# కఠోపనిషత్

## ప్రథమోఽధ్యాయః - ప్రథమా వల్లీ

### శంకర భాష్యమ్

### ఉపోద్ఘాతమ్

ఓం నమో భగవతే వైవస్వతాయ మృత్యవే బ్రహ్మవిద్యాచార్యాయ, నచికేతసే చ .అథ కాఠకోపనిషద్వల్లీనాం సుఖార్థప్రబోధనార్థమల్పగ్రంథా వృత్తిరారభ్యతే . సదేర్ధాతోర్విశరణగత్యవసాదనార్థస్యోపనిపూర్వస్య క్విప్ప్రత్యయాంతస్య రూపమిదం 'ఉపనిషత్' ఇతి. ఉపనిషచ్ఛబ్దేన చ వ్యాచిఖ్యాసితగ్రంథప్రతిపాద్యవేద్యవస్తువిషయా విద్యా ఉచ్యతే . కేన పునరర్థయోగేనోపనిషచ్ఛబ్దేన విద్యోచ్యత ఇతి, ఉచ్యతే . యే ముముక్షవో దృష్టానుశ్రవికవిషయవితృష్ణాః సంతః ఉపనిషచ్ఛబ్దవాచ్యాం వక్ష్యమాణలక్షణాం విద్యాముపసద్యోపగమ్య తన్నిష్ఠతయా నిశ్చయేన శీలయంతి తేషామవిద్యాదేః సంసారబీజస్య విశరణాద్ధింసనాద్వినాశనాదిత్యనేనార్థయోగేన విద్యోపనిషదిత్యుచ్యతే . తథా చ వక్ష్యతి 'నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే' (క.ఉ.1.3.15) ఇతి . పూర్వోక్తవిశేషణాన్వా ముముక్షూన్పరం బ్రహ్మ గమయతీతి చ బ్రహ్మగమయితృత్వేన యోగాద్బ్రహ్మవిద్యా ఉపనిషత్ . తథా చ వక్ష్యతి 'బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృత్యుః' (క.ఉ. 2.3.18) ఇతి . లోకాదిర్బ్రహ్మజజ్ఞో యోఽగ్నిః, తద్విషయాయా విద్యాయా ద్వితీయేన వరేణ ప్రార్థ్యమానాయాః స్వర్గలోకఫలప్రాప్తిహేతుత్వేన గర్భవాసజన్మజరాద్యుపద్రవబృందస్య లోకాంతరే పౌనఃపున్యేన ప్రవృత్తస్యావసాదయితృత్వేన శైథిల్యాపాదనేన ధాత్వర్థయోగాదగ్నివిద్యాపి ఉపనిషదిత్యుచ్యతే . తథా చ వక్ష్యతి 'స్వర్గలోకా అమృతత్వం భజంతే' (క.ఉ. 1.1.13) ఇత్యాది . నను చోపనిషచ్ఛబ్దేనాధ్యేతారో గ్రంథమప్యభిలపంతి — ఉపనిషదమధీమహే ఉపనిషదమధ్యాపయామ ఇతి చ . నైష దోషః, అవిద్యాదిసంసారహేతువిశరణాదేః సదిధాత్వర్థస్య గ్రంథమాత్రేఽసంభవాద్విద్యాయాం చ సంభవాత్ గ్రంథస్యాపి తాదర్థ్యేన తచ్ఛబ్దత్వోపపత్తేః 'ఆయుర్వై ఘృతం' (తై.సం.2.3.11) ఇత్యాదివత్ . తస్మాద్విద్యాయాం ముఖ్యయా వృత్త్యా ఉపనిషచ్ఛబ్దో వర్తతే, గ్రంథే తు భక్త్యేతి . ఏవముపనిషన్నిర్వచనేనైవ విశిష్టోఽధికారీ విద్యాయాం ఉక్తః . విషయశ్చ విశిష్ట ఉక్తో విద్యాయాః పరం బ్రహ్మ ప్రత్యగాత్మభూతం . ప్రయోజనం చాస్యా ఆత్యంతికీ సంసారనివృత్తిర్బ్రహ్మప్రాప్తిలక్షణా . సంబంధశ్చైవంభూత ప్రయోజనేనోక్తః . అతో యథోక్తాధికారి విషయప్రయోజన సంబంధాయా విద్యాయాః కరతలన్యస్తామలకవత్ప్రకాశకత్వేన విశిష్టాధికారివిషయప్రయోజన సంబంధా ఏతా వల్ల్యో భవంతీతి . అతస్తా యథాప్రతిభానం వ్యాచక్ష్మహే ..

తత్రాఖ్యాయికా విద్యాస్తుత్యర్థా .

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

### ఉపోద్ఘాతం

భగవంతుడూ, వివస్వతుని పుత్రుడూ, బ్రహ్మవిద్యా బోధకుడూ అయిన మృత్యుదేవునకు (యమ దేవునికి) నమోవాకములు, (అలాగే) నచికేతునకు కూడా నమోవాకములు.  (లోకముల యొక్క సృష్టి లయాల గురించిన, జీవుల జరా మరణాల గురించిన, విద్యా అవిద్యల గురించిన జ్ఞానం కలవాడు భగవంతుడు).

కఠోపనిషద్ లోని వల్లీల అర్థాన్ని సులభంగా గ్రహించగలిగేందుకు వీలుగా వాటి క్లుప్తమైన వివరణ ప్రారంభించబడుతోంది. పొడి పొడి చేయుట (విశరణ), పొందుట లేదా చేరుట (గతి), సడలించుట లేదా వదులు చేయుట (అవసాదన) అనే అర్థాలనిచ్చే 'సద్' ధాతువునకు 'ఉప' మరియు 'ని' అనే ఉపసర్గలను ముందు చేర్చి, చివరన క్విప్ ప్రత్యయాన్ని చేర్చడం ద్వారా ఉపనిషద్ అనే పదం ఏర్పడింది. ('సద్ విశరణగత్యవసాదనే' అని ధాతుపాఠం). సంబంధిత గ్రంథంలో ఏ తెలిసికొనదగిన విషయం గురించిన ప్రతిపాదన చేయబడబోతోందో, ఆ విషయం గురించిన జ్ఞానాన్ని 'ఉపనిషద్' శబ్దము సూచిస్తుంది. '(ఇదేకాక) ఇంకా మరేదైనా సంబంధం వల్ల, జ్ఞానము ఉపనిషద్ శబ్దం చేత సూచించబడుతోందా?' అని అంటే, ఇలా సమాధానం ఇస్తున్నారు. దృశ్యాదృశ్య విషయాలపైన ఉండే కోరికలనుండి విడిపడి, ఉపనిషద్ నందు చెప్పబడే జ్ఞానాన్ని సమీపించి (ఉప సద్), దానిపై స్థిరంగా నిశ్చయాత్మకంగా (ని) విచారణ చేసే ముముక్షువుల విషయంలో, ఇక ముందు ముందు చెప్పబోయే లక్షణాలు కల, ఆ జ్ఞానం జగదుత్పత్తి బీజాలైన అజ్ఞానం, మొదలైన వాటిని ముక్కలు ముక్కలు చేస్తుంది, హింసిస్తుంది, నిర్మూలిస్తుంది. [శంకరులు తమ భాష్యంలో 'దృశ్యానుశ్రవిక విషయవితృష్ణా' అన్న సందర్భంలో, 'అనుశ్రావిక' అంటే వేదములలో తెలియజెప్పినటువంటి స్వర్గములోని భోగములు (అదృశ్య ఫలాలు) మొదలైనవి – ఆనందగిరి టీక]. (ఉపనిషద్ అన్న పదానికి గల అర్థసముదాయమూ, జ్ఞానము యొక్క విశిష్ట లక్షణాలూ--రెండూ ఒకటే కాబట్టి, జ్ఞానము ఉపనిషద్ పదం చేత సూచింపబడటం సరిపడుతోంది). ఇదే విషయాన్ని 'అది తెలుసుకొంటే, మృత్యు ముఖాన్నించి విడుదలౌతాడు' ['నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే' (క.ఉ. 1.3.15)] అని (ఈ కఠోపనిషత్తులోనే) తరువాత భాగంలో చెప్పబడబోతోంది. ముందు చెప్పిన విధంగా గానూ లేదా జ్ఞానానికి బ్రహ్మమునకు దారితీసే ఉపాయంతో సంబంధముండటం వలనగానూ, అంతేకాక అది (ఆ జ్ఞానం) ఇంతకు ముందు తెలిపిన వైరాగ్యం కలిగి మోక్షాన్నికోరే సాధకులు పరమాత్మను పొందేలా చేయటం చేతనూ, బ్రహ్మను గురించిన జ్ఞానాన్నే ఉపనిషత్తు అంటారు. ఈ విషయాన్నే తరువాతి పాఠంలో 'పాప పుణ్యాలనుండి అలాగే కోరికలు మరియు అజ్ఞానం నుండి స్వేచ్ఛ పొంది, బ్రహ్మమును పొందుతాడు' ['బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృత్యుః' (క.ఉ. 2.3.18)] అని ఉపనిషత్తు చెప్పబోతున్నది. సర్వలోకాలకు ఆద్యుడైన, బ్రహ్మ నుండి జనించిన, జ్ఞాన సంపన్నుడైన ఏ అగ్ని గురించిన జ్ఞానం (నచికేతునిచే) రెండవ వరంగా కోరబడిందో, ఆ (అగ్నికి సంబంధించిన) జ్ఞానం కూడా సడలించుట (అవసాదనే) అనే (సద్) ధాతు అర్థం వల్ల ఉపనిషత్తు అనే అనబడుతోంది. అంటే మరి, (ఈ అగ్ని యొక్క జ్ఞానం వల్ల కలిగే) స్వర్గలోకఫలప్రాప్తి కారణంగా గర్భవాసం, జన్మించడం, వృద్ధాప్యం వంటి అనర్థాలు జన్మాంతరాలలో పునరావృత్తం కావడం అనేవి కొంతమేరకు సడలించ బడుతున్నందున, ధాతు అర్థానికి అనుగుణంగా అగ్నికి సంబంధించిన జ్ఞానం కూడా 'ఉపనిషద్' అనియే అనబడుతున్నదని అభిప్రాయం. ఇదే విషయం 'స్వర్గలోక వాసులు అమృతత్వం పొందుతారు' ['స్వర్గలోకా అమృతత్వం భజంత' (క.ఉ. 1.1.13)] అంటూ రాబోయే పాఠంలో చెప్పబడబోతోంది.

(ఈ ఉపోద్ఘాత భాష్యంలో శంకరులు ఉపనిషద్ శబ్దాన్ని నిర్వచిస్తున్నారు. 'ఉప', 'ని', 'షద్' లుగా ఉపనిషద్ పదాన్ని విభజిస్తే, అందులో 'ఉప', 'ని' అనేవి ఉపసర్గలు. అంటే, పదంలోని ధాతురూపానికి ముందు చేర్చబడేవి. ఇక 'షద్' ధాతురూపం. 'సద్' అనే ధాతువునకు క్విప్ ప్రత్యయాన్ని జోడిస్తే 'షద్' అవుతుంది. అలా ఏర్పడిన రూపమే ఉపనిషద్. ఇందులోని 'సద్' అనే ధాతువు ఏ అర్థాన్ని సూచిస్తుంది అనేది ధాతుపాఠం ద్వారా గ్రహిస్తాం. 'సద్' ధాతువు యొక్క ధాతు పాఠం 'సద్ విశరణగత్యవసాదనే'. దీని ప్రకారం, 'సద్' ధాతువుకు పొడి పొడి చేయుట

(విశరణ), పొందుట లేదా చేరుట (గతి), సడలించుట లేదా వదులు చేయుట (అవసాదన) అనే అర్థాలు సూచింపబడుతున్నాయి. మరి జ్ఞానానికి పర్యాయపదంగా ఉపనిషద్ అని చెప్తున్నారు కదా. పైన చెప్పబడిన అర్థాలకూ జ్ఞానానికీ ఎలాటి సంబంధం లేదుకదా అనే సందేహం కలగవచ్చు. అందుకోసమే, పైన వివరంగా జ్ఞానానికీ, ఉపనిషద్ శబ్దానికీ గల సంబంధాన్ని శంకరులు సూచించారు.)

**సందేహం :** 'ఉపనిషద్' పదం చేత పాఠకులు ఒక గ్రంథాన్ని సూచించడం, అలాగే 'ఉపనిషత్తును అధ్యయనం చేశాం' అని, 'ఉపనిషత్తును బోధించాం' అని ప్రస్తావించడం వాస్తవం కాదా?

**సమాధానం :** ఇటువంటి దృష్టితో (ఉపనిషత్తు అనగా ఒక గ్రంథమనే భావనలో) చూసినపుడు, 'సద్' ధాతువు యొక్క 'సంసారానికి హేతువైన అవిద్యను ముక్కలు చేయడం, నిర్మూలించడం, సడలించడం' అనే అర్థాలు అన్వయించవనీ, జ్ఞానమనే దృష్టితో చూస్తేనే అన్వయిస్తాయని చెప్పినప్పటికీ, ఇందులో దోషమేమీ లేదు (ఒక దృష్టితో ఒక అర్థం వేరొక దృష్టితో వేరొక అర్థం చెప్పడం సమంజసమే). ఎందుచేతంటే, (ఉపనిషద్ జ్ఞానాన్ని బోధించేందుకు) ఉద్దేశించిన గ్రంథాన్ని కూడా 'ఉపనిషద్' అనే పదంతో సూచించడం సమంజసమే కాబట్టి. ఉదాహరణకి 'నేయియే ఆయువు' ['ఆయుర్వై ఘృతం' (తై. సం. 2 . 3 . 11)] అని అన్నట్లు. (నేయి ఆయువును వృద్ధి చేస్తుంది అనే అర్థం వచ్చేలా నేయియే ఆయువు అని అనడం వాడుకలో ఉంది కదా. అదే విధంగా, ఉపనిషద్ జ్ఞానాన్ని బోధించే గ్రంథాన్ని ఉపనిషద్ అని అనడంలో దోషం ఏముంది?). కాబట్టి, జ్ఞానానికి సంబంధించి 'ఉపనిషద్' శబ్దాన్ని ప్రాథమిక అర్థంలో ఉపయోగిస్తే, గ్రంథ సందర్భంలో గౌణ అర్థంలో వాడినట్లు గ్రహించాలి.

ఆ విధంగా, 'ఉపనిషద్' పదం యొక్క నిర్వచనంలోనే అట్టి జ్ఞాన సముపార్జనకు కావలసిన అర్హతలు కూడా నిర్దేశితమైనాయి. {దృశ్యాదృశ్య విషయాలపైన ఉండే కోరికలనుండి విడిపడి, ఉపనిషద్ నందు చెప్పబడే జ్ఞానాన్ని సమీపించి (ఉప సద్), దానిపై స్థిరంగా నిశ్చయాత్మకంగా (ని) విచారణ చేసే ముముక్షువులు ఆ జ్ఞానాన్ని పొందటానికి అర్హులని ముందుగా చెప్పే ఉన్నారు.} మరి ఆ జ్ఞానం, పరబ్రహ్మమే ప్రత్యగాత్మగా జీవులలో ఉన్నదనే అత్యంత విశిష్టమైన విషయాన్ని, ఎరుక పరుస్తుంది. సమూలంగా సంసార నివృత్తి చేయడం వల్ల కలిగే పరబ్రహ్మ ప్రాప్తియే ఈ ఉపనిషద్ యొక్క ప్రయోజనం. (అజ్ఞానం పూర్తిగా తొలగింపబడటమే, జనన మరణాది ప్రవాహ రూపమైన జగత్తు సమూలంగా నిర్మూలించడం వల్ల కలిగే పర్యవసానం. ఏదేని వస్తువుపై ఆపాదింపబడిన అధ్యారోపానికి అస్తిత్వం లేదు అని అనడంలో అర్థం ఏమంటే, అధ్యారోపం తొలగగా మిగిలిన వస్తువు, దేనిపై అధ్యారోపణ జరిగిందో ఆవస్తువే అవుతుంది కదా అని. అలాగే, సంసార నివృత్తి అంటే పరబ్రహ్మ ప్రాప్తియే. లేదా, భాష్యంలో చెప్పిన 'బ్రహ్మప్రాప్తిలక్షణా' అంటే సంసార నివృత్తి పరబ్రహ్మన్ని పొందటాన్ని సూచిస్తోందని అర్థం. – స్వామి గంభీరానంద). వాటి మధ్య సంబంధం (జ్ఞానానికి మరియు దాని ప్రయోజనానికి మధ్య సంబంధం) వాటి ప్రయోజనాన్ని కూలంకషంగా వివరించడం ద్వారానే చెప్పినట్లైంది. (కర్మచేత నిర్మూలన చేయబడలేని అజ్ఞానాన్ని తొలగించడానికి జ్ఞానం అవసరం. కాబట్టి, సాధనతో కూడిన లక్ష్యం లాగా, జ్ఞానం యొక్క లక్ష్యం జ్ఞానసంబంధమే). అందుచేత, ఈ వల్లీలు ప్రత్యేక అర్హతలు కలవారికి (వాటి అధ్యయన సామర్థ్యం కలవారికి) ఉద్దేశించినవి, ప్రత్యేక విషయ ప్రస్తావన, ప్రయోజనం, సంబంధం కలిగినవి. ఎందుకంటే, విశిష్టమైన సమర్థత కలవానికి విశిష్టమైన విషయప్రస్తావన, ప్రయోజన, సంబంధం కలిగిన జ్ఞానాన్ని చేతిలోని ఉసిరికాయలాగా ఇవి (ఈ వల్లీలు) స్పష్టంగా తెలియచెప్తాయి. కాబట్టి, ఈ వల్లీలను మా శక్తిమేరకు వ్యాఖ్యానిస్తున్నాం.

జ్ఞానాన్ని శ్లాఘించే నిమిత్తమైనదీ కథ--

**ఉశన్హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ .**

**తస్య హ నచికేతా నామ పుత్ర ఆస ..** **.. 1-1-1 ..**

ఒకానొక కాలంలో, వాజశ్రవుని కుమారుడు, కామనచే, అన్నిటినీ దానం చేశాడు. కథా ప్రకారం, అతనికి నచికేతుడు అనే పేరు గల కుమారుడు ఉండెను.

## శంకర భాష్యమ్

ఉశన్ కామయమానః . హ వై ఇతి వృత్తార్థస్మరణార్థౌ నిపాతౌ . వాజం అన్నం , తద్దానాదినిమిత్తం శ్రవో యశో యస్య సః వాజశ్రవాః, రూఢితో వా ; తస్యాపత్యం వాజశ్రవసః . సః వాజశ్రవసః కిల విశ్వజితా సర్వమేధేనేజే తత్ఫలం కామయమానః . సః తస్మిన్క్రతౌ సర్వవేదసం సర్వస్వం ధనం దదౌ దత్తవాన్ . తస్య యజమానస్య హ నచికేతా నామ పుత్రః కిల ఆస బభూవ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఉశన్' – కోరికచే; 'హ వై'- ఇవి రెండూ అవ్యయములు, గతించిన విషయాన్ని స్మరించే సందర్భాన్ని సూచిస్తాయి (ఒకానొక కాలంలో అన్నట్లుగా); 'వాజశ్రవా' – ఆహారాన్ని(వాజమ్) దానం చేయటంచేత ఎవడు కీర్తి (శ్రవః) పొందాడో అతడు, లేదా వాజశ్రవుడనే పేరు గలవాని కుమారుడైనందున వాజశ్రవసుడు, కోరికలను సాధించుకొనేందుకై, సర్వాన్నీ దానం చేయడమనే కర్మ విశిష్టత కలిగిన విశ్వజిత్ యాగాన్ని చేశాడు. ఆ యాగంలో అతడు, 'సర్వవేదసం' – (తన) సమస్త సంపదను; 'దదౌ' – దానం చేశాడు; 'హ' – కథానుసారం; 'తస్య' – అతనికి, ఆ దానం చేసిన వానికి (ఆ వాజశ్రవసునకు); 'నచికేతా నామ పుత్రః' – నచికేతుడనే పేరు గల పుత్రుడు; 'ఆస' – ఉండెను.

(ఒకానొకప్పుడు, వాజశ్రవసుడనే వాడు కోరికలను సాధించడానికై, సర్వాన్నీ దానం చేయడమనే కర్మ విశిష్టత కలిగిన విశ్వజిత్ యాగాన్ని చేశాడు. ఆ యాగవిధిలో భాగంగా అతడు తన సమస్త సంపదను ఋత్విక్కులకు, బ్రాహ్మణులకు దానం చేశాడు. వానికి నచికేతుడనే పేరు గల కుమారుడున్నాడు.)

**తగ్ం హ కుమారగ్ం సన్తం దక్షిణాసు**

**నీయమానాసు శ్రద్ధావివేశ సోఽమన్యత** **.. 1-1-2 ..**

దక్షిణలను (బ్రాహ్మణుల కొరకై) తీసుకొని వెళుతుండగా, ఇంకనూ బాలకుడైన అతనికి (నచికేతునికి) శ్రద్ధ కలిగి ఇలా ఆలోచించాడు.

## శంకర భాష్యమ్

తం హ నచికేతసం కుమారం ప్రథమవయసం సంతం అప్రాప్తప్రజననశక్తిం బాలమేవ శ్రద్ధా ఆస్తిక్యబుద్ధిః పితుర్హితకామప్రయుక్తా ఆవివేశ ప్రవిష్టవతీ . కస్మిన్కాలే ఇతి, ఆహ — ఋత్విగ్భ్యః సదస్యేభ్యశ్చ దక్షిణాసు నీయమానాసు విభాగేనోపనీయమానాసు దక్షిణార్థాసు గోషు, సః ఆవిష్టశ్రద్ధో నచికేతాః అమన్యత ..

కథమితి, ఉచ్యతే — పీతోదకా ఇత్యాదినా

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'కుమారం సన్తమ్' – జీవితపు ప్రథమదశలోనే ఉన్నటువంటి, (ఇంకనూ) యౌవనంలో ప్రవేశించనటువంటి, అప్పటికీ కేవలం బాలుడే అయినట్టి; 'తమ్' – అతనిలో, ఆ నచికేతునిలో; తన తండ్రికి ప్రియం చేయాలనే కోరికచే ప్రేరేపింపబడిన 'శ్రద్ధా' - విశ్వాసం (శాస్త్రముల పట్ల నమ్మిక); 'ఆవివేశ'– కలిగింది. ఏ సమయంలో? ఇదే చెప్పబడుతోంది. 'దక్షిణాసు నీయమానాసు' – దక్షిణలను తీసుకొని పోతున్నప్పుడు, ఋత్విక్కులకు, సదస్యులైన బ్రాహ్మణులకు దక్షిణలుగా ఇవ్వబడే గోవుల మందలను విడివిడిగా (ఒక్కొక్కరికి వారి వారికి నిర్దేశించబడిన వాటిని) తీసుకొని వెడుతున్నప్పుడు; 'సః'– అతడు, శ్రద్ధ కలిగిన ఆ నచికేతుడు; 'అమన్యత'– ఆలోచించాడు.

(ఆ నచికేతుడు ఋత్విక్కులకు, సదస్యులకు దక్షిణలుగా ఇవ్వవలసిన గోవులను ఎవరికి కేటాయించినవి వారికి ఇవ్వడానికి, తండ్రి ఆదేశం ప్రకారం, తీసుకు వెళ్తున్నాడు. ఆ విధంగా పశువులను తీసుకువెడుతున్న సందర్భంలో, తన తండ్రికి మేలు జరగాలనే కోరికచే చేస్తున్న పనిలో శ్రద్ధ నిండినవాడై తను తీసుకొని వెడుతున్న గోవులను పరికించి చూసి, ఆ నచికేతుడు ఇలా ఆలోచన చేశాడు.)

ఏమని (ఆలోచించాడు) అనేది 'పీతోదకా....'తో మొదలయ్యే మంత్రాలలో చెప్తున్నారు.

**పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరిన్ద్రియాః .**
**అనన్దా నామ తే లోకాస్తాన్స గచ్ఛతి తా దదత్ .. 1-1-3 ..**

నీరు త్రాగియున్నవి, గడ్డి మేసినవి, పాలు పితకబడినవి, వీర్యవంతము కానివైన గోవులను దక్షిణగా ఇచ్చిన వాడు ఆనంద రహితమనే పేరుగల లోకాలను పొందుతాడు.

## శంకర భాష్యమ్

దక్షిణార్థా గావో విశేష్యంతే . పీతముదకం యాభిస్తాః పీతోదకాః . జగ్ధం భక్షితం తృణం యాభిస్తా జగ్ధతృణాః . దుగ్ధో దోహః క్షీరాఖ్యో యాసాం తాః దుగ్ధదోహాః . నిరింద్రియాః ప్రజననాసమర్థాః జీర్ణాః, నిష్ఫలా గావ ఇత్యర్థః . యాస్తాః ఏవంభూతాః గాః ఋత్విగ్భ్యో దక్షిణాబుద్ధ్యా దదత్ ప్రయచ్ఛన్ అనందాః అనానందాః అసుఖా నామేత్యేతత్ . యే తే లోకాః, తాన్ సః యజమానః గచ్ఛతి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

బ్రాహ్మణులకు దక్షిణకై ఇవ్వబడుతున్న గోవులు ఎలాంటివో విశదీకరిస్తున్నారు. 'ఉదకమ్'– నీరు; 'పీతమ్' – తాగియున్నవి; కాన, 'పీతోదకాః'. 'తృణమ్'– గడ్డిని; 'జగ్ధమ్' – తిన్నవి; కాన, 'జగ్ధతృణాః'; 'దోహ' – పాలను; 'దుగ్ధః'– పితకబడినవి; కాన, 'దుగ్ధదోహాః'; 'నిరింద్రియాః' – అవయవముల శక్తి ఉడిగినవి, దూడలకు జన్మ నివ్వలేనివి (గతములో నీటిని తాగిఉన్నవి అనగా ఇకపై నీటిని త్రాగే శక్తి కూడా లేనివి. అలాగే, గడ్డి తినుటకు, పాలనిచ్చుటకు శక్తి కూడా లేనివి – ఆనందగిరి). సరిగా చెప్పాలంటే బలహీనమైనవి, వట్టిపోయినవని అర్థం. 'తాః' – అట్టి వాటిని, అలాంటి గోవులను; ఋత్విక్కులకు దక్షిణరూపంగా 'దదత్' – ఇస్తూన్న; 'సః' – ఆ యాగ నిర్వాహకుడు, యజమాని, తన తండ్రి; 'అనన్దాః' – ఆనంద రహితం (ఆనందమనేదే లేని); 'నామ తే' – అనే పేరు గలిగిన 'తాన్' – అట్టి; 'లోకాః' లోకములకు 'గచ్ఛతి' – పయనిస్తాడు.

(నచికేతుడు తను తీసుకొని పోతున్న గోవులను చూసి ఇలా అనుకొన్నాడు. ఈ గోవులు నీరుత్రాగడానికి, గడ్డి మేయడానికి, పాలను ఇవ్వడానికి కూడా శక్తిలేనివి. ఇవి బలహీనమైనవి, ఇంద్రియ పటుత్వం లేనివి, వట్టిపోయినవి. అలాంటి, ఉపయోగం లేని గోవులను ఋత్విక్కులకు, సదస్యులైన బ్రాహ్మణులకు దక్షిణగా ఇస్తున్న తన తండ్రి, పుణ్యాన్ని సంపాదించకపోగా ఆనంద విహీనమైన లోకాలను పొందుతాడని విచారించి, పోనీ తన వల్లనైనా తండ్రికి ఎలాగైనా హితం కలగాలని ఆలోచన చేశాడు. అలా ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి తండ్రితో ఇలా అంటున్నాడు.)

**స హోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి**
**ద్వితీయం తృతీయం తగ్ం హోవాచ మృత్యవే త్వా దదామీతి .. 1-1-4 ..**

**అతడు (నచికేతుడు) తండ్రితో ఇలా అన్నాడు, "తండ్రీ, నన్ను ఎవరికి దానం చేస్తావు?". (ఇలా) రెండవసారి, మూడవసారి (అడుగగా). అతడు (తండ్రి) "నిన్ను మృత్యువుకు ఇస్తాను" అని అన్నాడు.**

### శంకర భాష్యమ్

తదేవం క్రత్వసంపత్తినిమిత్తం పితురనిష్టం ఫలం పుత్రేణ సతా నివారణీయం మయా ఆత్మప్రదానేనాపి క్రతుసంపత్తిం కృత్వేత్యేవం మన్యమానః పితరముపగమ్య స హోవాచ పితరం — హే తత తాత కస్మై ఋత్విగ్విశేషాయ దక్షిణార్థం మాం దాస్యసీతి ప్రయచ్ఛసీత్యేతత్ . స ఏవముక్తేన పిత్రా ఉపేక్ష్యమాణోఽపి ద్వితీయం తృతీయమపి ఉవాచ — కస్మై మాం దాస్యసి కస్మై మాం దాస్యసీతి . నాయం కుమారస్వభావ ఇతి క్రుద్ధః సన్ పితా తం హ పుత్రం కిల ఉవాచ మృత్యవే వైవస్వతాయ త్వా త్వాం దదామీతి ..

స ఏవముక్తః పుత్రః ఏకాంతే పరిదేవయాంచకార . కథమితి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

లోపభూయిష్టమైన యాగం కారణంగా తండ్రికి కలగబోయే అప్రియమైన ఫలాన్ని నివారించేందుకు తనను తాను త్యాగంచేసుకొని యాగాన్ని సుసంపన్నం చేయాలని మనసులో ఆలోచించి, 'పితరమ్'– తండ్రిని; సమీపించి, 'సః' - అతడు (నచికేతుడు); 'ఉవాచ హ' - అన్నాడు, " 'తత' ('తాత' అని స్వీకరించాలి)– ఓ తండ్రీ; 'కస్మై'– ఎవరికి, ఏ ఋత్విగ్వరేణ్యునికి; దక్షిణగా, 'మామ్'– నన్ను; 'దాస్యసి'– దానం చేస్తావు?" 'ఇతి'- అని. అతడు అలా (మొదటిసారి) అడిగినప్పుడు తండ్రి ఉపేక్షించినప్పటికీ, 'ద్వితీయం తృతీయం'- రెండవసారి, మూడవసారి; కూడా, "నన్నెవరికి దానం చేస్తావు, నన్నెవరికి దానం చేస్తావు" అని అడిగాడు. ఇతడు బాలునిలాగా ప్రవర్తించడం లేదని కోపించిన తండ్రి, **తమ్** అతనితో కుమారునితో " 'త్వా' ('త్వం' లాగానే)– నిన్ను; 'మృత్యవే'– మృత్యువునకు; 'దదామి' – ఇస్తాను; " 'ఇతి'- అని 'ఉవాచ హ' అన్నాడు.

(ప్రయోజనం లేని గోవులను దానం చేసి తండ్రి పొందబోయే అనర్థాన్ని గ్రహించి, తండ్రికి హితం చేకూరేందుకు, ఆలోచనచేయగా అతనికిలా తోచింది. ఈ గోవుల వల్ల ఋత్విక్కులకు ఎటువంటి ప్రయోజనం చేకూరదు. అదే తనను ఆ ఋత్విక్కులకు దానం చేస్తే, తను చేసే సేవలకు ఆ వేదపండితులు సంతోషించగలరు కాబట్టి, తన తండ్రి తనను వారిలో ఎవరో ఒకరికి దానం చేసినట్లైతే, తండ్రికి పుణ్యగతులు ప్రాప్తిస్తాయి కదా అని, తనకు తోచిన ఈ ఆలోచనను తండ్రికి చెప్పే ప్రయత్నంతో తండ్రీ, నన్నెవరికి దానం చేస్తావని అని అడిగాదు. కర్తవ్యాల నిర్వహణలో ఉన్న తండ్రి, బాల్యచాపల్యంతో నచికేతుడు ఇలా అంటున్నాడని తొలుత భావించి, మొదటిసారి బదులు పలుకలేదు. నచికేతుడు విడిచిపెట్టకుండా రెండవసారి, మూడవసారి అదే మాట అనేసరికి, చికాకు పడ్డ తండ్రి కోపంతో "నిన్ను మృత్యువునకు ఇస్తా" అన్నాడు. తండ్రి తనను ఋత్విక్కులలో ఎవరికైనా ఇస్తానని అంటాడేమోనని ఊహించుకున్న నచికేతుడు తండ్రి ఇలా మృత్యువుకిస్తా అనే సరికి విచారపడి ఒంటరిగా కూర్చొని ఇలా ఆలోచించసాగాడు.)

అలా చెప్పబడిన కుమారుడు ఒంటరి ప్రదేశంలో విచారంగా తదేకంగా ఆలోచించసాగాడు. ఎలాగ (ఏమని ఆలోచించాడు) అనేది చెప్పబడుతోంది--

**బహూనామేమి ప్రథమో బహూనామేమి మధ్యమః.**

**కిగ్ం స్విద్యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి .. 1-1-5 ..**

అనేకులలో ప్రథముడిని. అనేకులలో మధ్యముణ్ణి. యముని నుండి నా తండ్రికి ఈరోజు నా ద్వారా ఏం ప్రయోజనం (సిద్ధిస్తుంది)?

## శంకర భాష్యమ్

బహూనాం శిష్యాణాం పుత్రాణాం వా ఏమి గచ్ఛామి ప్రథమః సన్ ముఖ్యయా శిష్యాదివృత్త్యేత్యర్థః . మధ్యమానాం చ బహూనాం మధ్యమః మధ్యమయైవ వృత్త్యా ఏమి . నాధమయా కదాచిదపి . తమేవం విశిష్టగుణమపి పుత్రం మాం 'మృత్యవే త్వా

దదామి' ఇత్యుక్తవాన్ పితా . సః కింస్విత్ యమస్య కర్తవ్యం ప్రయోజనం మయా ప్రదత్తేన కరిష్యతి యత్కర్తవ్యం అద్య? నూనం ప్రయోజనమనపేక్ష్యైవ క్రోధవశాదుక్తవాన్ పితా . తథాపి తత్పితుర్వచో మృషా మా భూదితి ..

ఏవం మత్వా పరిదేవనాపూర్వకమాహ పితరం శోకావిష్టం కిం మయోక్తమితి —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'బహూనా ' – అనేకులలో, అనేక శిష్యులలో లేదా పుత్రులలో; 'ప్రథమః' – ప్రథమునిగా, ఉత్తమ ప్రవర్తన గల శిష్యులలో ప్రథమునిగా; 'ఏమి' – ఎన్నబడుదును; ఎంచబడుతా. ఇదీ భావం. మరియు, 'బహూనామ్' – అనేకులలో, అనేక మధ్యములలో; 'మధ్యమః ఏమి' – మధ్యమునిగా ఎంచబడుతా, మధ్యమునిగా ప్రవర్తిస్తా. అయితే, ఎప్పుడుకూడా అధమ ప్రవర్తనుడిని కాదు. (గురుసేవలో ఉండి గురువు అవసరాలు గమనిస్తూ కాలానుగుణంగా అతని కావలసినవి సమకూర్చడం ఉత్తమ ప్రవర్తన. ఆదేశానుసారం పనిచేయడం మధ్యమ ప్రవర్తన. ఆదేశాలను అధిగమించడం లేదా తిరస్కరించడం అధమ ప్రవర్తన. – ఆనందగిరి). అలాంటి గుణం కలిగిన కుమారుడనైన నాతో నా తండ్రి, "నిన్ను మృత్యువుకు సమర్పిస్తా" అన్నాడు. 'మయా' – నా ద్వారా, నన్ను పంపడం వల్ల; 'యమస్య' – యముని నుండి; నా తండ్రికి 'అద్య' – ఈ రోజు; 'కిమ్ స్విత్' – ఏమి; 'కర్తవ్యం' – ప్రయోజనం; 'కరిష్యతి' – కలుగుతుంది?

'నా తండ్రి, ఎటువంటి ప్రయోజనం కోసం కాక, కేవలం కోపం చేత అలా అని ఉండవచ్చు. అయినా, తండ్రి వచనం అసత్యం కారాదు' అని ఆలోచించి, 'ఎంత మాట అన్నాను' అనే ఆలోచనతో శోకపూరితుడైయున్న (బాధపడుతూన్న ) తండ్రితో, (నచికేతుడు ఇలా) అన్నాడు.

(తండ్రి వద్దనున్న శిష్యబృందంలో ఎప్పుడూ ప్రవర్తనలోగాని విద్యనభ్యసించడంలోగాని నేను ప్రథముడినే. ఒకవేళ, ఏ కారణంచేతనైనా ప్రథముడిని కాకపోతే బృందంలో కనీసం మధ్యముడిగానైనా ఉండేవాడినే. ఏనాడూ కోపగలిగించేలా అథముడిని మాత్రం కాను. అటువంటి నాతో నా తండ్రి 'నిన్ను మృత్యువుకు ఇస్తా' అని అన్నాడు. పోనీ నన్ను యముని దగ్గఱకు పంపడం వల్ల, నా తండ్రికి ఏదైనా ప్రయోజనముంటుందా అని ఆలోచిస్తే, ఏ ప్రయోజనం లేదని తెలుస్తోంది. కాబట్టి, ఏదో ప్రయోజనాన్ని ఆశించి తండ్రి నన్ను అలా 'యముని వద్దకు పంపుతా' అని ఉండడు. బహాశా కేవలం, కోపం చేత (పని వత్తిడిలోని విసుగుచేత) అలా అని ఉండవచ్చు. ఏది ఏమైనా, నా తండ్రి వచనం అబద్ధం కాకూడదు. ఇలా ఆలోచించిన నచికేతుడు, 'కుమారుడిని అలా ఎందుకు అన్నాను' అని బాధతో శోకిస్తున్న తండ్రిని సమీపించి ఈ విధంగా అన్నాడు.)

**అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాఽపరే .**
**సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాజాయతే పునః .. 1-1-6 ..**

పూర్వులు ఎలా ప్రవర్తించారో చూసి అనుసరించు. అలాగే, ఇతరులు (సమకాలీన ఉత్తములు) ఎలా ప్రవర్తిస్తున్నారో గమనించు. మనిషి ధాన్యంలాగా కృశించి మరణిస్తాడు, తిరిగి ధాన్యంలా పునర్జీవిస్తాడు.

## శంకర భాష్యమ్

అనుపశ్య ఆలోచయ విభావయానుక్రమేణ యథా యేన ప్రకారేణ వృత్తాః పూర్వే అతిక్రాంతాః పితృపితామహాదయస్తవ . తాంద్‌దృష్ట్వా చ తేషాం వృత్తమాస్థాతుమర్హసి . వర్తమానాశ్చ అపరే సాధవో యథా వర్తంతే తాంశ్చ తథా ప్రతిపశ్య ఆలోచయ . న చ తేషాం మృషాకరణం వృత్తం వర్తమానం వా అస్తి . తద్విపరీతమసతాం చ వృత్తం మృషాకరణం . న చ మృషాభూతం కృత్వా కశ్చిదజరామరో భవతి ; యతః సస్యమివ మర్త్యః మనుష్యః పచ్యతే జీర్ణో మ్రియతే, మృత్వా చ సస్యమివ ఆజాయతే ఆవిర్భవతి పునః ; ఏవమనిత్యే జీవలోకే కిం మృషాకరణేన ? పాలయాత్మనః సత్యం . ప్రేషయ మాం యమాయేత్యభిప్రాయః ..

స ఏవముక్తః పితా ఆత్మనః సత్యతాయై ప్రేషయామాస . స చ యమభవనం గత్వా తిస్రో రాత్రీరువాస యమే ప్రోషితే . ప్రోష్యాగతం యమం అమాత్యా భార్యా వా ఊచుర్బోధయంతః —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యథా' – ఏవిధంగా; నీ యొక్క, 'పూర్వే' – పూర్వులు, పితరులు తాతలు ప్రవర్తించారో; 'అనుపశ్య' – 'అను' – (ఆ విధంగా) అనుగుణంగా; 'పశ్య' – పరిశీలించు, దృష్టిసారించు. అట్టి పరిశీలన వారి అడుగుజాడలను తగు రీతిగా నీవు అనుసరించేలా చేస్తుంది. 'తథా' – అదే విధంగా; 'అపరే' – ఇతరులు, సత్పురుషులు; ఎలా ప్రవర్తిస్తున్నారో వారిని కూడా నీవు 'ప్రతిపశ్య' – పరిశీలించు, ఆలోచించు. వారి ప్రవర్తనలో ఎటువంటి అనృతం (అసత్యం) లేనే లేదు. దీనికి విరుద్ధంగా, సత్యంపట్ల నిర్లక్ష్యం దుర్జనుల స్వభావమై ఉంది. అంతేకాకుండా, అపరిమితం కాని దానికి మరణ క్షయాలనుండి స్వేచ్ఛ లేదు. (పరిమితమైనదే క్షయిస్తుంది, నశిస్తుంది). ఎందుకంటే, 'మర్త్యః' – మానవుడు; 'సస్యమ్ ఇవ' – (ధాన్యపు) గింజ వలె; 'పచ్యతే' – కృశిస్తాడు మరణిస్తాడు; మరణించిన తర్వాత 'పునః' – మరల; 'సస్యమ్ ఇవ ఆజాయతే' – (ధాన్యపు) గింజ వలె ఉద్భవిస్తాడు. ఇటువంటి అనిత్యమైన మానవ జగత్తులో మాట తప్పటం వల్ల ఏం ప్రయోజనం? సత్యాన్ని పాలించి, నన్ను యముని వద్దకు పంపమని అభిప్రాయం.

(నచికేతుడు తండ్రిని ఓదారుస్తూ ఇలా అన్నాడు. తండ్రీ, నీ పూర్వులు ఎలా ప్రవర్తించారో గమనించు. అలాగే, సత్పురుషులు ఎలా ప్రవర్తిస్తున్నారో కూడా పరిశీలించు. వారేనాడూ సత్యాన్ని విడువలేదు. దుర్జనులు మాత్రమే సత్యాన్ని నిర్లక్ష్యం చేస్తారు. కాబట్టి, దుర్జనుల మార్గాన్ని అనుసరించి సత్యాన్ని వీడకు. అపరిమితం కానిది ఏదైనా క్షీణించి నశించ వలసిందే. మానవుడు వడ్లగింజలాగా నశిస్తాడు, తిరిగి పుడతాడు. ఇలాంటి అనిత్యమైన మానవ జీవితంలో మాట తప్పటం వల్ల ప్రయోజనమేముంటుంది? కాబట్టి, సత్యాన్ని పాలించి నన్ను యముని వద్దకు పంపు అని ప్రార్థించాడు.)

ఆ విధంగా (నచికేతునిచే) చెప్పబడిన తర్వాత, తండ్రి తన సత్యత్వాన్ని నిల్పుకోవడం కోసం, కుమారుణ్ణి (యముని వద్దకు) పంపాడు. అతడు, యమసదనానికి వెళ్ళగా యముడు నివాసంలో లేనందున, మూడు రాత్రులు

(యముని రాకకై ఎదురు చూస్తూ) నిరీక్షిస్తూ ఉన్నాడు. యముడు తన సదనానికి తిరిగి వచ్చిన పిమ్మట అతనితో, అతని అమాత్యులు, భార్యలు వినతి పూర్వకంగా ఇలా చెప్తున్నారు.

**వైశ్వానరః ప్రవిశతి అతిథిర్బ్రాహ్మణో గృహాన్ .**
**తస్యైతాగ్ం శాన్తిం కుర్వన్తి హర వైవస్వతోదకమ్ .. 1-1-7 ..**

అగ్నివంటి బ్రాహ్మణ అతిథి గృహాలలో ప్రవేశించాడు. అతడికి సపర్యలు చేసేందుకు ఓ వైవస్వతా, (బ్రాహ్మణ అతిధి కొరకు) ఉదకం తీసుకో.

## శంకర భాష్యమ్

వైశ్వానరః అగ్నిరేవ సాక్షాత్ ప్రవిశతి అతిథిః సన్ బ్రాహ్మణః గృహాన్ దహన్నివ . తస్య దాహం శమయంత ఇవాగ్నేః ఏతాం పాద్యాసనాదిదానలక్షణాం శాంతిం కుర్వంతి సంతోఽతిథేర్యతః, అతః హర ఆహర హే వైవస్వత, ఉదకం నచికేతసే పాద్యార్థం ..

యతశ్చాకరణే ప్రత్యవాయః శ్రూయతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'వైశ్వానరః'– సాక్షాత్తు అగ్నియే అన్నట్లుగా, తేజస్సుతో నిండిన; 'బ్రాహ్మణః'– ఒక బ్రాహ్మణుడు; 'అతిథిః'– అతిథిగా; 'గృహాన్'– గృహములలో; 'ప్రవిశతి'– ప్రవేశించాడు. 'తస్య'– అతని కొరకు, ఆ అతిథి కొరకు; 'ఏతామ్'– ఈ విధమైన; 'శాంతిమ్'– ప్రాయశ్చిత్తమును అనగా పాద ప్రక్షాళనకై నీటిని ఇచ్చుట, ఆసనం ఏర్పాటు చేయుట మొదలైన వాటిని, ఏవిధంగానైతే జనులు అగ్ని తీవ్రతను చల్లార్చేందుకు చేస్తారో అలా, ఎందుకంటే అలా చేయకపోతే ప్రత్యవాయ దోషం ప్రాప్తిస్తుంది కాబట్టి, 'కుర్వంతి'– నిర్వహిస్తారు. కాబట్టి, 'వైవస్వత'– ఓ యమా, 'ఉదకమ్'– నీటిని (నచికేతుని యొక్క) పాదములను కడుగుటకై 'హర'– తీసుకురా.

(సాక్షాత్తు అగ్నియే గృహాలలో ప్రవేశించాడా అన్నట్లుగా అంతటి తేజోమూర్తియైన బ్రాహ్మణ అతిథి వచ్చాడు. అతిథికి సపర్యలు చేసి అతనిని తృప్తి పరచడం నీ కర్తవ్యం. అట్టి కర్తవ్యాన్ని చేయకుంటే ప్రత్యవాయ దోషంప్రాప్తిస్తుంది. చేయవలసిన కర్తవ్యాన్ని చేయకుంటే ప్రాప్తించే దోషాన్ని ప్రత్యవాయం అంటారు. కాబట్టి, ఓ యమా, బ్రాహ్మణ అతిథియొక్క పాదప్రక్షాళనాది సేవల నిమిత్తమై నీటిని తీసుకురా అని వినతి పూర్వకంగా యమదేవుని యొక్క మంత్రులు, భార్యలు నివేదిస్తున్నారు.)

**ఆశాప్రతీక్షే సంగతగ్ం సూనృతాం ఇష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్**
**ఏతద్వృఙ్క్తే పురుషస్యాల్పమేధసో యస్యానశ్నన్వసతి బ్రాహ్మణో గృహే .. 1-1-8 ..**

ఏ అల్పబుద్ధికలవాని గృహంలో అతిథి ఆహారంలేకుండా ఉంటాడో, అతనిని ఆశ, ప్రతీక్షలు, సత్పురుష సంగం వల్ల కలిగే ఫలాలు, ప్రియవచనాలు, యజ్ఞఫలాలు, ధార్మిక ఫలాలు, పుత్రులు, పశువులు, సర్వమూ విడిచిపోతాయి.

## శంకర భాష్యమ్

ఆశాప్రతీక్షే, అనిర్జ్ఞాతప్రాప్యేష్టార్థప్రార్థనా ఆశా, నిర్జ్ఞాతప్రాప్యార్థప్రతీక్షణం ప్రతీక్షా, తే ఆశాప్రతీక్షే ; సంగతం సత్సంయోగజం ఫలం , సూనృతాం చ సూనృతా హి ప్రియా వాక్ తన్నిమిత్తం చ, ఇష్టాపూర్తే ఇష్టం యాగజం ఫలం పూర్తం ఆరామాదిక్రియాజం ఫలం , పుత్రపశూంశ్చ పుత్రాంశ్చ పశూంశ్చ సర్వాన్ , ఏతత్ సర్వం యథోక్తం వృంక్తే వర్జయతి వినాశయతీత్యేతత్ . పురుషస్య అల్పమేధసః అల్పప్రజ్ఞస్య, యస్య అనశ్నన్ అభుంజానః బ్రాహ్మణః గృహే వసతి . తస్మాదనుపేక్షణీయః సర్వావస్థాస్వప్యతిథిరిత్యర్థః ..

ఏవముక్తో మృత్యురువాచ నచికేతసముపగమ్య పూజాపురఃసరం —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఆశాప్రతీక్షే'– 'ఆశా' అంటే తెలియనిదైనప్పటికీ పొందతగినదానిని పొందాలనే కోరిక; 'ప్రతీక్ష' అంటే తెలిసినదానిని పొందతగినదానిని గురించిన ఆకాంక్ష లేదా ఎదురుచూపు. కోరిక, ఆకాంక్ష అనే ఈ రెండింటినీ 'ఆశాప్రతీక్షే' అంటారు. 'సంగతమ్'– సత్పురుష సాంగత్యం వల్ల కలిగే ఫలం (*సంగతం సత్సంయోగజం ఫలం* అన్న భాష్య పాఠానికి ఇలా సత్పురుష సాంగత్యం వల్ల కలిగే ఫలమని అర్థం చెప్పబడింది. అయితే *సంగతం తత్సంయోగజం ఫలం* అనే పాఠాంతరం తీసుకొంటే ఆశాప్రతీక్షల రెండింటి కలయిక వల్ల కలిగే ఫలమని అర్థం చేసుకోవచ్చు). 'సూనృతమ్ చ'– ప్రియ వచనం, దాని యొక్క ఫలంకూడా; 'ఇష్టా-పూర్తే' – 'ఇష్ట' అనేది యజ్ఞం వల్ల కలిగే ఫలం; 'పూర్త' అనేది ధార్మిక (చెఱువులు, బావుల నిర్మాణాల వంటి) కర్మల వల్ల కలిగే ఫలం. 'పుత్ర-పశూన్ చ'– పుత్రులు మరియు పశువులు; 'సర్వాన్-ఏతత్' ('సర్వమ్ ఏతత్' గా ఉండాలి)– ఇదంతా, ఈ చెప్పబడినవి అంతా; 'వృఙ్క్తే'– వీడుతాయి లేదా నశిస్తాయి; 'యస్య'– ఎవని, ఏ; 'పురుషస్య అల్పమేధసః'– అల్పబుద్ధిగల వ్యక్తి యొక్క; 'గృహే'– గృహము నందు; 'బ్రాహ్మణః'– ఒక బ్రాహ్మణుడు; 'అనశ్నన్'– ఆహారం లేకుండా; 'వసతి'– నివసిస్తాడో.

(ఏ మందమతి ఇంట్లో బ్రాహ్మణ అతిథి భోజనం లేకుండా ఉంటాడో, అట్టి వాడు తను తెలియక కోరుకున్న వాటిని, తెలిసి ఎదురుచూస్తున్న వాటిని, సత్పురుష సాంగత్యం వల్ల కలిగే ఫలాలనీ, ప్రియవచనాలను వాటి వల్ల పొందే ఫలాలనీ, వైదిక ధార్మిక కర్మలచే సాధించుకొన్న ఫలాలనీ, పుత్రులనూ, పశువులనూ, సర్వస్వాన్నీ కోల్పోతాడు. కాబట్టి, ఎట్టి పరిస్థితిలోనూ అతిథిని నిర్లక్ష్యం చేయడం తగదని అభిప్రాయం.)

**తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మే**

**అనశ్నన్బ్రహ్మన్నతిథిర్నమస్యః .**
**నమస్తేఽస్తు బ్రహ్మన్స్వస్తి మేఽస్తు**
**తస్మాత్ప్రతి త్రీన్వరాన్వృణీష్వ .. 1-1-9 ..**

ఓ బ్రాహ్మణా, మూడు రాత్రులు నా గృహంలో నిరాహారంగా వసించిన అతిథివి పూజనీయుడవు అయిన నీకు నమఃస్కారములు. నాకు మంగళమగుగాక. అందుకు ప్రతిగా (నీవు మూడు రాత్రులు నిరాహారిగా ఉన్నందుకు) నీవు మూడు వరాలు కోరుకో.

## శంకర భాష్యమ్

తిస్రః రాత్రీః యత్ యస్మాత్ అవాత్సీః ఉషితవానసి గృహే మే మమ అనశ్నన్ హే బ్రహ్మన్ అతిథిః సన్ నమస్యః నమస్కారార్హశ్చ, తస్మాత్ నమః తే తుభ్యం అస్తు భవతు . హే బ్రహ్మన్ స్వస్తి భద్రం మే అస్తు . తస్మాత్ భవతోఽనశనేన మద్గృహవాసనిమిత్తాద్దోషాత్ . తత్ప్రాప్త్యుపశమేన యద్యపి భవదనుగ్రహేణ సర్వం మమ స్వస్తి స్యాత్ , తథాపి త్వదధికసంప్రసాదనార్థమనశనేనోషితామేకైకాం రాత్రిం ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ అభిప్రేతార్థవిషయాన్ప్రార్థయస్వ మత్తః ..

నచికేతాస్త్వాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'తిస్రః రాత్రీః' - మూడు రాత్రుల కాలము; 'అనశ్నన్'– నిరాహారిగా; 'గృహే మే'– నా గృహములో; 'అవాత్సీః'– ఉన్నవాడివైనందున; 'బ్రహ్మన్' - ఓ బ్రాహ్మణుడా, నీవు 'అతిథిః'– అతిథివి; 'నమస్యః'– పూజనీయుడవు. అందుచే, 'తే'–నీకు, నీ కొరకు; 'నమః అస్తు' - నమఃస్కారమగుగాక. 'బ్రహ్మన్'- ఓ బ్రాహ్మణా, 'తస్మాత్'– అందువలన, నీవు నా గృహంలో నిరాహారిగా ఉన్నందుచేత నాకు దోషం కలిగినందున; నీ అనుగ్రహంచేత అట్టి దోషంనుండి ఉపశమనం పొంది, 'మే'– నాకు; 'స్వస్తి'– మంగళము; 'అస్తు'– అగుగాక. ఇంకా కూడా, దానికి మించి లబ్ధిచేకూర్చేందుకై, 'ప్రతి'– ఒకదానికి ఒకటి చొప్పున; నిరాహారియై ఉన్న ఒక్కొక్క రాత్రికి ఒక్కొక్కవరం చొప్పున ఏవైనా 'త్రీన్ వరాన్' - మూడు వరాలను; 'వృణీష్వ' – కోరుకో. అంటే, ప్రీతికరమైన విషయాలను కోరుకొమ్మని ప్రార్థించాడని అర్థం.

(యముడు ఆ బ్రాహ్మణ బాలకునితో ఇలా అన్నాడు. నా గృహంలో మూడు రాత్రుల కాలం నిరాహారిగా ఉన్న ఓ బ్రాహ్మణా, నీవు మాకు అతిథివి, పూజనీయుడివి. నీకు నమస్కారము. అలా మూడు రాత్రుల కాలం నిరాహారిగా ఉన్నందున కలిగిన దోషం నుండి నేను ఉపశమనం పొందుదును గాక. నాకు మంగళము చేకూరుగాక. ఆ దోషానికి ప్రాయశ్చిత్తంగా, అంతకంటే మించిన లబ్ధి నీకు కలిగేందుకు, ఒక్కొక్క రాత్రికి ఒక్కొక్క వరం చొప్పున ఏవైనా మూడు వరాలను అంటే నీకు ప్రీతి కలిగించేవిషయాలను కోరుకో అన్నాడు.)

అయితే, నచికేతుడన్నాడు –

**శాన్తసంకల్పః సుమనా యథా**
**స్యాద్వీతమన్యుర్గౌతమో మాఽభిమృత్యో .**
**త్వత్ప్రసృష్టం మాఽభివదేత్ప్రతీత**
**ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే .. 1-1-10 ..**

ఓ మృత్యుదేవా, నా తండ్రి గౌతముడు సంకల్పాల నుండి ఉపశాంతి పొంది, ప్రసన్నమైన చిత్తాన్ని కలిగి, నా పట్ల కోపాన్ని వీడి, నీనుండి విడుదలైనప్పుడు నన్ను గుర్తించి పలకరించాలి. ఇదంతా మూడింటిలో కోరిన ప్రథమ వరం.

## శంకర భాష్యమ్

యది దిత్సుర్వరాన్ , శాంతసంకల్పః ఉపశాంతః సంకల్పో యస్య మాం ప్రతి 'యమం ప్రాప్య కిం ను కరిష్యతి మమ పుత్రః' ఇతి, సః శాంతసంకల్పః సుమనాః ప్రసన్నచిత్తశ్చ యథా స్యాత్ వీతమన్యుః విగతరోషశ్చ గౌతమః మమ పితా మా అభి మాం ప్రతి హే మృత్యో ; కించ, త్వత్ప్రసృష్టం త్వయా వినిర్ముక్తం ప్రేషితం గృహం ప్రతి మా మాం అభివదేత్ ప్రతీతః లబ్ధస్మృతిః, 'స ఏవాయం పుత్రో మమాగతః' ఇత్యేవం ప్రత్యభిజానన్నిత్యర్థః . ఏతత్ప్రయోజనం త్రయాణాం వరాణాం ప్రథమం ఆద్యం వరం వృణే ప్రార్థయే యత్పితుః పరితోషణం ..

మృత్యురువాచ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

వరాలను ఇవ్వదలచుకొంటే, ఓ యమదేవా, నా తండ్రి 'గౌతమః'– గౌతముడు; 'శాంతసంకల్పః'– ఆలోచనలనుండి ఉపశమనం పొందాలి, యముని వద్దకు చేరిన నా కుమారుడు ఎలా ఉన్నాడో అనే నాగురించిన చింతనుండి ఉపశమనం పొంది అతడు శాంతసంకల్పుడు కావాలి; 'మా అభి'– నా పట్ల; 'సుమనాః'– ప్రసన్న చిత్తుడు; 'వీతమన్యు'– కోపమును వీడినవాడు; 'యథా స్యాత్'– అలా అగుగాక. ఇంకా ఏమంటే, 'త్వత్ ప్రసృష్టమ్'– నీనుండి విడుదలచేయబడిన తదుపరి, మా గృహానికి వెళ్ళినప్పుడు; 'ప్రతీతః'– గుర్తుపట్టి; 'మాం అభివదేత్' - నన్ను పలుకరించుగాక; 'ఇతడు నా పుత్రుడే, వచ్చాడు' అని గుర్తుపట్టాలి అని అర్థం. 'ఏతత్ త్రయాణామ్' అనుగ్రహించిన మూడు వరాలలో 'ప్రథమమ్'– మొదటి; 'వరమ్'– కోరిక; 'వృణే'– (అనుగ్రహించమని) ప్రార్థన. ఇది తండ్రిని తృప్తిపరచే ప్రయోజనం కొరకై కోరినది. (ఇతడు దయ్యమై తిరిగి వచ్చాడు, ఇతనిని చూడరాదు అనే భావంతో నా తండ్రి నన్ను తిరస్కరింపకుండేలా అనుగ్రహించు అన్నది అభిప్రాయం - ఆనందగిరి)

(ఓ యమదేవా, నా తండ్రి గౌతముడు యముని వద్దకు వెళ్ళిన నా కుమారుడు ఎట్లా ఉన్నాడోననే నాగురించిన చింత నుండి ఉపశమనం పొంది, ప్రసన్న చిత్తుడై, నా పట్ల కోపాన్ని వీడాలి. మరింకా, నీనుండి విడుదల పొంది, మా గృహానికి తిరిగివెళ్ళినప్పుడు నా తండ్రి నన్ను గుర్తుపట్టి, వీడు నా పుత్రుడే, తిరిగి వచ్చాడని ఆనందించి నన్ను

పలుకరించాలి. నీవు అనుగ్రహించిన మూడు వరాలలో మొదటి వరాన్ని ఈ విధంగా కోరుతున్నా అన్నాడు నచికేతుడు.)

(ఆ నచికేతునితో) మృత్యువు అన్నాడు –

**యథా పురస్తాద్భవితా ప్రతీత**

**ఔద్దాలకిరారుణిర్మత్ప్రసృష్టః .**

**సుఖగ్ంం రాత్రీః శయితా వీతమన్యు స్త్వాం**

**దదృశివాన్మృత్యుముఖాత్ప్రముక్తమ్ .. 1-1-11 ..**

(నిన్ను) గుర్తించి ఔద్దాలకి ఆరుణి వెనుకటి లాగానే ఉంటాడు. రాత్రిళ్ళు సుఖంగా నిద్రిస్తాడు. మృత్యుముఖం నుండి విడుదలైన నిన్ను దర్శించి కోపాన్ని వీడుతాడు.

## శంకర భాష్యమ్

యథా బుద్ధిః త్వయి పురస్తాత్ పూర్వం ఆసీత్స్నేహసమన్వితా పితుస్తవ, భవితా ప్రీతిసమన్వితస్తవ పితా తథైవ ప్రతీతః ప్రతీతవాన్సన్ . ఔద్దాలకిః ఉద్దాలక ఏవ ఔద్దాలకిః అరుణస్యాపత్యం ఆరుణిః ద్వ్యాముష్యాయణో వా మత్ప్రసృష్టః మయానుజ్ఞాతః సన్ ఉత్తరా అపి రాత్రీః సుఖం ప్రసన్నమనాః శయితా స్వప్తా వీతమన్యుః విగతమన్యుశ్చ భవితా స్యాత్ , త్వాం పుత్రం దదృశివాన్ దృష్టవాన్ సన్ మృత్యుముఖాత్ మృత్యుగోచరాత్ ప్రముక్తం సంతం ..

నచికేతా ఉవాచ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'మత్ప్రసృష్టః'– నాచే విడుదల చేయబడిన (నిన్ను); 'ఔద్దాలకిః ఆరుణిః'– ఔద్దాలక-అరుణి వంశజుడైన (నీ తండ్రి); 'ప్రతీతః'– గుర్తించి; 'యథా'– ఎలాంటి; 'పురస్తాత్'– ఇంతకు ముందు నీపట్ల తండ్రికి స్నేహభావం కలదో; 'తథా'– అలాంటిదే; 'భవితా'– ప్రేమభావం (అటుపైనా) ఉంటుంది. 'రాత్రీః'– రాత్రులందు, రాబోయే రాత్రులందు కూడా 'సుఖమ్'– సంతోషంగా, నిశ్చలమైన మనసుతో; 'శయితా'– నిద్రిస్తాడు; 'మృత్యుముఖాత్ ప్రముక్తమ్'– మృత్యుకోరల నుండి విడుదలైన 'త్వామ్ దదృశివాన్'– (తన కుమారుడైన) నిన్ను దర్శించినవాడై; 'వీతమన్యుః'– కోపం వీడతాడు.

(ఔద్దాలకి అంటే ఉద్దాలకుడు అనే అర్థం లేదా ఉద్దాలకుని కొడుకు అని. ఉద్దాలకుల వంశంలో జన్మించిన వాడని అలాగే అరుణుల వంశంలో జన్మించిన వాడని కూడ. సోదరులు లేని కన్య వివాహసమయంలో ఆమెకు కలగబోయే పుత్రుడు రెండు వంశాలకు అనగా తను పుట్టిన వంశానికి మరియు భర్త వంశానికి చెందేలా నిబంధించుకొనే సంప్రదాయం ఉంది. ఆ సంప్రదాయం ప్రకారం, అట్టి పుత్రుడు రెండు వంశములకు పితృకార్యములు నిర్వర్తించే

అధికారం కలిగి ఉంటాడు. ఇక్కడ కూడా, నచికేతుని తండ్రియైన గౌతముడు కూడా అలా ఉద్దాలక, ఆరుణి వంశములు రెండింటికి చెందినవాడైయుండవచ్చు.– స్వామి గంభీరానంద)

(ఆ విధంగా తన మొదటి వరాన్ని కోరిన నచికేతునితో యమదేవుడు ఇలా అన్నాడు. నానుండి విడుదలపొందిన నిన్ను, ఔద్దాలక-అరుణి వంశస్థుడైన నీ తండ్రి గుర్తించి, పూర్వం నీపై ఎలాంటి వాత్సల్యం ఉండేదో అదే వాత్సల్యతను చూపుతాడు. అతడు రాత్రులందు నిశ్చింతగా నిదురిస్తాడు. మృత్యుముఖంనుండి విడుదలైన నిన్ను చూసి కోపాన్ని వదిలేస్తాడు. ఇలా యమదేవుడు నచికేతుడు అడిగిన మొదటి వరాన్ని అనుగ్రహించాడు. ఇక, రెండవ వరం గురించి నచికేతుడు యమదేవునితో ఇలా అంటున్నాడు.)

నచికేతుడు అన్నాడు –

**స్వర్గే లోకే న భయం కించనాస్తి**

**న తత్ర త్వం న జరయా బిభేతి .**

**ఉభే తీర్త్వాఽశనాయాపిపాసే**

**శోకాతిగో మోదతే స్వర్గలోకే .. 1-1-12 ..**

స్వర్గలోకంలో కొంచెమైనా భయం లేదు. అక్కడ నీవుండవు (మృత్యువుండదు). వృద్ధాప్యం భయపెట్టదు. ఆకలి దప్పులు రెండింటినీ అధిగమించినందున, శోకాన్నుండి తరించి, స్వర్గలోకంలో సుఖిస్తారు.

## శంకర భాష్యమ్

స్వర్గే లోకే రోగాదినిమిత్తం భయం కించన కించిదపి నాస్తి . న చ తత్ర త్వం మృత్యో సహసా ప్రభవసి, అతో జరయా యుక్త ఇహ లోక ఇవ త్వత్తో న బిభేతి కశ్చిత్తత్ర . కిం చ ఉభే అశనాయాపిపాసే తీర్త్వా అతిక్రమ్య శోకమతీత్య గచ్ఛతీతి శోకాతిగః సన్ మానసేన దుఃఖేన వర్జితః మోదతే హృష్యతి స్వర్గలోకే దివి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'స్వర్గే లోకే'– స్వర్గలోకంలో; రోగములు మొదలగు వాటి వల్ల భయం 'కించన'– ఏ మాత్రం కూడ; 'నాస్తి' - ఉండదు. 'తత్ర'– అక్కడ (ఆ స్వర్గలోకంలో); 'త్వం'– నీవు (అనగా మృత్యువు); 'న'– లేవు. అనగా, అక్కడ ఆ స్వర్గలోకంలో నీదైన (మృత్యువు) శక్తి ప్రభావం ఉండదు. అందువల్ల, ఈ లోకంలో జరిగేదానికి భిన్నంగా అక్కడ ఏమాత్రం కూడా 'జరయా'– వృద్ధాప్యం వలన; 'న బిభేతి'– వణికి పోరు. మరేమంటే, 'ఉభే అశనాయాపిపాసే తీర్త్వా'– ఆకలి దప్పికలు రెండింటినీ అతిక్రమించి; మరియు 'శోకాతిగః'– శోకమునుండి తరించి, మనసులో దుఃఖమును విడిచిన వాడై 'స్వర్గలోకే'– దైవలోకంలో; 'మోదతే'– ఆనందిస్తాడు.

(రెండవ వరాన్ని కోరే క్రమంలో నచికేతుడు ఇలా అంటున్నాడు. స్వర్గలోకంలో వ్యాధులు మొదలైన వాటి వల్ల ఏ మాత్రం కూడ భయమనేదే ఉండదు. ఎందుకంటే, అక్కడ మృత్యువు ప్రభావం ఉండదు. కాబట్టి, ఈ లోకంలో వృద్ధాప్యం వస్తుందనగానే దాని వెంటనంటి మృత్యువు ఏనాడైన ఆకస్మికంగా రాగలదనే భయం వెంటాడుతూనే ఉంటుంది. కానీ, ఇందుకు భిన్నంగా అక్కడ స్వర్గలోకంలో వృద్ధాప్యం వల్ల భయమనేదే ఉండదు. ఇంకేమంటే, అక్కడ మానవుడు ఆకలిదప్పులు రెండిటినీ అతిక్రమించినందువల్ల, మనసులో దుఃఖభావాన్ని పోగొట్టుకొన్నవాడై, దేవలోకంలో ఆనందాన్ని అనుభవిస్తాడు.)

**స త్వమగ్నిగ్ం స్వర్గ్యమధ్యేషి మృత్యో**
**ప్రబ్రూహి త్వగ్ం శ్రద్దధానాయ మహ్యమ్ .**
**స్వర్గలోకా అమృతత్వం భజన్త**
**ఏతద్ద్వితీయేన వృణే వరేణ .. 1-1-13 ..**

ఓ మృత్యూ, నీవంటిదైన (విశేష గుణములు కలదైన), స్వర్గలోక సాధనమైన అగ్ని గురించి నీకు తెలుసు. దాని గురించి శ్రద్ధగలిగిన నాకు బోధించు. (ఆ అగ్నిని ఉపాసించే) స్వర్గలోక వాసులు అమృతత్త్వం పొందుతారు. ఇదంతా వరాలలో రెండవదానిగా అనుగ్రహించు.

## శంకర భాష్యమ్

ఏవం గుణవిశిష్టస్య స్వర్గలోకస్య ప్రాప్తిసాధనభూతం అగ్నిం స్వర్గ్యం స త్వం మృత్యుః అధ్యేషి స్మరసి, జానాసీత్యర్థః . హే మృత్యో, యతః తం ప్రబ్రూహి కథయ శ్రద్దధానాయ శ్రద్ధావతే మహ్యం స్వర్గార్థినే . యేనాగ్నినా చితేన స్వర్గలోకాః స్వర్గో లోకో యేషాం తే స్వర్గలోకాః యజమానాః అమృతత్వం అమరణతాం దేవత్వం భజంతే ప్రాప్నువంతి, తత్ ఏతత్ అగ్నివిజ్ఞానం ద్వితీయేన వరేణ వృణే ..

మృత్యోః ప్రతిజ్ఞేయం —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'స త్వమ్'– నీ లాగానే విశిష్టమైన గుణములు కల; 'స్వర్గ్యమ్ అగ్నిమ్'– స్వర్గలోకం పొందటానికి సాధనరూపమైన అగ్ని గురించి; 'అధ్యేషి'– గుర్తుచేసుకో, అంటే నీకు తెలుసని అర్థం. కాబట్టి, 'మృత్యో'– ఓ మృత్యుదేవతా; 'మహ్యమ్ శ్రద్ధధానాయ'– శ్రద్ధ కలిగిన స్వర్గకాముడనైన నాకు; 'త్వమ్'– నీవు; 'ప్రబ్రూహి'– ప్రవచించు. ఏ అగ్నిని ఉపాసించడంచేత, 'స్వర్గలోకాః'– స్వర్గలోక వాసులు, ఎవరైతే స్వర్గాన్ని (యజ్ఞాది కర్మలచేత) సాధించుకొన్నారోవారు, యజ్ఞకర్తలు లేదా యజమానులు; 'అమృతత్వం'– మరణము లేకపోవడాన్ని, దైవత్వాన్ని;

'భజన్తే'– పొందుతారు.  'ఏతత్'– ఈ అగ్ని గురించిన జ్ఞానాన్ని 'ద్వితీయేన వరేణ'– రెండవ వరముగా; 'వృణే'– అనుగ్రహించు.

(నచికేతుడు మృత్యువును ఇలా ప్రార్థించాడు. నీలాగే విశిష్టగుణాలు కలిగి, స్వర్గలోకాన్ని పొందటానికి సాధనమైన అగ్ని గురించి నీకు బాగా తెలిసిఉంటుంది.  కాబట్టి శ్రద్ధకలిగిన స్వర్గకాముడనైన నాకు ఆ అగ్నిని గురించి బోధించు.  దేనిని  ఉపాసించి స్వర్గలోకాన్ని పొందిన యజ్ఞకర్తలు మరణంలేని స్థితిని పొందారో ఆ అగ్నిగురించిన జ్ఞానాన్నంతా రెండవ వరంగా అనుగ్రహించమని కోరుతున్నా.)

మృత్యువు ఇలా ప్రమాణం చేస్తున్నాడు –

**ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ**

**స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్ .**

**అనన్తలోకాప్తిమథో ప్రతిష్ఠాం**

**విద్ధి త్వమేతం నిహితం గుహాయామ్ .. 1-1-14 ..**

ఓ నచికేతా, నీవడిగిన స్వర్గలోక సాధనమైన అగ్నిని గురించి బాగా తెలుసుకున్నవాడినై నీకు బోధిస్తాను.  సావధానుడవై తెలుసుకో.  అనంతలోక ప్రాప్తికి సాధనం, జగత్తుకు ఆధారం అయిన ఈ అగ్ని విద్వాంసుల బుద్ధి గుహలో దాగి ఉన్నది.

## శంకర భాష్యమ్

తే తుభ్యం ప్రబ్రవీమి ; యత్త్వయా ప్రార్థితం తత్ ఉ మే మమ వచసః నిబోధ బుధ్యస్వ ఏకాగ్రమనాః సన్ . స్వర్గ్యం స్వర్గాయ హితం స్వర్గసాధనం అగ్నిం హే నచికేతః ప్రజానన్ విజ్ఞాతవాన్సన్నహమిత్యర్థః . ప్రబ్రవీమి తన్నిబోధేతి చ శిష్యబుద్ధిసమాధానార్థం వచనం . అధునాగ్నిం స్తౌతి — అనంతలోకాప్తిం స్వర్గలోకఫలప్రాప్తిసాధనమిత్యేతత్ , అథో అపి ప్రతిష్ఠాం ఆశ్రయం జగతో విరాట్స్వరూపేణ, తం ఏతం అగ్నిం మయోచ్యమానం విద్ధి విజానీహి త్వం నిహితం స్థితం గుహాయాం . విదుషాం బుద్ధౌ నివిష్టమిత్యర్థః ..

ఇదం శ్రుతేర్వచనం —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'నచికేతః'– నచికేతుడా; నీవు కోరిన (ఆ అగ్ని గురించిన) 'తత్ ఉ'– ఆ విషయాన్ని; 'స్వర్గ్యం అగ్నిం'– స్వర్గాన్ని పొందేందుకు సహకరించే సాధనమైన అగ్నిని గురించి; 'ప్రజానన్'– బాగా తెలిసికొన్న దానిని; 'మే'– నా నుండి, నా మాటలద్వారా; 'తే'– నీకు; 'ప్రబ్రవీమి'–చక్కగా బోధిస్తా; 'నిబోధ'– బుద్ధితో ఏకాగ్రమైన మనసుతో గ్రహించు. తప్పక బోధిస్తా, ఏకాగ్రమైన మనసుతో గ్రహించమనడంలో శిష్యునియొక్క బుద్ధిని విషయం మీద నిమగ్నం చేయడమే

ఉద్దేశ్యం. ఇక అగ్నిని స్తుతిస్తున్నాడు. ఆ అగ్ని, 'అనన్తలోకాప్తిమ్' - అనంతమైన లోకాన్ని ప్రసాదించేది; అంటే, స్వర్గమనే ఫలాన్ని పొందేందుకు సాధనమైనదని అర్థం. 'అథో'– మరింకా; 'ప్రతిష్ఠమ్'– ఆధారం, విరాట్ స్వరూపమైన జగత్తునకు ఆశ్రయమైనది; 'ఏతమ్'– ఇది, నాచే బోధించబడుచున్న ఈ అగ్ని; 'నిహితమ్ గుహాయామ్'– రహస్య స్థానంలో దాగినదిగా, విద్వాంసుల బుద్ధియందు దాగినదిగా; 'విద్ధి'– తెలుసుకో.

{బృహదారణ్యక ఉపనిషద్ నందు 'అతడు (సగుణ బ్రహ్మరూపమైన విరాట్ పురుషుడు) తనను తాను మూడు విధాలుగా వ్యాకృతం (విభ జనం) చేసుకొన్నాడు'['స త్రేధాత్మానం వ్యకురుత' (బృ.ఉ. 1.2.3)]. ఆ శ్రుతి పాఠానుసారం విరాట్ పురుషుడు అగ్ని, వాయు, ఆదిత్య రూపాలను పొందాడు. విరాట్ స్వరూపంలోని అంశయైన అగ్ని, జగత్తునకు ఆధారం. – ఆనందగిరి}

(అందుకు యమదేవుడిలా బదులిస్తున్నాడు, "నచికేతా, నీవేదైతే అగ్ని గురించిన జ్ఞానాన్ని కోరావో, స్వర్గలోకప్రాప్తికి కారణమైన ఆ అగ్ని గురించి నాకు బాగా తెలిసిన దానిని తప్పక నీకు బోధిస్తా. సావధానుడవై గ్రహించు." బోధిస్తాను సావధానంగా గ్రహించమని అనడంలో నచికేతుని బుద్ధిని ఏకాగ్రత పరచడమే ఉద్దేశ్యం. బోధనలో భాగంగా యమదేవుడు, ఆ అగ్ని గొప్పదనాన్ని ఇలా చెప్తున్నాడు. "అగ్ని అనంతలోక ప్రాప్తికి సాధనం. విరాట్ స్వరూపమైన జగత్తునకు అది ఆధారం. విద్వాంసుల బుద్ధి గుహయే దాని స్థావరం. అలా అది రహస్యం.")

ఇది (ఈ క్రిందిమంత్రం) శ్రుతి వచనం –

**లోకాదిమగ్నిం తమువాచ తస్మై**
**యా ఇష్టకా యావతీర్వా యథా వా .**
**స చాపి తత్ప్రత్యవదద్యథోక్త-**
**మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః** **.. 1-1-15 ..**

అతనికి (నచికేతునికి) జగత్తునకు మూలమైన అగ్నిని గూర్చి, (అగ్ని ఆరాధనకు ఉపయోగించే) ప్రత్యేకమైన ఇటుకలు, వాటి సంఖ్యలు, అగ్ని వేది నిర్మాణముల గురించి (యమదేవుడు) ప్రవచించాడు. అతడు (నచికేతుడు) కూడా చెప్పబడిన విషయాన్ని చెప్పినట్లుగా అర్థం చేసుకొని పునర్వచించాడు. అప్పుడు మృత్యువు సంతసించినవాడై తిరిగి అన్నాడు.

## శంకర భాష్యమ్

లోకాదిం లోకానామాదిం ప్రథమశరీరిత్వాత్ అగ్నిం తం ప్రకృతం నచికేతసా ప్రార్థితం ఉవాచ ఉక్తవాన్మృత్యుః తస్మై నచికేతసే . కించ, యాః ఇష్టకాః చేతవ్యాః స్వరూపేణ యావతీర్వా సంఖ్యయా యథా వా చీయతేఽగ్నిర్యేన ప్రకారేణ

సర్వమేతదుక్తవానిత్యర్థః . స చాపి నచికేతాః తత్ మృత్యునోక్తం ప్రత్యవదత్ యథావత్ప్రత్యయేనావదత్ ప్రత్యుచ్చారితవాన్ . అథ అస్య ప్రత్యుచ్చారణేన తుష్టః సన్ మృత్యుః పునరేవాహ వరత్రయవ్యతిరేకేణాన్యం వరం దిత్సుః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'లోకాదిమ్'– లోకములకన్నా ముందువాడైన, అంటే ప్రప్రథమంగా రూపాన్ని గలవాడైన; 'అగ్నిమ్ తమ్'– నచికేతుడు ఏ విషయం గురించి అర్థించాడో అట్టి ప్రస్తుతం సంగతమైన అగ్ని గురించి; 'తస్మై'– అతనికి (ఆ నచికేతునికి); 'ఉవాచ'– (యమదేవుడు) బోధించాడు. అంతేకాక, 'యాః ఇష్టకాః'– (యజ్ఞవేది నిర్మాణానికి ఉపయోగించదగిన) ఇటుకలలోని రకాలు; 'యావతీః వా'– వాటి (ఉపయోగించ వలసిన ఇటుకల) సంఖ్య; 'యథా వా'– లేదా అగ్నిని ఏర్పాటు చేసే విధానం; వీటన్నిటినీ చెప్పాడని అర్థం. 'తత్' – అదంతా; 'యథోక్తమ్' - (యమునిచే) చెప్పినరీతిగా; 'సః చ అపి'– అతడు, నచికేతుడు కూడా; 'ప్రత్యవదత్' - తిరిగి అర్థవంతంగా వల్లించాడు. 'అథ'– అప్పుడు; 'మృత్యుః'– మృత్యువు; 'తుష్టః'– (చెప్పిన దానిని అర్థం చేసుకొని నచికేతునిచే తిరిగి వల్లించబడినందున) తృప్తిచెందినవాడై; ఇప్పటికే ఇవ్వబడిన మూడు వరాలకు అదనంగా మరొక వరం ఇవ్వదలచిన వాడై, 'పునః ఏవ ఆహ'– మరల అన్నాడు.

(ముందు చెప్పినట్లుగా విరాట్ స్వరూపంలో మొదటి వాడైనందున, లోకముల కన్నా ముందు సృజించబడినవాడు. అంతేకాదు, పంచభూతాలలో రూపం కలిగిన వారిలో ప్రథముడు కూడా అగ్నియే. అటువంటి అగ్నిని గురించి నచికేతుడు కోరగా, యమదేవుడు అతనికి వివరంగా బోధించాడు. అంటే, అగ్నిని ఆరాధించేందుకు కావలసిన యజ్ఞవేది నిర్మాణ విశేషాలు, ఆ నిర్మాణానికి కావలసిన ఇటుకల ప్రత్యేకతలు, వాటి సంఖ్యాపరమైన విశేషాలు అన్నింటినీ బోధించాడని అర్థం. అలా బోధింపబడినదాన్ని నచికేతుడు శ్రద్ధగా గ్రహించి, చెప్పినదానిని చెప్పినవిధంగా అర్థం చేసుకొని తిరిగి యమునికి వల్లించాడు. ఆ విధంగా వల్లించిన నచికేతుని యొక్క శ్రద్ధకు సంతసించినవాడైన యమదేవుడు, అతనికి ముందు ఇచ్చిన మూడు వరాలకు అదనంగా మరొక వరాన్ని ఇవ్వదలచి, మరలా ఇలా అంటున్నాడు.)

**తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా**
**వరం తవేహాద్య దదామి భూయః .**
**తవైవ నామ్నా భవితాఽయమగ్నిః**
**సృఙ్కాం చేమామనేకరూపాం గృహాణ .. 1-1-16 ..**

గొప్ప మనసుగల ఆ యమదేవుడు ప్రీతిచెంది నచికేతునితో ఇలా అన్నాడు, "నీ ప్రయోజనార్థం ఇక్కడ ఇప్పుడు మరొక వరాన్ని ఇస్తున్నాను. ఈ అగ్ని ఇకపై నీపేరిట ప్రసిద్ధి పొందుతుంది. మరింకా, అనేక రూపాలు రంగులు కల ఈ కంఠహారాన్ని స్వీకరించు."

## శంకర భాష్యమ్

కథం ? తం నచికేతసం అబ్రవీత్ ప్రీయమాణః శిష్యస్య యోగ్యతాం పశ్యన్ప్రీయమాణః ప్రీతిమనుభవన్ మహాత్మా అక్షుద్రబుద్ధిః వరం తవ చతుర్థం ఇహ ప్రీతినిమిత్తం అద్య ఇదానీం దదామి భూయః పునః ప్రయచ్ఛామి . తవైవ నచికేతసః నామ్నా అభిధానేన ప్రసిద్ధః భవితా మయోచ్యమానః అయం అగ్నిః . కించ, సృంకాం శబ్దవతీం రత్నమయీం మాలాం ఇమాం అనేకరూపాం విచిత్రాం గృహాణ స్వీకురు . యద్వా, సృంకాం అకుత్సితాం గతిం కర్మమయీం గృహాణ . అన్యదపి కర్మవిజ్ఞానమనేకఫలహేతుత్వాత్స్వీకుర్విత్యర్థః ..

పునరపి కర్మస్తుతిమేవాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఎలా (ఏ విధంగా) అన్నాడు? 'ప్రీయమాణః'– ప్రీతిచెందినవాడై, శిష్యునియొక్క యోగ్యతను చూసి పరమసంతోషం పొందినవాడై, సంతోషాన్ని అనుభవించిన వాడై; 'మహాత్మా' – గొప్పమనసు కల, సంకుచిత మనస్తత్వం లేని; ఆ యమదేవుడు 'తమ్'– అతనితో (ఆ నచికేతునితో); 'అబ్రవీత్'– అన్నాడు; 'వరమ్'– వరాన్ని, నాల్గవదాన్ని; 'తవ ఇహ'– నీ ప్రీతికొరకు; 'అద్య'– ఇప్పుడు; 'భూయః దదామి'– మరొకదానిని ఇస్తున్నాను. 'అయమ్ అగ్నిః'– నాచే బోధించబడిన ఈ అగ్ని; 'తవైవ నామ్నా'– నీ పేరున మాత్రమే, నచికేతుని పేరుతోనే; 'భవితా'– ప్రసిద్ధి చెందుతుంది. (ఇదీ నాల్గవ వరం). 'చ'– మరింకా; 'అనేక రూపామ్' - అనేక రూపాలుకలది, అనేకరంగులు కలిగి విచిత్రమైనదీ చిరుసవ్వడి చేసే రత్నాలంకృతమైన 'ఇమామ్'– ఈ; 'సృఙ్కామ్'– మాలను; 'గృహాణ'–స్వీకరించు. లేదా, 'సృఙ్కామ్'– పాపరహితమైన, కర్మలతో నిండిన మార్గాన్ని; 'గృహాణ'–స్వీకరించు. అనేక ఫలాలను అనుగ్రహించే వివిధ కర్మలకు సంబంధించిన జ్ఞానాన్ని స్వీకరించమని అభిప్రాయం.

(తనచే నేర్పబడిన అగ్ని విద్యను ఏకాగ్రచిత్తంతో గ్రహించి తిరిగి దానిని అర్థవంతంగా తనకు వల్లించిన నచికేతుని యోగ్యతను చూసి యమదేవుడు ఎంతో ముచ్చటపడ్డాడు. అలా ప్రీతిచెందిన, సంకుచిత బుద్ధి లేని ఆ యమదేవుడు ఆ నచికేతునితో ఇలా అంటున్నాడు. నచికేతా, నీపై ఏర్పడిన ప్రీతివల్ల నీవు అడుగకపోయినా అదనంగా ఇంకొక వరాన్ని కూడా ఇస్తున్నా. అదేమిటంటే, నాచే చెప్పబడిన ఈ అగ్ని ఇకపై నీ పేరుతో నచికేతాగ్నిగా ప్రసిద్ధి చెందుతుంది. ఇది ముందటి మూడు వరాలకు అదనంగా ఇచ్చిన నాల్గవ వరం. ఇదే కాకుండా, అనేక రూపాలు, రంగులు కలిగి చిత్రమైన రత్నాలతో పొదగబడిన కంఠమాలను బహుమానంగా ఇస్తున్నా తీసుకొమ్మన్నాడు. ఇక్కడ విశేషార్థమేమంటే, అనేక ఫలాలను అనుగ్రహించే పాపరహితమైన కర్మలతో నిండిన మార్గాన్ని నీకు అనుగ్రహిస్తున్నా. ఆ మార్గాన్ని అనుసరించు అని కూడా అర్థం. ఆ కర్మమార్గాన్ని యమదేవుడు ఈ క్రింది మంత్రంలో ఇలా వివరిస్తున్నాడు.)

కర్మల గొప్పదనాన్ని కీర్తిస్తూ (యమదేవుడు) మరలా ఇలా అన్నాడు.

**త్రిణాచికేతస్త్రిభిరేత్య సన్ధిం**
**త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ .**
**బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా**
**నిచాయ్యేమాగ్ం శాన్తిమత్యన్తమేతి .. 1-1-17 ..**

మూడింటి (మూడు వేదాల) అనుసంధానంతో, ముమ్మారు నచికేతాగ్ని ప్రేల్చి, మూడు విధాలైన కర్మలను (యజ్ఞం, వేదాధ్యయనం, దానములను) ఆచరించినవాడు జన్మ, మృత్యువుల నుండి తరిస్తాడు. బ్రహ్మనుండి ఉత్పన్నమైన పూజనీయమైన విరాట్ స్వరూపమే తానుగా విచారించి తెలుసుకొని తద్వారా పూర్ణమైన శాంతిని పొందుతాడు.

## శంకర భాష్యమ్

త్రిణాచికేతః త్రిః కృత్వా నాచికేతోఽగ్నిశ్చితో యేన సః త్రిణాచికేతః ; తద్విజ్ఞానవాన్వా . త్రిభిః మాతృపిత్రాచార్యైః ఏత్య ప్రాప్య సంధిం సంధానం సంబంధం , మాత్రాద్యనుశాసనం యథావత్ప్రాప్యేత్యేతత్ . తద్ధి ప్రామాణ్యకారణం శ్రుత్యంతరాదవగమ్యతే 'యథా మాతృమాన్పితృమాన్' (బృ. ఉ. 4 . 1 . 2) ఇత్యాదేః . వేదస్మృతిశిష్టైర్వా ప్రత్యక్షానుమానాగమైర్వా . తేభ్యో హి విశుద్ధిః ప్రత్యక్షా . త్రికర్మకృత్ ఇజ్యాధ్యయనదానానాం కర్తా తరతి అతిక్రామతి జన్మమృత్యూ . కించ, బ్రహ్మజజ్ఞం , బ్రహ్మణో హిరణ్యగర్భాజ్జాతో బ్రహ్మజః బ్రహ్మజశ్చాసౌ జ్ఞశ్చేతి బ్రహ్మజజ్ఞః . సర్వజ్ఞో హ్యసౌ . తం దేవం ద్యోతనాజ్జ్ఞానాదిగుణవంతం , ఈడ్యం స్తుత్యం విదిత్వా శాస్త్రతః, నిచాయ్య దృష్ట్వా చాత్మభావేన ఇమాం స్వబుద్ధిప్రత్యక్షాం శాంతిం ఉపరతిం అత్యంతం ఏతి అతిశయేనైతి . వైరాజం పదం జ్ఞానకర్మసముచ్చయానుష్ఠానేన ప్రాప్నోతీత్యర్థః ..

ఇదానీమగ్నివిజ్ఞానచయనఫలముపసంహరతి, ప్రకరణం చ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'త్రిభిః'– మూడింటితో, అనగా తల్లి, తండ్రి మరియు గురువుల నుండి పొందేదే సరియైనవిద్య, ఎందుకంటే అదే ప్రామాణిక విద్య అని శ్రుతికూడా ఇలా చెప్తోంది, 'మాతా పితరులు కలవాడు చెప్పినట్లుగా' ['యథా మాతృమాన్పితృమాన్' (బృ. ఉ. 4 . 1 . 2)] లేదా వేదములు, స్మృతులు మరియు సత్పురుషుల నుండి పొందిన విద్య లేదా సాక్షాత్ ప్రమాణ సిద్ధంగానూ, అనుమాన ప్రమాణంతోనూ మరియు శాస్త్రముల ద్వారా అంటే వాటి నుండి అనుభవ పూర్వకంగా గ్రహించబడిన విషయమని స్పష్టం; 'సన్ధిమ్ ఏత్య'– సంధిని లేదా సంబంధాన్ని పొంది; 'త్రిణాచికేతః'– నాచికేతాగ్నిని మూడు సార్లు ప్రజ్వలించినవాడు త్రిణాచికేతుడు లేదా నాచికేతాగ్ని యొక్క జ్ఞానం, అధ్యయనం మరియు ఆచరణ కలవాడు; 'త్రికర్మకృత్'– మూడు విధాలైన కర్మలను అంటే యజ్ఞం, వేదాధ్యయనం, దానం అనే త్రివిధ కర్మలను నిర్వహించిన వాడు; 'జన్మమృత్యు'– పుట్టుక మరణాలను; 'తరతి'– అధిగమిస్తాడు. మరింకా, 'బ్రహ్మజజ్ఞం'– బ్రహ్మనుండి జనించిన అనగా విరాట్ పురుషుడు బ్రహ్మజ, కాబట్టి అతని గురించిన జ్ఞానం

బ్రహ్మజజ్ఞం. అదియే సర్వవ్యాపక తత్త్వం. 'దేవం'– దైవం, సర్వాన్ని ప్రకాశింపచేయుట, తెలియపరచుటయే గుణాలుగా గల అతడు (ఆ హిరణ్యగర్భుడు) 'ఈడ్యం'– ఉపాసనీయుడు, ఆరాధింపదగినవాడు; 'నిచయ్య'– మనసులో విచారణ చేసి; అదే తన ఆత్మగా, 'విదిత్వా'– తెలుసుకొన్నవాడు; 'ఇమామ్'– తన బుద్ధికి గోచరణీయమైన; 'అత్యన్తమ్'– పూర్ణమైన; 'శాన్తిమ్' - శాంతిని, విషయ విముఖత్వాన్ని; 'ఏతి' – పొందును. కర్మలను ఉపాసనలతో జోడించడం ద్వారా విరాట్ స్వరూపస్థితిని పొందుతాడని అర్థం.

["(ఈ క్రతువులో) ఉపయోగించే ఇటుకల సంఖ్య 720. (విరాట్ ప్రజాపతికి ప్రతీక అయిన) ఒక సంవత్సరం లోని రాత్రులు, పగళ్ళ సంఖ్య కూడా ఇదే. ఈ సంఖ్యల సమానత వల్ల సూచనేమంటే పగలు, రాత్రుల సముదాయంచే ఏర్పడే (సంవత్సరం – ప్రజాపతి అనబడే) అగ్నిని నేనే." ఈ విధంగా అగ్నియే (విరాట్) తన స్వరూపంగా ధ్యానించడం వల్ల అదే తానుగా అనుభవం కలుగుతుంది. - ఆనందగిరి]

[మూడు విధాలైన విద్యలను అనుసంధానించుకొని, మూడు విధాలైన కర్మలను ఆచరించినందున మృత్యువును అధిగమించినట్లే, అగ్నికార్యాన్ని మూడుసార్లు నిర్వర్తించివాడు కూడా మృత్యువును అధిగమిస్తాడు. అంతేకాక, సర్వవ్యాపకుడైన బ్రహ్మనుంచి జన్మించిన వాని గురించిన (అంటే విరాట్ పురుషుని గురించిన) జ్ఞానాన్ని పొంది, అదియే తానుగా అనుభవం పొందిన వానికి పూర్ణశాంతి లభిస్తుంది – బాలగోపాలేంద్ర వ్యాఖ్య]

(తల్లి, తండ్రి, గురువులనుండి నేర్చుకొన్నదే సరైన విద్య. ఇదే అర్థం కాకుండా, వేదాలు, స్మృతులు, సత్పురుషుల నుండి గ్రహించినది కూడా సరైన విద్యే అనే అర్థం ఉంది. అదేకాకుండా, ప్రత్యక్ష ప్రమాణంతోనూ, అనుమాన ప్రమాణంతోనూ, శాస్త్రప్రమాణంతోనూ గ్రహించిన విద్య కూడా సరైన విద్యయే. ఈ విధంగా సరైన విద్యతో అనుసంధానం చేసుకొని, మూడు కాలాలలో నచికేతాగ్నిని ఆరాధించినవాడు లేదా అగ్నియొక్క జ్ఞానాన్ని పొంది, అధ్యయనం చేసి, విధిపూర్వకంగా ఆరాధించినవానిని త్రిణాచికేతుడంటారు. అట్టి వాడు, త్రివిధాలైన కర్మలను అంటే యజ్ఞము, స్వాధ్యాయము (వేదాధ్యయనము), దానములను ఆచరించినట్లైతే, జనన మరణాలను అధిగమిస్తాడు. ఈ చెప్పినదంతా కర్మలకు సంబంధించిన విషయం. ఇక ఉపాసన విషయాన్ని ప్రస్తావిస్తున్నారు. బ్రహ్మనుండి జనించిన వాడైన విరాట్ పురుషుడు (లేదా హిరణ్యగర్భుడు) సర్వవ్యాపకుడనీ, సర్వాన్నీ ప్రకాశింపచేయడం లేదా తెలియచేయడమే అతని స్వభావమనీ, ఉపాసనీయుడని మనసులో విచారణ చేసి తెలుసుకొన్నవాడు తన బుద్ధికి గోచరించే పూర్ణమైన శాంతిని (విషయాల పట్ల విముఖతని) అనుభవిస్తాడు. ఇదీ ఉపాసనకు సంబంధించిన విషయం. ఇలా కర్మలనూ, ఉపాసననూ జోడించిడం వల్ల విరాట్ స్వరూపం పొందబడుతుందని అభిప్రాయం. ఇక్కడు ఇంకొక విషయం గమనించాలి. గత మంత్రంలో యమదేవుడు ఇకపై ఈ అగ్ని నచికేతాగ్నిగా పిలువబడుతుంది అనే వరాన్ని ఇచ్చాడు. ఇచ్చిన ఆ వరాన్ని వెంటనే అమలు పరిచాడు ఈ మంత్రంలో. ఇక్కడ అగ్ని గురించిన ప్రస్తావన వచ్చినపుడల్లా నచికేతాగ్నిగానే సంబోధించాడు.)

అగ్ని గురించిన విజ్ఞానాన్ని, నిర్మాణాన్ని తెలుకొన్నందున కలిగే ఫలితాల వివరణను దాని గురించిన చర్చను ముగిస్తూ --

**త్రిణాచికేతస్త్రయమేతద్విదిత్వా**

**య ఏవం విద్వాగ్ంశ్చినుతే నాచికేతమ్ .**

**స మృత్యుపాశాన్పురతః ప్రణోద్య**

**శోకాతిగో మోదతే స్వర్గలోకే .. 1-1-18 ..**

ఆ మూడు విషయాలు తెలుసుకొని మూడుసార్లు నాచికేత యజ్ఞాన్ని నిర్వహించినవాడు మరియు అది (విరాట్ స్వరూపమైన అగ్ని) తానే అని విచారించి తెలుసుకొని నాచికేత యజ్ఞాన్ని నిర్వహించినవాడు శోకాన్ని అధిగమించి ముందుగానే మృత్యుపాశాన్ని విడిచివేసి, స్వర్గలోకంలో సుఖిస్తాడు.

## శంకర భాష్యమ్

త్రిణాచికేతః త్రయం యథోక్తం 'యా ఇష్టకా యావతీర్వా యథా వా' ఇతి . ఏతత్ విదిత్వా అవగమ్య యశ్చ ఏవం ఆత్మస్వరూపేణ అగ్నిం విద్వాన్ చినుతే నిర్వర్తయతి నాచికేతమగ్నిం క్రతుం , సః మృత్యుపాశాన్ అధర్మాజ్ఞానరాగద్వేషాదిలక్షణాన్ పురతః అగ్రతః, పూర్వమేవ శరీరపాతాదిత్యర్థః, ప్రణోద్య అపహాయ, శోకాతిగః మానసైర్దుఃఖైర్విగత ఇత్యేతత్ , మోదతే స్వర్గలోకే వైరాజే విరాడాత్మస్వరూపప్రతిపత్త్యా ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏతత్ త్రయమ్'– ఈ మూడింటిని, ఇంతకు ముందు (15వ శ్లోకంలో) చెప్పినట్లు 'అగ్నివేది నిర్మాణానికి కావలసిన ఇటుకల ప్రత్యేకత, వాటి సంఖ్యా నిర్ణయం, నిర్మాణ విధానం' ['యా ఇష్టకా యావతీర్వా యథా వా'] అనే మూడు ప్రధాన విషయాలను; 'విదిత్వా'– తెలుసుకొని; 'త్రిణాచికేతః'– మూడుసార్లు అగ్ని క్రతువు నిర్వహించినవాడు, మరియు 'యః'– ఎవడు; 'ఏవమ్ విద్వాన్'– ఆత్మస్వరూపమే అగ్నిగా తెలుసుకొని; 'నాచికేతమ్'– అగ్ని క్రతువును 'చినుతే'– నిర్వర్తిస్తాడో; 'సః'– అతడు'; 'మృత్యుపాశాన్'– అధర్మం, అజ్ఞానం, రాగం ద్వేషం అనే లక్షణాలను; 'పురతః'– ముందుగానే, అంటే శరీరపతనానికి ముందుగానే అని అభిప్రాయం; 'ప్రణోద్య'– తొలగించుకొని; 'శోకాతిగః'– మానసిక దుఃఖాన్ని వీడి; 'స్వర్గలోకే'– విరాట్ లోకంలో; విరాట్టే తన ఆత్మస్వరూపమనే భావనలో; 'మోదతే'– సుఖిస్తాడు.

(ముందు 15వ శ్లోకంలో చెప్పిన విధంగా అగ్ని ఆరాధనకు ప్రత్యేకించిన ఇటుకులు, వాటి సంఖ్యాది విషయాలు, అగ్నివేది నిర్మాణ విషయాలను గ్రహించి, మూడు సార్లు అగ్ని కార్యాన్ని నిర్వర్తించినవాడు మరియు ఉపాసనా విధానంలో అగ్నియే తన స్వరూపమని ధ్యానపూర్వకంగా విచారించి తెలిసికొని అగ్ని కార్యాన్ని నిర్వహించినవాడు, అధర్మ, అజ్ఞాన, రాగ-ద్వేష లక్షణాలు కలిగిన మృత్యుపాశాన్ని శరీరాన్ని విడిచిపెట్టే ముందే తొలగించుకొంటాడు. ఆవిధంగా, అతడు మనసులో కలిగే దుఃఖాన్నుండి విడివడి, విరాట్ లోకంలో అంటే విరాట్టు తానసే భావనలోనే సుఖిస్తాడు.)

[శంకరుల వ్యాఖ్యలోని 'నాచికేతమగ్నిం క్రతుం' లోని 'క్రతుం' అనే పదానికి 'ధ్యానము లేదా విచారణగా' అర్థంచేసుకోవాలి అని బాలగోపాలేన్ద్రుని అభిప్రాయం]

**ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో**
**యమవృణీథా ద్వితీయేన వరేణ .**
**ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యన్తి జనాస-**
**స్తృతీయం వరం నచికేతో వృణీష్వ .. 1-1-19 ..**

ఓ నచికేతా, ఇదీ స్వర్గానికి సాధనమైన అగ్ని గురించి నీవు కోరిన రెండవ వరం. ఈ అగ్నియే నచికేతాగ్నిగా జనులచే పిలువబడుతుంది. నచికేతా, మూడవ వరాన్ని అడుగు.

## శంకర భాష్యమ్

ఏషః తే తుభ్యం అగ్నిః వరః హే నచికేతః, స్వర్గ్యః స్వర్గసాధనః, యం అగ్నిం వరం అవృణీథాః వృతవాన్ ప్రార్థితవానసి ద్వితీయేన వరేణ, సోఽగ్నిర్వరో దత్త ఇత్యుక్తోపసంహారః . కించ, ఏతం అగ్నిం తవైవ నామ్నా ప్రవక్ష్యంతి జనాసః జనా ఇత్యేతత్ . ఏష వరో దత్తో మయా చతుర్థస్తుష్టేన . తృతీయం వరం నచికేతః వృణీష్వ . తస్మిన్న్యదత్తే ఋణవానేవాహమిత్యభిప్రాయః ..

ఏతావద్ధ్యతిక్రాంతేన విధిప్రతిషేధార్థేన మంత్రబ్రాహ్మణేనావగంతవ్యం యద్వరద్వయసూచితం వస్తు నాత్మతత్త్వవిషయయాథాత్మ్యవిజ్ఞానం . అతో విధిప్రతిషేధార్థవిషయస్య ఆత్మని క్రియాకారకఫలాధ్యారోపణలక్షణస్య స్వాభావికస్యాజ్ఞానస్య సంసారబీజస్య నివృత్త్యర్థం తద్విపరీతబ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం క్రియాకారకఫలాధ్యారోపణశూన్యమాత్యంతికనిఃశ్రేయసప్రయోజనం వక్తవ్యమిత్యుత్తరో గ్రంథ ఆరభ్యతే . తమేతమర్థం ద్వితీయవరప్రాప్త్యాప్యకృతార్థత్వం తృతీయవరగోచరమాత్మజ్ఞానమంతరేణేత్యాఖ్యాయికయా ప్రపంజయతి . యతః పూర్వస్మాత్ కర్మగోచరాత్ సాధ్యసాధనలక్షణాదనిత్యాద్విరక్తస్యాత్మజ్ఞానేఽధికార ఇతి తన్నిందార్థం పుత్రాద్యుపన్యాసేన ప్రలోభనం క్రియతే . నచికేతా ఉవాచ 'తృతీయం వరం నచికేతో వృణీష్వ' ఇత్యుక్తః సన్ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'నచికేతః'– ఓ నచికేతా; 'ఏషః'– ఇదియే; 'తే'– నీవు; 'ద్వితీయేన వరేణ'– రెండవ వరముగా; 'అవృణీథాః'– కోరిన, అభ్యర్థించిన; 'స్వర్గ్యః అగ్నిః'– స్వర్గలోకము పొందేందుకు సాధనమైన అగ్ని;. అట్టి అగ్ని గురించిన వరాన్ని ఇవ్వడం జరిగింది అని ముగించాడు. అంతేకాక, 'జనాసః'– జనులు; 'ఏతమ్ అగ్నిమ్' - ఈ అగ్నిని; 'తవ ఏవ'– నీది గానే; అంటే నీ పేరిటనే (నచికేతాగ్ని గానే) 'ప్రవక్ష్యన్తి'– చెప్పుకొంటారు. సంతుష్టుడనై నాచే ఈ నాలుగవ వరం ఇవ్వబడినది. 'నచికేతః'– నచికేతా; 'తృతీయమ్ వరమ్'– మూడవ వరాన్ని; 'వృణీష్వ'– అడుగు. అది అనుగ్రహించకపోతే నేను ఋణగ్రస్తుడనే అని అభిప్రాయం.

(ఓ నచికేతా, ఇప్పుడు ఈ చెప్పినదంతా, నీవు రెండవ వరంగా కోరియున్న, స్వర్గలోకాన్ని సాధించిపెట్టే అగ్ని గురించిన జ్ఞానం. అట్టి అగ్నియొక్క జ్ఞానం పూర్తిగా నీకు బోధించబడింది అని అభిప్రాయం. అంతేకాక, జనులు ఈ అగ్నిని ఇకనుండి నీపేరిటనే నచికేతాగ్నిగా వ్యవహరిస్తారు. ఇది నీ శ్రద్ధ పట్ల ప్రీతిచెందిన నేను నీకు అనుగ్రహించిన నాలుగవ వరం. ఇక, మిగిలియున్న మూడవ వరాన్ని కూడా కోరుకో. అది ఇవ్వకపోతే నేను నీకు ఋణపడి ఉన్నట్లుగానే అవుతుందని భావం.)

ఇంతకు పూర్వభాగం వరకు (వేదంలో ఈ కఠోపనిషద్ పాఠం ప్రారంభం కావడానికి ముందు వరకు) చెప్పిన మంత్రాలు, బ్రాహ్మణాలలో తెల్పిన విధ్యుక్త నిషేధకర్మల వల్ల తెలిసిందీ, అలాగే పైన చెప్పిన రెండు వరములచే సూచింపబడిన వస్తువూ ఇంతమాత్రమే (అగ్ని కార్యం మరియు ఆ అగ్ని కార్యం సాధనగా పొందగలిగే స్వర్గం. ఇది మాత్రమే, ఇప్పటివరకు చెప్పబడిన విషయం). కాని, అది ఆత్మతత్త్వ విషయం, ఆత్మయొక్క నిజమైన విజ్ఞానం గురించినది మాత్రం కాదు. విధ్యుక్త, విధినిషేద విషయాల సందర్భంలో, ఆత్మయందు కర్మలుచేయడం, వాటికి కర్తృత్వం వహించడం, ఆ కర్మఫలాలను అనుభవించడం అనే అధ్యారోపణలు చేయబడతాయి. అట్టి లక్షణం గల సంసారబీజానికి కారణమైన స్వభావసిద్ధమైన అజ్ఞానం నిర్మూలించేందుకు, ఆ అజ్ఞానానికి విరుద్ధమైనదీ, పైన చెప్పిన అధ్యారోపణలేవీ లేనిదీ, ఆద్యంతమూ మోక్షమే ప్రయోజనంగా గలదీ అయిన బ్రహ్మము మరియు ఆత్మ ఏకమేననే విజ్ఞాన బోధ ఆవశ్యకం. ఈ విషయాన్ని బోధించడానికే, గ్రంథం యొక్క తరువాతి భాగం ప్రారంభించబడుతోంది. మూడవ వరంలో ప్రస్తావించబోయే ఆత్మను గురించిన జ్ఞానం (ఇప్పటివరకు ప్రస్తావించక పోవడంతో) లోపించడంతో, రెండవ వరం ప్రాప్తించినప్పటికినీ తృప్తి చేకూరనందున, ఈ కథాక్రమం ద్వారా విస్తారంగా ఆత్మను గురించిన జ్ఞానం బోధించబడబోతున్నది. ముందు చెప్పిన కర్మకాండలోని అశాశ్వతమైన ఫలితాలు మరియు సాధనలపట్ల విముఖత కలిగిన వాడు మాత్రమే ఆత్మజ్ఞానం పొందటానికి అర్హుడు. కాబట్టి, అట్టి అనిత్యమైన ఫలితాలను, సాధనలను నిందించే (తక్కువ స్థాయివని నిరూపించే) ఉద్దేశ్యంతోనే, ముందు నచికేతునిని పుత్రాదుల వంటి విషయాలపై ప్రలోభపెడుతున్నాడు. అందుకే, "ఓ నచికేతా, మూడవ వరాన్ని అడుగు" అని చెప్పగా, నచికేతుడు అంటున్నాడు --

**యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే-**
**ఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే .**
**ఏతద్విద్యామనుశిష్టస్త్వయాఽహం**
**వరాణామేష వరస్తృతీయః** **.. 1-1-20 ..**

మానవుడు మరణించినప్పుడు ఈ సందేహం కలుగుతోంది. కొందరు 'అది ఉన్నది' అంటున్నారు, కొందరు 'అది లేదు' అంటున్నారు. నీ నుండి ఈ విద్యను (ఈ విషయాన్ని) గురించిన ఉపదేశాన్ని నేను పొందాలి. (నీవిచ్చిన) వరాలలో ఇది మూడవ వరం.

## శంకర భాష్యమ్

యేయం విచికిత్సా సంశయః ప్రేతే మృతే మనుష్యే, అస్తి ఇత్యేకే అస్తి శరీరేంద్రియమనోబుద్ధివ్యతిరిక్తో దేహాంతరసంబంధ్యాత్మా ఇత్యేకే మన్యంతే, నాయమస్తి ఇతి చైకే నాయమేవంవిధోఽస్తీతి చైకే . అత్ర చాస్మాకం న ప్రత్యక్షేణ నాప్యనుమానేన నిర్ణయవిజ్ఞానం . ఏతద్విజ్ఞానాధీనో హి పరః పురుషార్థ ఇత్యతః ఏతత్ విద్యాం విజానీయాం అహం అనుశిష్టః జ్ఞాపితః త్వయా . వరాణామేష వరస్తృతీయోఽవశిష్టః ..

కిమయమేకాంతతో నిఃశ్రేయససాధనాత్మజ్ఞానార్హో న వేత్యేతత్పరీక్షణార్థమాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ప్రేతే మనుష్యే'– మనుష్యుడు మృతి చెందినప్పుడు; 'ఏకే'– కొందరు; 'అస్తి ఇతి'– (అది) ఉన్నది అని; దేహానికి, ఇంద్రియాలకు, మనసుకు, బుద్ధికి భిన్నమైనదీ నూతన శరీరంతో సంబంధంపొందేటటువంటిదీ అయిన ఆత్మ ఉన్నది అని; 'చ ఏకే'– ఇక ఇతరులు; 'అయమ్'– ఇది, ఈ విధమైన ఆత్మ; 'న అస్తి'– ఉండుటనేది లేదు; అని అంటున్నారు. అందుచేత, దాని విజ్ఞానం ప్రత్యక్షప్రమాణం చేత గాని, అనుమాన ప్రమాణం చేత గాని నిర్ణయించబడేది కాదు. కాని, మానవుని ఉన్నత లక్ష్యమైన పరమ పురుషార్థం దాని (ఆ ఆత్మ గురించిన) స్పష్టమైన జ్ఞానంమీద ఆధారపడింది. కాబట్టి, 'ఇయం విచికిత్సా'– ఈ సందేహం ఏదైతే ఉన్నదో; 'ఏతత్'–ఇది యావత్తూ; 'త్వయా అనుశిష్టః'– నీచే ఉపదేశించబడగా; 'అహం'– నేను; 'విద్యామ్'– తెలుసుకొంటాను. 'ఏషః'– ఈ; 'వరః'– వరము; 'తృతీయః'– మూడవది, చివరిది.

మోక్షసాధనమైన ఆత్మజ్ఞానానికి ఇతడు (నచికేతుడు) తగిన అర్హత కలిగిన వాడో కాదో పరీక్ష చేయడానికై, మృత్యువు ఇలా అంటున్నాడు –

(మూడవ వరాన్ని కోరుకొమ్మని చెప్పగా నచికేతుడు ఇలా అంటున్నాడు. "మనుష్యులు మరణించినప్పుడు ఈ విధమైన సందేహం కలుగుతోంది. శరీరానికి, ఇంద్రియ సంఘాతానికి, మనసుకీ, బుద్ధికీ భిన్నమైన ఆత్మ అనేది ఒకటి ఉన్నదనీ, అది నూతన శరీరంతో సంబంధం ఏర్పరుచుకొంటుందీ అని కొందరు అంటున్నారు. మరి కొందరైతే అలాంటి ఆత్మ అనేది ఏదీ లేదని అంటున్నారు. కాబట్టి, ఈ విషయం గురించిన జ్ఞానాన్ని నీవు నాకు బోధించవలసింది. ఇది నీవిచ్చిన వరాలలో మూడవదీ, చివరిదీనూ" అని నచికేతుడు అన్నాడు. నేరుగా ఆత్మ గురించిన ప్రస్తావన చేయకపోయినప్పటికినీ, నచికేతుని కోరిక ఆత్మవిషయక జ్ఞానానికి దారితీసేదే. కాబట్టి, ఈ పిల్లవాడు పరమ పురుషార్థానికి మార్గమైన ఆత్మజ్ఞాన బోధకు అర్హుడేనా కాదా అనేది నిర్ధారించుకొనేందుకే, యమదేవుడు ఇలా అంటున్నాడు.)

**దేవైరత్రాపి విచికిత్సితం పురా**
**న హి సువిజ్ఞేయమణురేష ధర్మః .**
**అన్యం వరం నచికేతో వృణీష్వ**
**మా మోపరోత్సీరతి మా సృజైనమ్ .. 1-1-21 ..**

పూర్వం దేవతలకు కూడా ఇదే విషయం గురించి సందేహం ఉండేది. ఈ విషయం సూక్ష్మమైనదైనందున (సామాన్యులకు) బాగా అర్థమయ్యేది కాదు. కాబట్టి, నచికేతా వేరొక వరాన్ని అడుగు. నన్ను వత్తిడిచేయకు. దీనిని (ఈ కోరికను) విడిచిపెట్టు.

### శంకర భాష్యమ్

దేవైరపి అత్ర ఏతస్మిన్వస్తుని విచికిత్సితం సంశయితం పురా పూర్వం . న హి సువిజ్ఞేయం సుష్ఠు విజ్ఞేయం అసకృచ్ఛ్రుతమపి ప్రాకృతైర్జనైః, యతః అణుః సూక్ష్మః ఏషః ఆత్మాఖ్యః ధర్మః . అతః అన్యం అసందిగ్ధఫలం వరం నచికేతః, వృణీష్వ . మా మాం మా ఉపరోత్సీః ఉపరోధం మా కార్షీః అధమర్ణమివోత్తమర్ణః . అతిసృజ విముంచ ఏనం వరం మా మాం ప్రతి ..

ఏవముక్తో నచికేతా ఆహ —

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'పురా'– పూర్వం; 'దేవైరపి'– దేవతలకు కూడా; 'అత్ర'– ఈ విషయం గురించి; 'విచికిత్సితమ్'– సంశయం, సందేహం ఉండేది. 'న హి సువిజ్ఞేయమ్'–నిజానికిసామాన్య జనులు దీనిని విన్నప్పటికినీ బాగుగా తెలియగలిగేది కాదు. ఎందువల్లనంటే, 'ఏషః ధర్మః'– ఆత్మగురించిన ఈ విషయం; 'అణుః'– అతి సూక్ష్మము. అందువల్ల, 'నచికేతః'– నచికేతా, 'అన్యమ్'– స్పష్టత గల మరొక; 'వరమ్'– వరాన్ని; 'వృణీష్వ'– అడుగు. 'మామ్'– నన్ను; 'మా ఉపరోత్సీః'– నిర్బంధం (వత్తిడి) చేయకు, ఋణదాత ఋణగ్రహీతను నిర్బంధపెట్టినట్లుగా వత్తిడిచేయకు. 'ఏనం'– దీనిని (ఈ వరాన్ని ); 'మా'– నా నుండి 'అతిసృజ'– విడిచిపెట్టు.

(యమదేవుడు, ముందు చెప్పినట్లుగా, నచికేతుడు సర్వోన్నతమైన ఆత్మజ్ఞాన బోధకు అర్హత కలవాడో కాదో నిర్ధారించుకునేందుకు, అతడిని ప్రలోభపెట్టే ఉద్దేశ్యంతో ఇలా అంటున్నాడు. "పూర్వం దేవతలకు కూడా ఈ ఆత్మను గురించి సంశయం ఉండేది. నీవేమో బాలుడివి. నిజానికి సామాన్యులు దీని గురించిన బోధను విన్నప్పటికీ వారికి అంత తేలికగా అర్థమయ్యేది కాదు. ఎందుకంటే, ఈ ఆత్మగురించిన విషయం చాలా సూక్ష్మమైనది. అందుచేత, దీని బదులుగా స్పష్టమైన మరొక వరాన్ని కోరుకో. ఇక దీని గురించిన బోధ చెయ్యమని నన్ను వత్తిడి చేయకు. ఈ ఆత్మగురించిన జ్ఞానాన్ని బోధ చేయడం నుంచి నన్ను తప్పించు".)

ఇలా (మృత్యువు) చెప్పగా, నచికేతుడు ఇలా అంటున్నాడు –

**దేవైరత్రాపి విచికిత్సితం కిల**
**త్వం చ మృత్యో యన్న సుజ్ఞేయమాత్థ .**
**వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో**
**నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్ .. 1-1-22 ..**

దేవతలు కూడా దీని గురించిన సంశయాన్ని పొందారన్నావు. ఓ మృత్యుదేవా, నీవు కూడా (అది) బాగా తెలియబడేది కాదన్నావు. ఇట్టి విషయాన్ని గురించి చెప్పేందుకు నీవంటి ఉపదేశకుడు కాక మరొకడు లభించడు. ఈ వరంతో పోల్చదగిన మరొక వరం ఏదీ లేదు.

## శంకర భాష్యమ్

దేవైరత్రాపి విచికిత్సితం కిలేతి భవత ఏవ నః శ్రుతం . త్వం చ మృత్యో, యత్ యస్మాత్ న సుజ్ఞేయం ఆత్మతత్త్వం ఆత్థ కథయసి . అతః పండితైరప్యవేదనీయత్వాత్ వక్తా చ అస్య ధర్మస్య త్వాదృక్ త్వత్తుల్యః అన్యః పండితశ్చ న లభ్యః అన్విష్యమాణోఽపి . అయం తు వరో నిఃశ్రేయసప్రాప్తిహేతుః . అతః న అన్యః వరః తుల్యః సదృశః అస్తి ఏతస్య కశ్చిదపి . అనిత్యఫలత్వాదన్యస్య సర్వస్యైవేత్యభిప్రాయః ..

ఏవముక్తోఽపి పునః ప్రలోభయన్నువాచ మృత్యుః —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'దేవైః అపి' - దేవతలకు సైతం; 'అత్ర' - ఈ విషయమై; 'విచికిత్సితమ్' - సంశయం ఉందని నీవే చెప్పగా విన్నాం. 'చ'– మరియు; 'మృత్యో'– ఓ మృత్యుదేవా; 'న సుజ్ఞేయమ్'–పండితులచే సైతం బాగా తెలుసుకొనబడలేనిదైన ఆత్మ తత్త్వమ్; అని 'యత్'– దేని గురించైతే; 'త్వమ్'– నీవు; 'అత్థ'– చెప్పావో; 'వక్తా చ అస్య'– అట్టి తత్త్వాన్ని ఉపదేశించే వాడు; 'త్వాదృక్'– నీ వంటివాడు; 'అన్యః'– ఇతరుడు, ఇతర పండితుడు; 'న లభ్యః'– లభించడు, వెదకిననూ లభించడు. ఈ వరమేమో మోక్షప్రాప్తికి కారణం. కాబట్టి, 'ఏతస్య తుల్యః'–దీనికి (ఈ వరానికి) సరిపోలే; 'న అన్యః కశ్చిత్ వరః'– వరం వేరొకటి ఏదియునూ లేదు.

(ఆత్మజ్ఞానం గురించిన వరం కాకుండా వేరొక వరాన్ని కోరుకొమ్మన్న యమదేవునితో నచికేతుడు ఇలా అంటున్నాడు, "యమదేవా, నీవే చెప్పావు కదా ఈ ఆత్మ గురించిన విషయమై పూర్వం దేవతలకు కూడా సందేహం ఉండేదని. అంతేకాక, పండితులకు సైతం ఇది నిజానికి బాగా అర్థమయ్యే విషయం కాదని కూడా అన్నావు. అంత సూక్ష్మమైన విషయాన్ని సమగ్రంగా బోధించగల నీ వంటి సమర్థుడు వేరొకడునాకు దొరకడం దుర్లభం. పోనీ ఇదేమైనా అల్పమైన వరమా తరువాత చూసుకుందాంలే అనుకోవడానికి. ఈ వరమేమో మోక్షప్రాప్తికి కారణం. కాబట్టి, దీనికి సరిపోల్చదగిన మరొక వరమేమీ నాకు తోచడం లేదు" అన్నాడు. అలా అన్నప్పటికీ, యముడు నచికేతుడిని ప్రలోభపెట్టే ప్రయత్నాన్ని విరమించకుండా, ఇలా అంటున్నాడు.)

(నచికేతునిచే) ఇలా అన్నప్పటికీ, తిరిగి ప్రలోభపెట్టేందుకై యమదేవుడు అంటున్నాడు--

**శతాయుషః పుత్రపౌత్రాన్వృణీష్వ**

**బహూన్పశూన్హస్తిహిరణ్యమశ్వాన్ .**

**భూమేర్మహదాయతనం వృణీష్వ**

**స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి .. 1-1-23 ..**

వందసంవత్సరముల ఆయుష్షు కల పుత్రులనూ, పౌత్రులనూ కోరుకో. అనేక పశువులు, ఏనుగులు, బంగారం, గుఱ్ఱాలను, విస్తారమైన భూమిని కోరుకో. ఇచ్ఛగలిగినంత కాలం నీవు జీవించేలా కోరుకో.

## శంకర భాష్యమ్

శతాయుషః శతం వర్షాణి ఆయూంషి యేషాం తాన్ శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ . కించ, గవాదిలక్షణాన్ బహూన్ పశూన్ హస్తిహిరణ్యం , హస్తీ చ హిరణ్యం చ హస్తిహిరణ్యం , అశ్వాంశ్చ . కించ, భూమేః పృథివ్యాః మహత్ విస్తీర్ణం ఆయతనం ఆశ్రయం మండలం సామ్రాజ్యం వృణీష్వ . కించ, సర్వమప్యేతదనర్థకం స్వయం చేదల్పాయురిత్యత ఆహ — స్వయం చ త్వం జీవ ధారయ శరీరం సమగ్రేంద్రియకలాపం శరదః వర్షాణి యావత్ ఇచ్ఛసి జీవితుం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'శతాయుషః'— ఎవరికైతే నూరేళ్ళ ఆయువుగలదో వారు 'శతాయుషః', అట్టి వంద సంవత్సరాలు ఆయువు కల; 'పుత్ర పౌత్రాన్'— కుమారులు, మనుమలను; 'వృణీష్వ'— కోరుకో. మరింకా, 'బహూన్ పశూన్'— అనేకములైన గోవుల వంటి లక్షణాలు గల పశువులను; 'హస్తి హిరణ్యమ్'— హస్తి చ హిరణ్యమ్ చ హస్తి హిరణ్యమ్ - ఏనుగులు, బంగారమూ; 'అశ్వాన్ చ'— గుఱ్ఱములు కూడ. ఇంకా, 'మహత్'— విస్తీర్ణమైన; 'భూమేః'— భూములు; 'ఆయతనం'— జనపదాల సముదాయం, లేదా సామ్రాజ్యం; 'వృణీష్వ'— కోరుకో. ఇంకా, ఆయువు స్వల్పమైతే పై చెప్పినదంతా వృథాయే అయినందున అంటున్నాడు. 'స్వయం చ'— నీవు కూడ; 'శరదః'— అనేక సంవత్సరాలు; 'యావత్ ఇచ్ఛసి'— కోరుకున్నంత కాలం; 'జీవ'— శరీరాన్ని ధరించి ఇంద్రియకార్యకలాపాలతో ఉండాలని కోరుకో.

(యమదేవుడు నచికేతునితో ఇలా అంటున్నాడు, "నూరేళ్ళ ఆయుర్దాయం కల పుత్రులు, మనుమలను కోరుకో. అనేక గోవులను, ఏనుగులను, బంగారాన్ని, గుఱ్ఱాలను కూడా కోరుకో. ఇంకా, విస్తారమైన భూమిని, సామ్రాజ్యాన్ని కోరుకో. నీకు ఆయుర్దాయం లేకపోతే పైన చెప్పినవన్నీ వృథాయే కాబట్టి, స్వయంగా నీవు కూడా కోరుకున్నంత కాలం ఇంద్రియపటుత్వంతో శరీరాన్ని ధరించి ఉండేలా కోరుకో.")

**ఏతత్తుల్యం యది మన్యసే వరం**

**వృణీష్వ విత్తం చిరజీవికాం చ .**

**మహాభూమౌ నచికేతస్త్వమేధి**

**కామానాం త్వా కామభాజం కరోమి .. 1-1-24 ..**

దీనికి సరితూగే వరం ఏదైనా నీవు తలిస్తే కోరుకో. ధనం, చిరకాల జీవనం కూడా. నీవు విశాల భూమండలానికి మహారాజువి కాగలవు. భోగ్యములైన వాటిని నీవు భోగించేలా చేస్తాను.

### శంకర భాష్యమ్

ఏతత్తుల్యం ఏతేన యథోపదిష్టేన సదృశం అన్యమపి యది మన్యసే వరం , తమపి వృణీష్వ . కించ, విత్తం ప్రభూతం హిరణ్యరత్నాది చిరజీవికాం చ సహ విత్తేన వృణీష్వేత్యేతత్ . కిం బహునా ? మహాభూమౌ మహత్యాం భూమౌ రాజా నచికేతః త్వం ఏధి భవ . కించాన్యత్ , కామానాం దివ్యానాం మానుషాణాం చ త్వా త్వాం కామభాజం కామభాగినం కామార్హం కరోమి, సత్యసంకల్పో హ్యహం దేవః ..

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏతత్-తుల్యమ్'– వీటికి, ఈ చెప్పినవాటికి సరితూగే; 'వరమ్'– ఇతర వరాన్ని; 'యది'– ఏదైనా; 'మన్యసే'–నీ మనసులో తలిస్తే, భావించినట్లైతే; 'వృణీష్వ'– కోరుకో. అంతేకాక, 'విత్తమ్'– ధనం లేదా సంపదను, అధికమైన బంగారాన్ని, రత్నాలను 'చిరజీవికామ్ చ'– అధిక ఆయుర్దాయాన్ని కూడా (కోరుకో). అంటే, సంపదతో కూడిన చిరాయువును కోరుకో. ఇంతెందుకు క్లుప్తంగా 'నచికేతః'– నచికేతా; 'త్వం'– నీవు; 'మహాభూమౌ' - విశాలమైన భూమండలానికి రాజువు; 'ఏధి'– అవుతావు. ఇదేకాక, 'త్వా'– నిన్ను; 'కామానామ్'– భోగములన్నిటిని, దివ్యములు మరియు మానుషములైన భోగమున్నింటిని; 'కామభాజమ్'– భోగించేందుకు తగిన వానిగా; 'కరోమి'– చేస్తాను. సంకల్పించినవి పూర్తి చేసే దేవుడను నేను.

(పైన చెప్పినవే కాకుండా, వాటికి సరితూగేది ఇంకేదైనా నీ మనసులో ఉంటే అదే కోరుకో. అదేకాక, అధిక ధన సంపదలు, రత్నాలు, మణులు, మాణిక్యాలు, వాటిని అనుభవించేందుకు చిరాయువును కూడా కోరుకో. ఇన్ని రకాలుగా చెప్పడం ఎందుకు, నీవు మహా భూమండలానికి రాజువే అవుతావు. అన్ని రకాలైన భోగాలు అంటే దివ్యమైన, మానుషములైన సమస్త భోగాలు అనుభవించేదుకు తగినవానిగా నిన్ను చేస్తాను.)

**యే యే కామా దుర్లభా మర్త్యలోకే**
**సర్వాన్కామాగ్ంశ్ఛన్దతః ప్రార్థయస్వ .**
**ఇమా రామాః సరథాః సతూర్యా**
**న హీదృశా లమ్భనీయా మనుష్యైః .**
**ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ**
**నచికేతో మరణం మాఽనుప్రాక్షీః .. 1-1-25 ..**

ఏయే కోరికలు మానవలోకం దుర్లభమో అట్టి సమస్త కోరికలలో నీకు ఇష్టమైనవాటిని కోరుకో. ఇదిగో అప్సరసలు రథాలతో వాద్యాలతో సహా. ఇట్టి వారు మానవులకు లభించరు. నాచే అనుగ్రహించబడిన ఈ సఖులతో పరిచర్యలు చేయించుకో. ఓ నచికేతా మరణానికి సంబంధించిన విషయం గురించి విచారణ చేయకు.

## శంకర భాష్యమ్

యే యే కామాః ప్రార్థనీయాః దుర్లభాశ్చ మర్త్యలోకే, సర్వాన్ తాన్ కామాన్ ఛందతః ఇచ్ఛాతః ప్రార్థయస్వ . కించ, ఇమాః దివ్యా అప్సరసః, రమయంతి పురుషానితి రామాః, సహ రథైర్వర్తంత ఇతి సరథాః, సతూర్యాః సవాదిత్రాః, తాశ్చ న హి లంభనీయాః ప్రాపణీయాః ఈదృశాః ఏవంవిధాః మనుష్యైః మర్త్యైః అస్మదాదిప్రసాదమంతరేణ . ఆభిః మత్ప్రత్తాభిః మయా ప్రదత్తాభిః పరిచారికాభిః పరిచారయస్వ ఆత్మానం , పాదప్రక్షాలనాదిశుశ్రూషాం కారయాత్మన ఇత్యర్థః . హే నచికేతః, మరణం మరణసంబద్ధం ప్రశ్నం ప్రేత్యాస్తి నాస్తీతి కాకదంతపరీక్షారూపం మా అనుప్రాక్షీః మైవం ప్రష్టుమర్హసి ..

మృత్యునా ఏవం ప్రలోభ్యమానోఽపి నచికేతా మహాహ్రదవదక్షోభ్య ఆహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యే యే కామాః'– ఏ ఏ కోరికలు; 'మర్త్యలోకే'– మనుష్య లోకంలో; 'దుర్లభాః'– కష్టసాధ్యమో; 'సర్వాన్ కామాన్'– ఆ సమస్త కోరికలలో; 'ఛన్దతః'– ఇష్టమైనవాటిని; 'ప్రార్థయస్వ'– కోరుకో. అంతే కాక, 'ఇమా'– ఈ, ఇక్కడ ఉన్న; 'రామాః'– అప్సరస స్త్రీలు, పురుషులను రమింపచేస్తారు కనుక రామాః; 'సరథాః'– రథాలతో కూడి; 'సతుర్యాః'– వాయిద్యాలతో కూడిన వారు. 'ఈ దృశాః'– ఇట్టివారు (ఇట్టి స్త్రీలు); 'మనుష్యైః'– మానవులు; 'న హి లమ్భనీయాః'– పొందగలిగే వారు కాదు; అంటే మాబోటి వారి అనుగ్రహంలేకుండా మానవులు ఇట్టి అప్సరసలను పొందలేరు అని అభిప్రాయం. 'మత్ప్రత్తాభిః'– నాచే ఇవ్వబడిన; 'ఆభిః'– వీరిచే, పరిచారికలచే (అప్సరస స్త్రీలచే); 'పరిచారయస్వ'– పరిచర్యలు, సేవలు పొందు, నీకు అవసరమైన పాదప్రక్షాళనం వంటి సేవలను చేయించుకో అని అభిప్రాయం. ఇక, 'నచికేతః'– ఓ నచికేతా; 'మరణమ్'– మరణానికి సంబంధించిన ప్రశ్న, శరీరాన్ని విడిచిన తర్వాత ఆత్మ అనేది ఉన్నదా లేదా అనే కాకదంత పరీక్షలాంటి సందేహాన్ని; 'మా అనుప్రాక్షీత్'– విచారణ చేయకు, అలా ప్రశ్నించడం నీకు తగదు.

(యమదేవుడు నచికేతునితో ఇంకా ఇలా అంటున్నాడు. "మానవలోకంలో ఏఏ కోరికలైతే దుష్టసాధ్యాలో వాటిలో నీకు ఇష్టమైనటువంటి వాటిని కోరుకో. మరింకా, ఇదిగో రథాలతో, వాయిద్యాలతో కూడిన ఈ అప్సరస స్త్రీలు. ఇటువంటి వారు మాబోటివారి అనుగ్రహంలేకుండా మానవులు పొందలేరు. నేను ఇచ్చే ఈ పరిచారికలతో నీకు అవసరమైన పాదప్రక్షాళనాది సేవలను చేయించుకో. ఇక, మరణానికి సంబంధించి, శరీరాన్ని విడిచిన తర్వాత ఆత్మ అనేది ఉన్నదా లేదా అనే, కాకి దంతాలను పరీక్షించడం లాంటి, సందేహాన్ని విచారణ చేయకు. అలా ప్రశ్నించడం నీకు తగినది కాదు." ఈ విధంగా అనేక ప్రలోభాలకి యమదేవుడు గురిచేసినప్పటికీ, నచికేతుడు ఏ మాత్రం తొణకకుండా ఇలా అంటున్నాడు.)

ఆ విధంగా ప్రలోభపెట్టినప్పటికీ, లోతైన సరస్సులాగా, నచికేతుడు క్షోభ పొందకుండా,ఇలా అన్నాడు—

**శ్వోభావా మర్త్యస్య యదంతకై**

**తత్సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః .**

**అపి సర్వం జీవితమల్పమేవ**

**తవైవ వాహాస్తవ నృత్యగీతే .. 1-1-26 ..**

ఓ మానవాంతకా, నిత్యము కాని ఇవన్నీ ఇంద్రియాలన్నింటిని తేజో విహీనపరుస్తాయి. జీవితం అంతా, మినహాయింపు లేకుండా, అల్పమైనది. ఈ రథాలు నీవే. ఈ నృత్యాలు, గీతాలు నీవే.

## శంకర భాష్యమ్

శ్వో భవిష్యంతి న వేతి సందిహ్యమాన ఏవ యేషాం భావో భవనం త్వయోపన్యస్తానాం భోగానాం తే శ్వోభావాః . కించ, మర్త్యస్య మనుష్యస్య అంతక హే మృత్యో, యత్ ఏతత్ సర్వేంద్రియాణాం తేజః తత్ జరయంతి అపక్షపయంతి . అప్సరఃప్రభృతయో భోగా అనర్థాయైవైతే, ధర్మవీర్యప్రజ్ఞాతేజోయశఃప్రభృతీనాం క్షపయితృత్వాత్ . యాం చాపి దీర్ఘజీవికాం త్వం దిత్ససి తత్రాపి శృణు . సర్వం యద్బ్రహ్మణోఽపి జీవితం ఆయుః అల్పమేవ, కిముతాస్మదాదిదీర్ఘజీవికా . అతః తవైవ తిష్ఠంతు వాహాః రథాదయః, తథా తవ నృత్యగీతే చ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'శ్వోభావాః'– అశాశ్వతములు, వేటి అస్తిత్వం సందిగ్ధమో అంటే మరునాటికి అవి ఉంటాయో ఉండవో ఖచ్చితంగా నిర్ణయించలేమో అట్టివి. ('శ్వః' అంటే రేపు 'అభావాః' అంటే ఉండనివి. అనగా శాశ్వతం కానట్టివి.) మరింకా, 'మర్త్యస్య'– మనుష్యులను; 'అంతక'– అంతము చేసేవాడా; ఓ మృత్యూ; ఈ అప్సరసలు మొదలైన భోగాలన్నీ అనర్థాలే. 'సర్వేంద్రియాణామ్'– ఇంద్రియాలన్నింటిలో; 'యత్'– ఏదైతే; 'తేజః'–శక్తి ఉన్నదో, దానిని 'జరయన్తి'– వ్యర్థపరుస్తాయి. ధార్మికత, బలం, వివేకం, శక్తి, కీర్తి మొదలైన వాటిని కృంగదీస్తాయి. దీర్ఘకాల జీవనం ఏదైతే నీవనుగ్రహిస్తానన్నావో దానిని గురించి కూడా విను. 'సర్వం యద్బ్రహ్మణోఽపి జీవితమ్'– బ్రహ్మ ఆయుష్షుతో సహ అందరి ఆయుర్దాయాలు; 'అల్పమ్ ఏవ'– నిశ్చితంగా స్వల్పమైనవే. ఇక, మావంటి వారి ఆయువుగురించి చెప్పేదేముంది. కాబట్టి, 'వాహాః'– వాహనాలు, అలాగే 'నృత్యగీతే'– నృత్యాలు, గీతాలు; 'తవ ఏవ'– నీవి మాత్రమే; నాకు వద్దు, నీ వద్దే ఉండనీ.

(యమదేవా, నీవు నాకు అనుగ్రహించాలనుకొన్నవన్నీ అశాశ్వతాలే. రేపు అవి ఉంటాయో ఉండవో అనేది సందేహం. ఇంకాపైగా, ఈ అప్సరసలు, ఈ భోగాలు అనర్థాలే. అవి మానవుడి ఇంద్రియ శక్తిని వ్యర్థపరిచి క్షీణింపచేస్తాయి. మనిషిలోని, ధార్మికత, బలం, వివేకం, శక్తి, కీర్తి, మొదలైనవాటన్నింటినీ కృంగదీస్తాయి. ఇక, దీర్ఘాయుర్దాయం గురించి అంటావా. బ్రహ్మ అంతటి వాని ఆయుర్దాయమే అత్యల్పం. మాబోటి వారి ఆయుష్షు గురించి

చెప్పేదేముంది. కాబట్టి, నీవు ఇవ్వజూపిన వాహనాలు, నృత్య గీతాది వాయిద్యాలు అన్నీ నీ వద్దనే ఉండనీ. వాటిని నేను ఆశించను అన్నాడు నచికేతుడు.)

**న విత్తేన తర్పణీయో మనుష్యో**
**లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా .**
**జీవిష్యామో యావదీశిష్యసి**
**త్వం వరస్తు మే వరణీయః స ఏవ .. 1-1-27 ..**

మానవుడు ధనముతో తృప్తిపొందేవాడు కాదు. నీ దర్శనం మాత్రాన్నే సంపద పొందుతాం. నీవు పాలించినంతకాలం జీవించి ఉంటాం. అయితే నీవు ఇవ్వదగిన వరం మాత్రం (ఇవేవీ కాదు) అది (ఆత్మ జ్ఞానం) మాత్రమే.

## శంకర భాష్యమ్

కించ, న ప్రభూతేన విత్తేన తర్పణీయో మనుష్యః . న హి లోకే విత్తలాభః కస్యచిత్తృప్తికరో దృష్టః . యది నామాస్మాకం విత్తతృష్ణా స్యాత్ , లప్స్యామహే ప్రాప్స్యామహే విత్తం , అద్రాక్ష్మ దృష్టవంతో వయం చేత్ త్వా త్వాం . జీవితమపి తథైవ — జీవిష్యామః యావత్ యామ్యే పదే త్వం ఈశిష్యసి ఈశిష్యసే ప్రభుః స్యాః . కథం హి మర్త్యస్త్వయా సమేత్యాల్పధనాయుర్భవేత్ ? వరస్తు మే వరణీయః స ఏవ యదాత్మవిజ్ఞానం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఇంకనూ, 'విత్తేన'– ధనముతో, అధిక సంపదతో; 'మనుష్యః'– మానవుడు; 'న తర్పణీయః'– తృప్తిపొందేవాడు కాదు. లోకంలో ధనం లభించడం చేత ఎవరూ తృప్తిని పొందకుండటం చూస్తున్నాం. ధనంపై కోరిక మాలో రేకెత్తుతుంది అనుకొంటే, 'త్వా'– నిన్ను (త్వా అనేది త్వామ్ బదులు ఉపయోగించబడింది) 'చేత్ అద్రాక్ష్మ'– దర్శించినందున; 'విత్తమ్'– ధనాన్ని; 'లప్స్యామహే'– తప్పక పొందుతాం, సాధిస్తాం. అదేవిధంగా, ఆయుర్దాయం విషయంలో కూడా, 'యావత్'– ఎంతకాలమైతే; 'త్వం'– నీవు; 'ఈశిష్యసి'– పాలనచేస్తావో, మృత్యువు పదవిలో ఉండి పరిపాలిస్తావో అంతకాలం 'జీవిష్యామః'– తప్పక జీవిస్తాం. అంటే, నిన్ను కలిసికొన్న మానవుడు పేద, అల్పాయువు ఎలా అవుతాడు. (కానే కాడు). కాబట్టి, 'వరః తు మా వరణీయః సః ఏవ'– నీవు అనుగ్రహించదగిన వరం మాత్రం (ఇవేవీ కావు) ఆత్మ జ్ఞానం ఒక్కటి మాత్రమే.

(ఇంకేమంటే, సంపద మానవునికి తృప్తినివ్వదు. ధనం కలిగినవారెవ్వరూ తృప్తితో లేకపోవడం లోకంలో చూస్తూనే ఉన్నాం. ఒకవేళ, ధనం గురించిన కోరిక ముందు ముందు కలుగుతుందేమో అంటే, నిన్ను దర్శించిన మాత్రం చేతనే మాకు సంపద కలిగి తీరుతుంది. అలాగే, ఆయుర్దాయం కూడా. నీవు మృత్యుపదవిలో ఉండి పాలన

చేసినంత కాలం, మాకు ఆయువు ఉండి తీరుతుంది. అంటే, నిన్ను దర్శించిన వాడు, పేదరికాన్ని ఎలా పొందుతాడు, అల్పాయువు ఎలా అవుతాడు. కాబట్టి, మాకు సంపదకు, ఆయువుకు లోటుండదు. కాబట్టి, నీ అనుగ్రహించ వలసినది ఇవేవీ కాదు. ఆత్మజ్ఞానం ఒక్కటి మాత్రమే అనుగ్రహించమని ప్రార్థిస్తున్నాడు నచికేతుడు.)

**అజీర్యతామమృతానాముపేత్య**
**జీర్యన్మర్త్యః క్వధఃస్థః ప్రజానన్ .**
**అభిధ్యాయన్వర్ణరతిప్రమోదా**
**నతిదీర్ఘే జీవితే కో రమేత .. 1-1-28 ..**

అధోలోకమైన భూమియందు క్షీణించే ఆయువుగల మానవుడు, (అసలు) ఆయువే క్షీణింపని అమృతుల (దేవతల) సామీప్యంలో ఉండడంచేత వారి ఔన్నత్యాన్ని తెలుసుకొన్నవాడై, విచారించగా (వాటితో పోలిస్తే) నృత్యగీతానందాల సుఖం అత్యల్పమని గ్రహించి, ఎవ్వడు దీర్ఘాయువుతో సుఖిస్తాడు?

## శంకర భాష్యమ్

యతశ్చ అజీర్యతాం వయోహానిమప్రాప్నువతాం అమృతానాం సకాశం ఉపేత్య ఉపగమ్య ఆత్మన ఉత్కృష్టం ప్రయోజనాంతరం ప్రాప్తవ్యం తేభ్యః ప్రజానన్ ఉపలభమానః స్వయం తు జీర్యన్ మర్త్యః జరామరణవాన్ క్వధఃస్థః కుః పృథివీ అధశ్చాసావంతరిక్షాదిలోకాపేక్షయా తస్యాం తిష్ఠతీతి క్వధఃస్థః సన్ కథమేవమవివేకిభిః ప్రార్థనీయం పుత్రవిత్తాద్యస్థిరం వృణీతే . 'క్వ తదాస్థః' ఇతి వా పాఠాంతరం . అస్మిన్పక్షే చైవమక్షరయోజనా— తేషు పుత్రాదిషు ఆస్థా ఆస్థితిః తాత్పర్యేణ వర్తనం యస్య స తదాస్థః . తతోఽధికతరం పురుషార్థం దుష్ప్రాపమపి అభిప్రేప్సుః క్వ తదాస్థో భవేత్ ? న కశ్చిత్తదసారజ్ఞస్తదర్థీ స్యాదిత్యర్థః . సర్వో హ్యుపర్యుపర్యేవ బుభూషతి లోకః . తస్మాన్న పుత్రవిత్తాదిలోభైః ప్రలోభ్యోఽహం . కించ, అప్సరఃప్రముఖాన్ వర్ణరతిప్రమోదాన్ అనవస్థితరూపతయా అభిధ్యాయన్ నిరూపయన్ యథావత్ అతిదీర్ఘే జీవితే కః వివేకీ రమేత ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అజీర్యతామ్'— వయస్సు తరుగుటనేది లేనివారు; 'అమృతానామ్'— మృతి లేని దేవతల; 'ఉపేత్య'— సమీపానికి చేరి; 'ప్రజానన్'— తెలుసుకొన్నవాడు, వారినుండి ఏదైనా ఇతర ఉన్నతి ప్రాప్తిస్తుందనేది తెలుసుకొన్నవాడు; తను మాత్రము, 'జీర్యన్ మర్త్యః'— చావు పుట్టుకలు కల మానవుడు; 'క్వధఃస్థః'— భూమిపై నివసించేవాడు;--- 'అధః'— క్రిందది, అంతరిక్షాది ఇతర లోకాలతో పోలిస్తే క్రిందదైన; 'క్వ'— భూమియందు; 'స్థః'— ఉండేవాడు. అట్టి వివేకవంతుడు అస్థిరమైన పుత్రధనాదులను ఎట్లా కోరుకుంటాడు. 'క్వ తధాస్థః' అనే పాఠాంతరం ఉంది. దాని ప్రకారం కూడా ఇలా అర్థం చేసుకోవచ్చు. 'తధాస్థః'—వాటి ఆసక్తిలో మునిగినవాడు; అంటే, పుత్రాది విషయాలపై ఆసక్తి కలిగినవాడు; 'క్వ'—

ఎక్కడుంటాడు. కష్టసాధ్యమైనదైనా, ఉన్నతమైన పురుషార్థాన్ని పొందాలనుకొనేటప్పుడు, పుత్రాదులను కోరేవాడు ఎక్కడుంటాడు. అసారమైనవని తెలుసుకొన్నవాడు వాటిని ఎన్నడూ కోరడు అని అభిప్రాయం. లోకంలో ప్రతివ్యక్తి ఉన్నతి నుండి ఉన్నతికి చేరాలనే కాంక్షిస్తాడు. కనుక, పుత్రులు సంపదలు మొదలైనవాటితో నేను మోహం చెందను. మరింకా, 'వర్ణరతిప్రమోదాన్'– నృత్యగీతానందాల గురించిన, అప్సరసాది గణాలచే పొందదగిన ఆనందాల గురించి; 'అభిధ్యాయన్'– విచారణ చేసి; వాటి వాస్తవికతను గుర్తించి, అనిత్యమైనవిగా గ్రహించినవాడు 'క్వ'– ఎవ్వడు, ఏ వివేకవంతుడు; 'అతిదీర్ఘే జీవితే' - అధిక ఆయుష్షువల్ల; 'రమేతా'–ఏం సుఖిస్తాడు.

(క్షణ క్షణానికి ఆయువు తరిగిపోయే భువిమీదుండే మానవుడు, ఆయువు ఏమాత్రం తరిగిపోని, మరణరహితులైన దేవతల సన్నిధానంలో ఉన్నప్పుడు, తనకంటే దేవతల ఔన్నత్యాన్ని గుర్తిస్తాడు కదా. అటువంటి వివేకవంతుడు అస్థిరమైన పుత్రధనాదులను ఎట్లా కోరుకుంటాడు? లేదా ఇంకొక పాఠాంతరంలో, దేవతల సాన్నిధ్యంలో ఉన్నవానికి, పుత్రాది విషయాలపై ఆసక్తి లేదా కోరిక ఎలా ఉంటుంది. ఎవరైనా వర్తమానం కంటే ఉన్నతమైన స్థితిసే కోరుకుంటారు. ఇది లోక రీతి. కనుక, నీవు ఇవ్వజూపే పుత్రులు, సంపదలతో నేను వ్యామోహం పొందను. ఇక అప్సరసలు వారి నృత్యగానల ఆనందాల వాస్తవస్వరూపం విచారణ చేస్తే అనిత్యమే అని తెలుసుకొన్నవాడు, దీర్ఘాయువు పొంది ఏం సుఖిస్తాడు. ఇలా, నచికేతుడు యముడు కోరుకొమ్మని చెప్పినవాటిని తిరస్కరించి, తిరిగి ఇలా అంటున్నాడు.)

**యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో**
**యత్సామ్పరాయే మహతి బ్రూహి నస్తత్**
**యోఽయం వరో గూఢమనుప్రవిష్టో**
**నాన్యం తస్మాన్నచికేతా వృణీతే .. 1-1-29 ..**

మృత్యుదేవా, దేని (ఏ ఆత్మ) గురించి జనులు పరలోకయానం సందర్భంలో అది ఉన్నదియా లేనిదియా అనే సంశయాన్ని పొందుతారో, ఏది అత్యుత్తమమైన ఫలితం పొందేందుకు సాధనమౌతుందో దానిని చెప్పు. అందుచేత, అతి గూఢంగా ఉంచబడిన దాని గురించిన (ఆత్మజ్ఞానం గురించిన) ఈ వరం కాక ఇతరమేదీ నచికేతుడు కోరలేదు.

**శంకర భాష్యమ్**

అతో విహాయానిత్యైః కామైః ప్రలోభనం , యన్మయా ప్రార్థితం యస్మిన్ ప్రేతే ఇదం విచికిత్సనం విచికిత్సంతి అస్తి నాస్తీత్యేవంప్రకారం హే మృత్యో, సాంపరాయే పరలోకవిషయే మహతి మహాప్రయోజననిమిత్తే ఆత్మనో నిర్ణయవిజ్ఞానం యత్ , తత్ బ్రూహి కథయ నః అస్మభ్యం . కిం బహునా, యోఽయం ప్రకృత ఆత్మవిషయః వరః గూఢం గహనం దుర్వివేచనం ప్రాప్తః

అనుప్రవిష్టః, తస్మాత్ వరాత్ అన్యం అవివేకిభిః ప్రార్థనీయమనిత్యవిషయం వరం నచికేతాః న వృణీతే మనసాపి ఇతి శ్రుతేర్వచనమితి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

కాబట్టి, ఓ మృత్యుదేవా, అశాశ్వతమైన కోరికలతో నన్ను మోహపెట్టటం విరమించి, నేను ప్రార్థించిన 'సాంపరాయే'– పరలోక విషయ సందర్భంలో; 'విచికిత్సనమ్'– ఉన్నది, లేదు అంటూ ఈ విధంగా దేనిగురించి (ఏ ఆత్మగురించి) జనులు సందేహ పడుతున్నారో, దానిని; 'మహతి'– అత్యంత గొప్ప ప్రయోజనానికి కారణమైన ఆత్మగురించిన నిశ్చితమైన విజ్ఞానం ఏదైతే ఉందో దానిని; 'నః'– నాకు; 'బ్రూహి'– బోధించు. ఇంతెందుకు, ప్రస్తావిస్తున్న వరం 'గూఢమ్'– రహస్యమైనది; 'అనుప్రవిష్టః'– విచారించడం కఠినమైనదైన ఆత్మవిషయం గురించి; 'తస్మాత్'– కనుక, 'అన్యమ్'– ఇతర అశాశ్వత విషయాలగురించిన వరాలు అవివేకులచే మాత్రమే కోరబడతాయి కాబట్టి; 'నచికేతః'– నచికేతుడు; 'న వృణీతే'– కోరడు, మానసికంగానైనా అని శృతి చెప్తోంది.

(యమదేవుడు ఇవ్వజూపిన ధనసంపదలను, దీర్ఘాయువును తిరస్కరించిన నచికేతుడు ఇంకా ఇలా అంటున్నాడు. "ఓ యమదేవా, అశాశ్వతాలైన వాటితో నన్ను మోహపెట్టటం విరమించు. పరలోకప్రాప్తి సమయంలో, అది ఉన్నది లేదు అని ఏ ఆత్మగురించి జనులు సంశయిస్తున్నారో, ఏ ఆత్మజ్ఞానం మహాప్రయోజనానికి హేతువవుతుందో, దానిని నాకు బోధించవలసింది. ఆత్మవిషయం అత్యంత సూక్ష్మము లేదా గోప్యమైనది, విచారించడం అతి దుష్కరమైనది. అనిత్యమైనవాటిని వివేకం లేని వారే కోరతారు" అని ముగించాడు. "కాబట్టి, నచికేతుడు ఇతర అనిత్యమైన విషయవస్తువులకు సంబంధించిన విషయాలను, మనసులో కూడా కోరలేదు. అతనికి కావలసింది ఆత్మజ్ఞాన బోధ మాత్రమే" అంటూ చెప్పిన మంత్రంలోని రెండవ భాగం శృతి చెప్పిన వాక్యంగా గ్రహించాలి.)

.. ప్రథమ వల్లీ భాష్యానువాదం సమాప్తం ..

# ద్వితీయా వల్లీ

## శంకర భాష్యమ్

పరీక్ష్య శిష్యం విద్యాయోగ్యతాం చావగమ్యాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

శిష్యుని పరీక్షించి, విద్యను గ్రహించగల అతని యోగ్యతలను గుర్తించిన వాడై (యమదేవుడు) ఇలా అంటున్నాడు.

**అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే**
**ఉభే నానార్థే పురుషగ్ం సినీతః .**
**తయోః శ్రేయ ఆదదానస్య సాధు**
**భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే .. 1-2-1 ..**

శ్రేయము వేరు, ప్రేయము వేరు. భిన్నమైన ఫలితాలు కల ఈ రెండూ మనిషిని బంధిస్తాయి. ఈ రెంటిలో శ్రేయమును కోరేవానికి మేలు జరుగుతుంది. ప్రియాన్ని కోరేవాడు లక్ష్యానికి దూరమౌతాడు.

## శంకర భాష్యమ్

అన్యత్ పృథగేవ శ్రేయః నిఃశ్రేయసం తథా అన్యత్ ఉతైవ అపి చ ప్రేయః ప్రియతరమపి తే శ్రేయఃప్రేయసీ ఉభే నానార్థే భిన్నప్రయోజనే సతీ పురుషం అధికృతం వర్ణాశ్రమాదివిశిష్టం సినీతః బధ్నీతః . తాభ్యాం విద్యావిద్యాభ్యామాత్మకర్తవ్యతయా ప్రయుజ్యతే సర్వః పురుషః . ప్రేయఃశ్రేయసోర్హి అభ్యుదయామృతత్వార్థీ పురుషః ప్రవర్తతే . అతః శ్రేయఃప్రేయఃప్రయోజనకర్తవ్యతయా తాభ్యాం బద్ధ ఇత్యుచ్యతే సర్వః పురుషః . తే యద్యప్యేకైకపురుషార్థసంబంధినీ విద్యావిద్యారూపత్వాద్విరుద్ధే ఇత్యన్యతరాపరిత్యాగేనైకేన పురుషేణ సహానుష్ఠాతుమశక్యత్వాత్తయోః హిత్వా అవిద్యారూపం ప్రేయః, శ్రేయ ఏవ కేవలం ఆదదానస్య ఉపాదానం కుర్వతః సాధు శోభనం శివం భవతి . యస్త్వదూరదర్శీ విమూఢో హీయతే వియుజ్యతే అర్థాత్ పురుషార్థాత్పారమార్థికాత్ప్రయోజనాన్నిత్యాత్ ప్రచ్యవత ఇత్యర్థః . కోఽసౌ ? య ఉ ప్రేయః వృణీతే ఉపాదత్తే ఇత్యేతత్ ..

యద్యుభే అపి కర్తుం స్వాయత్తే పురుషేణ, కిమర్థం ప్రేయ ఏవాదత్తే బాహుల్యేన లోక ఇతి, ఉచ్యతే .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'శ్రేయః'– కోరదగినది, పరమ లక్ష్యమైనది (ముక్తి); 'అన్యత్'– వేరైనది. అలాగే, 'ప్రేయః'– ప్రియమైనది; 'ఉత'– కూడా; 'అన్యత్ ఏవ'– వేరైనదే. 'తే ఉభే'– ఈ రెండూ; 'పురుషం'– మానవుని, ఎవరైతే వర్ణాశ్రమాది ప్రత్యేకతలను బట్టి (ఈ రెండింటిని పొందేందుకు) అధికారం కలిగి ఉంటాడో అతనిని; 'నానా అర్థే'– భిన్నమైన ప్రయోజనాలు ఇచ్చేవి అయినా; 'సినీతః'– బంధిస్తాయి. అభ్యున్నతిని లేదా అమృతత్త్వాన్ని సాధించాలనుకొనేవాడు, ప్రియములో కాని లేదా శ్రేయస్సులో కాని నిమగ్నమై ఉంటాడు. ఆ విధంగా సమస్త మానవులకూ ఈ రెండూ తప్పనిసరియైన కర్తవ్యాలు. కాబట్టి, సమస్త మానవులూ ఈ ప్రియమైన, శ్రియమైన ప్రయోజనాలు పొందేందుకు చేయదగిన కర్తవ్యాలతో బంధింపబడి ఉన్నట్లు చెప్తున్నారు. ఈ రెండూ, మానవుని యొక్క పురుషార్థాలకు సంబంధించి యున్నప్పటికినీ, అవి విద్య, అవిద్యల స్వభావాలైనందున ఒకదానికొకటి విరుద్ధమైనవి. ఆవిధంగా, ఒకే మానవునిచే వీటి రెండింటిలో ఏదో ఒకదానిని విడువకుండా, ఈ రెండూ కలిపి ఆచరించబడేవి కానందున, 'తయోః'– ఈ రెండింటిలో; 'శ్రేయః'– శ్రియమైనదానిని, పరమలక్ష్యమైన దానిని మాత్రమే, ప్రియమైనదానిని వదలివేసి; 'ఆదదానస్య'–స్వీకరించిన వాడు; 'సాధు భవతి'– శుభం మంగళరూపుడు అవుతాడు. ఎవడు? 'యః ఉ'– ఎవడైతే; 'ప్రేయః వృణీతే'– ప్రియాన్ని ఎంచుకొంటాడో, పట్టుకొంటాడో; అతడు 'హీయతే'– దూరమౌతాడు. అట్టి హ్రస్వదృష్టిగల అజ్ఞాని, మూర్ఖుడు పురుషార్థాలలోని పరమ ప్రయోజనం నుంచి పతనం పొందుతాడని అభిప్రాయం.

(యమదేవుడు నచికేతునకు ఆత్మగురించిన జ్ఞానాన్ని బోధించడానికి ఈ ప్రకారంగా ఉపక్రమించాడు. మానవుడు ఆచరించే కర్మలలో రెండు రకాలున్నాయి. ఒకరకమైన కర్మలు మానవునికి హితాన్ని చేకూరిస్తే, రెండవరకం కర్మలు మానవులకు ప్రియాన్ని కలిగిస్తాయి. హితమంటే తనకు మేలు చేసేది. ప్రియమంటే తను ఇష్టమైనది. ఈ రెండూ చూడటానికి ఒకటిగానే అనిపిస్తున్నా అవి రెండూ భిన్నమైనవే. ఉదాహరణకు రోగికి చేదుమందు మేలు కలిగించేదే కాని, అది అతనికి ప్రియమైనది కాదు. అదే దుర్వ్యసనాలు మనిషికి ప్రీతిని కలిగిస్తాయి కాని, అతనికి మేలు చేసేవి కావు. ఈ రెండూ భిన్నమైన ఫలితాలనిచ్చేవి అయినప్పటికీ రెండూ కర్మలే కాబట్టి, వర్ణాశ్రమ ధర్మాలను అనుసరించి వాటిని ఆచరించే వారిని, ఇవి బంధిస్తాయి. లోకంలో అభ్యున్నతి లేదా పురోగతి సాధించాలనుకొనేవాడు ప్రియాన్ని ఆశ్రయిస్తున్నాడు. అమృతత్త్వాన్ని సాధించాలనుకొనేవాడు శ్రియాన్ని ఆశ్రయిస్తున్నాడు. ఆ విధంగా, సమస్త మానవులూ శ్రియం లేదా ప్రియాన్ని పొందే క్రమంలో బంధింపబడుతున్నారు. ఇవి రెండూ మానవుని పురుషార్థాలకు సంబంధించినవే అయినా, ఇందులో శ్రియం విద్యా రూపం. ప్రియం అవిద్యా రూపం. ఇవి రెండూ ఒకదాని నొకటి విభేదిస్తాయి కాబట్టి, ఒకేకాలంలో ఒకే వ్యక్తిచే ఈ రెండూ కలిపి ఆచరించబడేవి కావు. ఈ రెండింటిలో ఏదో ఒకదాన్ని ఆశ్రయించినవాడు, రెండవ దాన్ని విస్మరిస్తాడు. అలా ప్రియాన్ని విస్మరించి, శ్రియాన్నే స్వీకరించినవాడు శుభాన్ని పొంది అంతిమలక్ష్యమైన మోక్షమార్గానికి చేరుకొంటాడు. అలా కాకుండా, ప్రియాన్ని కోరినవాడు భోగాలను అనుభవిస్తూ పురుషార్థాలలోని ఉన్నతమైన మోక్షం నుండి దూరమౌతాడు. కాబట్టి, శ్రేయోదాయకమైన కర్మలనే చేపట్టాలి. ప్రియాన్ని ఇచ్చే కర్మలను విడిచిపెట్టాలి.)

మానవునిచే ఈ రెండూ (శ్రేయము, ప్రేయములు) చేయదగినవే అయినా, లోకంలో ఎక్కువమంది ప్రియానికే అంటిపెట్టుకొని ఉంటున్నారు అన్న విషయం చెప్పబడుతోంది.

**శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత-**
**స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః .**
**శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే**
**ప్రేయో మన్దో యోగక్షేమాద్వృణీతే .. 1-2-2 ..**

శ్రేయము, ప్రియము మనిషిని సమీపిస్తాయి. వివేకులు విచారించి రెంటినీ విడదీస్తారు. ప్రియము కంటే ఉత్తమమైన శ్రేయాన్ని వివేకులు ఎంచుకొంటే, విడువదగిన ప్రియాన్ని మందబుద్ధులు వారి యోగ క్షేమాల నిమిత్తం కోరుకొంటారు.

## శంకర భాష్యమ్

సత్యం స్వాయత్తే ; తథాపి సాధనతః ఫలతశ్చ మందబుద్ధీనాం దుర్వివేకరూపే సతీ వ్యామిశ్రీభూతే ఇవ మనుష్యం పురుషం ఆ ఇతః ఏతః ప్రాప్నుతః శ్రేయశ్చ ప్రేయశ్చ . అతో హంస ఇవాంభసః పయః, తౌ శ్రేయఃప్రేయఃపదార్థౌ సంపరీత్య సమ్యక్పరిగమ్య మనసా ఆలోచ్య గురులాఘవం వివినక్తి పృథక్కరోతి ధీరః ధీమాన్ . వివిచ్య చ శ్రేయో హి శ్రేయ ఏవ అభివృణీతే ప్రేయసోఽభ్యర్హితత్వాచ్ఛ్రేయసః . కోఽసౌ ? ధీరః . యస్తు మందః అల్పబుద్ధిః సః సదసద్వివేకాసామర్థ్యాత్ యోగక్షేమాత్ యోగక్షేమనిమిత్తం శరీరాద్యుపచయరక్షణనిమిత్తమిత్యేతత్ . ప్రేయః పశుపుత్రాదిలక్షణం వృణీతే ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

అవి (అనగా శ్రేయము మరియు ప్రేయము అన్న రెండూ) చేయదగిన కర్తవ్యాలన్నది సత్యమే. అయినప్పటికీ, వివేకములేని మందబుద్ధులు ఆ కర్తవ్యాలకు సంబంధించిన సాధనలు, ఫలితాలను విచారించడం ద్వారా, వాటి మధ్య భిన్నత్వాన్ని సులభంగా గ్రహించలేరు. కాబట్టి, 'శ్రేయశ్చ ప్రేయశ్చ'– హితము, ప్రియము; 'మనుష్యమ్ ఏతః' (ఆ-ఇతః) – మనిషిని సమీపిస్తాయి, రెండూ కలగలిసిపోయినట్లుగా. హంస నీటి నుండి పాలను వేరుచేసినట్లుగా, 'ధీరః'– వివేకవంతులు; 'సంపరీత్య'– పూర్తి విచారణ చేసి, వాటి ప్రాముఖ్యత, అప్రాధాన్యతలను మనసులో విశ్లేషించి; 'తౌ'– ఆ రెండింటిని (హితాన్ని, ప్రియాన్ని); 'వివినక్తి'– వేరుచేస్తారు. విభజించిన తరువాత, 'ప్రేయసః' – ప్రియముతో పోల్చి; 'శ్రేయః హి'– హితమునే నిశ్చయంగా; 'అభివృణీతే'– ఉత్తమమైనదిగా ఎంచుకొంటారు. ఎవరు? 'ధీరః'– వివేకవంతులు. అయితే, 'మన్దః'– మందబుద్ధిగలవాడు, వివేకం లేకపోవడం చేత; 'యోగక్షేమాత్'– తన పురోగతి, శరీర రక్షణ మొదలైనవాటి కొరకు; 'ప్రేయః'– ప్రియాన్ని, విడువవలసిన దాన్ని, అంటే పశువులు, పుత్రుల వంటి వాటితో కూడిన దాన్ని; 'వృణీతే'– ఎంచుకొంటాడు.

(మనిషి తన జీవిత కాలంలో వేదం విధించిన ఎన్నో కర్తవ్యాలు నిర్వహించాలి. కర్తవ్యాలు నిర్వహించాలంటే వాటికి కావలసిన సంబారాలు, సాధనాల గురించి తెలియాలి. అంతే కాక, ఆ కర్తవ్యాలు నిర్వహించిన మీదట కలిగే

ఫలితాల గురించి కూడా తెలుసుకోవాలి. అట్లా, కూలంకషంగా విచారించి తెలుసుకొన్న తర్వాతనే, ఆ కర్తవ్యాల నిర్వహణ వల్ల హితం కలుగుతుందా, ప్రియం కలుగుతుందా అనేది నిశ్చయమౌతుంది. అయితే, మూర్ఖులు ఈ విధంగా విచారణ చేయకపోవడంచేత, హితానికి, ప్రియానికి ఉన్న తేడా అంత సులభంగా గ్రహించలేరు. హితమైన, ప్రియమైన కర్తవ్యాలు రెండూ కూడా మనిషికి అందుబాటులోనే ఉంటాయి. వివేకవంతుడు ఆ కర్తవ్యాలను క్షుణ్ణంగా పరిశీలించి, విచారణ చేసి, హంస నీటినుండి పాలను వేరుచేసినట్లుగా, హితమైన కర్తవ్యాలు, ప్రియమైన కర్తవ్యాలుగా వేరు చేస్తాడు. అలా వేరు చేసి, ప్రియమైన వాటికంటే హితమైన కర్తవ్యాల గొప్పదనాన్ని గుర్తించి, హితాన్ని కలిగించే కర్తవ్యాలనే స్వీకరిస్తాడు. కాని, మందబుద్ధిగలవాడు మాత్రం, తన పురోగతి, శరీర పోషణ రక్షణాలే ముఖ్యమైనవిగా భావించడం వల్ల, పశుసంపద పుత్రసంపదల వంటి ప్రీతిని కలిగించే కర్తవ్యాలని అంటే విడిచి పెట్టవలసిన వాటిని ఆచరిస్తాడు.)

**స త్వం ప్రియాన్ప్రియరూపాంశ్చ**
**కామానభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః .**
**నైతాం సృఙ్కాం విత్తమయీమవాప్తో**
**యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః .. 1-2-3 ..**

ఓ నచికేతా, ప్రియమైనవి మరియు ప్రియాన్ని కలిగించేవైన కోరికలను విచారించి త్యజించినట్టి వాడివి నీవు. చాలామంది మానవులు సంపదతో నిండిన ఏ మార్గంలోనైతే మునిగి పోతారో, అట్టి దుష్ట మార్గాన్ని నీవు స్వీకరించలేదు.

## శంకర భాష్యమ్

స త్వం పునః పునః మయా ప్రలోభ్యమానోఽపి ప్రియాన్ పుత్రాదీన్ ప్రియరూపాంశ్చ అప్సరఃప్రభృతిలక్షణాన్ కామాన్ అభిధ్యాయన్ చింతయన్ తేషామనిత్యత్వాసారత్వాదిదోషాన్ హే నచికేతః, అత్యస్రాక్షీః అతిసృష్టవాన్ పరిత్యక్తవానసి ; అహో బుద్ధిమత్తా తవ . న ఏతాం అవాప్తవానసి సృంకాం సృతిం కుత్సితాం మూఢజనప్రవృత్తాం విత్తమయీం ధనప్రాయాం ; యస్యాం సృతౌ మజ్జంతి సీదంతి బహవః అనేకే మూఢా మనుష్యాః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'నచికేతః'– ఓ నచికేతా మరలా మరలా ప్రలోభపెట్టబడినప్పటికీ; 'ప్రియాన్'– పుత్రులు మొదలైన; 'ప్రియరూపాంశ్చ'– అప్సరసలు మొదలైన లక్షణాలు కల; 'కామాన్'– కోరికలను; 'అభిధ్యాయన్'– విచారణ చేసి, అవి అనిత్యత్వం, అసారత్వమనే దోషములు కలవని గ్రహించి; 'అత్యస్రాక్షీః'– పరిత్యజించిన నీ వివేకం ఎంత గొప్పదో. 'బహవః'– అనేక; 'మనుష్యాః'– మానవులు; 'యస్యామ్'– ఏ మార్గంలో; 'మజ్జన్తి'– మునిగిపోతారో; 'ఏతాం'–ఈ

'విత్తమయీమ్'– సంపదతో కూడిన; 'సృఙ్కాం '– దారి, మూర్ఖ జనులచే ఆశ్రయింపబడే చెడు మార్గం; 'న అవాప్తః'– నీవు స్వీకరించలేదు.

(ఆహా నచికేతా, నేను నిన్ను మరీ మరీ ప్రలోభపెట్టినప్పటికీ ప్రియమైన, ప్రియరూపాలైన కోరికలను వాటి అనిత్యత్వాన్ని, సారహీనతను విచారణ చేసి మరీ పరిత్యజించావు. కోరికలు రెండు రకాల విషయాల గురించి ఉంటాయి. వాటిలో స్వభావ రీత్యా తనకు ప్రియమైనవాటి గురించిన కోరికలు మొదటి రకమైనవి. వాటిని ప్రియాలు అంటారు. కొన్ని వస్తువులు లేదా విషయాలు ఉండటం వల్ల మనకు వాటిపై ప్రీతి కలుగుతుంది. ఇవి రెండవ రకం. వాటినే ప్రియరూపాలు అంటారు. అటువంటి రెండు రకాలైన విషయాలపైన కోరికలనూ నిరాకరించిన నీ వివేకం ప్రశంసనీయం. ఎంతోమంది ధనభూయిష్టమైన మార్గంలో ప్రయాణించి దుఃఖాన్ని పొందుతారు. కాని, నచికేతా! నీవు అలాకాదు. అల్పబుద్ధులు ఆశ్రయించే అటువంటి చెడు మార్గాన్ని నీవు స్వీకరించలేదు.)

**దూరమేతే విపరీతే విషూచీ**
**అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా .**
**విద్యాభీప్సినం నచికేతసం మన్యే**
**న త్వా కామా బహవోఽలోలుపన్త .. 1-2-4 ..**

ఈ రెండింటికి చాలా అంతరం, వైరుధ్యం ఉంది. వాటి మార్గాలు భిన్నం. వాటిని విద్య మరియు అవిద్యగా (వివేకులు) తెలుసుకొంటారు. నచికేతా నీవు విద్యపై అభిలాష కలవాడివిగా భావిస్తా. (ఎందుకంటే) అనేకమైన కోరికలపట్ల నీవు మోహాన్ని పొందలేదు.

## శంకర భాష్యమ్

'తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే' ఇతి హ్యుక్తం ; తత్కస్మాత్ ? యతః దూరం దూరేణ మహతాంతరేణ ఏతే విపరీతే అన్యోన్యవ్యావృత్తరూపే వివేకావివేకాత్మకత్వాత్ తమఃప్రకాశావివ విషూచీ విషూచ్యౌ నానాగతీ భిన్నఫలే సంసారమోక్షహేతుత్వేనేత్యేతత్ . కే తే ఇతి, ఉచ్యతే . యా చ అవిద్యా ప్రేయోవిషయా విద్యేతి చ శ్రేయోవిషయా జ్ఞాతా నిర్జ్ఞాతా అవగతా పండితైః . తత్ర విద్యాభీప్సినం విద్యార్థినం నచికేతసం త్వామహం మన్యే . కస్మాత్ ? యస్మాదవిద్వద్బుద్ధిప్రలోభినః కామాః అప్సరఃప్రభృతయః బహవోఽపి త్వా త్వాం న అలోలుపంత న విచ్ఛేదం కృతవంతః శ్రేయోమార్గాదాత్మోపభోగాభివాంఛాసంపాదనేన . అతో విద్యార్థినం శ్రేయోభాజనం మన్యే ఇత్యభిప్రాయః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ప్రియం కంటే ఉత్తమమైన శ్రేయాన్ని వివేకులు ఎంచుకొంటే, విడువదగిన ప్రియాన్ని మందబుద్ధులు కోరుకొంటారు అని చెప్పారు కదా. ఎందుచేత అలా చెప్పారు? 'ఏతే'– ఈ రెండూ; 'దూరమ్'– చాలా దూరం లేదా

అంతరం; 'విపరీతే'– వైరుద్ధ్యం కలవి, అంటే వెలుగు, చీకటిలాగా అవి వివేకం మరియు అవివేకానికి సంబంధించిన విషయాలైనందున, ఒక దానితో మరొకటి కలిసేవి కావు; 'విషూచీ' (విషూచ్యౌ) – భిన్నమార్గాలు కలవి, సంసారం-మోక్షమనే భిన్న ఫలితాల నిచ్చేవి అయినందున. అవి ఏమిటో చెప్తున్నారు. 'యా చ'– వేటిసైతే; 'అవిద్యా ఇతి'– తిరస్కరించతగిన దాన్ని ఫలంగా ఇచ్చే అజ్ఞానంగా; 'విద్యా ఇతి'– స్వీకరించతగినదాన్ని ఫలంగా ఇచ్చే జ్ఞానంగా; 'జ్ఞాతా'– వివేకవంతుడు గ్రహిస్తాడో అవి. ఆ రెండిటిలో, 'నచికేతసమ్'– నచికేతా నీవు; 'విద్యాభీప్సినమ్'– జ్ఞానాభిలాషివని; 'మన్యే'– తలుస్తాను. ఎందుచేత? మూర్ఖుల బుద్ధిని మోహపరిచే 'కామాః'– కోరికలు, అప్సరసలు మొదలైనవాటి పట్ల కోరికలు; 'బహవః'– అనేకములైనప్పటికినీ; 'త్వా' (త్వాం) – నీవు; 'న అలోలుపన్త'– వంచింప బడలేదు (మోహానికి లోనుకాలేదు). ఆత్మను సంపాదించాలనే కోరికను సాధింపచేసే శ్రేయోమార్గం నుండి మరలలేదు. కాబట్టి, నీవు శ్రేయోమార్గాన్ని స్వీకరించుటకు తగిన విద్యార్థివని తలుస్తా అని అభిప్రాయం.

(1.2.2వ మంత్రంలో ప్రియం కంటే ఉత్తమమైన శ్రేయాన్ని వివేకులు ఎంచుకొంటే, విడువదగిన ప్రియాన్ని మందబుద్ధులు కోరుకొంటారు అని అన్నారు కదా. అలా ఎందుకు జరుగుతోంది అని అంటే, దానికి సమాధానాన్ని ఈ మంత్రంలో సూచిస్తున్నారు. శ్రేయానికి, ప్రియానికి మధ్య అధిగమించరాని దూరం ఉంది. వాటి రెండింటి తత్త్వంలో విరుద్ధత కూడా ఉంది. వెలుగు, చీకటి మధ్య ఉన్నంత వైరుధ్యం వాటి రెండింటి మధ్య ఉంది. శ్రేయం వెలుగు వంటిదైతే, ప్రియం చీకటి వంటిది. వెలుగు ఉంటే చీకటి ఉండనట్లు ఒకటి ఉంటే, మరొకటి ఉండనంతటి వైరుద్ధ్యం వాటిది. అవి ఇచ్చే ఫలితాలు కూడా భిన్నమైనవే. ప్రియం సంసారాన్ని ఫలంగా ఇస్తే, శ్రేయం మోక్షాన్ని ఫలంగా ఇస్తుంది. వివేకం కలవాడు వాటిలో స్వీకరించదలసిన హితాన్ని విద్యాలక్షణం కలదిగాను, త్యజించతగిన ప్రియాన్ని అవిద్యాలక్షణం కలదిగాను గ్రహిస్తాడు. ఆ రెండింటిలో, నచికేతా నీవు విద్యను అభిలాషిస్తున్నావని నేను అనుకొంటున్నాను. ఎందుకలా అనుకొంటున్నానంటే, అవివేకులను మోహానికి గురిచేసే అనేకవిధాలైన కోరికలను, నీవు త్యజించావు. ఆ కోరికలు, ఆత్మను సంపాదించాలనే కోరికను సాధింపచేసే శ్రేయోమార్గం నుండి నిన్ను మరల్చ లేకపోయాయి. కాబట్టి, శ్రేయోమార్గాన్ని స్వీకరించుటకు నీవు తగిన విద్యార్థివి.)

**అవిద్యాయామన్తరే వర్తమానాః**
**స్వయం ధీరాః పణ్డితంమన్యమానాః .**
**దన్ద్రమ్యమాణాః పరియన్తి మూఢా**
**అన్ధేనైవ నీయమానా యథాన్ధాః .. 1-2-5 ..**

తమకు తాము వివేకులం, పండితులం అని తలచుకొంటూ, అజ్ఞానంలో ప్రవర్తిల్లే మూర్ఖులు, అంధునిచే తీసుకొని పోబడే మరో అంధునిలా, వలయంలో పరిభ్రమిస్తున్నారు.

## శంకర భాష్యమ్

యే తు సంసారభాజో జనాః, అవిద్యాయాం అంతరే మధ్యే ఘనీభూత ఇవ తమసి వర్తమానాః వేష్ట్యమానాః పుత్రపశ్వాదితృష్ణాపాశశతైః, స్వయం ధీరాః ప్రజ్ఞావంతః పండితాః శాస్త్రకుశలాశ్చేతి మన్యమానాః తే దంద్రమ్యమాణాః అత్యర్థం కుటిలామనేకరూపాం గతిం గచ్ఛంతః జరామరణరోగాదిదుఃఖైః పరియంతి పరిగచ్ఛంతి మూఢాః అవివేకినః అంధేనైవ దృష్టివికలేనైవ నీయమానాః విషమే పథి యథా బహవః అంధాః మహాంతమనర్థమృచ్ఛంతి, తద్వత్ ..

అత ఏవ మూఢత్వాత్ న సాంపరాయః ప్రతిభాతి .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

కాని, సంసారానికి తగినవారైన జనులు, 'అవిద్యాయామ్ అన్తరే'– అజ్ఞానం మధ్యలో, చిక్కనైన చీకటి మధ్యలో, పుత్రులు పశువుల లాంటి వందల కొలది కోరికలతో; 'వర్తమానాః'– జీవిస్తున్నారు. వారు 'స్వయమ్'– తమని తాము; 'ధీరాః'– వివేకవంతులమని; 'పణ్డితాః'– శాస్త్రములు అధ్యయనం చేసినవారమని; 'మన్యమానాః'– భావించుకొనేవారై; 'దన్ద్రమ్యమాణాః'–జనన మరణ రోగాది దుఃఖాలచే పీడింపబడుతూ మోసపూరితమైన సిద్ధాంతాలను అనుసరిస్తూ, 'మూఢాః'– మూర్ఖులై, అవివేకులై; 'అన్ధేన'– గుడ్డివానిచే; 'నీయమానాః'– తప్పుడు త్రోవల వెంట తీసుకెళ్ళబడే; 'అంధాః ఇవ'– గుడ్డివారిలా; 'పరియన్తి'– చుట్టూ చుట్టూ తిరుగుతున్నారు, వలయంలో పరిభ్రమిస్తున్నారు. అంటే, గొప్ప అనర్థాన్ని పొందుతున్నారు.

(వివేకవంతుడు నచికేతునిలా శ్రేయోమార్గాన్ని స్వీకరించి పరమ తత్త్వాన్ని పొందగోరుతున్నాడు. కాని, సంసారానికే పరిమితమయ్యే సాధారణ జనులు, అజ్ఞానమనే దట్టమైన చీకటి మధ్యలో పుత్రులు, పశువులవంటి సంసార సంబంధమైన కోరికలు కోరుకుంటూ జీవిస్తున్నారు. ఇది సాధారణంగా మానవుల పరిస్థితి. అయితే, కొందరైతే తమకు తాము వివేకవంతులమనీ, శాస్త్రాన్ని కూలంకషంగా అధ్యయనం చేసిన వారమని వారికి వారే అనుకొంటూ, జనన మరణ రోగాది దుఃఖాన్ని ఇచ్చే కుహనా సిద్ధాంతాలను, పద్ధతులను అనుసరిస్తూ జనన మరణ చక్రంలో పరిభ్రమిస్తున్నారు. వీరి తరహా ఎలాంటిదంటే, ఒక గుడ్డివాడు చూపే దారిలో మరొక గుడ్డివాడు పయనించడం లాంటిది. కాబట్టి, చివరకు వారంతా మహా వినాశనాన్ని పొందుతున్నారని అభిప్రాయం. ఈ అజ్ఞానం వల్లనే, అట్టివానికి పరలోకాన్ని పొందే సాధనం అవగతం కాదు.)

అందుచేతనే, అజ్ఞానం వలన పరలోకప్రాప్తి సాధనం అవగాహనకు రాదు.

**న సామ్పరాయః ప్రతిభాతి బాలం**

**ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్ .**

**అయం లోకో నాస్తి పర ఇతి మానీ**

**పునః పునర్వశమాపద్యతే మే .. 1-2-6 ..**

ధనమోహంతో ప్రమాదం తెచ్చుకొనే అమాయకునికి పరలోక సాధనం అవగతం కాదు. ఈ లోకానికి మించి మరొకటి లేదని అనుకొంటూ, మరల మరల నావశంలోకే వస్తాడు.

## శంకర భాష్యమ్

సంపరేయత ఇతి సంపరాయః పరలోకః, తత్ప్రాప్తిప్రయోజనః సాధనవిశేషః శాస్త్రీయః సాంపరాయః . స చ బాలం అవివేకినం ప్రతి న ప్రతిభాతి న ప్రకాశతే నోపతిష్ఠత ఇత్యేతత్ . ప్రమాద్యంతం ప్రమాదం కుర్వంతం పుత్రపశ్వాదిప్రయోజనేష్వాసక్తమనసం తథా విత్తమోహేన విత్తనిమిత్తేనావివేకేన మూఢం తమసాచ్ఛన్నం . స తు అయమేవ లోకః యోఽయం దృశ్యమానః స్త్ర్యన్నపానాదివిశిష్టః నాస్తి పరః అదృష్టో లోకః ఇత్యేవం మననశీలః మానీ పునః పునః జనిత్వా వశం అధీనతాం ఆపద్యతే మే మృత్యోర్మమ . జననమరణాదిలక్షణదుఃఖప్రబంధారూఢ ఏవ భవతీత్యర్థః ..

ప్రాయేణ హ్యేవంవిధ ఏవ లోకః . యస్తు శ్రేయోర్థీ స సహస్రేషు కశ్చిదేవాత్మవిద్భవతి త్వద్విధః

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'సంపరాయః' అంటే దేహాన్ని విడిచిపెట్టిన తర్వాత పొందేది, పరలోకం అని అర్థం. అట్టి పరలోకాన్ని పొందటమనే ఫలాన్ని ఇచ్చే శాస్త్రీయమైన సాధనావిశేషాన్ని 'సాంపరాయః' అంటారు. అటువంటి సాధనం, 'బాలమ్'– బాలునికి, అవివేకికి; 'ప్రమాద్యన్తమ్'– ప్రమాదాన్ని తెచ్చుకొనేవారికి, పుత్రులు పశువులు మొదలైన ప్రయోజనాలపై ఆసక్తికలిగిన వారికి; 'విత్తమోహేన'– సంపదవ్యామోహంతో వివేకం నశించిన వారికి; 'మూఢమ్'– మూర్ఖులకు, అజ్ఞానమనే చీకటిచే కప్పబడినవారికి; 'న ప్రతిభాతి'– గోచరించదు, ఉపయోగపడదు. అట్టి వారు, 'అయమ్ లోకః'– స్త్రీలు, ఆహారం, పానీయం మొదలైన విశేషాలతో నిండి కనిపించే ఈ ప్రపంచం మాత్రమే తప్ప; 'న పరః అస్తి'– కనిపించని వేరొక లోకం లేదు; 'ఇతి మానీ'– అని సదా భావించి; జన్మిస్తూ, 'పునః పునః'– తిరిగి తిరిగి; 'మే'– మృత్యువునైన నా 'వశమ్ ఆపద్యతే'– అధీనమవుతారు. అంటే, అతడు జనన మరణాది రూపమైన దుఃఖాన్ని మాత్రమే అధిరోహిస్తాడు అని అర్థం.

(భూలోకంపై ఉన్న ఈ మానవ దేహాన్ని విడిచిపెట్టిన తర్వాత పొందబోయే దాన్ని 'పరలోకం' అంటారు. అటువంటి పరలోకాన్ని పొందటానికి శాస్త్రాలు కొన్ని సాధనాలు నిర్దేశించాయి. ఆ సాధనాలను 'సాంపరాయః' అంటారు. అయితే బాలుడికి, పుత్రులు పశువులు మొదలైన వాటిపై ఆసక్తి అనే ప్రమాదాన్ని తెచ్చుకొన్నవారికి, ధనవ్యామోహంతో వివేకం కోల్పోయిన వారికి, అజ్ఞానమనే చీకటిచే కప్పబడినవారికి ఈ సాధనాలు ఉన్నాయనేదే మనసుకు తోచదు. ఒకవేళ ఉన్నాయని తోచి వాటిని ఆచరించినా, వారికి ఎటువంటి ప్రయోజనం కలుగదు. అలాంటి వారు, యువతులు, అన్నపానీయాలతో నిండిన ఈ లోకం తప్ప వేరొకటి ఉన్నదనే భావనే చేయరు. ఆ విధంగా వారు మరలా మరలా జన్మించి, మరణిస్తూ, మృత్యువునైన నా అధీనంలోకి వస్తూనే ఉంటారు. జనన మరణ చక్రం నుండి బయట పడరని తాత్పర్యం.

క్రిందటి మంత్రంలో ఒక రకమైన అజ్ఞానుల గురించి చెప్పారు. వారెలాంటివారంటే, ఏవో కొన్ని వేద విరుద్ధమైన సిద్ధాంతాలనీ, భావాలనీ పట్టుకొని తమకు తామే పండితులమని చెప్పుకుంటూ అలా తాము ప్రమాదంలో పడటమే

కాకుండా ప్రచారంలోకి తెచ్చి మరికొంతమందిని వాటివైపు ఆకర్షితులయ్యేలా చేసి వారిని కూడా ప్రమాదంలోకి తోస్తారు. ఇప్పుడు ఈ మంత్రంలో మరొక రకం అజ్ఞానుల గురించి ప్రస్తావన చేస్తున్నారు. ఈ రకం వారికి వారున్న ఈ భూలోకం తప్ప వేరొకటున్నదనే జ్ఞానం ఏమాత్రం ఉండదు. అజ్ఞానులలో ఇది రెండవ రకం.)

అది సాధారణ లోకరీతి. కాని, వేయిమందిలో ఒకడు, నీలాంటి వాడు శ్రేయాన్ని అభిలషించి, ఆత్మజ్ఞాని అవుతున్నాడు.

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః**
**శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః .**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽఽ-**
**శ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః .. 1-2-7 ..**

ఏది అనేకులకు వినడానికే లభ్యం కాదో. విన్ననూ అనేకులు దేనిని గ్రహించలేరో, దానిని బోధించేవాడు (దొరకడమే) ఆశ్చర్యం. నేర్పుతో బోధించగా దానిని అంతే నేర్పుగా గ్రహించగలిగే వాడు (దొరకడం) ఇంకా ఆశ్చర్యం.

## శంకర భాష్యమ్

యస్మాత్ శ్రవణాయాపి శ్రవణార్థం శ్రోతుమపి యః న లభ్యః ఆత్మా బహుభిః అనేకైః, శృణ్వంతోఽపి బహవః అనేకే అన్యే యం ఆత్మానం న విద్యుః న విదంతి అభాగినః అసంస్కృతాత్మానో న విజానీయుః . కించ, అస్య వక్తాపి ఆశ్చర్యః అద్భుతవదేవ, అనేకేషు కశ్చిదేవ భవతి . తథా శ్రుత్వాపి అస్య ఆత్మనః కుశలః నిపుణ ఏవానేకేషు లబ్ధా కశ్చిదేవ భవతి . యస్మాత్ ఆశ్చర్యః జ్ఞాతా కశ్చిదేవ కుశలానుశిష్టః కుశలేన నిపుణేనాచార్యేణానుశిష్టః సన్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'బహుభిః'– అనేకులు; 'శ్రవణాయాపి'–కేవలం వినాలనే కుతూహల మాత్రంచేత విన్ననూ; 'యః'– ఏది; 'న లభ్యః'– లభించేదికాదో; 'బహవః'– అనేకులు (ఇంకొందరు); 'శృణ్వంతః అపి'– విన్నప్పటికినీ; 'యం'– దేనిని, ఏ ఆత్మను; 'న విద్యుః'– తెలిసినవారు కారో; అంటే, మనసులు పరిశుద్ధం కాని అభాగ్యులు తెలుసుకోలేరో. మరింకా, 'అస్య వక్తా'– దానిని బోధించే ఆచార్యుడు, బోధకుడు; 'ఆశ్చర్యః'– అద్భుతమైనవాడు, అనేకులలో అరుదైనవాడు. అలాగే, అట్టి ఆత్మబోధ అనేకులు విన్నప్పటికీ, 'కుశలః'– నిపుణత; 'లబ్ధా'– సాధించినవాడు అరుదు. 'కుశలానుశిష్టః'– నైపుణ్యంగల ఆచార్యుడు చెప్పిన విధంగా ఆచరించి, 'జ్ఞాతా'– జ్ఞానాన్ని పొందినవాడు; 'ఆశ్చర్యః'– అద్భుతం, అరుదైనవాడు.

(ఇక ఆత్మజ్ఞానం గురించిన బోధను ప్రారంభిస్తున్నాడు యమదేవుడు. ఈ ఆత్మ జ్ఞానం ఎలాంటిదంటే, అనేకమంది కేవలం కుతూహలంతో దీనిని గురించి విన్నంత మాత్రాన లభించేది కాదు. మరికొంతమంది, కొంత శ్రద్ధతో విన్నప్పటికినీ, మనసులు పరిశుద్ధంగా లేని కారణం చేత వారికి ఆత్మజ్ఞానం అవగాహనకు రాదు. అంటే, ఆత్మజ్ఞానం పొందాలంటే కేవలం వినాలనే కుతూహలం ఉంటే సరిపోదు. ప్రయత్నం చేసి మనసును పరిశుద్ధం చేసుకోవాలి అని అభిప్రాయం. అసలీ ఆత్మజ్ఞానాన్ని బోధించే ఆచార్యుడు దొరకడమే చాలా అరుదు. ఒకవేళ దొరికితే అంతకన్నా అద్భుతం మరొకటి ఉండదు. అలాంటి ఆచార్యుడు లభించి, ఆత్మజ్ఞాన బోధ చేసినప్పటికినీ, దానిని విన్న అనేకులలో విషయాన్ని గ్రహించే నిపుణత కలిగిన శిష్యుడు లభించడం మరీ దుర్లభం. నైపుణ్యంగా ఆచార్యుడు బోధించిన దానిని అనుభవంలోకి తెచ్చుకొని ఆత్మజ్ఞానాన్ని సాధించినవాడైతే అత్యంత దుర్లభం కాబట్టి అన్నిటికన్నా అదీ మరీ అద్భుతం. అంటే అరుదైన వాటిలో కెల్లా అరుదు.

అంటే, ఎందరో జనులలో ఆత్మజ్ఞానం పొందాలి అనుకొనే వాడే దుర్లభం. ఏ వేయిమందిలోనో ఆ జిజ్ఞాస కలిగేవాడు ఒక్కడుంటాడు. ఆ కుతూహలం కలిగిన వాళ్ళలో శ్రద్ధగా అవగాహన చేసుకోవాలని ప్రయత్నంచేసేవాడు ఇంకా అరుదు. ఇలాంటి వారికి ఆత్మజ్ఞానాన్ని బోధించే గురువు లభించడం ఒక అద్భుతమే. సరియైన గురువుచేత ఆత్మజ్ఞానం బోధించబడినప్పటికీ, ఆత్మవిషయాన్ని గ్రహించగల్గినవాడు ఏంతో దుర్లభం. ఆత్మవిషయాన్ని గ్రహించడం ఒక ఎత్తయితే, ఆ గ్రహించిన విషయాన్ని సాధన చేత అనుభవంలోకి తెచ్చుకొనేవాడు మరీ అద్భుతం. అందుకే గురువు అద్భుతం, శిష్యుడు మరీ అద్భుతం అని అంటున్నారు.)

ఎందువల్లనంటే,

**న నరేణావరేణ ప్రోక్త ఏష**
**సువిజ్ఞేయో బహుధా చిన్త్యమానః .**
**అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి**
**అణీయాన్హ్యతర్క్యమణుప్రమాణాత్ .. 1-2-8 ..**

ఇది (నీవడిగిన ఈ ఆత్మజ్ఞానం) అల్పజ్ఞుడు బోధిస్తే, అనేక విధాలుగా ఆలోచించబడి, బాగా అవగతం కాదు. ఆత్మ తనకు అన్యంకాదనువాడు బోధిస్తే, అణువు కన్నా సూక్ష్మమై విచారణకు అతీతమైన ఆ స్థితిలో తలపు లేదా ఆలోచనే నిశ్చయంగా ఉండదు.

### శంకర భాష్యమ్

కస్మాత్ ? న హి నరేణ మనుష్యేణ అవరేణ ప్రోక్తః అవరేణ హీనేన ప్రాకృతబుద్ధినేత్యేతత్ . ఉక్తః ఏషః ఆత్మా యం త్వం మాం పృచ్ఛసి . న హి సుష్ఠు సమ్యక్ విజ్ఞేయః విజ్ఞాతుం శక్యః యస్మాత్ బహుధా అస్తి నాస్తి కర్తాకర్తా శుద్ధోఽశుద్ధ ఇత్యాద్యనేకధా చిన్త్యమానః వాదిభిః . కథం పునః సువిజ్ఞేయ ఇతి, ఉచ్యతే — అనన్యప్రోక్తే అనన్యేన అపృథగ్దర్శినాచార్యేణ

ప్రతిపాద్యబ్రహ్మాత్మభూతేన ప్రోక్తే ఉక్తే ఆత్మని గతిః, అనేకధా అస్తినాస్తీత్యాదిలక్షణా చింతా గతిః, అత్ర అస్మిన్నాత్మని నాస్తి న విద్యతే సర్వవికల్పగతిప్రత్యస్తమితరూపత్వాదాత్మనః . అథవా స్వాత్మభూతే అనన్యస్మిన్ ఆత్మని ప్రోక్తే అనన్యప్రోక్తే గతిః అత్ర అన్యావగతిర్నాస్తి జ్ఞేయస్యాన్యస్యాభావాత్ . జ్ఞానస్య హ్యేషా పరా నిష్ఠా యదాత్మైకత్వవిజ్ఞానం . అతః గంతవ్యాభావాన్న గతిరత్రావశిష్యతే సంసారగతిర్వాత్ర నాస్త్యనన్య ఆత్మని ప్రోక్తే నాంతరీయకత్వాత్తద్విజ్ఞానఫలస్య మోక్షస్య . అథవా ప్రోచ్యమానబ్రహ్మాత్మభూతేనాచార్యేణ అనన్యతయా ప్రోక్తే ఆత్మని అగతిః అనవబోధోఽపరిజ్ఞానమత్ర నాస్తి . భవత్యేవావగతిస్తద్విషయా శ్రోతుస్తదనన్యోఽహమిత్యాచార్యస్యేవేత్యర్థః . ఏవం సువిజ్ఞేయ ఆత్మా ఆగమవతాచార్యేణానన్యతయా ప్రోక్తః . ఇతరథా అణీయాన్ అణుతరః అణుప్రమాణాదపి సంపద్యత ఆత్మా . అతర్క్యం అతర్క్యః, అణుప్రమాణో న తర్క్యః స్వబుద్ధ్యభ్యూహేన కేవలేన తర్కేణ . తర్క్యమాణేఽణుపరిమాణే కేనచిత్స్థాపితే ఆత్మని తతోఽణుతరమన్యోఽభ్యూహతి తతోఽప్యన్యోఽణుతరమితి . న హి తర్కస్య నిష్ఠా క్వచిద్విద్యతే ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అవరేణ నరేణ'– అల్పజ్ఞుడైన మానవునిచే, ప్రాపంచిక జ్ఞానం కలిగిన మానవునిచే; 'ఏషః'– ఇది, నీవడిగిన ఆత్మగురించిన విషయం; 'ప్రోక్తః'–చెప్పబడినా; 'న హి సువిజ్ఞేయః'– బాగా సమగ్రంగా అవగతమయ్యేది కాదు. ఎందుకంటే, అది (ఆ ఆత్మ విషయం) 'బహుధా'– అనేక రకాలుగా, అంటే, అది ఉన్నది, అది లేనేలేదు, అది కర్త, అది కర్త కాదు, అది శుద్ధం, అది అశుద్ధం, వంటి భిన్న భిన్న భావనలతో; 'చిన్త్యమానః'– వివాదగ్రస్తులచే విచారింపబడుతోంది. ఏవిధంగా మరి అది బాగా అర్థమవుతుంది? అదే చెప్తున్నారు. ఆ ఆత్మ 'అనన్య'– ఆత్మకు ఇతరము కానివానిచే, ఆత్మకంటే భిన్నంగా రెండవదానిని దర్శించని ఆచార్యునిచే, ఈ ఉపనిషద్ నందు ప్రతిపాదింపబడిన బ్రహ్మముతో ఏకత్వాన్ని దర్శించిన వానిచే; ఆత్మ గురించి 'ప్రోక్తే'– బోధింపబడగా; 'అత్ర'– దానియందు, ఆ ఆత్మయందు; 'గతిః'– తలంపు, అది ఉన్నట్టిదా లేనిదా మొదలైనటు వంటి విచారణ; 'న అస్తి'– ఉండదు. అన్ని ఆలోచనలు నిర్గమించే రూపమైనందున ఆత్మయందు తలపులకు తావులేదు.

(ప్రాపంచిక విషయాలకుసంబంధించిన లౌకికజ్ఞానం మాత్రమే కలవాడు ఈ ఆత్మ గురించిన విషయాన్ని బోధించినట్లైతే, అది బాగా స్పష్టంగా అవగతం కాదు. అంటే, ఆత్మ ఉన్నది, లేదు, అది కర్త, అది కర్తకాదు, అది శుద్ధం, అది అశుద్ధం వంటి వివాదాల విచారణతోనే సరిపోతుంది. సరే, అల్పజ్ఞులచే బోధింపబడటం వల్ల అది సరిగా అర్థమయ్యేది కాదు. మరైతే, ఎవరు బోధిస్తే ఆ ఆత్మజ్ఞానం స్పష్టంగా బోధపడుతుంది? ఆత్మను తనకు అన్యంగా భావించనివారు, ఆత్మకు అన్యంగా మరొకదానిని దర్శింపని వారు, ఉపనిషత్తునందు ప్రతిపాదింపబడిన బ్రహ్మముతో ఏకత్వాన్ని దర్శించిన వారు బోధించగా అట్టి ఆత్మయందు ఇక ఎటువంటి తలపూ, విచారణా ఉండదు. అంటే, ఆలోచనకు, విచారణకు అతీతమైనది ఆత్మస్వరూపం. ఆత్మజ్ఞానియైన ఆచార్యునిచే బోధించగా శిష్యునికి ఆత్మగురించిన వైరుద్ధ్యభావనలన్నీ నశించి, ఆత్మస్వరూపం స్పష్టంగా అవగతమౌతుంది.)

లేదా, 'అనన్యప్రోక్తే'– ఎప్పుడైతే ఆత్మతప్ప ఇతరమేదీ లేదని, అది తన స్వరూపమేనని సరిగా బోధింపబడుతుందో (అన్యము కాదు అది తన ఆత్మయేనని బోధింపబడుతోందో .. బాలగోపాలేన్ద్ర వ్యాఖ్య); 'అత్ర'– దానియందు, ఆ స్థితియందు; 'న అస్తి గతిః'– (నేను ఆ ఆత్మను లేదా బ్రహ్మమును అన్న అవగాహన తప్ప) వేరొక అవగాహనే ఉండదు. ఎందువల్లనంటే, తెలియదగినది వేరొకటి ఏదీ లేనందున (బ్రహ్మాత్మ ఏకత్వము తప్ప వేరొకటనేదే

లేనందువల్ల). సమస్త జ్ఞానమునకూ ఆత్మైకత్వమన్న జ్ఞానమే తాత్పర్యం. కాబట్టి, తెలియబడవలసినదేదీ లేనందుచేత, తెలుసుకొనుటకు మిగిలి ఉన్నది ఏదీ లేదు.

(లేదా 'అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి' అన్న మంత్రభాగాన్ని మరొక విధంగా కూడా అర్థంచేసుకోవచ్చు. ఆత్మ తప్ప ఇతరమైనది ఏదీలేదని, అదే తన స్వరూపమని చక్కగా గురువుచే బోధింపబడగా, విన్న శిష్యునికి నేనే ఆ ఆత్మను ఇతరమనేది ఇంకేదీ లేదనే అవగాహన తప్ప వేరొక అవగాహనే ఉండదు. తను ఆత్మ స్వరూపుడైనప్పుడు, ఆత్మకు భిన్నంగా మరొకటి ఏదీ లేనప్పుడు, ఇక తెలుసుకోవడానికి ఏమి మిగిలింది? అంటే, తెలుసుకోవడానికి ఏమీ లేదని అభిప్రాయం. ఆత్మ ఏకమన్న సత్యమే సమస్త జ్ఞానానికి పరమలక్ష్యం.)

లేదా, ఇతరమనేదే లేని ఆత్మగురించి బోధించిన మీదట, 'న అస్తి అత్ర గతిః'–సంసారగతి అనేది, అనగా పునర్జన్మ అనేది ఉండదు. (బాలగోపాలేన్ద్రులు ద్వైతం సత్యమైనదిగా గోచరించడాన్నే సంసారగతిగా అన్వయించారు. ఈ గోచరత్వం ఆత్మజ్ఞానం కలగగానే నశిస్తుంది). ఎందుకంటే, ఆ ఆత్మజ్ఞాన ఫలంగా మోక్షం వెంటనే లభిస్తుంది కనుక.

(ఇంకొక విధంగా కూడా ఈ మంత్ర పాఠాన్ని అర్థం చేసుకోవచ్చు. ఆత్మజ్ఞాన బోధ విన్న తర్వాత సంసారమనేదే నిశ్చయంగా ఉండదు. సంసారం లేకపోవడమంటే తిరిగి జన్మించకపోవడమే. ఎందువల్లనంటే, ఆత్మజ్ఞానానికి మోక్షమే ఫలం కాబట్టి. మోక్షమంటే అజ్ఞాన నిర్మూలనం లేదా సంసార వినాశనం.)

లేదా, తనచే బోధింపబడే బ్రహ్మమే తాననే ఐక్యతపొందిన ఆచార్యునిచే ఆత్మ జ్ఞానం బోధించబడగా, 'న అగతిః'– అవగతం కాకపోవుట, ఆత్మజ్ఞానలబ్ధి లేకపోవుట అనేదే ఉండదు, ఆ ఆత్మజ్ఞాన బోధ విన్న శిష్యునికి అది నాకు అన్యము కాదనే జ్ఞానం, ఆచార్యునికి ఎలా అనుభవమైనదో అలాగే, అవగతమౌతుంది. అదీ అభిప్రాయం.

(మరో అర్థమేమంటే, సమర్థుడైన ఆచార్యునిచే ఆత్మ జ్ఞానం బోధించబడితే, అది అవగతం కాకపోవడమనేది ఉండదు. ఆత్మజ్ఞానం లభించకపోవడమనేది జరుగదు. గురువుకు ఏవిధంగానైతే తాను ఆత్మకు అన్యంకాదనే అనుభవం కలిగిందో, ఆ గురువు బోధ విన్న శిష్యునికి కూడా అదే అనుభవం కలిగి తీరుతుంది. సందేహమేమీ లేదని అభిప్రాయం.)

ఆ విధంగా, వేదశాస్త్రమందు పాండిత్యముగల ఆచార్యుడు, బోధ మరియు బోధించబడే ఆత్మవిషయం వేరు వేరు కాదు అని బోధించగా ఆత్మ స్పష్టంగా అవగతమౌతుంది. (ఆగమ పాండిత్యం కలిగిన, ఆత్మ నిష్ఠుడైన ఆచార్యుడు ఆత్మజ్ఞానాన్ని బోధించగా – బాలగోపాలేన్ద్రుల వ్యాఖ్య). అలా కాకపోతే, 'అణుప్రమాణాత్'– పరమాణు ప్రమాణం కంటే కూడా; 'అణీయాన్'– అతి సూక్ష్మమైన ఆత్మ; 'అతర్క్యమ్'– వాదంతో నిర్ణయించేది కాదు, అంటే స్వబుద్ధితో (సమర్థుని బోధచేత సంస్కరింపబడిన బుద్ధికి ఇది వేరైనదని గ్రహించాలి) కేవలం హేతురీత్యా ఊహించి తెలుసుకొనలేనిది. అది (ఆ ఆత్మ) తర్కించదగిన విషయమై, పరిమాణంలో పరమాణువులాంటిది అని ప్రతిపాదిస్తే, మరొకడు అది (ఆ ఆత్మ) పరమాణువు కంటే సూక్ష్మమైనదని తేల్చవచ్చు మరింకొకడు ఆ పరమాణువు కన్నా సూక్ష్మమైనదాని కన్నా మరింత సూక్ష్మతమమైనదని ప్రతిపాదించవచ్చు. ఆ విధంగా ఈ కుతర్కానికి అంతమనేదే ఉండదు.

(ఆత్మజ్ఞాన విషయంలో బోధకు, బోధింపబడే విషయానికి తేడా ఉండదు. లౌకిక విజ్ఞానాలకు ఇది పూర్తిగా విరుద్ధం. ఆ విధంగా బోధింప సమర్థుడైన, ఆత్మ నిష్ఠత కలిగిన ఆచార్యునిచే బోధించబడితేనే ఆత్మవిద్య స్పష్టంగా, ఎటువంటి సందేహాలకు తావు లేకుండా అవగతమౌతుంది. అలా కాకుండా, పరమాణువు కంటే కూడా సూక్ష్మమైన ఆత్మ తత్త్వాన్ని స్వంత బుద్ధితో ఊహించి నిర్ధారణ చేయలేం. సరియైన గురువుచే సంస్కరింపబడిన బుద్ధి కానందున,

ఆత్మను ఊహచేసి గ్రహించగలిగే సమర్ధత సాధారణ బుద్ధికి ఉండదు. సంస్కరించబడని బుద్ధి చేసే ఊహకు అంతమేమీ ఉండదు. ఇదెలా ఉంటుందంటే, ఆత్మ పరిమాణంలో పరమాణువు కంటే సూక్ష్మమైననది ఒకడు ప్రతిపాదిస్తే, మరొకడు అంతకంటే మరింత సూక్ష్మమైనదని మరొకడు నిర్ధారిస్తాడు. మరింకొకడు, పరమాణు పరిమాణమే సూక్ష్మతమమైనదని, అంతకంటే సూక్ష్మతరమైనదేదీ లేదని వాదిస్తాడు. ఈ ఊహలకు, వాదనలకు అంతూ పొంతూ ఉండదు. కాబట్టి, ఆత్మజ్ఞానం ఊహచేసి గ్రహింపగలిగేది కాదు.)

**నైషా తర్కేణ మతిరాపనేయా**
**ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ .**
**యాం త్వమాపః సత్యధృతిర్బతాసి**
**త్వాదృఙ్నో భూయాన్నచికేతః ప్రష్టా .. 1-2-9 ..**

ఇది తర్కంచే పొందగలిగేది కాదు. ప్రియతముడా, అన్యునిచే (తార్కికుడు కాని వానిచే) మాత్రమే చెప్పబడితేనే నీవు కోరినది (ఆత్మ తత్త్వం) బాగుగా తెలుస్తుంది. సత్యదీక్షగలిగి దయాపాత్రుడవైనావు. నచికేతా, నీవలె ప్రశ్నించేవాడు మాకు దొరకడు.

## శంకర భాష్యమ్

అతోఽనన్యప్రోక్త ఆత్మన్యుత్పన్నా యేయమాగమప్రభవా మతిః, నైషా తర్కేణ స్వబుద్ధ్యభ్యూహమాత్రేణ ఆపనేయా నాపనీయా న ప్రాపణీయేత్యర్థః ; నాపనేతవ్యా వా ; నోపహంతవ్యా . తార్కికో హ్యనాగమజ్ఞః స్వబుద్ధిపరికల్పితం యత్కించిదేవ కల్పయతి . అత ఏవ చ యేయమాగమప్రభూతా మతిః అన్యేనైవ ఆగమాభిజ్ఞేనాచార్యేణైవ తార్కికాత్ , ప్రోక్తా సతీ సుజ్ఞానాయ భవతి హే ప్రేష్ఠ ప్రియతమ . కా పునః సా తర్కాగమ్యా మతిః ఇతి, ఉచ్యతే — యాం త్వం మతిం మద్వరప్రదానేన ఆపః ప్రాప్తవానసి . సత్యా అవితథవిషయా ధృతిర్యస్య తవ స త్వం సత్యధృతిః . బతాసీత్యనుకంపయన్నాహ మృత్యుర్నచికేతసం వక్ష్యమాణవిజ్ఞానస్తుతయే . త్వాదృక్ త్వత్తుల్యః నః అస్మభ్యం భూయాత్ భవతాత్ . భవత్వన్యః పుత్రః శిష్యో వా ప్రష్టా . కీదృక్ ? యాదృక్త్వం హే నచికేతః ప్రష్టా ..

పునరపి తుష్ట ఆహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

కాబట్టి, 'ఏషా మతిః'– ఇది, అనగా వేదములచే ప్రతిపాదించినదీ, ఆత్మతో తాదాత్మ్యం పొందిన ఆచార్యునిచే బోధించబడగా ఉద్భవించేదీ అయినట్టి ఈ ఆత్మ గురించిన జ్ఞానం, తార్కికబుద్ధిచే ఊహచేసినంత మాత్రం చేత; 'న ఆపనేయా'('న ప్రాపణీయా') – పొందబడేది కాదు. లేదా ('ఆపనేయా' పదాన్ని 'ఆ అపనేయా' అని విభజించే సందర్భంలో) 'ఆ అపనేయా'– తొలగింపబడేది కాదు, నశింపబడేది కాదు. వేదములందు విశిష్టమైన జ్ఞానం లేని

తార్కికుడు, తన బుద్ధి ఎలా ఊహచేస్తే అలా అనేక కల్పనలు చేస్తాడు. అందుచేతనే, 'ప్రేష్ఠ' - ఓ ప్రియతమా, వేదములచే ప్రతిపాదింపబడిన ఈ ఆత్మగురించిన జ్ఞానం, తార్కికునకు అన్యమైన వాడు, వేదములందు నిష్ఠకల ఆచార్యునిచే చెప్పబడినప్పుడు స్పష్టంగా అవగతమౌతుంది. అయితే మరి, 'తర్కానికి అతీతమైన ఆ విషయం ఏమిటి?' అన్న ప్రశ్నకు సమాధానం చెప్పబడుతోంది. 'యాం త్వం'– ఏవిషయమైతే నీవు; 'ఆపః'– నా వరప్రదానంగా నీవు పొందావో అది. 'సత్యధృతిః'– సత్యమైన ఆ విషయంపట్ల శ్రద్ధ లేదా నిష్ఠత కలవాడివి; 'అసి'– అయిఉన్నావు. 'బత'– (దయను సూచించే శబ్దం) నచికేతుని పట్ల దయతో, ఆ విధంగా చెప్పబోయే ఉపదేశ వైశిష్ట్యాన్ని స్తుతిస్తున్నాడు. 'నః'– మాకు, 'త్వాదృక్'– నీకు సరితూగే, నీ వంటివాడు; 'న భూయాత్'– లభించడు. ఎటువంటి వాడు? నచికేతునిలా ప్రశ్నించేవాడు. నీవంటివాడు నీకన్నా ఇతరుడు, పుత్రుడు, శిష్యుడు లేదా ప్రశ్నించేవాడు మాకు లభించడు అని అభిప్రాయం.

(ఈ ఆత్మజ్ఞాన విషయం తర్కం వల్ల సాధింపవచ్చు అని అనుకొంటావేమో. నచికేతా, ఇది తర్కానికి అందని విషయం. ఆత్మతో తాదాత్మ్యం పొందిన ఆచార్యునిచే బోధింపబడితేనే అది అవగతమౌతుంది. అంతేగాని, కేవలం తర్కించి తెలుసుకొనబడే విషయం కాదు. వేదములందు సరియైన అవగాహన లేని తార్కికుడు తన బుద్ధితో అనేక కల్పనలు చేస్తాడే గాని ఆత్మయొక్క అసలైన జ్ఞానాన్ని పొందలేడు. మరి, తర్కానికి కూడా అందని ఆ విషయమే నీవు మూడవ వరంగా కోరింది. అసలైన విషయం అదే. నీవు దాన్ని ఆత్మజ్ఞానం అని ప్రస్తావించకుండా, మానవులు దేహత్యాగం చేసిన తర్వాత ఉండేది ఏమది అని ప్రశ్నించావు. నీవు అడిగినదే ఆత్మజ్ఞాన విషయం. ఆ ఆత్మజ్ఞానం పట్ల నీకున్న శ్రద్ధ లేదా నిష్ఠ ప్రశంసనీయం. అట్టి నీపట్ల దయకలిగిన వాడనై, ఆత్మ జ్ఞాన విశిష్టతను బోధించడానికి ఉపక్రమిస్తున్నాను. నీవంటి శ్రద్ధాళుపై ఉత్తమమైన విషయం గురించి సరియైన ప్రశ్నను లేవనెత్తే శిష్యుడు మాకు లభించడు.)

ప్రీతిచెందినవాడై, తిరిగి (యమదేవుడు) ఇలా అంటున్నాడు–

**జానామ్యహం శేవధిరిత్యనిత్యం**
**న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్ .**
**తతో మయా నాచికేతశ్చితోఽగ్ని-**
**రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్ .. 1-2-10 ..**

అనిత్యమైన వానిచే నిత్యమైనది ప్రాప్తించదు కనుక సంపద అనిత్యమని నాకు తెలుసు. (అలా తెలిసినప్పటికీ) అనిత్యమైన ద్రవ్యాలతో నచికేతాగ్నిని ఆరాధించి, సాపేక్షిక నిత్యమైన స్వర్గాన్ని పొందాను.

## శంకర భాష్యమ్

జానామ్యహం శేవధిః నిధిః కర్మఫలలక్షణః నిధిరివ ప్రార్థ్యత ఇతి . అసౌ అనిత్యం అనిత్య ఇతి జానామి . న హి యస్మాత్ అనిత్యైః అధ్రువైః యత్ నిత్యం ధ్రువం, తత్ ప్రాప్యతే పరమాత్మాఖ్యః శేవధిః. యస్త్వనిత్యసుఖాత్మకః శేవధిః, స ఏవానిత్యైర్ద్రవ్యైః ప్రాప్యతే హి యతః, తతః తస్మాత్ మయా జానతాపి నిత్యమనిత్యసాధనైః ప్రాప్యత ఇతి నాచికేతః చితః అగ్నిః అనిత్యైః ద్రవ్యైః పశ్వాదిభిః స్వర్గసుఖసాధనభూతోఽగ్నిః నిర్వర్తిత ఇత్యర్థః . తేనాహమధికారాపన్నో నిత్యం యామ్యం స్థానం స్వర్గాఖ్యం నిత్యమాపేక్షికం ప్రాప్తవానస్మి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'శేవధి'– నిధి, కర్మఫలముల రాశి; ఆ నిధి, 'అనిత్యమ్' (అనిత్యః) – శాశ్వతం కానిది; 'ఇతి'– అని; 'జానామ్యహమ్'– నాకు తెలుసు. ఎందువల్లనంటే, 'అధ్రువైః'– అశాశ్వతమైనవాటి ద్వారా; 'తత్'– ఆ; 'ధృవమ్'– శాశ్వతమైన తత్త్వం, పరమాత్మ అనబడే ఆ సంపదల నిధి; 'న ప్రాప్యతే'– పొందగలిగేది కాదు. అనిత్యమైన ద్రవ్యముల వల్ల అనిత్యమైన సుఖదాయక సంపదలరాశియే ప్రాప్తిస్తుంది. 'తతః'– కాబట్టి; 'మయా'– నాచే, శాశ్వతమైనది అనిత్యమైన సాధనాలతో పొందగలిగేది కాదని తెలియబడినప్పటికినీ; 'నాచికేతః అగ్నిః'– నాచికేతమనే పేరుగల అగ్నిని; 'అనిత్యైః ద్రవ్యైః'– అశాశ్వతమైన వాటిచే, అంటే పశువులు మొదలైన వాటిచే; 'చితః'– రగిల్చి, స్వర్గలోకాన్ని పొందేందుకు ఉద్దేశించిన యాగం నిర్వహించబడింది. ఆ విధంగా తగిన యోగ్యతను సంపాదించిన మీదట, 'నిత్యమ్'– శాశ్వతమైన అంటే, సాపేక్షిక శాశ్వతమైన స్వర్గమని పిలువబడే మృత్యుదేవతా స్థితిని; 'ప్రాప్తవాన్ అస్మి'– నేను సాధించాను.

(అశాశ్వతమైన సాధన సంపత్తిచే శాశ్వతమైన దానిని పొందటం సాధ్యంకాదు కనుక, కర్మ ఫలాలుగా ప్రోగుపడిన సంపదల రాశి శాశ్వతమైనది కాదని తెలుసు. కర్మలు చేసినందువల్ల కలిగే ఫలాలు అశాశ్వతాలు. అలాటి అశాశ్వతమైన అనేక ఫలాలను ప్రోగుచేసుకొన్నప్పటికీ, వాటి ద్వారా శాశ్వతమైన పరమాత్మ తత్త్వాన్ని పొందటమనేది కుదరదు. నాకు అలా తెలిసినప్పటికీ, నాచికేతాగ్నిని రగిల్చి, స్వర్గలోకాన్ని సాధించేందుకై అశాశ్వతమైన ద్రవ్యాలతో ఆహుతులు సమర్పిస్తూ అనేక యజ్ఞాలను నిర్వహించినందువల్ల కలిగిన యోగ్యతచే సాపేక్షిక నిత్యమైన స్వర్గలోకంలో మృత్యుదేవత అనే ఈ పదవిని సాధించాను అంటున్నాడు యమదేవుడు. నిత్యమంటే శాశ్వతమైనది. కాని స్వర్గలోకం సాపేక్షిక నిత్యం. అంటే నిత్యత్వం కానిదే కాని ఇతరాలతో పోలిస్తే నిత్యంలా భాసించేది.)

**కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం**
**క్రతోరనన్త్యమభయస్య పారమ్ .**
**స్తోమమహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా**
**ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః .. 1-2-11 ..**

**ఓ నచికేతా, కోరికల అంతిమత్వాన్ని, జగత్తు యొక్క ఆధారాన్ని, ధ్యానం కలిగించే అనంత ఫలాలనీ (వీటిని సాపేక్షికాలుగా భావించాలి), అభయం యొక్క ఆవలి తీరాన్ని, బృహత్తరమైనదాని పథాన్ని, పూజనీయమైన మహత్తత్త్వాన్ని, నీ స్థితిని ఓర్పుతో పరికించి చూసి వివేకంతో, వాటన్నింటినీ త్యజించావు.**

## శంకర భాష్యమ్

త్వం తు కామస్య ఆప్తిం సమాప్తిం , అత్ర హి సర్వే కామాః పరిసమాప్తాః, జగతః సాధ్యాత్మాధిభూతాధిదైవాదేః ప్రతిష్ఠాం ఆశ్రయం సర్వాత్మకత్వాత్ , క్రతోః ఉపాసనాయాః ఫలం హైరణ్యగర్భం పదం , అనంత్యం ఆనంత్యం , అభయస్య చ పారం పరాం నిష్ఠాం , స్తోమం స్తుత్యం మహత్ అణిమాద్యైశ్వర్యాద్యనేకగుణసంహతం , స్తోమం చ తన్మహచ్చ నిరతిశయత్వాత్ స్తోమమహత్ , ఉరుగాయం విస్తీర్ణాం గతిం , ప్రతిష్ఠాం స్థితిమాత్మనోఽనుత్తమామపి దృష్ట్వా ధృత్యా ధైర్యేణ ధీరః నచికేతః, ధీమాన్ బుద్ధిమాన్సన్ అత్యస్రాక్షీః పరమేవాకాంక్షన్నతిసృష్టవానసి సర్వమేతత్సంసారభోగజాతం . అహో బతానుత్తమగుణోఽసి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

కాని ఓ నచికేతా, నీవైతే 'కామస్య ఆప్తిమ్'– కోరికల యొక్క అంతాన్ని అంటే కోరిక అనేదే కలగని స్థితిని, సమస్తకోరికలు నిశ్శేషంగా ముగిసిన స్థాయిని; (ఇక్కడ హిరణ్యగర్భుని స్థితిని సూచిస్తోంది. కోరిక హిరణ్యగర్భునికి అతీతమైన స్థితికి చేర్చదు. అది హిరణ్యగర్భుని స్థితివరకే కోరిక పరిమితమౌతుంది); 'జగతః'– ఆధ్యాత్మ, ఆధిభూత, ఆధిదైవములకు; 'ప్రతిష్ఠామ్'– ఆశ్రయం లేదా సర్వవ్యాపకత్వం చేత ఆధారమైనదానిని (అనగా హిరణ్యగర్భతత్త్వాన్ని ); 'క్రతోః'– ఉపాసనల (హిరణ్యగర్భుని ఉపాసనల) యొక్క ఫలమైన (సాపేక్షికంగా అనంతత్వమైన) హిరణ్యగర్భపదవిని (ఇది బాలగోపాలేన్ద్రుని అనువాద ప్రకారం. ఇతరులు క్రతోః పదానికి యజ్ఞములనే అర్థాన్ని తీసుకొన్నారు); 'అనన్త్యమ్' ('ఆనన్త్యమ్') –అంతమనేదే లేని అనంతత్వాన్ని; 'అభయస్య'– నిర్భయత్వం యొక్క; 'పారమ్'– ఆవలి తీరాన్ని, 'స్తోమమ్'– కీర్తనీయమైనది మరియు 'మహత్'–గొప్పది, అణిమాది ఐశ్వరాలవంటి అనేక దైవీసంపదలు సమృద్ధిగా గలది, అతిశయించరాని కీర్తి, గొప్పదనం కలదానిని 'స్తోమ-మహత్' అంటారు. అటువంటిదానిని, 'ఉరుగాయమ్'– బృహత్తరమైన విస్తీర్ణత గల (హిరణ్యగర్భుని స్థితిని) దాన్ని; 'ప్రతిష్ఠామ్'– నీ అస్తిత్వ స్థితికి మించినదైనప్పటికినీ ; 'ధృత్యా'– ఓర్పుతో; 'దృష్ట్వా'– పరిశీలించిన మీదట; 'ధీరః'– వివేకవంతుడవై; 'అత్యస్రాక్షీః'– నిరాకరించావు, పరముపై మాత్రమే కోరిక కలిగి ఈ సకల ప్రాపంచిక భోగాలను సమస్తాన్నీ (హిరణ్యగర్భుని స్థాయి వరకు కల భోగములన్నింటినీ) త్యజించావు. ఆహా, ఎంతటి ఉత్తమగుణము కలిగిన వాడివి నీవు!

(నచికేతుని ఉత్తమగుణాలని గుర్తించిన వాడై యమదేవుడు ఇంకా ఇలా అంటున్నాడు. నచికేతా నీవు కోరికలు ముగిసిన స్థాయిని పొందినవాడివి. ఎందుకంటే, హిరణ్యగర్భ తత్త్వాన్ని అవగాహన చేసుకొని ఆస్థాయిని అధిగమించినవానికి కోరిక అనేదే జనించదు. అన్ని కోరికలకు అతీతమైన ఉన్నత స్థితి అది. సర్వజగత్తును అంటే ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవికములైన సర్వస్వాన్ని వ్యాపించి, దానికి ఆధారభూతమైనది హిరణ్యగర్భత్వం. అంతమనేదే లేని, నిర్భయానికి ఆవలితీరమైన, అణిమాది అష్టైశ్వర్య సంపదలు కలిగి, దానికి మించినది మరొకటి ఏదీలేని, విస్తీర్ణతలో బృహత్తరమైనట్టి హిరణ్యగర్భత్వాన్నే ఉపాసనా ఫలంగా పొంది, నీ అస్తిత్వానికి అతీతమైన అట్టి స్థితిని ఓర్పుతో పరిశీలించి, వివేకవంతుడవై నిరాకరించావు. అంటే, చిన్ని చిన్ని కోరికలనుండి హిరణ్యగర్భుని స్థాయి వరకూ ఉన్నటువంటి కోరికల సమూహాన్నంతటినీ నీవు త్యాగం చేశావు. ఏ కారణంతో అలా చేశావంటే, ఈ సమస్త కోరికలూ అశాశ్వతాలని గ్రహించిన మీదట, ఏదైనా కోరితే శాశ్వతమైన దానినే కోరాలనే ఆకాంక్షతో, అలాంటి

శాశ్వతమైన పరమ తత్త్వాన్ని తెలుసుకోవాలనే ఏకైక లక్ష్యంతో, మిగిలిన అన్ని కోరికలనూ విడిచిపెట్టావు. ఇక్కడ మనం ఒక విషయాన్ని చాలా జాగ్రత్తగా గమనించాలి. అదేమంటే, అన్నిటికంటే అత్యున్నతమైన దానిని కోరి అంతకంటే తక్కువ స్థాయి కలవాటిని వదిలి పెట్టటం వంటిది కాదు. ఈ తక్కువ స్థాయి ఫలాలను జాగ్రత్తగా పరిశీలించి వాటి నిత్యత్వం సాపేక్షికమైనదని తెలుసుకొని తృణీకరించడం నచికేతునిలో యమదేవుడు గ్రహించిన ఔన్నత్యం. దానిని బట్టే నీవెంతటి ఉత్తమగుణ సంపన్నుడవో తెలుస్తోంది అని నచికేతునితో అన్నాడు యమదేవుడు.)

**తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం**
**గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ .**
**అధ్యాత్మయోగాధిగమేన దేవం**
**మత్వా ధీరో హర్షశోకౌ జహాతి .. 1-2-12 ..**

అది దర్శింప శక్యంగాని, చేరుటకు వీలులేని, బుద్ధిలో దాగి, అనర్థాల మధ్యనున్నట్టి, పురాతనమైనది. ఆ దివ్యత్వాన్ని ధ్యానించి, చిత్తాన్ని బాహ్యవిషయాలనుండి విరమింపచేసి ఆత్మయందు ఏకాగ్రంచేసిన వివేకవంతుడు సుఖదుఃఖాలను వదలివేస్తాడు.

## శంకర భాష్యమ్

యం త్వం జ్ఞాతుమిచ్ఛస్యాత్మానం తం దుర్దర్శం దుఃఖేన దర్శనమస్యేతి దుర్దర్శః అతిసూక్ష్మత్వాత్ తం , గూఢం గహనం , అనుప్రవిష్టం ప్రాకృతవిషయవిజ్ఞానైః ప్రచ్ఛన్నమిత్యేతత్ . గుహాహితం గుహాయాం బుద్ధౌ హితం నిహితం స్థితం తత్రోపలభ్యమానత్వాత్ . గహ్వరేష్ఠం గహ్వరే విషమే అనేకానర్థసంకటే తిష్ఠతీతి గహ్వరేష్ఠం . యత ఏవం గూఢమనుప్రవిష్టో గుహాహితశ్చ, అతోఽసౌ గహ్వరేష్ఠః ; అతో దుర్దర్శః . తం పురాణం పురాతనం అధ్యాత్మయోగాధిగమేన విషయేభ్యః ప్రతిసంహృత్య చేతస ఆత్మని సమాధానమధ్యాత్మయోగః తస్యాధిగమః ప్రాప్తిః తేన మత్వా దేవం ఆత్మానం ధీరః హర్షశోకౌ ఆత్మన ఉత్కర్షాపకర్షయోరభావాత్ జహాతి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఏదైతే నీవు తెలియగోరుతున్నావో, 'తం'– అది; 'దుర్దర్శమ్'– చూడ కష్టమైనది, చాలా సూక్ష్మమైనదైనందున; అది 'అనుప్రవిష్టమ్'– లౌకికవిషయ జ్ఞానముల చేత కప్పబడి; 'గూఢమ్'– అందుకొన వీలులేనిది; 'గుహాహితమ్'– బుద్ధియందు ఉన్నది లేదా దాగియున్నది, అక్కడ అది తెలియబడుతోంది కనుక; 'గహ్వరేష్ఠమ్'– అనేక తీవ్రమైన అనర్థసంకటాల నడుమ ఉన్నది, దేహేంద్రియాలే అనేక సంకటాలకు మూలం. అది లౌకికమైన విషయాలకు సంబంధించిన విజ్ఞానంచేత కప్పబడి యున్నందున, బుద్ధియే దాని స్థానమైనందున, అది విషమ పరిస్థితుల మధ్యలో ఉన్నట్లే. అందుచేతనే, చూడ కష్టమైనది. 'అధ్యాత్మయోగాధిగమేన'–చిత్తాన్నివిషయానుభవాలనుండి ఉపసంహరించి ఆత్మయందు ఏకాగ్రం చేయడాన్ని అధ్యాత్మయోగం అంటారు, అట్టి ఏకాగ్రతను సాధించి; 'పురాణమ్'– పురాతనమైన;

'దేవమ్'– ఆత్మను; 'మత్వా'– ధ్యానించే; 'ధీరః'– వివేకవంతుడు; 'హర్షశోకౌ'– సుఖాన్ని, దుఃఖాన్ని; 'జహాతి'– వదిలేస్తాడు. ఎందుకంటే హర్షమువల్ల ఉత్సాహంగాని, శోకం వల్ల ఉద్వేగంగాని ఆత్మకు లేనందువల్ల.

(యమదేవుడు ఇంకా ఇలా అంటున్నాడు. నచికేతా నీవు దేనినైతే తెలుసుకోవాలని కోరావో, ఆ ఆత్మ అతిసూక్ష్మమైనందున దర్శింప వీలుకాదు. లౌకిక విషయాల గురించిన విజ్ఞానాల చేత మరుగుపడినందువల్ల, ఆత్మ అందుకోవడానికీ కుదరదు. బుద్ధికి మాత్రం గోచరిస్తున్నందువల్ల బుద్ధిలోనే దాగియున్నట్లు భావించాలి. అది సమస్త సంసార దుఃఖాలకు మూలమైనట్టి దేహేంద్రియ సంఘాతం మధ్యలో ఉన్నటువంటిది. ఎవరైతే విషయాలనుండి మనసును విముఖం చేసి, సనాతనమైన ఆ ఆత్మయందు చిత్తాన్ని ఏకాగ్రం చేస్తారో వారు వివేకవంతులు. అటువంటి వారి చిత్తం ఆత్మభావనలో నిమగ్నం కావడం చేత, హర్షం కలిగించే విషయాలేవీ వారికి అత్యుత్సాహాన్ని కలిగించవు. అలాగే శోకం కలిగించే విషయాలేవీ కూడా నిరాశను లేదా దుఃఖాన్ని కలిగించవు. ఎందుకంటే, సుఖదుఃఖాలనేవే ఉండని ఆత్మ భావనలో మనస్సు నిమగ్నమైనందువలన వారు శోకమోహాల పట్ల నిర్లిప్తంగా ఉంటారు.)

**ఏతచ్ఛ్రుత్వా సమ్పరిగృహ్య మర్త్యః**
**ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య .**
**స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా**
**వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే .. 1-2-13 ..**

ఇదంతా విని, సమగ్రంగా అవగాహన చేసుకొన్న మర్త్యుడు (మానవుడు) సూక్ష్మమైన ఈ ధర్మాన్ని దేహానికి వేరైనదిగా గుర్తించి, పొంది, ఆనందానికి హేతువైనదాన్ని పొందానని ఆనందిస్తాడు. అట్టి ఆనంద సదనం నచికేతునికి తెరువబడిందని తలుస్తున్నా.

## శంకర భాష్యమ్

కించ, ఏతదాత్మతత్త్వం యదహం వక్ష్యామి, తచ్ఛ్రుత్వా ఆచార్యసకాశాత్ సమ్యగాత్మభావేన పరిగృహ్య ఉపాదాయ మర్త్యః మరణధర్మా ధర్మాదనపేతం ధర్మ్యం ప్రవృహ్య ఉద్యమ్య పృథక్కృత్య శరీరాదేః అణుం సూక్ష్మం ఏతం ఆత్మానం ఆప్య ప్రాప్య సః మర్త్యః విద్వాన్ మోదతే మోదనీయం హి హర్షణీయమాత్మానం లబ్ధ్వా . తదేతదేవంవిధం బ్రహ్మ సద్మ భవనం నచికేతసం త్వాం ప్రత్యపావృతద్వారం వివృతం అభిముఖీభూతం మన్యే, మోక్షార్హం త్వాం మన్యే ఇత్యభిప్రాయః ..

ఏతచ్ఛ్రుత్వా నచికేతాః పునరాహ — యద్యహం యోగ్యః, ప్రసన్నశ్చాసి భగవన్ మాం ప్రతి

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, 'ఏతత్'–ఈ ఆత్మతత్త్వం అంతా, ఏదైతే నేను బోధింపబోతున్నానో దానిని; 'శ్రుత్వా'– గురువు అనుగ్రహంతో విని; 'సమ్పరిగృహ్య'– అది తన ఆత్మయేనని బాగుగా అవగాహన చేసుకొన్న; 'మర్త్యః'– మృతిధర్మం కల

మానవుడు; 'ధర్మ్యమ్'–సరియైనదానిని (ఉత్తమమైనదానిని, ఆత్మను); 'ప్రవృహ్య'– దేహాదులకు వేరైనదిగా విడదీసి; 'ఏతమ్ అణుమ్'– ఈ సూక్ష్మతమమైన దానిని; 'ఆప్య'– పొందిన (దానిని సాధించిన); 'సః'–అతడు, ఆ మానవుడు, విద్వాంసుడు; 'మోదనీయమ్'– ఆనంద హేతువైన ఆత్మను; 'లబ్ధ్వా'– కలిగినవాడై; 'మోదతే'– హర్షిస్తాడు. అలాంటిదైనట్టి ఈ 'సద్మ'– బ్రహ్మ సదనం; యొక్క ద్వారం తెరువబడి 'నచికేతసమ్'– నచికేతా నీకై; 'వివృతమ్'– ఎదురుగా నిలచియున్నదని; 'మన్యే'– తలుస్తా. అంటే, నీవు మోక్షమునకు అర్హుడవని భావిస్తా అని అభిప్రాయం.

(యమదేవుడు ఇంకా ఇలా అంటున్నాడు. నాచేత చెప్పబడబోయే ఈ ఆత్మతత్త్వాన్ని గురువు అనుగ్రహంతో విని, కూలంకషంగా అవగాహన తెచ్చుకొన్న మానవుడు, ఈ ఉత్తమమైన ఆత్మ దేహాదులకు వేరైనటువంటిదని గ్రహించి, అత్యంత సూక్ష్మమైన అద్దానిని పొందుతాడు. దేహంతో మిళితమై ఉన్న ఆత్మను ఆ దేహానికి భిన్నమైనదిగా గ్రహించి దానిని దేహాదులనుండి ముంజగడ్డినుండి విడదీసినట్లుగా సాధకుడు జాగ్రత్తగా విడదీయాలని సూచిస్తున్నారు ఇక్కడ. అలాంటి వివేకవంతుడు, ఆనందానికి హేతువైనట్టి ఆత్మను పొందినందువల్ల ఆనందాన్ని అనుభవిస్తాడు. నీకు నేను అటువంటి ఉపదేశం చేయబడబోతున్నాను. కాబట్టి, అటువంటి విశిష్టమైన బ్రహ్మ నివాసపు ద్వారాలు నచికేతా నీకై తెరువబడి ఉన్నాయి అని కవితాత్మకంగా యమదేవుడు నచికేతుడిని ప్రశంసిస్తూ, నీ ప్రవేశానికి అవి ఎదురు చూస్తున్నాయి అంటున్నాడు. అంటే, నచికేతా నీవు ఆత్మజ్ఞానానికి అర్హత కలిగి ఉన్నావు అని అభిప్రాయం.)

ఈ చెప్పినదంతా విన్న నచికేతుడు తిరిగి ఇలా అంటున్నాడు. నేను యోగ్యుడనైతె మరియు భగవాన్ నీవు నా పట్ల ప్రీతి చెందితే,

**అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మా-**
**దన్యత్రాస్మాత్కృతాకృతాత్ .**
**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ**
**యత్తత్పశ్యసి తద్వద** **..1-2-14 ..**

ధర్మానికి, అధర్మానికి వేరైనదిగా, కారణానికి కార్యానికి భిన్నమైనదిగా, భూత భవిష్యత్తులకు వేరైనదిగా దేనినైతే నీవు దర్శించావో దానిని బోధించు.

### శంకర భాష్యమ్

అన్యత్ర ధర్మాత్ శాస్త్రీయాద్ధర్మానుష్ఠానాత్తత్ఫలాత్తత్కారకేభ్యశ్చ పృథగ్భూతమిత్యర్థః . తథా అన్యత్ర అధర్మాత్ విహితాకరణరూపాత్ పాపాత్ , తథా అన్యత్రాస్మాత్కృతాకృతాత్ , కృతం కార్యమకృతం కారణమస్మాదన్యత్ర . కించ, అన్యత్ర భూతాచ్చ అతిక్రాంతాత్కాలాత్ భవ్యాచ్చ భవిష్యతశ్చ తథా అన్యత్ర వర్తమానాత్ . కాలత్రయేణ యన్న పరిచ్ఛిద్యత ఇత్యర్థః . యదీదృశం వస్తు సర్వవ్యవహారగోచరాతీతం పశ్యసి జానాసి తద్వద మహ్యం ..

ఇత్యేవం పృష్టవతే మృత్యురువాచ, పృష్టం వస్తు విశేషణాంతరం చ వివక్షన్ .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అన్యత్ర ధర్మాత్'– ధర్మానికి భిన్నమైనది, అంటే శాస్త్రవిహిత కర్మానుష్ఠానాలు, వాటి ఫలితాలు, వాటికి సంబంధించిన సాధనాలకు భిన్నమైనదని అర్థం. అలాగే, 'అన్యత్ర అధర్మాత్'– అధర్మానికి భిన్నమైనది, విహితం కాని కర్మల రూపానికి అంటే పాపానికి భిన్నమైనది. అలాగే, 'అన్యత్రాస్మాత్కృతాకృతాత్'– కృత మనగా కార్యము, అకృతమనగా కారణము, ఈ రెండింటికి వేరైనది. మరింకా, 'అన్యత్ర భూతాత్ చ భవ్యాత్ చ'– గడచినకాలమునకు, భవిష్యత్కాలమునకు వేరుగా అలాగే వర్తమానానికి కూడా వేరుగా నున్నది. అంటే మూడు కాలముల యొక్క పరిచ్ఛేదము లేనిదని అర్థం. 'యత్'– సర్వ లౌకిక వ్యవహార పరిధికి అతీతమైనట్టిదైన అది ఏదైతే 'పశ్యసి'– నీవు దర్శించావో, తెలుసుకొన్నావో; 'తత్'– దానిని; నా కొరకు 'వద'– చెప్పు.

(నచికేతుడు ఇలా అంటున్నాడు. ఓ యమదేవా,లౌకిక వ్యవహారాలకు భిన్నమైన ఏ ఆత్మతత్త్వాన్నైతే నీవు దర్శించావో దానిని నాకు ఉపదేశించు. అంటే, శాస్త్రములో చెప్పబడిన కర్మానుష్ఠానాలకు వాటి వల్ల కలిగే ఫలితాలకు వేరైనటువంటిది, నిషిద్ధ కర్మలకు, వాటి ఆచరణ వల్ల కలిగే పాపాలకు కూడా భిన్నమైనట్టిది, అలాగే కార్య-కారణ స్వరూపాలకు కూడా భిన్నమైనదీ మరియు భూత-భవిష్యత్-వర్తమాన కాలాలకు అతీతమైనట్టిది అనగా కాల పరిచ్ఛేదము లేనట్టిదీ ఆత్మతత్త్వం అని అన్నావు. అటువంటి ఆత్మతత్త్వాన్ని ఏదైతే నీవు దర్శించి తెలుసుకొన్నావో దానిని నాకు చెప్పవలసిందని నచికేతుడు అడిగాడు. వరంగా కోరుకొన్నప్పుడు నచికేతుడు ప్రాణులు మరణించిన తర్వాత అది ఏదో ఉన్నదని కొందరు లేదని కొందరు అంటుంటారు. దాని గురించి నాకు తెలియచెప్పు అని సాధారణ మానవుడు అడిగినట్లుగా అడిగాడు. ఆ తరువాత యమదేవుడు ఆత్మతత్త్వాన్ని కొంత బోధించిన మీదట శ్రద్ధగా గ్రహించిన నచికేతుడు ఇప్పుడు ఆత్మ కాల-దేశ అవధులకు ఆవలి విషయమని గ్రహించి, ఆ ఆత్మతత్త్వాన్ని బోధించని కొంత స్పష్టమైన ప్రశ్నను యమదేవుని ముందు ఉంచుతున్నాడు. నచికేతుడు బోధించబడుతున్న విషయంలో ఎంతటి శ్రద్ధను చూపి పరిణితిని చెందుతున్నాడో అలాగే సాధకులు కూడా తాము అధ్యయనం చేస్తున్న విషయాన్ని అంతే శ్రద్ధగా గ్రహించి తత్త్వం పట్ల అవగాహనను పెంచుకోవాలి. ఇంకొక విషయమేమంటే అది ఉన్నదా లేదా అన్న తొలి ప్రశ్నలోని సంశయత్వం మలిప్రశ్నలో తొలగిపోయింది. అది సాధన పురోగతి చెందుతోందన్నదానికి సూచన. అంటే సాధన పురోగమిస్తుంటే సంశయాలు క్రమ క్రమంగా తొలగిపోతాయని గ్రహించాలి. అలా పరిణితి చెందిన బుద్ధితో నచికేతుడు యమదేవుడిని ఆత్మతత్త్వాన్ని ఉపదేశించమని కోరుతున్నాడు.)

(నచికేతునిచే) ఇలా ప్రశ్నించబడిన మీదట, ప్రశ్నించిన విషయాన్ని, దాని విశిష్టతలతో సహా వివరించే ఉద్దేశ్యంతో యమదేవుడు ఇలా అంటున్నాడు.

**సర్వే వేదా యత్పదమామనన్తి**

**తపాగ్ంసి సర్వాణి చ యద్వదన్తి .**

**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి**

**తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్** .. 1-2-15 ..

ఏ పదాన్ని (స్థితిని) సర్వ వేదాలు ప్రతిపాదిస్తున్నాయో, సర్వ తాపసులు దేనిని వచిస్తున్నారో, దేనిని కోరి జనులు బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నారో, ఆ పదాన్ని (స్థితిని) సంగ్రహంగా 'ఓం' అని చెప్తున్నాను.

## శంకర భాష్యమ్

సర్వే వేదా యత్పదం పదనీయం గమనీయం అవిభాగేన అవిరోధేన ఆమనంతి ప్రతిపాదయంతి, తపాంసి సర్వాణి చ యద్వదంతి యత్ప్రాప్త్యర్థానీత్యర్థః . యదిచ్ఛంతో బ్రహ్మచర్యం గురుకులవాసలక్షణమన్యద్వా బ్రహ్మప్రాప్త్యర్థం చరంతి, తత్ తే తుభ్యం పదం యజ్జ్ఞాతుమిచ్ఛసి సంగ్రహేణ సంక్షేపతః బ్రవీమి ఓం ఇత్యేతత్ . తదేతత్పదం యద్బుభుత్సితం త్వయా తదేతదోమితి ఓంశబ్దవాచ్యమోంశబ్దప్రతీకం చ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'సర్వే వేదా'– సకల వేదములు వివిధత్వం విరోధత్వం ఏమీ లేకుండా; 'యత్ పదమ్'– ఏ పొందతగినదానిని, లక్ష్యమైనదానిని; 'ఆమనన్తి'– ప్రతిపాదిస్తున్నాయో; 'చ'– మరియు; 'తపాంసి సర్వాణి'– సమస్త తాపసులు; 'యత్ వదన్తి'– దేనిని వచిస్తున్నారో, అంటే దేని ప్రాప్తికై తహతహ లాడుతున్నారో; 'యత్ ఇచ్ఛన్తః'– దేనిని అభిలషించి; 'బ్రహ్మచర్యమ్'– (విద్యాభ్యాసం కోసం) గురుకులంలో నివసించడం లాంటిది లేదా బ్రహ్మమును పొందేందుకు ఇతర విధానమేదైనా కాని (జీవితాంతం బ్రహ్మచర్యాన్ని పాటించడం లాంటివి); 'చరన్తి'– అభ్యసిస్తున్నారో; 'తత్'– ఆ; 'పదమ్'– తత్త్వం, నీవు తెలుసుకోవాలనుకొంటున్న ఆ తత్త్వం; 'సంగ్రహేణ'– క్లుప్తంగా; 'ఓమ్ ఇతి ఏతత్'–'అది ఓం అని; 'బ్రవీమి'– చెప్తున్నాను. దేనిని నీవు తెలుసుకోవాలనుకొన్నావో అది 'ఓం' అనే శబ్దంతో సూచింపబడుతోంది. 'ఓం' అనేది ఆ తత్త్వానికి చిహ్నం లేదా ప్రతీక.

(యమదేవుడు ఇలా నచికేతునితో అంటున్నాడు. వేదాలన్నీ భిన్నాభిప్రాయాలు లేకుండా, ముక్త కంఠంతో పరమతత్త్వాన్ని, పరమలక్ష్యమైనదాన్ని ప్రతిపాదిస్తున్నాయి. మహర్షులంతా ఆ పరమతత్త్వాన్ని సాధించాలని నిరంతరంగా తపించి పోతున్నారు. అలాగే, ఆ పరమలక్ష్యాన్ని పొందాలనే ఎందరో జీవితాంతం బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నారు. నీవు తెలుసుకోవాలనుకొంటున్నది కూడా ఆ పరమతత్త్వాన్నే. ఆ పరమతత్త్వం 'ఓం' అనే శబ్దం చేత సూచింపబడుతోంది. 'ఓం' పదమే దానికి ప్రతీక లేదా చిహ్నం.

ఒక పదాన్ని ఉచ్చరించడం చేత ఏ విషయం స్ఫురణకు (మనసులో స్ఫురిస్తుందో) వస్తుందో, ఆ విషయానికి ఆ పదం ఆధారం, సూచిక లేదా చిహ్నం. అలాగే, ఇతర విషయాలతో సంగం లేకుండా ఏకాగ్రచిత్తుడైన వానికి ఓం పదాన్ని ఉచ్చరించడం వల్ల జ్ఞానం తనంత తానుగా గోచరిస్తుంది కనుక, ఆ జ్ఞానం ఓం పదంపై ఆధారితమైనట్లు, ఓం పదం చేత సూచింపబడుతున్నట్లు. అంటే ఇలా ధ్యానించాలి, "నేను ఓం పదం చేత సూచింపబడుతూ, సత్వగుణ ప్రధానమైన మాయ చేత నియంత్రింపబడే బ్రహ్మాన్ని" అని. ఒకవేళ అలా చేయలేకపోతే, ఓం చిహ్నం మీద బ్రహ్మమనే

ఆలోచనను అధ్యాసచేయాలి. ఉత్తముడు బ్రహ్మమును ఓం ప్రమేయం లేకుండానే విచారించ గలడు. మధ్యముడు ఓం సహాయంతో బ్రహ్మాన్ని ధ్యానిస్తాడు. అధముడు బ్రహ్మాన్ని ఓం చిహ్నంలో ఆరాధిస్తాడు.)

**ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ .**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ .. 1-2-16 ..**

నిశ్చయంగా ఈ అక్షరమే (సగుణ) బ్రహ్మ. ఈ అక్షరం (నిర్గుణ) బ్రహ్మమనేది నిశ్చితం. ఈ అక్షరాన్ని ధ్యానించిన వాడు, ఈ రెంటిలో దేనిని కోరితే దానిని పొందటం నిశ్చయం.

## శంకర భాష్యమ్

అతః ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ అపరం ఏతద్ధ్యేవాక్షరం పరం చ . తయోర్హి ప్రతీకమేతదక్షరం . ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా ఉపాస్య బ్రహ్మేతి యో యదిచ్ఛతి పరమపరం వా తస్య తత్ భవతి . పరం చేత్ జ్ఞాతవ్యం , అపరం చేత్ ప్రాప్తవ్యం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏతత్ హి ఏవ అక్షరమ్ బ్రహ్మ'– ఈ అక్షరం నిశ్చయంగా (సగుణ) బ్రహ్మ లేదా అపర బ్రహ్మ లేదా హిరణ్యగర్భతత్త్వం. 'ఏతత్ హి ఏవ అక్షరమ్ పరమ్'– ఈ అక్షరం (నిర్గుణ) బ్రహ్మ లేదా పరబ్రహ్మ. ఈ రెండింటికినీ, ఓం అక్షరం ప్రతీక లేదా చిహ్నం. 'యః'– ఎవడైతే; 'ఏతత్ హి ఏవ అక్షరమ్'– ఈ ఓం అక్షరమే బ్రహ్మమని ఉపాసిస్తాడో, అతడు ఈ పరబ్రహ్మ మరియు అపరబ్రహ్మ అన్న రెండింటిలో, 'యదిచ్ఛతి'– ఏది కోరితే; 'తత్ తస్య'– అది తానే అవుతాడు. పరబ్రహ్మ అయితే తెలియబడుతుంది, అపరబ్రహ్మ అయితే పొందబడుతుంది.

(బ్రహ్మము రెండు విధాలు. మొదటిది సగుణ బ్రహ్మ అంటే గుణములు కలిగిన బ్రహ్మ. దీనినే అపర బ్రహ్మ లేదా హిరణ్యగర్భతత్త్వం అంటారు. రెండవది పరబ్రహ్మ. ఇది అసలైన మూల తత్త్వం. ఈ పరమాత్మ తత్త్వంలో (పరబ్రహ్మ తత్త్వంలో) ఎటువంటి విశేషణాలు, గుణాలు ఉండవు. పరబ్రహ్మ తత్త్వం కన్నా అపరబ్రహ్మతత్త్వం కొంత తక్కువ స్థాయిది. అయితే, ఈ రెండింటికీ ఓం అక్షరమే ప్రతీక. ఈ ఓంకారాన్ని ఉపాసించిన సాధకుడు, పరబ్రహ్మతత్త్వం అపరబ్రహ్మతత్త్వములలో ఏది కోరితే దానిని పొందుతాడు. అయితే ఇక్కడ చిన్న తేడా గమనించాలి. పరబ్రహ్మ తత్త్వమనేది జ్ఞాన రూపం కాబట్టి, అది తెలియబడుతుంది లేదా అనుభవానికి వస్తుంది. అపరబ్రహ్మ తత్త్వమనేది పొందబడుతుంది.)

**ఏతదాలమ్బనగ్ం శ్రేష్ఠ మేతదాలమ్బనం పరమ్ .**
**ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే .. 1-2-17 ..**

(బ్రహ్మప్రాప్తికి ఉపకరించే) ఆలంబనాలలో ఈ ఆలంబనమే (ఓం కారము) శ్రేష్ఠం. ఈ ఆలంబనం (పర మరియు అపర) బ్రహ్మసాధ్యం. ఈ ఆలంబనాన్ని ధ్యాన్నిస్తే బ్రహ్మలోకంలో ఆరాధనీయుడౌతాడు.

## శంకర భాష్యమ్

యత ఏవం , అత ఏవ ఏతత్ బ్రహ్మప్రాప్త్యాలంబనానాం శ్రేష్ఠం ప్రశస్యతమం . ఏతదాలంబనం పరం అపరం చ, పరాపరబ్రహ్మవిషయత్వాత్ . ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే . పరస్మిన్బ్రహ్మణ్యపరస్మింశ్చ బ్రహ్మభూతో బ్రహ్మవదుపాస్యో భవతీత్యర్థః ..

అన్యత్ర ధర్మాదిత్యాదినా పృష్టస్యాత్మనోఽశేషవిశేషరహితస్యాలంబనత్వేన ప్రతీకత్వేన చోంకారో నిర్దిష్టః అపరస్య చ బ్రహ్మణో మందమధ్యమప్రతిపత్తౄన్ప్రతి . అథేదానీం తస్యోంకారాలంబనస్యాత్మనః సాక్షాత్స్వరూపనిర్దిధారయిషయేదముచ్యతే .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

అందుచేత, బ్రహ్మమును పొందేందుకు కల అన్ని ఆధారాలలో (గాయత్రి వంటి వాటిలో) 'ఏతత్ ఆలమ్బనమ్'– ఈ ఆధారము; 'శ్రేష్ఠమ్'– ఉన్నతమైనది, శ్లాఘించతగినది. 'ఏతత్ ఆలమ్బనమ్'– ఈ ఆధారం; 'పరమ్'– పరబ్రహ్మమునకు, అలాగే అపర బ్రహ్మమునకు కూడా సంబంధించినది. 'ఏతత్ ఆలమ్బనమ్'– ఈ ఆధారాన్ని; 'జ్ఞాత్వా'– ధ్యానించిన మీదట; 'బ్రహ్మలోకే మహీయతే'– బ్రహ్మలోకమునందు ఆరాధింపబడతాడు. అభిప్రాయమేమంటే, (అట్టి ధ్యాన ఫలితంగా) పరబ్రహ్మగాను లేదా అపరబ్రహ్మగానూ తాదాత్మ్యతను పొంది, బ్రహ్మవలె ఆరాధింపబడతాడని అర్థం.

ధర్మానికి, అధర్మానికి అన్యమైనది ... అని ప్రశ్నింపబడిన ఆత్మ అన్ని విశేషములు వర్జించినదైనందు వల్ల, మధ్యమ, అధమాధికారులైన సాధకులకు ఓంకారం ఆలమ్బనంగాను (ధ్యానమునకు) మరియు చిహ్నం లేదా ప్రతీకగాను (ఆరాధించేందుకు) నిర్దేశించబడింది. మరియు, అలాగే అపరబ్రహ్మము విషయంలో కూడా, మధ్యమ, అధమాధికారులైన సాధకులకు అదే విధంగా నిర్దేశింపబడింది.

(బ్రహ్మన్ని పొందేందుకు ఉపకరించే అనేక మాధ్యమాలున్నాయి. ఓంకారం, గాయత్రీ మంత్రం, మొదలైనవి. అటువంటి వాటన్నింటిలోకీ ఓంకారమే ఉన్నతమైనది, ఉత్తమమైనదిగా పరిగణిస్తారు. ఈ ఓంకారాన్ని మాధ్యమంగా చేసుకొని, నిర్గుణ బ్రహ్మన్ని లేదా సగుణ బ్రహ్మన్ని పొందే అవకాశం ఉంది. ఈ ఓంకారాన్ని అధారం చేసుకొని నిర్గుణ బ్రహ్మం గురించి విచారణ చేసిన సాధకుడు నిర్గుణ పరబ్రహ్మమే అవుతాడు. అలాగే, ఈ ఓంకారాన్ని ఆధారం చేసుకొని సగుణ బ్రహ్మన్ని ఉపాసిస్తే, సాధకుడు సగుణ అపరబ్రహ్మమౌతాడు. పరబ్రహ్మమైనా, అపరబ్రహ్మమైనా బ్రహ్మలోకంలో బ్రహ్మముగానే పూజనీయుడౌతాడని అభిప్రాయం.

పరబ్రహ్మ విషయంలో ఎలాగైతే ఈ ఓంకారము మధ్యమాధికారులకు ధ్యానంలోనూ మందాధికారులకు ఉపాసనలోనూ ఆలంబనంగానూ ఉంటుందో, అలాగే అపరబ్రహ్మ విషయంలో కూడా ఈ ఓంకారమే మధ్యమ,

మందాధికారులకు ఆధారమూ, ఆలంబనమూ అవుతోంది. ఓంకారమే పరబ్రహ్మ సాధనకు, అపరబ్రహ్మ సాధనకు కూడా ఆలంబనమని అర్థం.)

ఇక, ఓంకారం ఆలంబనంగా గల ఆత్మయొక్క సాక్షాత్స్వరూప నిర్ధారణ చేసేందుకై ఇలా చెప్పబడుతోంది.

**న జాయతే మ్రియతే వా విపశ్చి-**
**న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ .**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే .. 1-2-18 ..**

మేధ (ఆత్మ) జన్మించేది కాదు, మరణించేది కాదు. దేనినుండీ ఉద్భవించేది కాదు, ఏదీ దాని నుండి ఉద్భవించదు. పుట్టుకలేని, నిత్యమైన, శాశ్వతమైనట్టిది అది పురాతనం. శరీరం చంపబడినా దాని కెట్టి గాయమూ కాదు.

## శంకర భాష్యమ్

న జాయతే నోత్పద్యతే మ్రియతే వా న మ్రియతే చ ఉత్పత్తిమతో వస్తునోఽనిత్యస్యానేకా విక్రియాః, తాసామాద్యంతే జన్మవినాశలక్షణే విక్రియే ఇహాత్మని ప్రతిషిధ్యేతే ప్రథమం సర్వవిక్రియాప్రతిషేధార్థం న జాయతే మ్రియతే వేతి . విపశ్చిత్ మేధావీ అపరిలుప్తచైతన్యస్వభావత్వాత్ . కించ, నాయమాత్మా కుతశ్చిత్ కారణాంతరాత్ బభూవ న ప్రభూతః . అస్మాచ్చాత్మనో న బభూవ కశ్చిదర్థాంతరభూతః . అతోఽయమాత్మా అజో నిత్యః శాశ్వతః అపక్షయవివర్జితః . యో హ్యశాశ్వతః, సోఽపక్షీయతే ; అయం తు శాశ్వతః అత ఏవ పురాణః పురాపి నవ ఏవేతి . యో హ్యవయవోపచయద్వారేణాభినిర్వర్త్యతే, స ఇదానీం నవః, యథా కుడ్యాదిః ; తద్విపరీతస్త్వాత్మా పురాణో వృద్ధివివర్జిత ఇత్యర్థః . యత ఏవం , అతః న హన్యతే న హింస్యతే హన్యమానే శస్త్రాదిభిః శరీరే ; తత్స్థోఽప్యాకాశవదేవ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'విపశ్చిత్'– చైతన్య స్వభావం ఎన్నడూ నశించేది కానందున మేధ (ఆత్మ); 'న జాయతే'– జన్మించదు, ఉత్పత్తి చేయబడదు; 'న వా మ్రియతే'– లేదా మరణించదు. ఉత్పత్తి చేయబడే అనిత్య వస్తువు అనేక మార్పులకు లోనవుతుంది. ఆత్మయందు మార్పులుండుటను త్రోసిపుచ్చేందుకు, మార్పునకు ఆది-అంతములైన పుట్టుక-చావులను మొదటగా అది జన్మించదు, మరణించదు అంటూ నిరాకరిస్తున్నారు. మరింకా, 'అయమ్'–ఈ ఆత్మ; 'న కుతశ్చిత్'– దేని నుండి ఉద్భవించినది కాదు, వేరొక కారణము నుండి ఏర్పడినది కాదు. మరియు ఆత్మ నుండి 'న కశ్చిత్ బభూవ'– ఏదియునూ ఉద్భవించదు, దానికి అన్యమైనదేదీ; కాబట్టి, 'అయమ్'– ఈ ఆత్మ; 'అజః'– పుట్టుక లేనిది; 'నిత్యః'–నిత్యమైనది; 'శాశ్వతః'– నశించుట లేనిది.అశాశ్వతమైనది క్షయమౌతుంది కాని, ఇది ఎప్పటికీ అలాసే

ఉంటుంది. అందుచేత అది 'పురాణః'– పురాతనం, పాతదైనప్పటికి నూతనమైనదే. ఏది అవయవ నిర్మాణ వృద్ధిచేత ఏర్పడుతుందో అది నవ్యమౌతుంది. కుండ మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. అయితే, ఆత్మ ఇందుకు విరుద్ధం. అది పురాతనం, వృద్ధి అనేది లేనిది అని అభిప్రాయం. అలా అయినందువల్లనే, 'శరీరే హన్యమానే'– శరీరము ఆయుధాలు మొదలైన వాటిచేత హింసింపబడినప్పటికీ; 'న హన్యతే'– ఆకాశమువలె అది అక్కడ (దేహంలో) ఉన్నప్పటికినీ అంతమొందించబడదు లేదా హింసింపబడదు.

(ఆత్మ యొక్క స్వభావాన్ని ఇక్కడ ఉపదేశిస్తున్నాడు యమదేవుడు. నశించుట చైతన్య స్వభావం కానందువల్ల, ఆ ఆత్మ చైతన్యస్వరూపమైనందుచేత, అది పుట్టేది కాదు, మరణించేదీ కాదు. ఏదైనా ఉత్పత్తి చేయబడుతోంది అనంటే అది నిత్యము కాదనుట స్పష్టం. నిత్యం కానిది అనేక మార్పులకు లోనవుతుంది. మార్పుకు మొదలు-చివర అనగా పుట్టుక, చావు అనేది సహజం. ఆత్మ ఎటువంటి మార్పుకు లోనుకానిదని నిర్ధారించేందుకేమొదటగా దానికి జనన మరణాలు లేవంటున్నారు. పోనీ ఆ ఆత్మ దేనినుండైనా ఉద్భవించిందా అంటే అదీ కాదు. దాని నుండి మరొకటి ఏదీ ఉద్భవించదు, పుట్టదు. అంటే, ఈ ఆత్మ పుట్టుకలేనిది, ఎప్పటికీ అలాగే ఉండేదీ, నాశనం లేనిదీ. ఎప్పటినుండో అది అలాగే ఉంటోంది కనుక అది పురాతనం. దేనికైనా కొత్త సొగసులు లేదా విశేషణాలు జతపడితే అది నూతనమౌతుంది. ఆత్మకు అలా కొత్తదనం వచ్చిపడేదీ ఏదీ ఎన్నడూ లేదు. మరింకా ఏమంటే, శరీరాన్ని హింసించినప్పటికీ లేదా అంతమొందించినప్పటికినీ, ఆత్మకు ఎట్టి గాయమూ లేదు, హానీ కలుగదు. ఇది ఎలాగంటే, ఆకాశాన్ని ఆయుధాలతో హింసిస్తే దానికేమైనా హాని కలుగుతుందా! ఏ మాత్రం కలుగదు. అలాగే, ఆత్మను కూడా హింసించడమనేది కుదరదు.)

**హన్తా చేన్మన్యతే హన్తుగ్ం హతశ్చేన్మన్యతే హతమ్ .**
**ఉభౌ తౌ న విజానీతో నాయగ్ం హన్తి న హన్యతే .. 1-2-19 ..**

**హతం చేయబడేదని హంతకుడు తలిస్తే, హతమౌతానని చంపబడేవాడు తలుస్తాడు. ఉభయులూ తెలియని వారే. అది చంపునది కాదు, చంపబడేది కాదు.**

## శంకర భాష్యమ్

ఏవం భూతమప్యాత్మానం శరీరమాత్రాత్మదృష్టిః హంతా చేత్ యది మన్యతే చింతయతి ఇచ్ఛతి హంతుం హనిష్యామ్యేనమితి యోఽప్యన్యో హతః సోఽపి చేన్మన్యతే హతమాత్మానం హతోఽహమితి ఉభావపి తౌ న విజానీతః స్వమాత్మానం ; యతః నాయం హంతి అవిక్రియత్వాదాత్మనః, తథా న హన్యతే ఆకాశవదవిక్రియత్వాదేవ . అతోఽనాత్మజ్ఞవిషయ ఏవ ధర్మాధర్మాదిలక్షణః సంసారః నాత్మజ్ఞస్య, శ్రుతిప్రామాణ్యాన్న్యాయాచ్చ ధర్మాధర్మాద్యనుపపత్తేః ..

కథం పునరాత్మానం జానాతీతి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఆత్మ ఇలాంటిదైనప్పటికినీ, శరీరమే ఆత్మయనే దృష్టివలన 'హన్తా'– హంతకుడు; 'హన్తుమ్'– హతం చేయాలని, చంపుతానని; 'మన్యతే చేత్' - తలుస్తే, భావిస్తే; 'హతః'– హతమయ్యేవాడు, చంపబడేవాడు; 'హతం'– చంపబడునట్లుగా; 'మన్యతే చేత్'– భావిస్తే, చంపబడేవాడినని తలిస్తే; 'ఉభౌ తౌ'– వారిద్దరూ సమానంగా; 'న విజానీతః'– తెలియని వారే, వారు ఆత్మను ఎరుగని వారే. ఎందుకంటే, 'అయమ్'– అది, ఆత్మ; 'న హన్తి'– చంపదు, ఆత్మకు ఎట్టి కర్తృత్వం లేనందున; 'న హన్యతే'– చంపబడదు, ఆత్మ ఆకాశం వలె మార్పుచెందేది కానందున. కాబట్టి, పుణ్య పాపములతో కూడిన సంసారం కేవలం అజ్ఞానికి మాత్రమే సంబంధించినది. బ్రహ్మజ్ఞానికి సంబంధించినది కాదు. ఎందుకంటే, వైదిక ప్రమాణాలు మరియు న్యాయశాస్త్రం ప్రకారం బ్రహ్మజ్ఞానికి పుణ్య పాపముల ప్రసక్తే ఉండదు.

(ఆత్మను హింసించడం కుదరని పని అని పైన చెప్పబడినప్పటికినీ, శరీరమే ఆత్మ అనే దోషదృష్టిచేతనే హంతకుడు తాను చంపుతున్నానని తలుస్తున్నాడు. అలాగే, హతుడు కూడా తాను చంపబడే వాడిననీ అనుకొంటున్నాడు. చిత్రమేమంటే, వారిద్దరూ ఆత్మ యొక్క స్వభావం తెలియని వారే. ఆత్మకు ఎటువంటి కర్తృత్వం లేకపోవడం వల్ల అది చంపదు, అది ఆకాశంవలె మార్పులేనిది కావడంచేత చంపబడేదీ కాదు. సంసార లక్షణాలైన, ఈ చంపడం చంపబడడం దేహానికి సంబంధించినవే. కేవలం ఆత్మ స్వభావం ఎరుగని అజ్ఞానికి మాత్రమే ఈ పుణ్య పాపాలతో కూడిన సంసారంతో సంబంధం ఉంటుంది కాని, ఆత్మజ్ఞానికి అట్టి సంసారబంధం ఉండదు. ఈ విషయాన్నే న్యాయశాస్త్రం మరియు వైదిక ప్రామాణ్యతలు నిర్ధారిస్తున్నాయి.)

మరైతే, ఆత్మను తెలుసుకోవడం ఎలా అనేది చెప్తున్నారు.

**అణోరణీయాన్మహతో మహీయా-**
**నాత్మాఽస్య జన్తోర్నిహితో గుహాయామ్ .**
**తమక్రతుః పశ్యతి వీతశోకో**
**ధాతుప్రసాదాన్మహిమానమాత్మనః ..1-2-20 ..**

ఆత్మ సూక్ష్మాతిసూక్ష్మం. బృహత్తరమైన వాటన్నింటిలో బృహత్తమం. ప్రాణుల హృదయంలో నిక్షిప్తమై ఉన్నది. కోరికలు నశించిన వాడు ఇంద్రియ వ్యాపారం శాంతించగా ఆత్మ యొక్క మహిమను దర్శించి, శోకరహితుడౌతాడు.

## శంకర భాష్యమ్

అణోః సూక్ష్మాత్ అణీయాన్ శ్యామాకాదేరణుతరః . మహతో మహత్పరిమాణాత్ మహీయాన్ మహత్తరః పృథివ్యాదేః ; అణు మహద్వా యదస్తి లోకే వస్తు, తత్తేనైవాత్మనా నిత్యేనాత్మవత్సంభవతి . తదాత్మనా వినిర్ముక్తమసత్సంపద్యతే . తస్మాదసావేవాత్మా అణోరణీయాన్మహతో మహీయాన్ , సర్వనామరూపవస్తూపాధికత్వాత్ . స చ ఆత్మా అస్య జంతోః బ్రహ్మాదిస్తంబపర్యంతస్య ప్రాణిజాతస్య గుహాయాం హృదయే నిహితః ఆత్మభూతః స్థిత ఇత్యర్థః . తం ఆత్మానం దర్శనశ్రవణమననవిజ్ఞానలింగం అక్రతుః అకామః, దృష్టాదృష్టబాహ్యవిషయేభ్య ఉపరతబుద్ధిరిత్యర్థః . యదా చైవం తదా మనఆదీని కరణాని ధాతవః శరీరస్య

ధారణాత్ప్రసీదంతీత్యేషాం ధాతూనాం ప్రసాదాదాత్మనో మహిమానం కర్మనిమిత్తవృద్ధిక్షయరహితం పశ్యతి అయమహమస్మీతి సాక్షాద్విజానాతి ; తతో విగతశోకో భవతి ..

అన్యథా దుర్విజ్ఞేయోఽయమాత్మా కామిభిః ప్రాకృతపురుషైర్యస్మాత్

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అణోః'– సూక్ష్మమైన దానికంటే; 'అణీయాన్'– సూక్ష్మతరమైనది, సామలవంటి తృణధాన్యంలాగా అత్యంత సూక్ష్మమైనది. 'మహతః'– మహాపరిమాణాలకంటే; 'మహీయాన్'– మహత్తరమైనది, భూమి మొదలగు వాటిలో. జగత్తునందు సూక్షత్వం నుండి మహత్వం దాకా వస్తువులేవైతే ఉన్నాయో, వాటన్నింటికి నిత్యమైన ఆత్మవలననే అస్తిత్వం కలుగుతోంది. ఆ ఆత్మతత్త్వం లేకపోతే వాటికి అస్తిత్వం ఉండదు. అందువలననే, సమస్త నామ రూప వృత్తులను ఆశ్రయించియున్న ఆత్మ అస్తిత్వంకల వస్తువులన్నింటికన్నా, సూక్ష్మతలో సూక్ష్మతరమైనది, బృహత్వంలో బృహత్తరమైనది. మరియు అట్టి ఆత్మ 'అస్య జన్తోః'– పిపీలికాదిబ్రహ్మపర్యంతం గల ప్రాణుల యొక్క; 'గుహాయామ్'– హృదయమునందు, 'నిహితః'– ఉన్నది, అంటే ఆత్మగా ఉన్నదని అర్థం. 'తమ్'– ఆ ఆత్మ, శ్రవణ మనన ధ్యానాదుల ద్వారా దేనిని తెలుసుకోగలమో అట్టి ఆత్మ (ఇది గోపాలేన్ద్రుని అభిప్రాయం. అయితే, దర్శనశ్రవణమననవిజ్ఞానలిఙ్గమ్ అనగా దర్శించుట, వినుట, విచారించుట, ఎరుగుట అనే సాధన ప్రక్రియలద్వారా గోచరింపబడే ఆత్మ అని కూడా అర్థం చేసుకోవచ్చు); 'అక్రతుః'– కోరిక లేనివాడు, అంటే కనిపించేవి కనబడనివి అయిన బాహ్య విషయాల పట్ల నిరాసక్తమైన బుద్ధి కలవాడని అభిప్రాయం. అవయవములు, అంటే మనసు మొదలైన ఇంద్రియములు. శరీరాన్ని ధరించియున్నందున మనసు, ఇంద్రియములను ధాతువులు అంటారు. అట్టి బాహ్యవిషయాలపట్ల నిరాసక్తత కలిగిన వాడు 'ధాతుప్రసాదాత్'– మనసేంద్రియముల ప్రశాంతత (అటూ ఇటూ చలించడం మాని స్థిరంగా ఉండటం) ద్వారా; 'ఆత్మనః'– ఆత్మయొక్క, అంటే కర్మ కారణంగా ఎటువంటి వృద్ధి క్షయములు లేనటువంటి ఆత్మ యొక్క; 'మహిమానమ్'– దివ్యత్వాన్ని, మహిమను; పశ్యతి – దర్శిస్తాడు, అంటే ఆత్మను నేరుగా 'నేనే ఆ ఆత్మను' అనే అనుభవాన్ని పొందుతాడు. ఆవిధంగా, అతడు 'వీతశోకః'– శోకమునుండి విడివడతాడు.

(మొదటగా, ఈ ఆత్మ ఎలాంటిదో వివరిస్తున్నారు. ఈ ఆత్మ జగత్తులోని సూక్ష్మతమమైన వస్తువులన్నింటికంటే సూక్ష్మతమమైనది. అలాగే జగత్తులోనున్న బృహత్తరమైన వస్తువులన్నింటికన్నా బృహత్తరమైనది, పెద్దది. ఇదేమిటి విరుద్ధంగా చెప్తున్నారు అని అనుకొంటున్నారేమో. ఇందులో వైరుధ్యమేమీ లేదు. దీని అర్థమేమంటే, సూక్ష్మతరమైన వస్తువులనుండి బృహత్తరమైన వస్తువుల వరకూ, ఆ వస్తువులు అలా ఉండటం అంటే వాటి అస్తిత్వానికి నిత్యమైన ఆత్మయే కారణం. ఆత్మయే లేకపోతే ఆ వస్తువులన్నీ అసత్ అంటే లేవు అని అర్థం. జగత్తులోని అత్యంత సూక్ష్మమైన వస్తువు యొక్క అస్తిత్వం కూడా ఆత్మపైనే ఆధారపడి ఉంటుంది. అంటే, ఆ సూక్ష్మతరమైన వస్తువు కంటే ఆత్మ సూక్ష్మమని నిర్ధారించబడుతోంది. అలాగే బృహత్తరమైన వస్తువు విషయంలోనూ ఆత్మ అంతకంటే బృహత్తరమనేది నిరూపితమవుతోంది. గడ్డిపరకనుండి బ్రహ్మ పర్యంతంగల ప్రాణుల హృదయాలలో ఆత్మ వసించి ఉంటుంది. మరి దీనిని పొందేదెలా అంటే చెప్తున్నారు. మనస్సును, ఇంద్రియాలను బాహ్య విషయాలనుండి విరమింపచేయడం ద్వారా. కోరికలు నశించిన వాడు, ఇంద్రియాలు మనస్సు ఎటువంటి అలజడి

లేకుండా ప్రశాంతతను పొందిన కారణంగా ఆ ఆత్మయే నేననే దివ్యమైన అనుభవాన్ని పొందుతాడు. అందుచేత, శోకరహితుడౌతాడు.)

అలాకాకుండా, కోరికలు కలిగిన సాధారణ జనులచే ఈ ఆత్మ తెలియబడటం అసాధ్యం. ఎందుకంటే,

**ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః .**

**కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి .. 1-2-21 ..**

ఆసీనమయ్యే సుదూరాలు పయనిస్తుంది. విశ్రమించియే అంతటా విస్తరిస్తుంది. ఆనంద నిరానందమైన ఆ దివ్యత్వాన్ని నాకన్నా ఇతురుడు ఎవడు తెలుసుకోగలుగుతాడు?

## శంకర భాష్యమ్

ఆసీనః అవస్థితోఽచల ఏవ సన్ దూరం వ్రజతి శయానః యాతి సర్వతః, ఏవమసావాత్మా దేవో మదామదః సమదోఽమదశ్చ సహర్షోఽహర్షశ్చ విరుద్ధధర్మవానతోఽశక్యత్వాజ్జ్ఞాతుం కః తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి . అస్మదాదేరేవ సూక్ష్మబుద్ధేః పండితస్య విజ్ఞేయోఽయమాత్మా స్థితిగతినిత్యానిత్యాదివిరుద్ధానేకధర్మోపాధికత్వాద్విరుద్ధధర్మవాన్ విశ్వరూప ఇవ చింతామణివత్కస్యచిదవభాసతే . అతో దుర్విజ్ఞేయత్వం దర్శయతి — కస్తం మదన్యో జ్ఞాతుమర్హతీతి . కరణానాముపశమః శయనం కరణజనితస్యైకదేశవిజ్ఞానస్యోపశమః శయానస్య భవతి . యదా చైవం కేవలసామాన్యవిజ్ఞానత్వాత్సర్వతో యాతీవ యదా విశేషవిజ్ఞానస్థః స్వేన రూపేణ స్థిత ఏవ సన్ మనఆదిగతిషు తదుపాధికత్వాద్దూరం వ్రజతీవ . స చేహైవ వర్తతే ..

తద్విజ్ఞానాచ్చ శోకాత్యయ ఇత్యపి దర్శయతి —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఆసీనః'– ఆసీనమయ్యే, అంటే చలింపకుండా స్థిరంగా ఉన్నట్టిదే; 'దూరమ్ వ్రజతి' - సుదూరం పయనిస్తుంది. 'శయానః'–శయనించిఉండియే; 'యాతి'– అంతటా వ్యాపిస్తుంది. అదేవిధంగా, అట్టి దివ్యమైన ఆత్మ 'మదామదః'– మదమ్ అంటే ఆనందం, అమదమ్ అంటే ఆనందరహితం రెండింటిని కలిగినది. అలా విరుద్ధ లక్షణాలు కలిగినది కాబట్టే, ఆ ఆత్మను తెలుసుకొనుట కష్టం. 'మదన్యః'– నేను కాక; 'కః'– ఎవరు; 'తం దేవమ్'– ఆ దివ్యత్వాన్ని, ఆనంద-నిరానంద లక్షణాలు కలిగినదాన్ని; 'జ్ఞాతుమ్ అర్హతి'– తెలియగలరు? మావంటివారు మాత్రమే, అంటే సూక్ష్మబుద్ధికల పండితులచే మాత్రమే ఈ ఆత్మ తెలుసుకొనబడగలదు. అచలం-గమనం, నిత్యం-అనిత్యం వంటి అనేక వైరుధ్య ధర్మాలు కలిగిన ఉపాధులవల్ల, విశ్వరూపవలె లేదా చింతామణివలె ఆత్మకు నిజంగా లేని విరుద్ధ ధర్మాలు ఉన్నట్లుగా ఆపాదింపబడినవి. (విశ్వరూప అనేది వివిధ రంగులు విరజిమ్మే ఒక రత్నవిశేషం. రంగులు ఆ రత్నం యొక్క అసలు రూపం కాదు. చింతామణి దాని యజమాని తలచిన విషయంగా రూపొందుతుంది. ఆ రూపొందిన విషయం చింతామణికి సంబంధించినది కాదు. అలా వాటికి లేని ధర్మాలు విశ్వరూప, చింతామణులకు కల్పించబడినాయి). 'కః

తమ్ మదన్యః జ్ఞాతుమర్హతి' అని అనడంలో ఆత్మను తెలుసుకోగలగడం ఎంతకష్టమో చెప్పబడింది. నిద్ర అంటే ఇంద్రియ వ్యాపారం ముగిసిన స్థితి. ఇంద్రియములచే ఆత్మచైతన్యానికి కల్పించబడిన పరిమితులు, నిద్రించే వానికి, ఉపశమిస్తాయి. నిద్రావస్థలో ఉన్న ఆత్మచైతన్యం తన సహజ సామాన్య లక్షణమైన సర్వవ్యాపకత్వం చేత సర్వత్రా నిండిఉంటుంది. ఎప్పుడైతే, ఆత్మచైతన్యం తన సహజ స్థితిలో స్థిరంగా ఉన్నదైనప్పటికినీ, ఉపాధి విశేషమైన మనసుకు గల వ్యాపకత్వ ధర్మం ఆపాదింపబడుతుందో అప్పుడు ఎంతోదూరం ప్రయాణిస్తున్నట్లు అనిపిస్తుంది. అంటే, మనసు మొదలైన వాటి యొక్క ధర్మాన్ని ఆత్మపొందినట్లుగా భావించబడుతోంది. నిజానికి, ఆత్మ ఇక్కడ ఉన్నదే (ఈ శరీరంలో ఉన్నదే).

(ఆత్మజ్ఞానాన్ని పొందటం ఎందుకు కష్టమైనదో యమదేవుడు వివరిస్తున్నారు. ఆ ఆత్మ అనేక వైరుధ్యాలు కలిగి ఉన్నది. అది కదలకుండా కూర్చొని ఉండే, దూర తీరాలకు ప్రయాణిస్తుంది. శయనించి ఉండే, సర్వత్రా వ్యాపిస్తుంది. అంతేకాదు, అనందమూ అదే ఆనందరహితమూ అదే. చూశారా! ఎన్ని వైరుధ్యాలో! ఇలాంటి వైరుధ్యాలు కలిగిన దానిని అవగతం చేసుకోవడం కష్టమే కదా. నావంటి పండితులు తప్ప వేరెవరూ దానిని తెలుసుకోలేరు అని యమదేవుడు అంటున్నాడు. ఈ చెప్పబడిన వైరుధ్యాలన్నీ ఆత్మకు సహజంగా ఉన్నవి కాదు. అవి ఉపాధుల వల్ల ఆత్మకు ఆపాదింపబడినవి. అదెలాగంటే, పట్టకం అనేదానిలో తెల్లని కాంతి ప్రవేశించి ఏడు రంగులుగా కనిపిస్తుంది. కాని, ఆ ఏడురంగులు ఆ పట్టకంలో సహజంగా లేనివే, కాని అవి దానికి ఆరోపించబడినాయి. అలాగే చింతామణి కోరికలు తీరుస్తుంది. అంటే ఏది కోరితే అది లభిస్తుంది. అంటే, చింతామణి ఆ కోరిన వస్తువుగా రూపొందుతుంది. అయితే, ఆ రూపొందిన వస్తువు చింతామణి కాదు. ఆ విధంగా, విరుద్ధతలన్నీ ఆత్మకు సహజంగా లేవు. అవి ఆత్మపై ఆరోపించబడినవి. శరీరంలో ఆత్మ సుస్థిరంగా ఉన్నప్పటికీ, జాగ్రత్తునందు మనసు దానికి ఉపాధి అయినందున, మనసు ధర్మమైన సుదూర ప్రయాణం ఆత్మకు ఆపాదింపబడి, ఆత్మయే సుదూరాలు ప్రయాణిస్తోంది అనిపిస్తుంది. అదే శయనావస్థలో, మనసు ఇంద్రియాల వ్యాపారం నిలిచిపోయినందున, వాటిచే ఆత్మకు కల్పించబడిన పరిమితులు తొలగిపోయి, ఆత్మ తన సహజ స్థితియైన సర్వవ్యాపకత్వంలో నిలిచి ఉంటుంది. అందువల్లనే, ఉపాధి పరంగా కల్పించబడిన పరిమితుల వల్ల పైన తెల్పిన విరుద్ధతలు ఆత్మయందు నిజానికి లేనప్పటికీ, ఆరోపింపబడుతున్నాయి. ఆత్మ శరీరాన్ని ఆశ్రయించి ఉన్నదే కాని, ఎక్కడికీ వెళ్లినది కాదు. మరైతే ఈ ఆత్మజ్ఞానం వల్ల ఉపయోగం కాని ప్రయోజనం కాని ఏమున్నది అనే అనుమానం కలుగవచ్చు. ఆ అనుమానం తీరుస్తూ ఆత్మజ్ఞానం వల్ల శోక నివారణ జరుగుతుందని అంటున్నారు.)

ఏవిధంగా ఆత్మజ్ఞానం వలన శోకం కూడా నివారించబడుతుందో వివరిస్తున్నారు.

**అశరీరగ్ం శరీరేషు అనవస్థేష్వవస్థితమ్ .**
**మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి .. 1-2-22 ..**

శరీరాల నడుమ అశరీరిగా, అశాశ్వతాల మధ్య శాశ్వతంగా, మహత్తరమైనదిగా, వ్యాపకత్వంగా ఆత్మను ధ్యానించిన వివేకి శోకించడు.

## శంకర భాష్యమ్

అశరీరః స్వేన రూపేణాకాశకల్ప ఆత్మా తం అశరీరం శరీరేషు దేవపితృమనుష్యాదిశరీరేషు అనవస్థేషు అవస్థితిరహితేష్వనిత్యేషు అవస్థితం నిత్యం అవికృతమిత్యేతత్ . మహాంతం . మహత్త్వస్యాపేక్షికత్వశంకాయామాహ — విభుం వ్యాపినం ఆత్మానం ; ఆత్మగ్రహణం స్వతోఽనన్యత్వప్రదర్శనార్థం . ఆత్మశబ్దః ప్రత్యగాత్మవిషయ ఏవ ముఖ్యః తమీదృశామాత్మానం మత్వా అయమహమితి, ధీరః ధీమాన్ న శోచతి . న హ్యేవంవిధస్యాత్మవిదః శోకోపపత్తిః ..

యద్యపి దుర్విజ్ఞేయోఽయమాత్మా తథాప్యుపాయేన సువిజ్ఞేయ ఏవేత్యాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఆత్మ తన సహజస్థితిలో ఆకాశం వంటిది, అట్టి ఆత్మ 'శరీరేషు'— దేహాల నడుమ, అంటే దేవ, పితృ, మానవ శరీరాల నడుమ; 'అశరీరమ్'— శరీరము లేనిది; 'అనవస్థేషు'— స్థిరంకానటువంటి, అశాశ్వతమైన వాటి నడుమ; 'అవస్థితమ్'— నిత్యమైనది, వికృతంలేనిది; 'మహాన్తం'— మహత్తరమైనది. ఈ గొప్పదనం సాపేక్షికమని పొరబడకుండా (దేనికంటే మహత్తరమనే ప్రశ్న తలెత్తకుండా), 'ఆత్మానమ్'— ఆత్మ; 'విభుమ్'— వ్యాపించినది; అని అంటున్నారు. బ్రహ్మము తన స్వకీయమైన ఆత్మకు అన్యముకాదని తెలియజేయడం కొరకు ఆత్మన్ శబ్దం చెప్పబడింది. ఆత్మన్ శబ్దం ప్రధానంగా ప్రత్యగాత్మను సూచిస్తుంది. ఈ విధమైన ఆత్మను, 'నేను ఇదియే' అని, 'మత్వా'— ధ్యానించిన; 'ధీరః'— ధీమంతుడు, బుద్ధిగలవాడు; 'న శోచతి'— శోకము పొందడు. ఈ విధంగా ఆత్మను తెలుసుకొన్న వానికి శోకముండదు.

(ఆత్మను పోల్చి చూడడానికి దాని స్వభావానికి చాలా దగ్గరగా ఉండే ఆకాశాన్ని చెప్తారు. ఆకాశానికి శరీరమనేదే ఉండదు. అలాగే, దేహాలలో ఉన్న అశరీరి ఆత్మ. అనిత్యం, అశాశ్వతమైన శరీరాల మధ్య ఉండే శాశ్వతత్త్వం ఆత్మ. అంతేకాక, ఆత్మ మహత్తరమైనది, వ్యాపించియున్నది. మహత్తరమైనది అని అంటే దేనికంటే మహత్తరమనే సాపేక్షికత్వం సూచితమౌతున్నందున, దానిని తోసిపుచ్చడానికి అది వ్యాపించి ఉన్నదని చెప్తున్నారు. సర్వత్రా వ్యాపించియున్నదానికి సాపేక్షికంగా మరొకటి ఏదీ ఉండదని అభిప్రాయం. అలా విశ్వ వ్యాపితమైనది తానే అంటే తన ఆత్మస్వరూపమేనని నిరంతరంగా చింతన చేసిన వానికిక శోకించడానికి కారణమేమీ ఉండదు. సర్వత్రా తానైయుండగా, తనకు అన్యంగా మరొకటిఏదీ లేనివానికి శోకించదగిన కారణం ఉండదు. అంటే, శోక రహితుడౌతాడని అర్థం.)

ఆత్మను అవగతం చేసుకోవడం కష్టమైనదే అయినప్పటికీ, తగిన ఉపాయాలతో దానిని తెలుసుకొనవచ్చని చెప్పబోతున్నారు.

**నాయమాత్మా ప్రవచనేన లభ్యో**

**న మేధయా న బహునా శ్రుతేన .**

**యమేవైష వృణుతే తేన లభ్య-**

**స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ంస్వామ్ .. 1-2-23 ..**

**ఈ ఆత్మ అధ్యయనంచేతగాని, బుద్ధి చేతగాని లేదా ఎంతగానో శ్రవణం చేసినాగాని లభ్యంకాదు. ఏ ఆత్మైతే కోరబడినదో దాని వలననే అది లభిస్తుంది. ఆ ఆత్మ తనంత తానుగానే తన స్వభావాన్ని వ్యక్తపరుస్తుంది.**

## శంకర భాష్యమ్

నాయమాత్మా ప్రవచనేన అనేకవేదస్వీకరణేన లభ్యః జ్ఞేయః ; నాపి మేధయా గ్రంథార్థధారణశక్త్యా ; న బహునా శ్రుతేన న బాహుశ్రుత్యేన కేవలేన . కేన తర్హి లభ్య ఇతి, ఉచ్యతే — యమేవ స్వమాత్మానం ఏష సాధకో వృణుతే ప్రార్థయతే, తేనైవాత్మనా వరిత్రా స్వయమాత్మా లభ్యః జ్ఞాయత ఇత్యేతత్ . నిష్కామశ్చాత్మానమేవ ప్రార్థయతే . ఆత్మనైవాత్మా లభ్యత ఇత్యర్థః . కథం లభ్యత ఇతి, ఉచ్యతే — తస్యాత్మకామస్య ఏష ఆత్మా వివృణుతే ప్రకాశయతి పారమార్థికీం స్వాం తనూం స్వకీయం యాథాత్మ్యమిత్యర్థః ..

కించాన్యత్ .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అయమాత్మా'– ఈ ఆత్మ; 'ప్రవచనేన'– అనేక వేదముల అధ్యయనం చేయుట చేత; 'న లభ్యః'– లభించదు; 'న మేధయా'– బుద్ధి ద్వారా కాదు, అంటే శాస్త్రముల అర్థం గ్రహించే శక్తి వల్ల కాదు; 'న బహునా శ్రుతేన'– అధికంగా కేవల శ్రవణం చేయడం వల్ల కాదు. మరి, ఎలా తెలుస్తుంది? అంటే, చెప్తున్నారు. 'యమ్ ఏవ'– తన స్వకీయమైన ఆ ఆత్మను దేనినైతే; 'ఏషః'– ఈతడు అనగా సాధకుడు; 'వృణుతే'– కోరుతున్నాడో; 'తేన'– ఆ ఆత్మయే, సాధకుడైనట్టి ఆ ఆత్మయే; తనంత తానుగా 'లభ్యః'–ప్రాప్తిస్తుంది అంటే ఇలాంటిది అలాంటిది అని తెలుస్తుంది; కోరికలు నశించి, కేవలం ఆత్మజ్ఞానాన్నే అర్థించినవానికి, ఆత్మ తనంత తానుగా (అనుగ్రహించడం చేత) తెలియబడుతుంది. ఎలాగంటే? చెప్తున్నారు. 'తస్య'– అతని యొక్క; ఆ సాధకుని యొక్క, 'ఏషః'– ఈ ఆత్మ; 'స్వామ్'– తన స్వంతమైన, పారమార్థికమైన; 'తనూమ్'– స్వభావాన్ని; 'వివృణుతే'– ప్రకటనం చేస్తుంది.

(ఈ ఆత్మ వేదాలను అధ్యయనం చేయడం వల్ల లభించేది కాదు. అలాగే శాస్త్రార్థాలను గ్రహించే సామర్థ్యం వల్లగాని, కేవలం అధికంగా శ్రవణం చేయడంవల్లగాని ఈ ఆత్మను పొందలేరు. మరైతే ఆత్మను పొందటం ఎలా? కోరికలన్నింటినీ త్యాగంచేసి, కేవలం ఆత్మజ్ఞానాన్ని మాత్రమే అర్థించే సాధకునికి, తాను దేనినైతే కోరుతున్నాడో ఆ ఆత్మ తనంత తానుగా అనుగ్రహం చేత తెలియబడుతుంది. ఎలా తెలియబడుతుంది? అంటే అతనికి ఈ ఆత్మ తన సహజ స్వరూపాన్ని తానే ప్రకట పరుచుకొంటుంది.)

మరింకొక విషయం.

**నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః .**

**నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ .. 1-2-24 ..**

దురాచారం వీడని వాడు, ఇంద్రియనిగ్రహం లేనివాడు, ఏకాగ్రమైన మనస్సు లేనివాడు, అశాంతమనస్కుడు ఈ ఆత్మను జ్ఞానముద్వారా పొందలేడు.

### శంకర భాష్యమ్

న దుశ్చరితాత్ ప్రతిషిద్ధాచ్ఛ్రుతిస్మృత్యవిహితాత్పాపకర్మణః అవిరతః అనుపరతః . నాపి ఇంద్రియలౌల్యాత్ అశాంతః అనుపరతః . నాపి అసమాహితఃఅనేకాగ్రమనాః విక్షిప్తచిత్తః . సమాహితచిత్తోఽపి సన్సమాధానఫలార్థిత్వాత్ నాపి అశాంతమానసః వ్యాపృతచిత్తో వా . ప్రజ్ఞానేన బ్రహ్మవిజ్ఞానేన ఏనం ప్రకృతమాత్మానం ఆప్నుయాత్ , యస్తు దుశ్చరితాద్విరత ఇంద్రియలౌల్యాచ్చ, సమాహితచిత్తః సమాధానఫలాదప్యుపశాంతమానసశ్చాచార్యవాన్ ప్రజ్ఞానేన ఏవం యథోక్తమాత్మానం ప్రాప్నోతీత్యర్థః ..

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'దుశ్చరితాత్'– శ్రుతి స్మృతులు విధించిన వాటికి వ్యతిరేకమైన పాపకర్మలందు, దుష్కార్యములందు; 'అవిరతః'– అభిలాష నశింపనివాడుగాని; 'అశాన్తః'– ఇంద్రియవ్యాపారం నశించనివాడుగాని; 'అసమాహితః'–మనసు అనేక విషయములందున్నవాడు అంటే, ఏకాగ్రమైన మనసు లేనివాడు లేదా చిత్త విక్షేపం కలవాడుగాని; 'అశాన్తమానసః'– ఏకాగ్రచిత్తుడైనప్పటికీ కర్మఫలంపై ధ్యాస వల్ల అశాంతమనస్కుడైన వాడుగాని; 'ప్రజ్ఞానేన'– బ్రహ్మకు సంబంధించిన జ్ఞానంద్వారా; 'ఏనమ్'– ప్రస్తుతమైన ఆత్మను; 'న ఆప్నుయాత్'– సాధించలేడు. కాని, దురాచారాన్ని విడిచినవాడు, ఇంద్రియాలను నిగ్రహించినవాడు, మనో ఏకాగ్రత కల్గినవాడు, ఏకాగ్రత వల్ల కలిగే ఫలితం గురించి మనసునందు ఎటువంటి అలజడి లేనివాడు, ఆచార్యుడు కలవాడు, పైన తెల్పిన ఆత్మను జ్ఞానంద్వారా పొందుతాడని అభిప్రాయం.

(ఎటువంటి యోగ్యతలు సాధకుడు అలవరచుకోవాలో వ్యతిరేకార్థంలో చెప్తున్నారు. వేదం సాధకులకు కొన్ని కర్మలను నిషేధించింది. అటువంటి నిషిద్ధకర్మలను ఆచరించడంలో సాధకుడు తనకున్న ఆసక్తిని విడిచిపెట్టాలి. అలా విడిచిపెట్టకపోతే, అతడికి ఆత్మజ్ఞానం ఎంతగా కృషిచేసినా లభించదు. అలాగే, ఇంద్రియాలు తమకు సంబంధించిన విషయాలలో మునిగి తేలుతుంటాయి. అలాంటి ఇంద్రియవృత్తులన్నింటిని సాధకుడు నిలువరించాలి లేదా నిగ్రహించాలి. తరువాత, మనసు వేర్వేరు విషయాలపై ఆసక్తి ఏర్పరుచుకొని వ్యవహరిస్తుంటుంది. అటువంటి మనోవ్యాపారాన్ని నిగ్రహించి మనసును ఆత్మవిషయమై ఏకాగ్రం చేయాలి. అంతేకాదు, మనసు ఆత్మవిషయమై ఏకాగ్రమైనప్పటికీ ఆ ఏకాగ్రత వల్ల కలిగే ఫలితంపైన ఆందోళన బయలుదేరి మనసును అశాంతికి గురిచేస్తుంది. అటువంటి ఆందోళన సైతం సాధకుడు విరమించుకొని మనసును శాంత పరచుకోవాలి. పైగా ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించగల ఆచార్యుడు కూడా అవసరం. ఎందుకంటే, సాధనా క్రమంలో శిష్యునికి కలిగే సంశయాలను తొలగించి సక్రమమైన మార్గంలో ముముక్షువు పయనించేలా నియంత్రించగలిగిన గురువు యొక్క ఆవశ్యకత ఎంతో ఉంది. వీటిలో ఏ ఒక్క విషయం పట్ల అశ్రద్ధ వహించినా, సాధకునికి ఆత్మజ్ఞానం లభించదని హెచ్చరిక చేయబడుతోంది.)

**యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః .**

**మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః .. 1-2-25 ..**

ఎద్దానికి బ్రాహ్మణ క్షత్రియులిద్దరూ ఆహారమో, మృత్యువు ఉపాహారమో, అది (ఆ ఆత్మ) ఎక్కడ ఉన్నదో ఎవనికి తెలుస్తుంది.

## శంకర భాష్యమ్

యస్త్వసేవంభూతః యస్య ఆత్మనః బ్రహ్మ చ క్షత్రం చ బ్రహ్మక్షత్రే సర్వధర్మవిధారకే అపి సర్వప్రాణభూతే ఉభే ఓదనః అశనం భవతః స్యాతాం , సర్వహరోఽపి మృత్యుః యస్య ఉపసేచనమివౌదనస్య, అశనత్వేఽప్యపర్యాప్తః, తం ప్రాకృతబుద్ధిర్యథోక్తసాధనానభియుక్తః సన్ కః ఇత్థా ఇత్థమేవం యథోక్తసాధనవానివేత్యర్థః, వేద విజానాతి యత్ర సః ఆత్మేతి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యస్య' - ఏ ఆత్మకు; 'బ్రహ్మ చ క్షత్రం చ'– బ్రాహ్మణ మరియు క్షత్రియులు, అంటే బ్రాహ్మణులు సర్వధర్మాలను నిలబెట్టేవారు, క్షత్రియులు సర్వప్రాణులను రక్షణచేసేవారు అయినప్పటికీ; 'ఉభే'– ఉభయులూ; 'ఓదనః'– ఆహారం; 'భవతః'– అయ్యారో; 'యస్య'– ఏ ఆత్మకు; 'మృత్యుః'– మృత్యువు, అన్నింటినీ హరించేదయినప్పటికీ; 'ఉపసేచనమ్'– ఉపాహారమో (ఊరగాయ వంటిది), అంటే కనీసం ముఖ్యాహారం కూడా కావడానికి తగినది కాదో; 'సః'– అది, ఆ ఆత్మ; 'యత్ర'– ఎక్కడ ఉన్నదని; 'ఇత్థా'– ఈ విధంగా, అంటే ముందు చెప్పిన యోగ్యతలు కలవాడు తెలుసుకొన్నట్లుగా; 'కః'– ఎవడు, కేవలం లౌకిక జ్ఞానం మాత్రమే కలిగి, ముందు చెప్పిన యోగ్యతలు లేనివాడు; 'వేద'–(ఎలా) తెలుసుకొంటాడు.

(ఆత్మ యొక్క గొప్పదనాన్ని వివరిస్తూ, అంత ఉన్నతమైన ఆత్మను తగిన యోగ్యతలు లేని వాడు ఎలా తెలుసుకొంటాడని ప్రశ్నిస్తున్నాడు. ఆత్మ ఎంత ఉన్నతమైనదంటే, జగత్తులో ధర్మాలన్నింటినీ ఆచరించి చూపి నిలబెట్టే బ్రాహ్మణులు మరియు సమస్త ప్రాణులకు రక్షణ నిచ్చే క్షత్రియులు ఉభయులూ ఆ ఆత్మకు ఆహరం వంటివారు. అన్నింటినీ గ్రసించే మృత్యువు ఆ ఆత్మకు వ్యంజనం లాంటిది. అంటే, జీవకోటిలో ఉన్నతులుగా భావనచేసే బ్రాహ్మణులు మరియు క్షత్రియులు ఆ ఆత్మకు ఆహారం అవుతారు అంటే ఆ ఆత్మలో లయమౌతారు. అంటే ఆత్మ ఔన్నత్యం ముందు బ్రాహ్మణుల ప్రతిభాపాటవాలు కాని, క్షత్రియుల శౌర్యత్వాలుగాని ఏమాత్రం పనికిరావు. వారేకాదు, జీవులంతా దేన్ని చూసి వణికిపోతారో, ఆ మృత్యువు ఆ ఆత్మకు ఫలహారమౌతుంది అంటే ఆ ఆత్మలో లయమౌతుందని అర్థం. అంటే మృత్యువు భృత్యువులా ఆత్మ ఎదుట సాగిలపడుతుంది. ఆత్మ ఎదుట మృత్యువుకు అస్తిత్వమే లేదని అభిప్రాయం. అటువంటి ఆత్మను ఆ విధంగా కేవలం లౌకిక జ్ఞానం మాత్రమే కలవాడు ఏలా అవగతం చేసుకొంటాడు? అంటే, అత్యంత ఉన్నతమైన ఆత్మను లౌకిక జ్ఞానపు కొలబద్దలతో కొలిచి తెలుసుకోవడం సాధ్యంకాదు. అందుచేత, ముందు మంత్రంలో చెప్పిన యోగ్యతలు సాధించినవాడు తెలుసుకొన్నట్లుగా, తగిన అర్హతలు సాధించని వాడు, ఆ ఆత్మ ఉనికిని ఎలా గ్రహిస్తాడు? అంటే, గ్రహించలేడని అభిప్రాయం.)

.. ఇతి ద్వితీయావల్లీభాష్యం ..

# తృతీయా వల్లీ

## శంకర భాష్యమ్

ఋతం పిబంతావిత్యస్యా వల్ల్యాః సంబంధః — విద్యావిద్యే నానా విరుద్ధఫలే ఇత్యుపన్యస్తే, న తు సఫలే తే యథావన్నిర్ణీతే . తన్నిర్ణయార్థా రథరూపకకల్పనా, తథా చ ప్రతిపత్తిసౌకర్యం . ఏవం చ ప్రాప్తృప్రాప్యగంతృగంతవ్యవివేకార్థం రథరూపకద్వారా ద్వావాత్మానావుపన్యస్యేతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఋతమ్ పిబన్తౌ అంటూ మొదలయ్యే ఈ తృతీయ వల్లికి (ముందు చెప్పిన వల్లీలతో) ఉన్న సంబంధం ఇది. విద్య, అవిద్య అనేవి విరుద్ధమైన, వ్యతిరేకమైన ఫలాలనిస్తాయని (ముందటి ద్వితీయ వల్లీలో) చెప్పినప్పటికీ, వాటి ఫలితాలతో పాటుగా అవి ఎలాంటివి (వాటి స్వభావం, పొందే విధానాలు) అనేవి ఇదమిత్థంగా నిర్ణయించబడలేదు. వాటిని నిర్ణయించేందుకై, తద్వారా తేలికగా అవగాహన కలిగించేందుకోసం రథరూపాన్ని కల్పనచేస్తున్నారు. అదేవిధంగా, ప్రాప్తికి, ప్రాపకునికి మరియు లక్ష్యానికి, ఆ లక్ష్యాన్ని చేరేవానికి కల తేడాను గుర్తించేందుకై రెండు ఆత్మతత్వాలను ప్రతిపాదిస్తున్నారు.

**ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే**
**గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే .**
**ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి**
**పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః .. 1-3-1 ..**

అవశ్యంగా సంభవించే కర్మఫలానుభవమైన సత్యాన్ని త్రావిన ఆ ఇరువురూ దేహంలోని పరబ్రహ్మ స్థానమైన (హృదయ) గుహయందు ప్రవేశిస్తారు. వారిద్దరినీ ఛాయాకాంతులతో బ్రహ్మవేత్తలు పోల్చి చెప్తారు. పంచాగ్ని ఆరాధకులు, ముమ్మారు నాచికేత యజ్ఞాన్ని ఆరాధించేవారు కూడా (అలాగే చెప్తారు).

## శంకర భాష్యమ్

ఋతం సత్యం అవశ్యంభావిత్వాత్కర్మఫలం పిబంతౌ ; ఏకస్తత్ర కర్మఫలం పిబతి భుంక్తే నేతరః, తథాపి పాతృసంబంధాత్పిబంతావిత్యుచ్యేతే ఛత్రిన్యాయేన . సుకృతస్య స్వయంకృతస్య కర్మణః ఋతమితి పూర్వేణ సంబంధః . లోకే అస్మిఞ్శరీరే, గుహాం గుహాయాం బుద్ధౌ ప్రవిష్టౌ, పరమే, బాహ్యపురుషాకాశసంస్థానాపేక్షయా పరమం , పరార్ధే పరస్య బ్రహ్మణోఽర్ధం స్థానం పరార్ధం హార్దాకాశం . తస్మిన్హి పరం బ్రహ్మోపలభ్యతే . తతః తస్మిన్పరమే పరార్ధే హార్దాకాశే ప్రవిష్టావిత్యర్థః . తౌ చ

చ్ఛాయాతపావివ విలక్షణౌ సంసారిత్వాసంసారిత్వేన బ్రహ్మవిదో వదంతి కథయంతి . న కేవలమకర్మిణ ఏవ వదంతి . పంచాగ్నయో గృహస్థాః . యే చ త్రిణాచికేతాః త్రిఃకృత్వో నాచికేతోఽగ్నిశ్చితో యైస్తే త్రిణాచికేతాః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'సుకృతస్య'– తమచే చేయబడిన కర్మ వల్ల; 'ఋతమ్'– సత్యము, అంటే ఖచ్చితంగా పొందబడే అవశ్యమైన కర్మ ఫలం (అదే సత్యం అనబడుతుంది); 'పిబన్తౌ'– ఇద్దరు గ్రోలారు. అంటే, వారిచే నిర్వహించబడిన కర్మలవల్ల అవశ్యం లభించే సత్యాన్ని గ్రోలారు. ఆ ఇద్దరిలో ఒకరే గ్రోలారు, అంటే కర్మఫలమైన సత్యాన్ని అనుభవించారు. రెండవ వారు అనుభవించలేదు. అయినప్పటికీ ఛత్రి న్యాయంగా, అనుభవం పొందిన వారితో పాటుగా ఉన్నందున, ఇద్దరూ సత్యాన్ని అనుభవించినవారే, గ్రోలిన వారే అవుతారు. (ఛత్రి న్యాయమేమంటే – ఒక మహారాజు తన పరివారంతో ఛత్రముల నీడన ఊరేగింపుగా వెళ్తున్నాడు. ఆ పరివారంలో చాలామంది ఛత్రముల నీడలో లేనప్పటికినీ, అందరూ 'ఛత్రిణః యాన్తి' ఛత్రములతో వెళ్తున్నట్లుగానే లోకులు పరిగణిస్తారు. దీనినే ఛత్రి న్యాయమంటారు). లోకే – తమ దేహములోని 'గుహామ్' (గుహాయామ్) –నిగూఢస్థానమందలి లేదా బుద్ధి యందలి; 'పరమే'– బాహ్యంలో గల ఆకాశానికన్నా పరమమైనదైన (వేరైన, ఉన్నతమైన), 'పరార్ధే'– పరమమైన బ్రహ్మ యొక్క స్థానమైనది అనగా హృదయాకాశం. అక్కడే నిశ్చయంగా పరబ్రహ్మ అనుభవమౌతుంది. అంటే, వారిద్దరూ పరబ్రహ్మపదమైన హృదయాకాశంలో ప్రవేశిస్తారని అభిప్రాయం. వారిద్దరిని, 'ఛాయాతపౌ'– నీడ వెలుగు వలె, అంటే సంసారంలో నిమగ్నమైన మరియు సంసారంనుండి విడివడిన వారి వలె వేర్వేరు లక్షణాలు కలవారిగా; 'బ్రహ్మవిదః'– బ్రహ్మవేత్తలు; 'వదన్తి'– చెప్తున్నారు. కర్మలను త్యజించిన వారు మాత్రమే ఆ విధంగా చెప్పడం లేదు. 'పఞ్చాగ్నయః'– అయిదు రకాలైన అగ్నులను ఆరాధించేవారు అంటే గృహస్థులు (గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్ని, సభ్య, ఆవసత్య అనేవి పంచాగ్నులు. లేదా స్వర్గం, మేఘం, భూమి, పురుషుడు, స్త్రీ ఇవి కూడా పంచాగ్నులుగా చెప్పబడుతున్నాయి– బృ.ఉ.6.9-13); 'చ'– మరియు; 'త్రిణాచికేతః'– ఎవరిచే ముమ్మారు నచికేతాగ్నులు వ్రేల్చబడుతున్నాయో వారు త్రిణాచికేతులు; కూడా ఇలాగే చెప్తున్నారు.

(ఉపదేశాన్ని ఒక పొడుపు కథలా ప్రారంభిస్తున్నారీ మంత్రంలో. ఇక్కడ ఇద్దరు ఉన్నారయ్యా. కర్మకు ఫలమనేది ఒకటి తప్పకుండా ఉండితీరవలసిందే కదా. ఆ కర్మ ఫలాన్నే ఋతము లేదా సత్యమని అంటారు. ఈ ఇద్దరూ కర్మఫలమైన సత్యాన్ని అనుభవిస్తున్నారు. అయితే, ఇక్కడొక విశేషముంది. అదేమంటే, ఇద్దరిలో ఒక్కరే కర్మఫలమైన సత్యాన్ని పొందినా, ఇద్దరూ కలిసే ఉన్నందుచేత ఛత్రిన్యాయం ప్రకారం, సహచరులైనందున వారిద్దరూ సత్యాన్ని ఫలంగా పొందినవారుగానే భావించబడుతున్నారు అవుతారు.అలా కర్మఫలప్రాప్తిగా సత్యాన్ని పొందిన వారిద్దరికీ కూడా పరబ్రహ్మ స్థానమైన దేహంలోని హృదయాకాశమే స్థానం. ఇన్ని సారూప్యతలున్నప్పటికీ వారిద్దరూ వెలుగు నీడలలాగా విరుద్ధ స్వభావం కలిగిన వారు. ఒకరు సంసారంలో నిమగ్నమైన వారైతే, రెండవ వారు సంసారం పట్ల విముఖత కలవారని బ్రహ్మవేత్తలు చెప్తున్నారు. మరైతే, ఈ పొడుపు కథను విప్పి ఆ ఇద్దరు ఎవరో ఊహ చేయండి. సమాధానం చాలా స్పష్టం. ఒకడు జీవుడైతే, రెండవది పరమాత్మ. అందులో జీవుడు మాత్రమే కర్మఫలాన్ని అనుభవిస్తూ సంసారంలో మునిగిపోతున్నాడు. కాని పరమాత్మకు కర్మఫలంతో సంబంధమే లేకున్నా, జీవునితో పాటు ఉన్నందువల్ల పరమాత్మ కూడా కర్మఫలాన్ని అనుభవిస్తున్నట్టుగానే భావన చేయబడుతోంది. అలాగే

జీవుడు మరియు పరమాత్మ ఇద్దరూ దేహంలోని హృదయాకాశాన్ని ఆశ్రయించి ఉన్నవారే. అయితే వారిద్దరిలో అత్యంత విశిష్టమైన భిన్నత్వమేమంటే పరమాత్మ జీవాత్మలు ఇద్దరూ వెలుగునీడల వంటి వారు. అంటే పరమాత్మ వెలుగుతో పోల్చబడితే, జీవాత్మ నీడతో పోల్చబడింది. వెలుగు ఉంటేనే నీడ కలుగుతుంది. వెలుగే లేకపోతే నీడకు అవకాశం ఎక్కడుంది. అలాగే పరమాత్మ ఉంటేనే జీవాత్మకు అస్తిత్వం. పరమాత్మ లేకుండా జీవాత్మ ఉండే అవకాశమే లేదు. పరమాత్మ ఒక్కడే స్వతంత్రంగా అస్తిత్వం కలిగినవాడు. ఈ విషయాన్ని బ్రహ్మవేత్తలే కాదు, పంచాగ్నులను ఆరాధించిన వారు,మూడు సార్లు నచికేతాగ్నులు రగిల్చిన గృహస్థులు కూడా అలాగే చెప్తున్నారు. అంటే జీవాత్మ, పరమాత్మల గురించిన ఈ విషయంలో కర్మలలో నిమగ్నులైన వారూ జ్ఞాన నిష్ఠ కలవారు కూడా ఏకాభిప్రాయంతో ఉన్నారన్న మాట.)

**యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్ .**
**అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి .. 1-3-2 ..**

ఏది యజ్ఞకర్తలకు (సంసార) సాగరాన్ని దాటించే సేతువు వంటిదో, జ్ఞాననిష్ఠులకు భయరహితమైన వినాశమే లేని పరమమైన బ్రహ్మమో అది ఆ నాచికేతాగ్ని అని తెలిసికోగలిగాం.

## శంకర భాష్యమ్

యః సేతుః సేతురివ సేతుః ఈజానానాం యజమానానాం కర్మిణాం , దుఃఖసంతరణార్థత్వాత్ . నాచికేతం నాచికేతోఽగ్నిః తం , వయం జ్ఞాతుం చేతుం చ శకేమహి శక్తవంతః . కించ, యచ్చ అభయం భయశూన్యం సంసారస్య పారం తితీర్షతాం తరితుమిచ్ఛతాం బ్రహ్మవిదాం యత్పరం ఆశ్రయం అక్షరం ఆత్మాఖ్యం బ్రహ్మ, తచ్చ జ్ఞాతుం శకేమహి . పరాపరే బ్రహ్మణీ కర్మిబ్రహ్మవిదాశ్రయే వేదితవ్యే ఇతి వాక్యార్థః ; తయోరేవ హ్యుపన్యాసః కృతః 'ఋతం పిబంతౌ' ఇతి ..

తత్ర యః ఉపాధికృతః సంసారీ విద్యావిద్యయోరధికృతో మోక్షగమనాయ సంసారగమనాయ చ, తస్య తదుభయగమనే సాధనో రథః కల్ప్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః'– ఏ; 'నాచికేతమ్'– నాచికేతాగ్ని; 'ఈజానానామ్'– యజమానులకు, యజ్ఞకర్తలకు లేదా కర్మలు నిర్వహించే వారికి; 'సేతుః'– సేతువు వంటిదో, అంటే దుఃఖములను దాటించునదైనందున సేతువు లేదా వంతెన వంటిదో; దానిని మేము 'శకేమహి'– తెలుసుకొని ఆచరించగలిగాం. మరింకా, 'పారమ్ తితీర్షతామ్'– ఆవలి తీరం చేరాలని (తరించాలని) కోరుకునే బ్రహ్మవేత్తలకు; సంసారానికి 'యత్పరమ్'– ఏది పరమమైన ఆశ్రయమైనదో; 'అభయమ్'– అట్టి భయరహితమైన; 'అక్షరమ్'– వినాశము లేని ఆత్మయనబడే బ్రహ్మను తెలుసుకోగలిగాం. ఈ వాక్యానికి అర్థమేమంటే, కర్మలు ఆచరించేవారికి ఆశ్రయమైన సగుణ బ్రహ్మ మరియు బ్రహ్మజ్ఞానులకు ఆశ్రయమైన నిర్గుణ బ్రహ్మ రెండునూ సాధింపతగినవే లేదా పొందతగినవే. సంసార మగ్నుడై సగుణ బ్రహ్మను ఉపాసించే జీవుడు

మరియు బ్రహ్మజ్ఞానాన్ని పొందటం ద్వారా పరబ్రహ్మను పొందగోరే జ్ఞాని ఈ ఇద్దరి గురించే, 'ఋతమ్ పిబన్తౌ...' అనే మంత్రంలో చెప్పబడింది.

('ఋతం పిబన్తౌ ......' అనే ఈ వల్లీలోని ప్రథమ మంత్రంలో రెండు విధాలైన తత్త్వాలను గురించి సూచనచేశారు. సగుణ బ్రహ్మాన్ని ఆరాధించే కర్మపరాయణులు మొదటి రకం వారు. నిర్గుణ బ్రహ్మాన్ని ఉపాసించే జ్ఞాన మార్గావలంబకులు రెండవ రకం వారు. కర్మలు నిర్వహించే యజమానులు నాచికేతాగ్ని అనే సేతువు ద్వారా సంసార దుఃఖాలనుండి తరిస్తారు. అంటే వారు సగుణబ్రహ్మాన్ని ఉపాసించడం ద్వారా సద్గతిని పొందతారు. ఇందుకు భిన్నంగా జ్ఞానులు భయరహితమైన, వినాశమే లేని, పరమపదమైన నిర్గుణబ్రహ్మాన్ని పొందుతారు. ఈ రెండు తత్త్వములూ పొందతగినవే అయినా, సగుణ బ్రహ్మము కన్నా నిర్గుణబ్రహ్మము ఉన్నతమూ, ఉత్తమమూ అని చెప్తున్నారు.)

అయితే, విద్యకు అర్హుడైనవాడు ముక్తిమార్గాన్ని మరియు అవిద్యకు అర్హతగలవాడు సంసార దుఃఖమనాన్ని ఎలా సాధిస్తారనేది సులభంగా అవగాహన కలిగించడంకోసం, రథాన్ని ఉదాహరణగా చేసుకొని వివరణ కొనసాగిస్తున్నారు.

**ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరగ్ం రథమేవ తు .**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ .. 1-3-3 ..**

ఆత్మయే ఆ రథానికి యజమాని అని తెలుసుకో. దేహమే ఆ రథం. బుద్ధియే సారథి అని తెలుసుకో. మనసే దాని పగ్గములు.

## శంకర భాష్యమ్

తత్రాత్మానం ఋతపం సంసారిణం రథినం రథస్వామినం విద్ధి విజానీహి ; శరీరం రథం ఏవ తు రథబద్ధహయస్థానీయైరింద్రియైరాకృష్యమాణత్వాచ్ఛరీరస్య . బుద్ధిం తు అధ్యవసాయలక్షణాం సారథిం విద్ధి ; బుద్ధినేతృప్రధానత్వాచ్ఛరీరస్య, సారథినేతృప్రధాన ఇవ రథః . సర్వం హి దేహగతం కార్యం బుద్ధికర్తవ్యమేవ ప్రాయేణ . మనః సంకల్పవికల్పాదిలక్షణం ప్రగ్రహమేవ చ రశనామేవ విద్ధి . మనసా హి ప్రగృహీతాని శ్రోత్రాదీని కరణాని ప్రవర్తంతే రశనయేవాశ్వాః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

వీటిలో 'ఆత్మానమ్'– ఆత్మ, అంటే కర్మఫలాలను భోగించేది, సంసార స్థితిగల ఆత్మ (జీవాత్మ); 'రథినమ్'– రథారోహకునిగా, యజమానిగా; 'విద్ధి'– తెలుసుకో; 'తు'– మరియు; 'శరీరమ్'– దేహము; 'రథమ్'– రథమే లేదా వాహనమే; ఎందుకంటే, రథానికి కట్టబడిన గుఱ్ఱముల స్థానములో ఇంద్రియములచే శరీరము లాగబడుతోంది కాబట్టి. 'తు'– మరియు; 'బుద్ధిమ్'– బుద్ధియే, నిశ్చయించేది కాబట్టి; 'సారథిమ్'– సారథిగా, వాహనచోదకుడుగా; 'విద్ధి'– తెలుసుకో. ఎందుకంటే, రథాన్ని మార్గంలో నడిపే ముఖ్య సారథిలాగా దేహయాత్రకు ప్రధానంగా బుద్ధి త్రోవచూపిస్తుంది.

దేహమునకు సంబంధించిన సర్వ కార్యకలాపములు నిశ్చయంగా బుద్ధిచేతనే నిర్దేశింపబడుతాయి. 'ప్రగ్రహమేవ'– పగ్గములే; 'మనః'– సంకల్ప వికల్పాది లక్షణం కలిగిన మనస్సు అని; 'విద్ధి'– తెలుసుకో. ఎలాగంటే, పగ్గములు పట్టుకొని గుఱ్ఱాలను కార్యోన్ముఖం చేసినట్లుగా, శ్రోత్రాది ఇంద్రియాలు మనసుచే నియంత్రించబడి ప్రవర్తిల్లుతాయి.

(క్రిందటి మంత్రంలో రథం కల్పన చేయబడుతోందని చెప్పారు కదా. ఆ రథం ఎలాంటిదో, ఏఏ అంగాలున్నాయో ఇప్పుడు చెప్తున్నారు. కర్మఫలాలను భోగించేది ఆత్మ అయితే అదే రథానికి యజమాని. అంటే సంసారంలో నిమగ్నమైన వానిగురించి ఇక్కడ ప్రస్తావిస్తున్నారు. సంసారి దృష్టిలో కర్మఫలాలను అనుభవించేది ఆత్మయే. కర్తృత్వ భోక్తృత్వాలన్నీ ఆత్మకే ఆపాదింపబడుతాయి. కాబట్టి, సంసారికి ఆత్మయే రథ యజమాని. మరి దేహమే వానికి రథం. రథాన్ని గుఱ్ఱాలు ఎలా లాగుతాయో అలాగే దేహాన్ని ఇంద్రియాలు నడిపిస్తాయి. రథాన్ని లాగేవి గుఱ్ఱాలయినా అవి ఒక నియతిలో ప్రయాణించాలంటే వాటిని అదుపు చేసి మార్గనిర్దేశనం చేసే సారథి ఉండాలి కదా. అలా, ఈ కల్పన చేయబడిన రథాన్ని నియంత్రించే వాహనచోదకుడే నిశ్చయాత్మకమైన బుద్ధి. బుద్ధియే రథానికి త్రోవచూపిస్తుంది. బుద్ధి ఇంద్రియాలను ఎలా నియంత్రిస్తుందంటే, మనసు సహాయంతో. బుద్ధిని ఇంద్రియాలను మనసు అనుసంధానం చేస్తుంది. ఇది ఎలాగంటే, సారథి పగ్గాల సహాయంతో అశ్వాలను అదుపు చేసినట్లుగా. అంటే, ఈ రథానికి సంబంధించి మనసే పగ్గాలు. పగ్గాల సహాయంతో సారథి అశ్వాలను నియంత్రణలో ఉంచినట్లుగా, మనసనే పగ్గంతో బుద్ధి ఇంద్రియాలను నియంత్రణలో ఉంచుతుంది. ఆ విధంగా, ఈ దేహమనే రథానికి కర్మఫలభోగియైన ఆత్మయే యజమాని, ఇంద్రియాలే అశ్వాలు, బుద్ధియే సారథి, మనసే పగ్గాలు అని కల్పన చేసుకోవాలి.)

**ఇన్ద్రియాణి హయానాహుర్విషయాగ్ం స్తేషు గోచరాన్.**
**ఆత్మేన్ద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః .. 1-3-4 ..**

ఇన్ద్రియాలను అశ్వాలంటారు. విషయాలు వాటి మార్గాలు. వివేకులు మనస్సు, ఇంద్రియాలతో కూడిన ఆత్మను భోక్తగా చెప్తారు.

### శంకర భాష్యమ్

ఇంద్రియాణి చక్షురాదీని హయానాహుః రథకల్పనాకుశలాః, శరీరరథాకర్షణసామాన్యాత్ . తేషు ఇంద్రియేషు హయత్వేన పరికల్పితేషు గోచరాన్ మార్గాన్ రూపాదీన్విషయాన్ విద్ధి . ఆత్మేంద్రియమనోయుక్తం శరీరేంద్రియమనోభిః సహితం సంయుతమాత్మానం భోక్తేతి సంసారీతి ఆహుః మనీషిణః వివేకినః . న హి కేవలస్యాత్మనో భోక్తృత్వమస్తి ; బుద్ధ్యాద్యుపాధికృతమేవ తస్య భోక్తృత్వం . తథా చ శ్రుత్యంతరం కేవలస్యాభోక్తృత్వమేవ దర్శయతి — 'ధ్యాయతీవ లేలాయతీవ' (బృ. ఉ. 4 . 3 . 7) ఇత్యాది . ఏవం చ సతి వక్ష్యమాణరథకల్పనయా వైష్ణవస్య పదస్యాత్మతయా ప్రతిపత్తిరుపపద్యతే, నాన్యథా, స్వభావానతిక్రమాత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

రథాన్ని ఊహచేసిన కుశలురు, శరీరానికి రథానికి లాగబడటంలో పోలిక ఉండంటంచేత, 'ఇంద్రియాణి'– కన్నులు మొదలైన ఇంద్రియాలను; 'హయాన్'– అశ్వములుగా; 'ఆహుః'– పోల్చి చెప్తారు. 'తేషు'– అశ్వాలుగా చిత్రించబడిన ఆ ఇంద్రియాలు; 'విషయాన్'– రూపాలు మొదలైన, 'గోచరాన్'– మార్గాలను తెలుసుకొంటాయి. 'మనీషిణః'– వివేకులు; 'ఆత్మేంద్రియ మనోయుక్తం'– శరీరం, ఇంద్రియాలు, మనసుతో కూడియున్న ఆత్మను; 'భోక్తేతి'– భోక్తగా, భోగించేదానిగా; 'ఆహుః'– చెప్తారు. కేవల ఆత్మకు భోక్తృత్వం ఉండదు. బుద్ధి యొక్క పరిమిత ఉపాధి చేత మాత్రమే దానికి భోక్తృత్వం ఆపాదించబడింది. ఇదే విషయాన్ని వేరొక శృతివాక్యం కేవల ఆత్మకు భోక్తృత్వం లేదని అంటూ 'ఆలోచించేదాని వలె, కంపించేదాని వలె' ['ధ్యాయతీవ లేలాయతీవ' (బృ.ఉ.4.3.7)] అని బృహదారణ్యకోపనిషత్ చెప్తోంది. ఇలా అయితేనే, కల్పన చేయబడిన రథాన్ని ఉపమానంగా చేసుకొని రాబోయే 9 వ మంత్రంలో వివరించే విష్ణుపదాన్ని తనదిగా పొందగలగటం అనేది సరిపడుతుంది. వేరే విధంగా అయితే కుదరదు. ఎందుకంటే, స్వభావాన్ని అతిక్రమించడం కుదరదు కాబట్టి.

(రథాన్ని గుర్రాలు వివిధ మార్గాలలోకి లాగుతాయి. అలాగే శరీరం ఇంద్రియాలచేత విషయ ప్రపంచంలోకి లాగబడుతోంది. ఇక్కడ లాగబడటం పోలిక. అందుచేతనే రథాన్ని శరీరంతో పోల్చారు. ఇంద్రియాలను గుర్రాలతో పోల్చారు. గుర్రాలు మార్గాలను తెలుసుకొని ఆ మార్గాల వెంబడి రథాన్ని తీసుకువెడతాయి. ఇక్కడ ఇంద్రియాలు విషయాలను గ్రహించి వాటి వెంట రథాన్ని అంటే శరీరాన్ని తీసుకువెడతాయి. రథంతో పాటుగా రథంపై ఆసీనమైన రథికునిలాగే, శరీరమనే రథంలో ఆసీనుడైన ఆత్మ విషయాలను భోగిస్తుందనుకోవాలి. కాని, ఆత్మకు భోక్తృత్వం అంటే భోగించే స్వభావం లేదని శ్రుతులు నిర్దిష్టంగా ప్రకటించాయి కదా. మరి ఈ భోక్తృత్వం ఆత్మకు ఎక్కడనుండి వచ్చింది? పరిమితులు లేని ఆత్మ పరిమితులు కల ఉపాధిని ఆశ్రయించి ఉన్న కారణంగా, ఉపాధుల యొక్క పరిమితులు ఆత్మపై ఆరోపించబడుతున్నాయే కాని, వాస్తవానికి ఆత్మకు కర్తృత్వ, భోక్తృత్వాలు ఏమీ లేవని గ్రహించాలి. ఆత్మకు కర్తృత్వ, భోక్తృత్వమనే లక్షణాలను ఆపాదిస్తే, ఆత్మ స్వభావానికి విరుద్ధమైన స్థితి కల్పించినట్లౌతోంది. ఆత్మ తన సహజ స్థితిని ఏ కాలంలోనూ దేశంలోనూ కోల్పోదు. ఇలా అయితేనే ఈ వల్లీలో రాబోయే 9 వ మంత్రంలో చెప్పబడబోయే విష్ణుపదాన్ని పొందటమనే స్థితి సాధ్యపడుతుంది. అంటే ఆత్మకు మరి ఆ చెప్పబోయే విష్ణుపదమనేది స్థితియే కాని, బేధమేమీ ఉండదని స్పష్టమౌతుంది.)

**యస్త్వవిజ్ఞానవాన్భవత్యయుక్తేన మనసా సదా .**
**తస్యేన్ద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః .. 1-3-5 ..**

**అధీనంలో లేని మనసుతో నిత్యమూ కూడి ఉండే అది (ఆ బుద్ధి) అవివేకి అవుతుంది. రథచాలకుని పొగరుబోతు అశ్వాలలాగా దాని (ఆ బుద్ధి) యొక్క ఇంద్రియాలు నియంత్రణలో ఉండవు.**

## శంకర భాష్యమ్

తత్రైవం సతి యస్తు బుద్ధ్యాఖ్యః సారథిః అవిజ్ఞానవాన్ అనిపుణోఽవివేకీ ప్రవృత్తౌ చ నివృత్తౌ చ భవతి యథేతరో రథచర్యాయాం అయుక్తేన అప్రగృహీతేన అసమాహితేన మనసా ప్రగ్రహస్థానీయేన సదా యుక్తో భవతి, తస్య అకుశలస్య బుద్ధిసారథేః ఇంద్రియాణి అశ్వస్థానీయాని అవశ్యాని అశక్యనివారణాని దుష్టాశ్వాః అదాంతాశ్వాః ఇవ ఇతరసారథేః భవంతి ..

యస్తు పునః పూర్వోక్తవిపరీతసారథిర్భవతి తస్య ఫలమాహా —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః తు'— అది అనగా ఎవరంటే, సారథిగా చెప్పబడే ఆ బుద్ధి; 'సదా'— ఎల్లవేళలా; 'అయుక్తేన మనసా'— అదుపులోలేని పగ్గములతో పోల్చబడిన మనసుతో కూడినదై; 'అవిజ్ఞానవాన్ భవతి'— అవివేకవంతం, వివేకహీనం అవుతుంది, దాని నైపుణ్యతను కోల్పోతుంది, అంటే ఇతర రథచోదకులలాగా నియోగించడంలోనూ, విరమింపచేయడంలోనూ దానికి సమర్థత నశిస్తుంది. 'తస్య'— అటువంటి అసమర్థత కలిగిన బుద్ధి అనబడే సారథి యొక్క; 'ఇన్ద్రియాణి'— ఇంద్రియములు, అశ్వములతో పోల్చబడిన ఇంద్రియములు; 'సారథేః'— ఇతర నిజ రథచోదకుల యొక్క; 'దుష్టాశ్వాః ఇవ'— పొగరుబోతు గుఱ్ఱములవలె; 'అవశ్యాని'— అధీనములో నుండవు, అదుపు తప్పుతాయి.

(బుద్ధిని కల్పిత రథానికి సారథి అనుకొన్నాం కదా. మరి, ఆ బుద్ధి వివేకవంతమైనదేతే, పగ్గాల సహాయంతో అశ్వాలను నియంత్రించగలిగిన సామర్థ్యం కలిగి రథం సరియైన మార్గాన ప్రయాణించేలా చేస్తుంది. అలా కాకుండా, పగ్గాలతో పోల్చబడిన మనస్సు బుద్ధియొక్క అధీనంలో లేకపోతే, అటువంటి అదుపులేని మనసుతో నిత్యం కూడియుండే బుద్ధికి అశ్వాలను అనగా ఇంద్రియాలను నియంత్రించే సామర్థ్యం ఉండదు. అంటే, బుద్ధి తన వివేకాన్ని కోల్పోతుంది. అలాటి అసమర్థమైన బుద్ధి తన ఇంద్రియాలను పట్టు, విడుపులతో నియంత్రించే శక్తి లేకపోవడం చేత, ఇంద్రియాలు పొగరుబోతు అశ్వాలలాగా, అదుపు తప్పి ప్రవర్తిస్తుంటాయి. అలాటి రథం ఇంద్రియాలు ఎటు లాగితే అటు వెడుతుందే తప్ప నిశ్చయమైన మార్గంలో ప్రయాణించదు, లక్ష్యం చేరదు.)

ఇప్పుడు చెప్పినదానికి విపరీతస్థితి గల సారథివల్ల కలిగే ఫలితం చెప్పబడబోతున్నది.

**యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా .**
**తస్యేన్ద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః .. 1-3-6 ..**

అధీనతలో నున్న మనసుతో నిత్యమూ కూడి ఉండే అది (ఆ బుద్ధి) వివేకవంతమవుతుంది. రథచాలకుని మంచి అశ్వాలలాగా దాని (ఆ బుద్ధి) యొక్క ఇంద్రియాలు నియంత్రణలో ఉంటాయి.

## శంకర భాష్యమ్

యస్తు విజ్ఞానవాన్ నిపుణః వివేకవాన్ యుక్తేన మనసా ప్రగృహీతమనాః సమాహితచిత్తః సదా, తస్య అశ్వస్థానీయానీంద్రియాణి ప్రవర్తయితుం నివర్తయితుం వా శక్యాని వశ్యాని దాంతాః సదశ్వా ఇవేతరసారథేః ..

తత్ర పూర్వోక్తస్యావిజ్ఞానవతో బుద్ధిసారథేరిదం ఫలమాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః తు'— అది అంటే, ముందు చెప్పినదానికి వ్యతిరేక స్థితి కలిగిన సారథి అనగా బుద్ధి; 'సదా'— ఎల్లవేళలా; 'యుక్తేన మనసా'— నియతి కలిగిన పగ్గములతో పోల్చబడిన మనసుతో కూడినదైనందున, ఏకాగ్రమైన మనసుతో కూడినందువల్ల; 'విజ్ఞానవాన్ భవతి'— వివేకవంతం అవుతుంది, నిపుణతను సంతరించుకుంటుంది. 'తస్య'— అటువంటి సమర్థత కలిగిన బుద్ధి అనబడే సారథి యొక్క; 'ఇన్ద్రియాణి'— ఇంద్రియములు, అశ్వములతో పోల్చబడిన ఇంద్రియములు; 'సారథేః'— ఇతర నిజ రథచోదకుల యొక్క; 'సదశ్వాః ఇవ'— మచ్చికచేయబడిన గుఱ్ఱములవలె; 'వశ్యాని'— అధీనములో ఉంటాయి, అదుపులో ప్రవర్తిస్తాయి.

(పై మంత్రంలో చెప్పినదానికి విపరీతమైన పరిస్థితిని వివరిస్తున్నారు ఈ మంత్రంలో. బుద్ధి వివేకవంతమైనదేతే, పగ్గాల సహాయంతో అశ్వాలను నియంత్రించగలిగిన సామర్థ్యం కలిగి రథాన్ని సరియైన మార్గంలో ప్రయాణించేలా చేస్తుంది. అనగా, పగ్గాలతో పోల్చబడిన మనస్సు బుద్ధియొక్క అధీనంలో ఉన్నట్లైతే, అటువంటి ఏకాగ్రమైన మనసుతో నిత్యం కూడియుండే బుద్ధికి కౌశలత్వం ఏర్పడి అశ్వాలను అనగా ఇంద్రియాలను సునాయాసంగా నియంత్రించ గలుగుతుంది. అలాటి సమర్థవంతమైన బుద్ధి తన ఇంద్రియాలను పట్టు, విడుపులతో నియంత్రించ కలిగినందువల్ల, ఇంద్రియాలు మచ్చికచేయబడిన అశ్వాలలాగా, అదుపులోనే ప్రవర్తిస్తుంటాయి.)

క్రిందటి 5 వ మంత్రంలో చెప్పబడిన అవివేకబుద్ధి అనే సారథి వల్ల కలిగే అంతిమ ఫలితం ఈ క్రింది మంత్రంలో చెప్పబోతున్నారు.

**యస్త్వవిజ్ఞానవాన్భవత్యమనస్కః సదాఽశుచిః .**
**న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి .. 1-3-7 ..**

ఎవడైతే (ఏ రథ యజమాని అయితే) అవివేకమైన బుద్ధితోనూ, అదుపులేని మనసుతోనూ, ఎల్లవేళలా దోషపూరితుడై ఉంటాడో, అతడు పరమపదాన్ని చేరడు. సంసారాన్ని పొందుతాడు.

## శంకర భాష్యమ్

యస్త్వవిజ్ఞానవాన్భవతి . అమనస్కః అప్రగృహీతమనస్కః సః తత ఏవ అశుచిః సదైవ . న సః రథీ తత్ పూర్వోక్తమక్షరం యత్పరం పదం ఆప్నోతి తేన సారథినా . న కేవలం తన్నాప్నోతి, సంసారం చ జన్మమరణలక్షణం అధిగచ్ఛతి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః తు'– కాని ఎవడు (రథారోహకుడు అనగా ఆత్మ); 'అవిజ్ఞానవాన్ భవతి'– అవివేకమైన బుద్ధి కలవాడై; 'అమనస్కః'– అదుపులోలేని మనసుతో ఉంటాడో; అతడు అందుచేత, 'సదా'– ఎల్లప్పుడు; 'అశుచిః'– అశుద్ధుడే. 'సః'– అతడు, ఆ రథారోహకుడు లేదా రథ యజమాని; 'తత్'– ఆ, అంటే ముందు చెప్పబడిన నాశములేని; 'పదమ్'– పరమ లక్ష్యాన్ని; 'న ఆప్నోతి'– పొందలేడు, అటువంటి బుద్ధి అనే సారథి సహాయంతో పొందలేడు. కేవలం ఆ పరమపదాన్ని పొందకపోవటమే కాదు. 'సంసారం'– జన్మ, మరణాలు లక్షణాలు కల ప్రాపంచిక జీవితాన్ని; 'అధిగచ్ఛతి'– చేరుతాడు.

(5వ మంత్రంలో అదుపు లేని మనసుతో కూడిన బుద్ధి తన సామర్థ్యాన్ని కోల్పోయి, అవివేకమౌతుందని చెప్పారు కదా. అటువంటి అవివేకమైన బుద్ధి వల్ల, ఆ రథ యజమాని తను చేరవలసిన గమ్యాన్ని చేరలేడు. ఆ విషయాన్నే ఈ మంత్రంలో వివరిస్తున్నారు. అధీనంలో లేని పగ్గాల వల్ల సారథి అశ్వాలపై పట్టుకోల్పోతాడు. తద్వారా అశ్వాలు రథాన్ని తమకు తోచిన విధంగా తీసుకువెళతాయే కాని, రథ యజమాని కోరుకున్న స్థానానికి చేర్చలేవు. ఏకాగ్రతలేని మనసుతో కూడిన బుద్ధి తనకు సహజమైన వివేకాన్ని కోల్పోయి మలినమౌతుంది. అలాటి బుద్ధి సహాయంతో రథ యజమాని తన లక్ష్యమైన పరమపదాన్ని చేరుకోలేడు. పరమపదం చేరకపోగా, సుఖ దుఃఖాలతో నిండి జరామరణాలు లక్షణాలుగాగల సంసారాన్నే ఆ రథ యజమాని పొందుతాడు.)

**యస్తు విజ్ఞానవాన్భవతి సమనస్కః సదా శుచిః .**
**స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే .. 1-3-8 ..**

ఎవడైతే (రథ యజమాని) వివేకమైన బుద్ధి కలిగి, ఏకాగ్రమైన మనసుతో, ఎల్లవేళలా పరిశుద్ధమై ఉంటాడో, అతడు పరమపదాన్ని పొంది దాని నుండి తిరిగి జన్మించడు.

## శంకర భాష్యమ్

యస్తు ద్వితీయో విజ్ఞానవాన్ భవతి విజ్ఞానవత్సారథ్యుపేతో రథీ, విద్వానిత్యేతత్ . యుక్తమనాః సమనస్కః సః తత ఏవ సదా శుచిః . స తు తత్పదమాప్నోతి, యస్మాదాప్తాత్పదాదప్రచ్యుతః సన్ భూయః పునః న జాయతే సంసారే ..

కిం తత్పదమిత్యాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః తు'– ఎవడైతే, రెండవ రకంవాడో (పైన చెప్పిన వానికి భిన్నమైనవాడో); అతడు, 'విజ్ఞానవాన్'– వివేకవంతుడైన సారథి కలిగి ఉంటాడో, అనగా రథ యజమాని జ్ఞానముతో కూడి ఉంటాడో; 'సమనస్కః'– ఏకాగ్రమైన మనసు కలిగినవాడో; ఈ కారణాల చేత ఎవడు, 'సదా శుచిః'– ఎల్లవేళలా పరిశుద్ధమై ఉంటాడో; 'సః తు'– అతడైతే; 'తత్ పదమ్ ఆప్నో ' - ఆ స్థితిని పొందుతాడు; 'యస్మాత్'– దేనినుండి, అనగా పొందబడిన లక్ష్యంనుండి వేరుకాబడనట్టి ఆ పరమపదాన్నుండి; అతడు 'న జాయతే భూయః'– తిరిగి జన్మ పొందడు, అంటే సంసారాన్ని తిరిగి పొందడు.

(ముందు మంత్రంలో చెప్పినవానికి భిన్నమైన రథ యజమాని గురించి వివరిస్తున్నారు. ఈ రథ యజమాని ఎలాంటి వాడంటే, ఇతని సారథి వివేకంగలవాడు. అంటే ఈ రథ యజమాని వివేకం అంటే జ్ఞానంతో సాన్నిహిత్యం కలవాడు. జ్ఞానమే సారథిగా గల ఈ యజమాని మనస్సు ఏకాగ్రమై ఉంటుంది. జ్ఞానము, ఏకాగ్రమైన మనసు గల యజమానిని మలిన పరచే వేరొకటి ఏదీ లేదు. అందువల్ల, అతడు పరిపూర్ణమైన శౌచం కలిగినవాడు. అటువంటి యజమాని తన గమ్యమైన పరమపద స్థితిని పొందుతాడు. ఆ స్థితి ఎటువంటిదంటే, ఆ స్థితికి చేరిన వానికి దానినుండి వేరవడమనేది ఉత్పన్నమే కాదు. అంటే, ఆ స్థితిని చేరినవాడు తిరిగి జన్మించడం అనేది ఉండదు.)

అటువంటి పరమపద స్థితి ఏమిటో వివరిస్తున్నారు.

**విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః .**
**సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ .. 1-3-9 ..**

వివేకం సారథిగాగలిగి, మనసు పగ్గాలు ఆధీనంలో గల మానవుడు అంతిమ మార్గాన్ని పొందుతాడు. అదే సర్వవ్యాపకుని పరమోత్కృష్ట స్థితి.

## శంకర భాష్యమ్

విజ్ఞానసారథిః యస్తు యో వివేకబుద్ధిసారథిః పూర్వోక్తః మనఃప్రగ్రహవాన్ ప్రగృహీతమనాః సమాహితచిత్తః సన్ శుచిర్నరో విద్వాన్ , సః అధ్వనః సంసారగతేః పారం పరమేవ, అధిగంతవ్యమిత్యేతత్ , ఆప్నోతి, ముచ్యతే సర్వసంసారబంధనైః . తత్ విష్ణోః వ్యాపనశీలస్య బ్రహ్మణః పరమాత్మనో వాసుదేవాఖ్యస్య పరమం ప్రకృష్టం పదం స్థానం , సతత్త్వమిత్యేతత్ , యత్ అసావాప్నోతి విద్వాన్ ..

అధునా యత్పదం గంతవ్యం తస్యేంద్రియాణి స్థూలాన్యారభ్య సూక్ష్మతారతమ్యక్రమేణ ప్రత్యగాత్మతయాధిగమః కర్తవ్య ఇత్యేవమర్థమిదమారభ్యతే .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః తు'– ముందు (మంత్రంలో) చెప్పినట్లు ఎవడైతే; 'విజ్ఞానసారథిః'– వివేకవంతమైన బుద్ధిని సారథిగా కలిగినవాడు; 'మనః ప్రగ్రహవాన్'– పగ్గముల వంటి మనసు కలిగినవాడు, అంటే ఎవని మనసు అదుపులో ఉంటుందో, ఎవని మనసు ఏకాగ్రతవల్ల పవిత్రమౌతుందో; 'సః నరః'– ఆ మానవుడు, ఆ విద్వాంసుడు; 'అధ్వనః పారం'– అంతిమ

మార్గం, అంటే ప్రపంచగతికి అతీతమైన అంతిమ పరమలక్ష్యాన్ని; 'ఆప్నోతి'— పొందుతాడు. సర్వ సంసారబంధనాలనుండి విముక్తి పొందుతాడు. 'తత్'— ఆ; 'విష్ణోః'—వాసుదేవుడనే పేరుగల బ్రహ్మ యొక్క లేదా సర్వవ్యాపకత్వ లక్షణమైన విష్ణుత్వం యొక్క; 'పరమం పదం' - ఉత్కృష్టమైన స్థితి లేదా స్థానమే, విద్వాంసుడైన ఈ మానవుడు పొందేది.

(క్రిందటి మంత్రంలో చెప్పబడినట్లుగా ఎవడైతే వివేకమనే సారథి నియంత్రణలో గల రథాన్ని అధిరోహించి ఉంటాడో, అతడి ప్రయాణం సాఫీగా గమ్యంవైపు అంటే తను అనుకొన్న లక్ష్యం దిశగా సాగుతుంది. ఇంద్రియాలనబడే గుఱ్ఱాలను మనసనే పగ్గంతో సరిగా నియంత్రిస్తున్న సారథి వల్ల లక్ష్యంకాని ఇతర విషయాలవైపు మళ్ళవు. అవి లక్ష్యందిశగానే ఏకాగ్రత కల్గి ఉంటాయి. ఇతర విషయాలను వదలి వేయడం వల్ల, లక్ష్యాన్ని కదిలించే మలినత్వమనేది ఉండదు. అంటే లక్ష్యమైన విషయం తప్ప మరొక ధ్యాస ఉండదు. అటువంటి రథికుడు తన అంతిమ లక్ష్యమైన పరమపదాన్ని పొందటమనేది నిశ్చయం. అందులో ఎటువంటి అనుమానం లేదు. దానినే విష్ణుపదం అని కూడా అంటారు. విష్ణువు అంటే సర్వవ్యాపకత్వం అనే తత్త్వార్థమే ఇక్కడ అన్వయించుకోవాలి. అటువంటి పరమోత్కృష్ట స్థితిని చేరుకొంటాడని తాత్పర్యం.

ఇంతటితో రథ కల్పన ముగిస్తున్నారు. ఈ కల్పనద్వారా సాధకుడు ఏ విధంగా తనని తాను లక్ష్యం దిశగా తీసుకువెళ్ళే ప్రయత్నం చేయగలడో వివరించారు. వివేకవంతమైన బుద్ధితో మనసును సహాయంతో ఇంద్రియాలను నియంత్రిస్తూ ఉన్నట్లైతే, అటువంటి వివేకబుద్ధి కలిగిన వాడు ఉన్నత లక్ష్యాన్ని చేరుతాడు. అలా కాకుండా అదుపులో లేని మనసుతో కూడిన బుద్ధి ఇంద్రియాలను నియంత్రించలేనప్పుడు, అట్టి అసమర్థమైన బుద్ధికల సాధకుడు తన లక్ష్యందిశగా పయనించడు అంటే దారి తప్పుతాడు. కాబట్టి, బుద్ధిని సమర్థవంతంగా వినియోగించడమనేది అవసరం.)

ఇక, ఈ పొందదగిన ఈ పరమపదాన్ని ఎలా పొందాలో చూపేందుకు ఈ తరువాతి భాగం ప్రారంభించబడుతోంది. స్థూలమైన ఇంద్రియాలతో మొదలుపెట్టి, స్థూలత్వం నుండి సూక్ష్మత్వం వైపుగా క్రమ క్రమంగా శరీరంలో వసించి ఉండే (అత్యంత సూక్ష్మమైన) ప్రత్యగాత్మను పొందే ఆ విధానం వివరించబడబోతోంది.

**ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః .**

**మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్పరః .. 1-3-10 ..**

విషయాలు ఇంద్రియాల కన్నా సూక్ష్మమైనవి. విషయాల కన్నా మనసు సూక్ష్మం. మనసు కన్నా బుద్ధి సూక్ష్మం. బుద్ధి కన్నా ఆత్మ అత్యంత సూక్ష్మం.

### శంకర భాష్యమ్

స్థూలాని తావదింద్రియాణి, తాని యైః పరైరర్థైరాత్మప్రకాశనాయారబ్ధాని తేభ్య ఇంద్రియేభ్యః స్వకార్యేభ్యః తే పరా హి అర్థాః సూక్ష్మా మహాంతశ్చ ప్రత్యగాత్మభూతాశ్చ . తేభ్యోఽపి అర్థేభ్యశ్చ పరం సూక్ష్మతరం మహత్ప్రత్యగాత్మభూతం చ మనః . మనఃశబ్దవాచ్యం మనస ఆరంభకం భూతసూక్ష్మం , సంకల్పవికల్పాద్యారంభకత్వాత్ . మనసోఽపి పరా సూక్ష్మతరా మహత్తరా

ప్రత్యగాత్మభూతా చ బుద్ధిః, బుద్ధిశబ్దవాచ్యమధ్యవసాయాద్యారంభకం భూతసూక్ష్మం . బుద్ధేరాత్మా సర్వప్రాణిబుద్ధీనాం ప్రత్యగాత్మభూతత్వాదాత్మా మహాన్ సర్వమహత్త్వాత్ అవ్యక్తాద్యత్ప్రథమం జాతం హైరణ్యగర్భం తత్త్వం బోధాబోధాత్మకం మహానాత్మా బుద్ధేః పర ఇత్యుచ్యతే ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఇప్పుడిక ఇంద్రియాలు స్థూలమైనవి. 'ఇంద్రియేభ్యః'– ఆ ఇంద్రియాల కన్నా; 'అర్థాః'– ఇంద్రియ విషయాలు, అంటే వేటిని ప్రకాశింపచేయడానికై ఇంద్రియాలు ఏర్పాటైనాయో అట్టి విషయాలు; 'పరాః'– గొప్పవి, సూక్ష్మమైనవి, మరింత వ్యాపకత్వం కలవి, వాటి ఆంతర్యములైనట్టివి. ఇది ఎలాగంటే, ఇంద్రియాలు, ఇంద్రియ విషయాల యొక్క కార్యములైనందువల్ల. (విషయాలను గ్రహించడానికి జ్ఞానేంద్రియాలు ఏర్పడ్డాయి. అంటే విషయాల కారణంగా వాటిని గ్రహించేందుకై జ్ఞానేంద్రియాలనే కార్యాలు ఏర్పాటైనాయి. ఇక్కడ విషయాలు కారణమైతే, జ్ఞానేంద్రియాలు కార్యమౌతాయి. కారణం కన్నా కార్యమెప్పుడూ స్థూలమే. లేదా కార్యము కన్నా, దానికి కారణమైనది సూక్ష్మం). 'అర్థేభ్యః చ'– ఇంద్రియ-విషయాలకన్నా కూడా; 'మనః'– మనసు; 'పరమ్'– గొప్పది, సూక్ష్మతమమైనది, మరింత వ్యాపకత్వం కలది, వాటి ఆంతర్యమైనది; పంచభూతముల మౌళిక సూక్ష్మరూపమే మనః శబ్దంతో సూచింపబడి మనసు యొక్క స్థూలత్వానికి కారణమౌతున్నాయి. అవే సంకల్ప వికల్పాలను ప్రారంభిస్తున్నాయి. 'మనసః'– మనసుతో పోల్చి చూస్తే; 'బుద్ధిః'– బుద్ధి, వివేకం; 'పరా' - గొప్పది, సూక్ష్మతమమైనది, మరింత వ్యాపకత్వం కలది, మనసుకు ఆంతర్యమైనట్టిది. నిశ్చయం, నిర్ణయం మొదలైనవాటికి ప్రారంభ స్థానమైన పంచతన్మాత్రలు బుద్ధి పదంచేత సూచింపబడుతున్నాయి. 'బుద్ధేః' - అట్టి బుద్ధి కన్నా; 'మహాన్ ఆత్మా'– గొప్పదైనది ఆత్మ. అది ఆత్మ ఎందుకంటే, సర్వ జీవుల బుద్ధికి అంతరతమమైనదైనందున. అది మహాన్, గొప్పది ఎందుకంటే, అది ఇతరములన్నింటికన్నా అత్యంత వ్యాపకత్వం కలిగినట్టిది. అవ్యక్తమునుండి (అనగా మాయనుండి) ప్రథమంగా ఉద్భవించింది, కార్య కారణత్వాలు కలిగిన హిరణ్యగర్భ తత్త్వంగా పిలువబడేది, ఆ మహత్తరమైన ఆత్మ, బుద్ధికన్నా గొప్పది, సూక్ష్మతరమైనది.

(ఇక ప్రయాణం ఎలా సాగాలో ఏ మార్గాన సాగాలో వివరిస్తున్నారు. ప్రత్యగాత్మను చేరుకోవడానికి క్రమంగా స్థూలత్వం నుండి సూక్ష్మత్వం దిశగా పయనించాలి. శరీరంలో జ్ఞానేంద్రియాలైన కళ్ళు, చెవులు, ముక్కు, నోరు, చర్మం స్థూలమైనవి కదా. అటువంటి స్థూలమైన ఇంద్రియాల కన్నా అవి గ్రహించే విషయాలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు సూక్ష్మమైనవి. సూక్ష్మత్వాన్ని ఎలా నిర్ణయిస్తారు, దానికేమైనా ప్రాతిపదిక ఉన్నదా? పరిమాణం ఒక ప్రాతిపదిక అయితే, వ్యాపకశీలత్వం మరొక ప్రాతిపదిక. కార్య కారణ సంబంధం ద్వారా సూక్ష్మత్వాన్ని నిర్ధారించవచ్చు. దేని కారణంగా వేరొకటి కార్యంగా పరిణమిస్తుందో లేదా ఒకదాని వల్ల మరొకటి ఉద్భవిస్తే, వాటిలో ఆ కారణమైన వస్తువు లేదా తత్త్వం పరిణమించిన రెండవదాని కన్నా సూక్ష్మమని గ్రహించాలి. దానినే ఇంకొక విధంగా కూడా చెప్పవచ్చు. రెండవదానికి మొదటిదానిని ఆత్మభావంగా గ్రహించవచ్చు. ఈ ప్రాతిపదికన ఇంద్రియ విషయాలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను గ్రహించే కారణంగా జ్ఞానేంద్రియాలు ఏర్పడినందున, ఇంద్రియవిషయాలు ఇంద్రియాలకన్నా సూక్ష్మమైనవని తెలుసుకోవాలి. అలాగే, ఇంద్రియ విషయాల కన్నా సంకల్ప వికల్ప రూపమైన మనసు గొప్పది లేదా సూక్ష్మమైనది. మనసు కన్నా నిశ్చయాత్మకమైన బుద్ధి సూక్ష్మమైనది. బుద్ధి కన్నా ఆత్మ మహత్తరమైనది లేదా

అత్యంత సూక్ష్మమైనది. జీవమున్న ప్రతి ప్రాణికి బుద్ధి అనేది ఉంటుంది. ఆ బుద్ధికి కారణభూతమైనది మహత్తు. కాబట్టి, అట్టి మహత్తేబుద్ధికన్నా సూక్ష్మతమమైనది. మహత్తు అంటేఅవ్యక్తమైన మాయనుండి సర్వ సృష్టికి ముందుగా వ్యక్తమై,కార్యకారణత్వాలు గల హిరణ్యగర్భతత్త్వంగా పిలువబడే మహా ఆత్మ. ఆ మహా ఆత్మ బుద్ధికన్నా సూక్ష్మతమమైనది, గొప్పది.)

**మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః .**
**పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః .. 1-3-11 ..**

మహత్తు కన్నా అవ్యక్తం గొప్పది. ఆ అవ్యక్తం కన్నా పురుషుడు గొప్పవాడు. పురుషుని కన్నా గొప్పదేదీ లేదు. అదే పరాకాష్ఠ, ఉన్నత లక్ష్యం.

## శంకర భాష్యమ్

మహతోఽపి పరం సూక్ష్మతరం ప్రత్యగాత్మభూతం సర్వమహత్తరం చ అవ్యక్తం సర్వస్య జగతో బీజభూతమవ్యాకృతనామరూపం సతత్త్వం సర్వకార్యకారణశక్తిసమాహారరూపం అవ్యక్తం అవ్యాకృతాకాశాదినామవాచ్యం పరమాత్మన్యోతప్రోతభావేన సమాశ్రితం వటకణికాయామివ వటవృక్షశక్తిః . తస్మాదవ్యక్తాత్ పరః సూక్ష్మతరః సర్వకారణకారణత్వాత్ప్రత్యగాత్మత్వాచ్చ మహాంశ్చ, అత ఏవ పురుషః సర్వపూరణాత్ . తతోఽన్యస్య పరస్య ప్రసంగం నివారయన్నాహ — పురుషాన్న పరం కించిదితి . యస్మాన్నాస్తి పురుషాచ్చిన్మాత్రఘనాత్పరం కించిదపి వస్త్వంతరం , తస్మాత్సూక్ష్మత్వమహత్త్వప్రత్యగాత్మత్వానాం సా కాష్ఠా నిష్ఠా పర్యవసానం . అత్ర హి ఇంద్రియేభ్య ఆరభ్య సూక్ష్మత్వాది పరిసమాప్తం . అత ఏవ చ గంతౄణాం సర్వగతిమతాం సంసారిణాం సా పరా ప్రకృష్టా గతిః, 'యద్గత్వా న నివర్తంతే' (భ. గీ. 15 . 6) ఇతి స్మృతేః ..

నను గతిశ్చేదాగత్యాపి భవితవ్యం , కథం 'యస్మాద్భూయో న జాయతే' (క. ఉ. 1 . 3 . 8) ఇతి ? నైష దోషః . సర్వస్య ప్రత్యగాత్మత్వాదవగతిరేవ గతిరిత్యుపచర్యతే . ప్రత్యగాత్మత్వం చ దర్శితం ఇంద్రియమనోబుద్ధిపరత్వేన . యో హి గంతా సోఽయమప్రత్యగ్రూపం పురుషం గచ్ఛతి అనాత్మభూతం న విందతి స్వరూపేణ . తథా చ శ్రుతిః 'అనధ్వగా అధ్వసు పారయిష్ణవః' (ఇతిహాసోపనిషత్ 18) ఇత్యాద్యా . తథా చ దర్శయతి ప్రత్యగాత్మత్వం సర్వస్య —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'మహతః'— మహత్తు కన్నా; 'అవ్యక్తమ్'— అవ్యక్తం, సమస్త విశ్వానికి బీజరూపంగా ఉన్నట్టిది, అవ్యాకృతమనే పేరు రూపు కలిగినది, సమస్త కార్యకారణ శక్తుల యొక్క సమిష్టి స్థితియైనది, అవ్యక్తమని, అవ్యాకృతమని, ఆకాశమని పిలువబడేది, వటవృక్ష శక్తి నిబిడీకృతమైయున్న వటబీజమువలె పరమాత్మను ఆశ్రయించినట్టిది [వృక్షశక్తి తనయందే నిబిడీకృతమైయున్నప్పటికీ బీజం ఏకంగా యున్నట్లే, మయాశక్తిని కలిగియున్నప్పటికీ పరమాత్మయందు కూడా ద్వైతమనేది లేదు – ఆనందగిరి టీక]; 'పరమ్'— సూక్ష్మం, మరింత వ్యాపనశీలత కలది, అంతరతమమైనది.'అవ్యక్తాత్'—

అవ్యక్తముతో పోల్చినపుడు [అవ్యక్తానికొక నిర్దిష్ట వ్యక్తిత్వమేమీ లేదు. అది ప్రకటితమైన ప్రపంచానికి కారణం. అది పరబ్రహ్మను ఆశ్రయించియున్నందున, పరబ్రహ్మయే ప్రకటితమైన ప్రపంచానికి కారణమా అన్నట్లు గోచరిస్తుంది. కాని, నిజానికి బ్రహ్మ కారణం కాదు. ఎందువలనంటే, అది పరిణామం చెందదు.]; 'పురుషః'– పురుషుడు, అనగా సర్వాన్ని పూరించినవాడు (నిండియున్నవాడు) కావున పురుషుడు; 'పరః'– గొప్పవాడు, సూక్ష్మమైన వాడు మరియు అధికుడు, సర్వకారణములకు కారణమైనవాడు, అన్నింటియొక్క అంతరతమమైనవాడు. అంతకన్నా గొప్పది మరొకటి ఉండే ప్రసక్తి లేదని చెప్పడమే, 'పురుషాత్ న పరమ్ కించిత్' అన్న పాఠానికి అర్థం. అంటే పురుషుని కన్నా అధికమైనది వేరేదీ లేదు. శుద్ధ చైతన్యఘనమైన పురుషునికి అతీతమైన పదార్థమేదీ లేదు కాబట్టి, 'సా'– ఆతడు, ఆ పురుషుడు; 'కాష్ఠా'– సూక్ష్మత్వానికి, గొప్పదనానికి, అంతరతమమైన ఆత్వత్వానికి పరాకాష్ఠ లేదా పర్యవసానం. ఇక్కడనే, ఇంద్రియాలతో ప్రారంభమైన సూక్ష్మత్వం మొదలైనవి (సూక్ష్మత్వం, గొప్పదనం, అంతరతమత్వం) పరిసమాప్తమౌతాయి. కాబట్టే, అది 'పరా గతిః'– పరమ గమ్యం, అంటే గమించేవారికి, సంసారంలో ప్రవర్తిల్లే సమస్త జనులకు అదే అంతిమ గతి, పరమ లక్ష్యం. ఎందువల్లనంటే, స్మృతి కూడా 'దేనిని చేరుకుంటే తిరిగి రారు' ['యద్గత్వా న నివర్తన్తే' (భ.గీ.15.6)] అని మరియు 'ఏది ప్రాప్తిస్తే తిరిగి రారు' ['యం ప్రాప్య న నివర్తన్తే' (భ.గీ.8.21)] అనే చెపుతోంది కూడా.

(సగుణ బ్రహ్మమునకు ప్రతీక అయిన హిరణ్యగర్భ తత్త్వాన్నే మహత్తు అనీ లేదా మహా ఆత్మ అని కూడా అంటారు. అటువంటి మహత్తుతో పోలిస్తే, అవ్యక్తం మరింత గొప్పది, సూక్ష్మమైనది. అవ్యక్తమంటే, వ్యక్తమైన లేదా ప్రకటితమైన హిరణ్యగర్భ తత్త్వానికి కారణమైనది. మర్రి విత్తనంలో విశాలమైన మర్రి చెట్టు దాగి ఉన్నట్లే, వ్యాకృతమైన హిరణ్యగర్భశక్తి కూడా వ్యాకృతం కావడానికి పూర్వం అవ్యక్తంగా ఉన్నది. ఈ అవ్యక్తానికే మాయ అని కూడా పేరు. ఈ అవ్యక్తానితో పోలిస్తే, పురుషుడు అనగా పరమాత్మ లేదా పరబ్రహ్మ సూక్ష్మతమమైన వాడు. ఇక అంతకన్నా సూక్ష్మతమమైనదేదీ లేదు. అన్ని గొప్పదనాలు, అన్ని సూక్ష్మతలూ, అంతరతమత్వాలు పరబ్రహ్మతో అంతమౌతాయి. అన్నింటికీ అదే పరాకాష్ఠ, పరమ లక్ష్యం. స్థూలత్వం నుండి సూక్ష్మత్వానికి మొదలైన ప్రయాణం పరబ్రహ్మతో అంతమౌతుంది. ఆ పరమ లక్ష్యాన్ని చేరుకున్నవాడు తిరిగి వచ్చే ప్రసక్తి ఉండదు అని స్మృతి వాక్యాలను ఉదహరించి నిర్ధారిస్తున్నారు.)

**సందేహం :** వెళ్ళడం అనేది ఉంటే, తిరిగి రావడం అనేది కూడా ఉండటం సంభవమే కదా. మరైతే, 'దేని నుండి తిరిగి ఉద్భవించడు' ['యస్మాద్భూయో న జాయతే' (క.ఉ.1.3.8)] అని ఎలా చెప్పబడింది?

**సమాధానం :** తప్పేమీ లేదు. అతడు సర్వానికి అంతరతమమైన ప్రత్యగాత్మ అయినందువల్ల, అతనిని తెలియడాన్ని పొందటంగా వ్యక్తీకరించడం జరిగింది. మరింకా, అతడు అంతరతమమైన ప్రత్యగాత్మయని ఇంద్రియాలు, మనసు, బుద్ధికి అతీతమైన వాడని చెప్పడం ద్వారా నిరూపణ చేయబడ్డది. యాత్రికుడు తను పొందని, తనది కాని, అశాశ్వతం కాని స్థితిని పొందుతాడు గాని, అందుకు విరుద్ధంగా కాదు. దీనినే శ్రుతి 'మార్గాలకు అతీతమైన దాన్ని పొందగోరేవారు, మార్గాలలో సాగరు' ['అనధ్వగా అధ్వసు పారయిష్ణవః' (ఇతిహాసోపనిషత్ 18)] అని చెప్తోంది. ఆ విధంగా కూడా అతడు సర్వమునందు వసించియున్న ఆత్మగా చూపబడుతోంది.

(ఇక్కడ కలిగే సందేహం మేమంటే, ఒక స్థానం నుండి మరొక స్థానానికి చేరడం అనేది సంభవమైతే, ఆ రెండవ స్థానంనుండి మొదటి స్థానానికి తిరిగి రావడమనేది అంతే సంభవం కదా. మరి, ఆ పరమపదాన్ని చేరుకున్నవారు

తిరిగి రారు అని ఎలా చెప్తారు అన్నది ప్రశ్న. ఇందుకు సమాధానంగా శంకరులు ఇది గమనానికి సంబంధించిన విషయం కాదని వివరిస్తున్నారు. అన్నింటా అంతరంగా నిండిఉన్న ఆత్మను, అజ్ఞానం వల్ల తెలియబడని దానిని జ్ఞానంచేత తెలుసుకోవడమే జరుగుతుంది గాని, తనది కాని వేరొకదానిని లేదా తనకు బాహ్యంగా వేరొక స్థానంలో లేదా కాలంలో ఉన్నదాన్ని పొందటం కాదు. కాబట్టి, ఆత్మను పొందుట అని చెప్పడం కేవలం వ్యావహారికమే. ఆత్మ అంతరతమమైనదని ఎలా గ్రహించగలిగామంటే, అది ఇంద్రియాలకు, మనసుకు, బుద్ధికి అతీతమైనదని చెప్పడం వల్ల. ఆత్మ మనకు బాహ్యంలో ఉన్నట్లైతే, అది ఇంద్రియాలకు, మనసుకు, బుద్ధికి గోచరమయి ఉండేది. ఎప్పుడైతే అది ఇంద్రియాలకు, మనసుకు, బుద్ధికి అతీతమైనదని అన్నామో అది మనకు బాహ్యంగా ఉండే అవకాశమే లేదు. అదేవిధంగా, సర్వానికి అంతరతమమై యున్నదని నిరూపణ జరిగింది. అటువంటి పరమపదాన్ని చేరుకొన్నవారు తిరిగి సంసారాన్ని పొందరనేది నిజమే.)

**ఏష సర్వేషు భూతేషు**
**గూఢోఽఽత్మా న ప్రకాశతే .**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా**
**సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః .. 1-3-12 ..**

అతడు సర్వ భూతములయందు దాగియున్నందున (సర్వము యొక్క) ఆత్మగా ప్రకటితం కాడు. కాని, సూక్ష్మదర్శులైన యోగులు సూక్ష్మబుద్ధిచే అతడిని దర్శిస్తారు.

## శంకర భాష్యమ్

ఏష పురుషః సర్వేషు బ్రహ్మాదిస్తంబపర్యంతేషు భూతేషు గూఢః సంవృతః దర్శనశ్రవణాదికర్మా అవిద్యామాయాచ్ఛన్నః అత ఏవ ఆత్మా న ప్రకాశతే ఆత్మత్వేన కస్యచిత్ . అహో అతిగంభీరా దురవగాహ్యా విచిత్రా చేయం మాయా, యదయం సర్వో జంతుః పరమార్థతః పరమార్థసతత్త్వోఽప్యేవం బోధ్యమానోఽహం పరమాత్మేతి న గృహ్ణాతి, అనాత్మానం దేహేంద్రియాదిసంఘాతమాత్మనో దృశ్యమానమపి ఘటాదివదాత్మత్వేనాహమముష్య పుత్ర ఇత్యనుచ్యమానోఽపి గృహ్ణాతి . నూనం పరస్యైవ మాయయా మోముహ్యమానః సర్వో లోకోఽయం బంభ్రమీతి . తథా చ స్మరణం — 'నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః' (భ.గీ.7.25) ఇత్యాది . నను విరుద్ధమిదముచ్యతే — మత్వా ధీరో న శోచతి (1.2.22), న ప్రకాశత ఇతి చ . నైతదేవం . అసంస్కృతబుద్ధేరవిజ్ఞేయత్వాన్న ప్రకాశత ఇత్యుక్తం . దృశ్యతే తు సంస్కృతయా అగ్ర్యయా, అగ్రమివాగ్ర్యా తయా, ఏకాగ్రతయోపేతయేత్యేతత్ ; సూక్ష్మయా సూక్ష్మవస్తునిరూపణపరయా . కైః ? సూక్ష్మదర్శిభిః 'ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః' (1.3.10) ఇత్యాదిప్రకారేణ సూక్ష్మతాపారంపర్యదర్శనేన పరం సూక్ష్మం ద్రష్టుం శీలం యేషాం తే సూక్ష్మదర్శినః, తైః సూక్ష్మదర్శిభిః, పండితైరిత్యేతత్ ..

తత్ప్రతిపత్త్యుపాయమాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏషః'– ఈ, ఈ పురుషుడు; 'సర్వేషు భూతేషు'– సర్వ జీవజాలములలో, బ్రహ్మము నుండి గడ్డిపోచ పర్యంతము; 'గూఢ'– దాగియున్నాడు లేదా రహస్యంగా యున్నాడు, దర్శన శ్రవణాది కర్మలు కలిగియున్నప్పటికీ అవిద్యచే అనగా మాయచే కప్పబడియున్నాడు. [అవిద్యా అన్న పదం వల్ల అది విద్యచే తొలగించబడేది అని సూచితమౌతుంది. మరి, మాయ అన్నపదం అది సత్యం కానిదని సూచిస్తోంది]. అలా, అతడు (సర్వానికి) ఆత్మ అయినప్పటికీ, 'న ప్రకాశతే'– ఆత్మగా ప్రకటనం కావడం లేదు (మాయచే కప్పబడి ఉండటం చేత). ఆహ్! మాయ ఎంత గంభీరమైనదో, అవగాహనాశక్యం కానిదో, విచిత్రమైనదో కదా! ఎందుకంటే, ప్రతి జీవి నిజానికి పరమతత్త్వమే అయినప్పటికీ, ఆ విధంగా బోధించబడినప్పటికీ, 'నేను పరమాత్మను' అనే సత్యాన్ని పట్టుకోలేక పోతోంది. కాని, అనాత్మ విషయాలైన దేహేంద్రియ సంఘాతాలు తాను కాదని బోధింపబడనప్పటికీ, ఘటం లాగా అవి ఇంద్రియాలకు గోచరించబడే విషయాలని తెలుసుకొంటున్నప్పటికీ, 'నేను ఫలానా వాని పుత్రుడను' అని అంటూ అనాత్మ విషయాలను తన ఆత్మగా అంగీకరిస్తున్నాడు. నిజానికి, పరమాత్మకు సంబంధించిన మాయచే మోహితుడై ప్రతి మానవుడు (జనన మరణాల మధ్య) భ్రమిస్తున్నాడు. ఈ విషయంపైననే స్మృతి 'యోగమాయచే ఆవరింపబడి నేను సర్వులకు ప్రకటితం కాకున్నాను' ['నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః' (భ.గీ.7.25)] అని బోధిస్తోంది. (త్రిగుణాల సమ్మిళితం వల్ల కలిగే మోహాన్నే మాయ అంటారు).

**<u>సందేహం :</u>** 'దానిని తెలిసికొన్నందున, ధీరుడు శోకించడు' ['మత్వా ధీరో న శోచతి' (1.2.22)] అని ఇంతకు ముందు చెప్పి, ఇప్పుడు (ఈ మంత్రంలో) 'న ప్రకాశతి' అని చెప్పడం విరుద్ధంగా లేదా?

**<u>సమాధానం :</u>** ఇది అలా కాదు. చిత్తశుద్ధి లేని వానికి పరమాత్మ తెలియబడనందున 'న ప్రకాశతి'అని చెప్పారు.

'తు'– కాని; 'దృశ్యతే'– దర్శింపబడతాడు, (ఎలా దర్శింపబడతాడు?) 'అగ్ర్యయా'– సంస్కరింపబడిన (బుద్ధి ద్వారా), పదునైన మొనవంటిది అగ్ర, అగ్ర్యయా అంటే అటువంటి ఏకాగ్రతతో కూడిన నిశితమైన, పదునైనటువంటిదాని ద్వారా (బుద్ధి ద్వారా); 'సూక్ష్మయా'– సూక్ష్మమైన విషయాలను గ్రహించడంలో నిమగ్నమైన సూక్ష్మబుద్ధి ద్వారా. [ధ్యానంచేత స్థిరమైన మనసు ఏకాగ్రతను సంతరించుకొని సహాయకారి అయినప్పుడు, (తత్వమసి) మహావాక్యంతో ఆ మనసు అనుసంధానమైతే 'నేను బ్రహ్మమును' అనే నిశ్చయం ఉదయిస్తుంది. ఆ వివేక స్థితిలో బ్రహ్మ సత్యత్వం అనుభవమౌతుంది. దీనినే సాంప్రదాయికంగా పరబ్రహ్మము యొక్క అపరోక్ష ఆత్మానుభూతిగా సూచిస్తారు – ఆనంద గిరి]. ఎవరిచే? సూక్ష్మదర్శిభిః – సూక్ష్మవిషయాలను గ్రహించే పటిమ గల యోగులచే. 'ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః' (1.3.10) అన్న మంత్రంలో చెప్పిన విధంగా సూక్షత్వాన్ని సూక్ష్మత యొక్క ఆరోహణ క్రమంలో అవగాహన చేసుకొంటూ సూక్ష్మతలోనికి చొచ్చుకొనిపోయే నిపుణతతో అత్యంత సూక్ష్మమైనదానిని కనుగొనగలిగిన వారే యోగులు. అట్టి వారిచే అనగా వివేకవంతులచే (దర్శింపబడుతుంది అని అభిప్రాయం).

(క్రిందటి మంత్రంలో పురుషత్వమే అత్యంత సూక్ష్మమైనదని, సూక్ష్మత్వానికి అది పరాకాష్ఠ అని వివరించబడింది కదా!. ఆ పురుషుడే సర్వ జీవరాశులలో గోప్యంగా ఉన్నాడు అని చెప్తున్నారు. అలా గోప్యంగా ఉండటం వల్ల అతడు ప్రకటనం కావడం లేదు. ఉన్నవాడు ప్రకటనం కావడం లేదంటే, ఆ ప్రకటనం కాకపోవడానికి కారణం ఏదో ఉండాలి. ఇక్కడ శంకరులు వివరంగా వ్యాఖ్యానిస్తున్నారు. అన్నిటా పూర్తిగా నిండి ఉన్న పరమాత్మ ప్రకటనం కావడం లేదంటే అతడు మాయచే కప్పబడిఉన్నాడు అని. ఈ మాయ ఎంతటి అఘటనాఘటన పటీయసో ఎటువంటి విచిత్రాలతో

మోహంలో పరిభ్రమింపచేస్తుందో విశదం చేస్తున్నారు. ఈ మాయనే అవిద్య అని అంటారు. అవిద్య అంటే తెలియకపోవడం, అదే అజ్ఞానం. అది ఎంత మోహాన్ని కలుగచేస్తుందో చెప్తున్నారు. మానవునికి నీ నిజ స్వరూపం ఆ పరమాత్మ తత్త్వమే అని ప్రత్యేకంగా చెప్పినప్పటికీ దానిని గ్రహించడం లేదు. కాని, ఏవరూ చెప్పకున్నప్పటికినీ, అనాత్మ విషయాలైన దేహాన్ని, ఇంద్రియాలను మాత్రం తన ఆత్మగా గ్రహించి ప్రవర్తిస్తున్నాడు. అంటే, సత్యాన్ని చెప్పినప్పటికీ గ్రహించుకోకుండా, ఎవరూ చెప్పనప్పటికీ అసత్యాన్నే సత్యంగా నమ్మి భ్రమ పడుతున్నాడు. మరైతే, ఆ పరమపురుషుడు ప్రకటనం కాకుండానే ఉండిపోతాడా అంటే అలా కాదంటున్నారు. సంస్కరింపబడిన బుద్ధి కలిగిన వివేకవంతులైన మహర్షులు, సూక్ష్మ విషయాలను గ్రహించే నైపుణ్యం కలవారు, అత్యంత సూక్ష్మమైన ఆ పురుషుని దర్శింప గలుగుతున్నారు. ఎలా దర్శించ గలుగుతున్నారంటే, ముందు మంత్రంలో చెప్పిన విధంగా సూక్ష్మత్వం వృద్ధిచెందే క్రమమైన ఇంద్రియాల నుండి వాటి విషయాలకు, అంటే ఇంద్రియ విషయాల నుండి మనసు వరకు, మనసు నుండి బుద్ధికి, బుద్ధి నుండి మహత్తుకు, మహత్తు నుండి అవ్యక్తానికి, అవ్యక్తం నుండి పురుషుని వరకు తమ సూక్ష్మబుద్ధి ద్వారా సూక్ష్మత్వాన్ని అనుసరిస్తూ మహర్షులు తిరిగి రాని పరమపదాన్ని చేరుకొంటున్నారు.)

దానిని (ఆ పరమాత్మను) పొందే సాధనా విధానం గురించి ఇక చెప్తున్నారు.

**యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని .**
**జ్ఞానమాత్మని మహతినియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని .. 1-3-13 ..**

**వివేకి ఇంద్రియాలను మనసునందు, మనసును బుద్ధ్యాత్మయందు, బుద్ధ్యాత్మని మహత్తునందు, మహత్తును శాంత్యాత్మ యందు లయం చేయాలి.**

## శంకర భాష్యమ్

యచ్ఛేత్ నియచ్ఛేదుపసంహరేత్ ప్రాజ్ఞః వివేకీ . కిం ? వాక్ వాచం ; వాగత్రోపలక్షణార్థా సర్వేషామింద్రియాణాం . క్వ ? మనసీ మనసి . ఛాందసం దైర్ఘ్యం . తచ్చ మనః యచ్ఛేత్ జ్ఞానే ప్రకాశస్వరూపే బుద్ధావాత్మని . బుద్ధిర్హి మనఆదికరణాన్యాప్నోతీత్యాత్మా ప్రత్యక్ చ తేషాం . జ్ఞానం బుద్ధిం ఆత్మని మహతి ప్రథమజే నియచ్ఛేత్ . ప్రథమజవత్స్వచ్ఛస్వభావకమాత్మనో విజ్ఞానమాపాదయేదిత్యర్థః . తం చ మహాంతమాత్మానం యచ్ఛేత్ శాంతే సర్వవిశేషప్రత్యస్తమితరూపే అవిక్రియే సర్వాంతరే సర్వబుద్ధిప్రత్యయసాక్షిణి ముఖ్యే ఆత్మని ..

ఏవం పురుషే ఆత్మని సర్వం ప్రవిలాప్య నామరూపకర్మత్రయం యన్మిథ్యాజ్ఞానవిజృంభితం క్రియాకారకఫలలక్షణం స్వాత్మయాథాత్మ్యజ్ఞానేన మరీచ్యుదకరజ్జుసర్పగగనమలానీవ మరీచిరజ్జుగగనస్వరూపదర్శనేనైవ స్వస్థః ప్రశాంతః కృతకృత్యో భవతి యతః,

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ప్రాజ్ఞః'– ప్రాజ్ఞత (విజ్ఞత) కలవాడు, వివేకి; 'యచ్ఛేత్'– నిగ్రహించాలి లేదా ఉపసంహరించాలి లేదా లయం చేయాలి. దేనిని (లయం చేయాలి)? 'వాక్'– వాక్కును, వాగింద్రియాన్ని (అంటే అన్ని ఇంద్రియాలను), వాక్ పదం

అన్ని ఇంద్రియాలను సూచిస్తున్నందున. ఎక్కడ (లయం చేయాలి)? 'మనసీ'– మనసు నందు, మనసీ అని ఈకారాన్ని ఉపయోగించడం వైదిక సంప్రదాయం. 'తత్'– ఆ మనసును తిరిగి; 'జ్ఞానే ఆత్మని'– బుద్ధియందు అనగా ప్రకాశమే స్వభావంగా గల దానియందు, అంటే మనసుకు అంతరమైన బుద్ధి యందు; 'యచ్ఛేత్'– లయం చేయాలి. ఎందుకంటే మనసుతో సహా ఇంద్రియాలను బుద్ధివ్యాపించి ఉన్నది కాబట్టి, బుద్ధి వాటికి అంతరతమమైనదే. 'జ్ఞానమ్'– ఆ బుద్ధిని; 'మహతి ఆత్మని'– మహా అత్మయందు, అనగా ప్రథమంగా జనించిన దానియందు (హిరణ్యగర్భుని యందు); 'నియచ్ఛేత్'– లయం చేయాలి. ఉద్దేశ్యమేమంటే, హిరణ్యగర్భుని వలె స్వచ్ఛమైన స్వభావం కలదిగా బుద్ధిని తయారు చేసుకోవాలి. ఆ మహా ఆత్మను, 'శాన్తే'– దేని స్వభావం ఎటువంటి విశేషత లేనిదో, మార్పునకు లోను కాదో అట్టి; 'ఆత్మని'– సర్వమునందు ఉన్నట్టి మరియు బుద్ధిలోని అన్ని మార్పులకు సాక్షియైనట్టి నిజ ఆత్మయందు, 'యచ్ఛేత్'– లయం చేయాలి.

(వివేకవంతుడు పరమపదాన్ని చేరుకొనే విధానాన్ని ఇక్కడ వివరిస్తున్నారు. మొదట ఇంద్రియాలను మనసునందు లయం చేయాలి. ఇంద్రియాల స్వభావం ఏమిటి? బాహ్యంలోనున్న శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను గ్రహించి మనసుకు చేరవేయడం. ఇది వాటి వృత్తి. ఈ ఇంద్రియ వృత్తిని నిర్మూలన చేయడమే ఇంద్రియాలను లయం చేయడం అంటారు. ఇంద్రియాలకు అంతరతమమైనది మనసని ముందే చెప్పారు కదా. ఇంద్రియ వ్యాపారాలు లేకపోతే, మిగిలేది మనసే కదా. కాబట్టి, ఇంద్రియాలను మనసులో లయం చేయడమంటే, ఇంద్రియవృత్తులను కట్టి పెట్టేయడమే. అప్పుడిక ఇంద్రియాలు అనుభవంలో మిగలవు. ఆ ఇంద్రియాలకు అతీతమైన మనసు మాత్రమే అనుభవమౌతుంది. ఇక ఇప్పడు మనసును బుద్ధియందు లయం చేయాలి. మనసు అంటే సంకల్ప వికల్పాల సమ్మేళనం. అంటే ఆలోచనల సముదాయమే మనసు. మనసును ఆలోచనా రహితంగా చేయడమే, బుద్ధియందు లయం చేయడం. ఎందుకంటే మనోప్రవృత్తి లేనప్పుడు మనసు అభివ్యక్తం కాదు. అపుడు, దానికి మూలమైన బుద్ధి మాత్రమే ప్రకటనమౌతుంది. ఇక బుద్ధిని మహా ఆత్మ అనగా హిరణ్యగర్భతత్త్వంలో లయం చేయాలి. అంటే, బుద్ధిని కళంకరహితంగా తీర్చిదిద్దుకోవాలి. వాసనలే బుద్ధిలోని కళంకాలు. ఈ వాసనలను పూర్తిగా నిర్మూలనం చేయడమే బుద్ధిని సంస్కరించుకోవడం. సంస్కరింపబడిన బుద్ధికి హిరణ్యగర్భునికి బేధముండదు. ఆవిధంగా, వాసనా రహితమైన బుద్ధి మహా ఆత్మయందు అనగా హిరణ్యగర్భతత్త్వంలో లయం చేసుకోవాలి. ఇక మహా ఆత్మను సగుణబ్రహ్మను నిర్గుణ పరబ్రహ్మమైన ఆత్మయందు విలీనం చేయాలి. సత్వ, రజ, తమో గుణాత్మకమైన హిరణ్యగర్భతత్త్వం అవ్యక్తం నుండి ప్రథమంగా ఉద్భవించినది. ఈ త్రిగుణాలకు అతీతమైనదే పరబ్రహ్మ తత్త్వమైన ఆత్మ. అది పరమ శాంత స్థితి. ఆస్థితిలో ఎట్టి విశేషతలు, మార్పులు ఉండవు. అదే సర్వజీవులలోనూ వ్యాపించి, బుద్ధియొక్క మార్పులకు సాక్షి స్వరూపంగా ఉన్నటువంటి ఆత్మస్థితి.)

ఎలాగైతే ఎండమావులలోని నీటిని, తాడు నందు తోచే పాముని, ఆకాశంలోని మలినాన్నీ ఎండమావులు, తాడు, ఆకాశాల స్వరూప స్వభావాలు తెలుసుకొనడం ద్వారా అవి సత్యం కాదని తోసిపుచ్చుతున్నామో, అదే విధంగా పురుషుడనబడే ఆత్మ యందు నామము రూపము కర్మ అనబడే మూడింటితో కూడి, మిథ్యాజ్ఞానంచేత విజృంభించబడుతూ, కారక-క్రియ-ఫల లక్షణాలు కలిగిన సర్వస్వాన్నీ విలీనం చేసినవాడు ఆత్మయందు ప్రశాంతంగా సుస్థితుడై కృతార్థుడౌతాడు. అందుచేత---

**ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత .**
**క్షురస్య ధారా నిశితా దురత్యయా**
**దుర్గం పథస్తత్కవయో వదన్తి .. 1-3-14 ..**

ఉద్గమించండి, మేలుకోండి, మహనీయులను సేవించి తెలుసుకోండి. కత్తి మొనలా వాడియైన, దుర్గమమైనదా మార్గమని వారు చెప్తారు.

### శంకర భాష్యమ్

అతస్తద్దర్శనార్థమనాద్యవిద్యాప్రసుప్తాః ఉత్తిష్ఠత హే జంతవః, ఆత్మజ్ఞానాభిముఖా భవత ; జాగ్రత అజ్ఞాననిద్రాయా ఘోరరూపాయాః సర్వానర్థబీజభూతాయాః క్షయం కురుత . కథం ? ప్రాప్య ఉపగమ్య వరాన్ ప్రకృష్టానాచార్యాంస్తత్త్వవిదః, తదుపదిష్టం సర్వాంతరమాత్మానమహమస్మీతి నిబోధత అవగచ్ఛత ; న హ్యుపేక్షితవ్యమితి శ్రుతిరనుకంపయా ఆహ మాతృవత్ , అతిసూక్ష్మబుద్ధివిషయత్వాజ్జ్ఞేయస్య . కిమివ సూక్ష్మబుద్ధిరితి, ఉచ్యతే — క్షురస్య ధారా అగ్రం నిశితా తీక్ష్ణీకృతా దురత్యయా దుఃఖేనాత్యయో యస్యాః సా దురత్యయా . యథా సా పద్భ్యాం దుర్గమనీయా తథా దుర్గం దుఃసంపాద్యమిత్యేతత్ ; పథః పంథానం తత్ తం జ్ఞానలక్షణం మార్గం కవయః మేధావినో వదంతి . జ్ఞేయస్యాతిసూక్ష్మత్వాత్తద్విషయస్య జ్ఞానమార్గస్య దుఃసంపాద్యత్వం వదంతీత్యభిప్రాయః ..

తత్కథమతిసూక్ష్మత్వం జ్ఞేయస్యేతి, ఉచ్యతే . స్థూలా తావదియం మేదినీ శబ్దస్పర్శరూపరసగంధోపచితా సర్వేంద్రియవిషయభూతా తథా శరీరం . తత్రైకైకగుణాపకర్షేణ గంధాదీనాం సూక్ష్మత్వమహత్త్వ విశుద్ధత్వనిత్యత్వాది తారతమ్యం దృష్టమబాదిషు యావదాకాశమితి . తే గంధాదయః సర్వ ఏవ స్థూలత్వాద్వికారాః శబ్దాంతాః యత్ర న సంతి, కిము తస్య సూక్ష్మత్వాదినిరతిశయత్వం వక్తవ్యమిత్యేతద్దర్శయతి శ్రుతిః —

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

అందుచేత ఆ పరమపదాన్ని పొందటానికై అనాదియైన అవిద్యలో నిదురించే ఓ పశువులారా, 'ఉత్తిష్ఠత'— లేవండి, ఆత్మజ్ఞానాభిముఖులు కండి; 'జాగ్రత'— మేల్కొనండి, ఘోరరూపమైన సర్వ అనర్థాలకు కారణమైన అజ్ఞానమనే నిద్రనుండి మేల్కొనండి. ఎలా (ఈ అజ్ఞాన నిద్రను అంతమొందించడ మెలా)? 'వరాన్'— ప్రసిద్ధులైన ఆచార్యులను, తత్వవేత్తలను; 'ప్రాప్య'— సమీపించి; 'నిబోధత'— అవగతం చేసుకోండి, సర్వాంతర్యామియైనట్టి ఆ ఆత్మను నేనే అన్న విషయాన్ని గ్రహించండి. దీనిని ఏమాత్రం ఉపేక్షించకండి అని మాతృసమానమైన కరుణతో ఉపనిషత్తు బోధిస్తోంది. ఎందుకంటే అత్యంత సూక్ష్మబుద్ధిగలవారే ఈ తెలుసుకోదగిన విషయాన్ని అవగతం చేసుకోగలరు. ఆ సూక్ష్మబుద్ధిని దేనితో పోల్చగలం. అదే చెప్తున్నారు. 'క్షురస్య'— కత్తియొక్క; 'నిశితా'— పదునైన; 'ధారా'— అంచును; 'దురత్యయా'— అధిగమించడం ఎంత కష్టతరమో. అంటే, పదునైన కత్తి అంచుపై నడవడం ఎంతటి దుష్కరమైన కార్యమో, అలాగే 'పథః' ('పన్థానమ్' అని గ్రహించాలి) – మార్గము, ఆత్మజ్ఞానం పొందే మార్గం; దుర్గమ్ – పొందుట కఠినతరం; అని

'కవయః'– మహనీయులు; 'వదన్తి'– వివరిస్తారు. అర్థమేమంటే, తెలియవలసినది అత్యంత సూక్ష్మమైనందున దానిని తెలియబరిచే మార్గం చాలా కష్టతరమైనదని వారు చెప్తారు.

ఆ తెలిసికొనవలసినది అత్యంత సూక్ష్మమని ఎలా తెలుసుకోవడం అనేది చెప్తున్నారు. శబ్ద స్పర్శ రూప రస గంధములనే విషయాలచే నిర్మితమైన ఈ పృథివి స్థూలం. ఇది అన్ని ఇంద్రియాలకు విషయవస్తువు. అదేవిధంగా శరీరం కూడా. సూక్ష్మత్వం-మహత్వం-విశుద్ధత్వం-నిత్యత్వం మొదలైనవాటి వృద్ధిక్రమాన్ని, నీటి నుండి ఆకాశము వరకూ ఒక్కొక్క దానియందు ఒక్కొక్క గుణాన్ని తొలగించుకుంటూ పోవడంద్వారా గమనించవచ్చు. కాబట్టి, స్థూలత్వాన్ని కలిగించే గంధం నుండి శబ్దం వరకూ గల ఈ విషయాలేవీ లేని దురవగాహమైన సూక్ష్మతరత్వాన్ని గురించి ఇక చెప్పేదేముంది? ఉపనిషత్తు చూపబోయేది ఇదే.

(పరమపదాన్ని చేరుకోవడానికి మార్గాన్ని సూచన చేసిన తర్వాత, ఈ మంత్రంలో సాధకులను మేల్కొలిపే ప్రయత్నం చేయబడుతోంది. ఇప్పటి వరకు అవిద్యా మోహంలో చిక్కుకొని నిదురించేవారిని తట్టి లేపుతున్నారు. మీరు అనాదిగా ఈ వ్యామోహనిద్రలో మునిగిపోతున్నారు. ఇకనైనా సుదీర్ఘమైన నిద్రనుండి లేవండి. మత్తునుండి మేల్కొనండి. జ్ఞానంవైపు నడవండి. ఎలా నడవడం అనే సందేహముంటే, మీకు సహకరించడానికి, మార్గం చూపడానికి మహనీయులెందరో ఉన్నారు. వారిని సమీపించి సేవించండి. వారు మీకు మార్గనిర్దేశనం చేస్తారు. అంతే కాని, నిరాశా నిస్పృహలనే అలసత్వంతో నీరసించకండి. అయితే, ఆ మార్గం ఎంతో సులభమేమోననిమాత్రం భావించకండి. ఆ మార్గం పదునైన కత్తిమొనలాంటిది అంటే సూక్ష్మమైనదని కఠినతరమైనదని వారు మిమ్ములను హెచ్చరిస్తారు. ఇది మీక్షేమాన్ని ఆశించి మీ మాతృమూర్తి చేసే హెచ్చరిక లాంటిది. దీనిని ఏ మాత్రం నిర్లక్ష్యం చేయవద్దు. కఠినతరమైనదని ప్రయాణాన్ని ప్రారభించకుండా ఉండొద్దని, సులభమైనదనే అతివిశ్వాసం కలిగి ఉండొద్దనీ చేస్తున్న హెచ్చరిక ఇది. ఎందుకంటే, ఈ మార్గంలో మీరు తెలుసుకొనదలచిన ఆ పరమపదం అత్యంత సూక్ష్మమైనది.

తెలుసుకోదగిన ఆ పరమపదం అత్యంత సూక్ష్మమైనదని ఎలా తెలుస్తుంది అని ఇక్కడొక సందేహం రావచ్చు. శబ్ద స్పర్శ రూప రస గంధాలనే పంచతన్మాత్రలచే పృథివి ఏర్పడింది. అంటే, పృథివి చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, త్వక్ అనే పంచఇంద్రియాలకు విషయవస్తువు. ఒక్కొక్క తన్మాత్రను తగ్గించడం ద్వారా నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలలోని మిగిలిన నాలుగు ఏర్పాటవుతాయి. గంధ తన్మాత్రను తొలగించడం ద్వారా నీటిని, ఘ్రాణేంద్రియం తప్ప మిగిలిన నాలుగు ఇంద్రియాలు గ్రహిస్తాయి కనుక నీరు ఆ నాలుగు ఇంద్రియాలకు విషయ వస్తువు. తరువాత రస తన్మాత్రను తీసివేయగా అగ్నిని త్వక్, చక్షు, శ్రోత్రేంద్రియాలు గ్రహిస్తాయి. అలాగే రూప తన్మాత్రను తీసివేయగా వాయువును త్వక్, శ్రోత్రేంద్రియాలు మాత్రమే గ్రహిస్తాయి. అలాగే స్పర్శ తన్మాత్రను తీసివేయగా మిగిలిన ఆకాశాన్ని కేవలం శ్రోత్రేంద్రియం మాత్రమే గ్రహిస్తుంది. ఇలా ఒక్కొక్క విషయవస్తువు తొలగించిగా సూక్ష్మత్వం పృథివి నుండి ఆకాశం వరకూ వృద్ధి చెందుతూ ఉంటుంది. సూక్ష్మత్వమే కాదు, మహత్వం, విశుద్ధత్వం, నిత్యత్వం కూడా అలాగే క్రమంగా వృద్ధి చెందుతూ ఉంటుంది. అయినా, విషయాలు వాటికి ఎంతోకొంత స్థూలత్వాన్ని ఆపాదిస్తూనే ఉంటాయి. అయితే, తెలుసుకోవలసిన ఆ పరమపదంలో ఇటువంటి విషయాలకు ఆస్కారమే లేనందున, అదియే అత్యంత సూక్ష్మమైన, మహత్తరమైన, విశుద్ధమైన, నిత్యత్వమైనట్టిది అని నిరూపితం చేస్తున్నారు. ఈ విషయాన్నే ఉపనిషత్ రాబోయే మంత్రంలో చెపుతోంది.)

**అశబ్దమస్పర్శమరూపమవ్యయం**
**తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్ .**
**అనాద్యనన్తం మహతః పరం ధ్రువం**
**నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే .. 1-3-15 ..**

శబ్దరహితం, స్పర్శ రహితం, రూప రహితం, క్షయ రహితం, రస రహితం, శాశ్వతం, గంధ రహితం, ఆదిలేని, అంతం లేని, మహత్తునకు అతీతమైన, స్థిరమైన దానిని తెలుసుకొన్నవాడు మృత్యుముఖాన్నుండి విడుదలౌతాడు.

## శంకర భాష్యమ్

అశబ్దమస్పర్శమరూపమరసమగంధవచ్చ యత్ , ఏతద్వ్యాఖ్యాతం బ్రహ్మ . అవ్యయం , యద్ధి శబ్దాదిమత్ , తద్వ్యేతి ; ఇదం త్వశబ్దాదిమత్త్వాదవ్యయం న వ్యేతి న క్షీయతే ; అత ఏవ చ నిత్యం ; యద్ధి వ్యేతి, తదనిత్యం ; ఇదం తు న వ్యేతి ; అతో నిత్యం . ఇతశ్చ నిత్యం — అనాది అవిద్యమానః ఆదిః కారణమస్య తదిదమనాది . యచ్చాదిమత్ , తత్కార్యత్వాదనిత్యం కారణే ప్రలీయతే యథా పృథివ్యాది ; ఇదం తు సర్వకారణత్వాదకార్యం , అకార్యత్వాన్నిత్యం ; న తస్య కారణమస్తి యస్మిన్ప్రలీయేత . తథా అనంతం అవిద్యమానోఽన్తః కార్యమస్య తదనంతం . యథా కదల్యాదేః ఫలాదికార్యోత్పాదనేనాప్యనిత్యత్వం దృష్టం , న చ తథాప్యంతవత్త్వం బ్రహ్మణః ; అతోఽపి నిత్యం . మహతః మహత్తత్త్వాద్బుద్ధ్యాఖ్యాత్ పరం విలక్షణం నిత్యవిజ్ఞప్తిస్వరూపత్వాత్ ; సర్వసాక్షి హి సర్వభూతాత్మత్వాద్బ్రహ్మ . ఉక్తం హి — 'ఏష సర్వేషు భూతేషు' (క. ఉ. 1 . 3 . 12) ఇత్యాది . ధ్రువం చ కూటస్థం నిత్యం న పృథివ్యాదివదాపేక్షికం నిత్యత్వం . తత్ ఏవంభూతం బ్రహ్మ ఆత్మానం నిచాయ్య అవగమ్య తం ఆత్మానం మృత్యుముఖాత్ మృత్యుగోచరాదవిద్యాకామకర్మలక్షణాత్ ప్రముచ్యతే వియుజ్యతే ..

ప్రస్తుతవిజ్ఞానస్తుత్యర్థమాహ శ్రుతిః —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యత్'– ఏది; 'అశబ్దమ్'– శబ్దమువలె వినబడేది కాదని; 'అస్పర్శమ్'– స్పృశించుటకు వీలుకానిదని; 'అరూపమ్'– వర్ణములు లేనిదని; 'అవ్యయమ్'– క్షీణతనొందనిదని; 'తథా'– మరియు; 'అరసమ్'– రుచి లేనిదని; 'నిత్యమ్'– శాశ్వతమైనదని, వివరించబడినదో అది అక్షర పరబ్రహ్మం. శబ్దం మొదలైన వాటిని కలిగినది క్షీణత లేదా మార్పు పొందుతుంది. కాని, ఈ చెప్పబడేది, అశబ్దాది లక్షణాలు కలిగినది కాబట్టి అది అవ్యయం, మార్పునొందనిది. తరగనిది, క్షీణత పొందనిది కాబట్టి అది నిత్యం. మార్పుచెందేది ఏదైనా నిత్యం కాదు. అయితే, ఇది మార్పుచెందనిది కాబట్టి శాశ్వతమైనది. దేనికి ఆది (మొదలు), కారణం లేదో అది అనాది అనగా మొదలనేదే లేనిది. ఈ కారణంవల్ల కూడా అది నిత్యం. దేనికి కారణమనేది ఉంటుందో అది అశాశ్వతం. ఎందువల్లనంటే కార్యం తిరిగి దాని కారణంలో

మృత్తిక వలె లయమౌతుంది. కాని, ఇది (ఈ అక్షర పరబ్రహ్మం) సర్వానికి కారణమైనది కనుక అది కార్యం కాదు. కార్యం కానందువల్ల అది నిత్యం. అది లయం కావడానికి కారణమనేది ఏదీ లేదు. అలాగే, 'అనంతమ్'– అంతం లేనిది అనగా కార్యం కానిది. అరటి చెట్టు దాని ఫలాల రూపంలో దాని ఫలితాన్ని అందించిన తర్వాత ఎలా నశిస్తుందో, కనీసం అలాంటి పరిమితి కూడా బ్రహ్మానికి లేదు కాబట్టి, అది నిత్యం. 'మహతః'– బుద్ధి లేక వివేకం అని పిలువబడే మహత్తుకన్నా; 'పరమ్'– వేరైనది, స్వభావరీత్యా అది (ఆ పరబ్రహ్మం) అన్నింటికి సాక్షియైన, నిత్య చైతన్యమైన, సర్వానికీ అంతర్యామియైన పరబ్రహ్మ. 'అది సర్వ భూతములలో నిగూఢమైయున్నదని' ['ఏష సర్వేషు భూతేషు' (క.ఉ.1.3.12)] ఇంతకు ముందే చెప్పబడింది. ఇది, 'ధృవమ్'– మార్పు చెందకుండా స్థిరమైనది, దీని నిత్యత్వం భూమి వంటి వాటివలే సాపేక్షికం కాదు. 'తత్'– ఆ ఆత్మను, ఈ విధమైన పరబ్రహ్మమైన ఆత్మను; 'నిచాయ్య'– అనుభవానికి తెచ్చుకొన్నవాడు; 'మృత్యుముఖాత్'– అనగా అజ్ఞానం, కోరిక, కర్మలనే వాటితో కూడిన మృత్యువు కోరలనుండి; 'ప్రముచ్యతే'– స్వేచ్ఛపొందుతాడు, విడివడుతాడు, ముక్తుడౌతాడు.

(శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధాలనే ఇంద్రియ విషయాలు ఏవీ లేనిది ఆత్మ అని ముందే గ్రహించాం కదా. ఇవేవీ లేనట్టి ఆత్మయొక్క యథార్థ తత్త్వాన్ని నిరూపణచేసే ప్రయత్నం జరుగుతోంది. శబ్దాది విషయాలు కలిగినది ఏదైనా మార్పుకు లోను కావలసినదే అంటే తరిగిపోయేదే, క్షీణించేదే. కాబట్టి, అటువంటిది అనిత్యం. అనిత్యం అంటే ఒకప్పుడు ఒక స్థానంలో ఉండి మరొకప్పుడు మరొకస్థానంలో లేకుండా పోయేది అని అర్థం. ఇందుకు భిన్నంగా మార్పు అనేదే లేనట్టిదానిని శాశ్వతం అంటారు. ఆవిధంగా శబ్దాది విషయ రహితమైనది మార్పులేకుండా ఉంటుంది అంటే శాశ్వతత్వం కలిగి ఉంటుందని అర్థం. ఆవిధంగా ఆలోచిస్తే, ఆత్మ నిత్యం. ఇంతేనా, ఇంకా ఏవిధంగానైనా ఆత్మ నిత్యమని చెప్పవచ్చునా అని ఆలోచిస్తే, మంత్రంలో ఆత్మకు చెప్పిన మరొక లక్షణం అనాది. అంటే, ఆది అనేది లేదు. అలాగే, ఇంకొక లక్షణం అనంతం. అంటే, అంతమనేదే లేనిది అపరిమితం. ఎటువంటిదీ అపరిమితం అని వివరించడానికి శంకరులు అరటి చెట్టుతో పోలిక చూపించి అపరిమిత తత్వాన్ని ఊహించుకోమని చెప్తున్నారు. ఇదెలాగంటే, అరటి చెట్టు కాయలు ఫలాలు ఇచ్చిన తర్వాత నశిస్తుంది. కాని, అన్నిటికి కారణమైన ఆత్మ తన కారణంగా సర్వకార్యాలూ సిద్ధించిన తర్వాత కూడా నశించేది కాదు. కనుక, ఆది, అంతాలు లేనిది ఆత్మ. కార్య కారణ సంబంధాల పరంగా ఆలోచిస్తే, ఆది లేనిది అంటే సర్వ కారణాలకు కారణమై ఉండి, అట్టిదానికి కారణమైనది మరొకటి ఏదీ లేనిది అని అర్థం. అలాగే, కారణత్వమే దాని స్వభావమైనందున అది కార్యం ఎన్నటికీ కాజాలదు. కాబట్టి, కార్యంగా మార్పుచెందే అవకాశమే లేనందువల్ల అది నిత్యం. మరింకొక లక్షణం మేమంటే, అది మహత్తు కన్నా అతీతం. అంటే సగుణ బ్రహ్మతత్త్వమైన హిరణ్యగర్భతత్త్వానికన్నా అతీతమైన నిర్గుణ అక్షర పరబ్రహ్మం. సర్వ జీవుల బుద్ధిగుహలో గుప్తంగా దాగి సర్వవృత్తులకు సాక్షిగా నిలచియున్న నిత్య చైతన్యం. దానిని అనుభవంలోనికి తెచ్చుకొన్న సాధకుడు, మృత్యుకోరలనుండి విముక్తి పొందుతాడు. మృత్యుకోరలంటే, అజ్ఞానంచేత జనించే కోరికల సాఫల్యానికై చేసే కర్మల రూపాలు. ఎప్పుడైతే జ్ఞానానుభవం పొందుతాడో అప్పుడు వాడికి దీపంచేత నశించే చీకటిలా, అజ్ఞానం నశిస్తుంది. అజ్ఞానం లేకపోవడం చేత, కోరిక పుట్టుకనేదే లేకుండా నశిస్తుంది. కోరిక నశిస్తే చేయవలసిన కర్మలేవీ మిగలవు. ఇవేవీ లేకపోతే, వీటన్నిటి కలయిక అయిన మృత్యువు అనేదే లేదు. మరింక అట్టివాడికిక బంధనాలెలా ఉంటాయి? ఉండవు అని ఉపనిషత్తు ఘంటాపథంగా బోధిస్తోంది.)

బోధించబడుతోన్న విజ్ఞానాన్ని ప్రస్తుతిస్తూ శ్రుతి ఇలా అంటోంది.

**నాచికేతముపాఖ్యానం మృత్యుప్రోక్తగ్ం సనాతనమ్ .**

**ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే .. 1-3-16 ..**

మృత్యుదేవతచే బోధింపబడి నచికేతునిచే గ్రహించబడిన ఈ సనాతన ఉపాఖ్యానాన్ని విచారించిన, శ్రవణం చేసిన పండితుడు బ్రహ్మమునందు స్థితుడౌతాడు.

### శంకర భాష్యమ్

నాచికేతం నచికేతసా ప్రాప్తం నాచికేతం మృత్యునా ప్రోక్తం మృత్యుప్రోక్తం ఇదమాఖ్యానముపాఖ్యానం వల్లీత్రయలక్షణం సనాతనం చిరంతనం వైదికత్వాత్ ఉక్త్వా బ్రాహ్మణేభ్యః శ్రుత్వా చ ఆచార్యేభ్యః మేధావీ బ్రహ్మైవ లోకో బ్రహ్మలోకః తస్మిన్ బ్రహ్మలోకే మహీయతే ఆత్మభూత ఉపాస్యో భవతీత్యభిప్రాయః ..

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'మృత్యుప్రోక్తమ్'– మృత్యుదేవతచే ఉపదేశించబడిన; 'నాచికేతమ్'– నచికేతునిచే గ్రహించబడిన; 'సనాతనమ్'– వేదమైనందున నిత్యమైనదైన; 'ఉపాఖ్యానమ్'– మూడు వల్లీలు కలిగిన వృత్తాంతం; 'ఉక్త్వా'– బ్రాహ్మణుల వలన ఆచార్యుల వలన చెప్పగా; 'చ – మరియు; 'శ్రుత్వా'– ఆచార్యులనుండి విన్న; 'మేధావీ'– వివేకవంతుడైన మానవుడు; 'బ్రహ్మలోకే'– బ్రహ్మలోకంలో అంటే బ్రహ్మమునకు అభిన్నమైన స్థితిలో; 'మహీయతే'– కీర్తింపబడతాడు అనగా బ్రహ్మభావంతో ఐక్యమై పూజింపబడుతాడు.

(మృత్యుదేవతచే బోధించబడిన ఈ ఉపదేశాన్ని నచికేతుడు గ్రహించాడు. ఇది వైదికం అనగా వేదమే. కాబట్టి ఈ వృత్తాంతం నిత్యమైనది. అంటే, దేశ కాలాలకు అతీతంగా ఇందులో చెప్పబడిన విషయం ఎప్పుడైనా, ఎక్కడైనా నిరూపితమవుతూనే ఉంటుంది. ఇటువంటి ఉపదేశాన్ని గురువులనుండి వినిన లేదా బ్రాహ్మణులనుండి విచారించి గ్రహించిన వివేకవంతుడు బ్రహ్మముతో ఐక్యమైన స్థితిని పొంది, బ్రహ్మకు అభిన్నుడైనందున పూజనీయుడే అవుతాడు. ఇదీ, ఈ నాచికేతోపాఖ్యాన్ని సమగ్రంగా అధ్యయనం చేసి కృతార్థుడైన వాడు పొందే స్థితి.)

**య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్బ్రహ్మసంసది .**

**ప్రయతః శ్రాద్ధకాలే వా తదానన్త్యాయ కల్పతే ..**

**తదానన్త్యాయ కల్పత ఇతి .. 1-3-17 ..**

బ్రాహ్మణ సభలో లేదా శ్రాద్ధకాలంలో పరమ గుప్తమైన దీనిని పవిత్రంగా శ్రవణంచేస్తే అనన్తమైన ఫలం కలుగుతుంది.

## శంకర భాష్యమ్

యః కశ్చిదిమం గ్రంథం పరమం ప్రకృష్టం గుహ్యం గోప్యం శ్రావయేత్ గ్రంథతోఽర్థతశ్చ బ్రాహ్మణానాం సంసది బ్రహ్మసంసది ప్రయతః శుచిర్భూత్వా శ్రాద్ధకాలే వా శ్రావయేత్ భుంజానాం , తత్ శ్రాద్ధం అస్య ఆనంత్యాయ అనంతఫలాయ కల్పతే సమర్థ్యతే . ద్విర్వచనమధ్యాయపరిసమాప్త్యర్థం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః'– ఎవరైనా; 'పరమం'– ఉత్తమమైనది; 'గుహ్యం'– గుప్తమైనదైన; 'ఇమం'– ఈ ఉపదేశాన్ని లేదా గ్రంథ పాఠాన్ని; 'ప్రయతః'– శౌచాన్ని పాటిస్తూ; 'బ్రహ్మ సంసది'– బ్రాహ్మణుల సభలో; 'శ్రాద్ధకాలే వా'– శ్రాద్ధకాలమందు భోక్తల సమక్షంలో కాని; 'శ్రావయేత్'–అర్థవంతంగా పఠించితే; 'తత్'– ఆ శ్రాద్ధము; 'ఆనంత్యాయ'– అనంతమైన ఫలాన్నిచ్చే; 'కల్పతే'– సామర్థ్యం కలిగినదౌతుంది. వాక్యాన్ని రెండు సార్లు చెప్పడం పాఠ్యభాగం ముగింపునకు సంకేతం.

(ఈ ఉపదేశం అత్యంత విలువైనది. రహస్యమైనది. ఎందుకంటే, జీవితం యొక్క పరమలక్ష్యాన్ని చేర్చే సాధనం కాబట్టి, దీనికన్నా విలువైన ఉపదేశం మరొకటి లేదు. ఈ ఉపదేశం సాధారణంగా లభించేది కాదు. అవగాహన చేసుకోవడం కష్టం కాబట్టి అది గుప్తంగా ఉంది. దాగి ఉంది. దాగి ఉన్నదాన్ని వెలికితీయాలంటే, దేనిచే ఆవరించబడి ఉండటం చేత అది దాచి ఉంచబడిందో, ఆ ఆవరించిన దాన్ని తొలగించాలి. అంటే హృదయాన్ని పరిశుద్ధం చేసుకొంటేనే ఆ గుప్తజ్ఞానాన్ని పొందగలమని చెప్తున్నారు. అలా నిర్మలమైన చిత్తంతో, వేదవేత్తల సమక్షంలో కాని, పితృయజ్ఞం జరిగే సమయంలో కాని ఈ ఉపదేశ పాఠాన్ని అర్థం చేసుకొని పఠించినప్పుడు, ఆ కార్యానికి అనంతఫలాన్ని కలుగచేసే సమర్థత ప్రాప్తిస్తుంది. ఇంతటితో ఈ ఉపదేశం పూర్తయినట్లు సూచనగా అనంత్యాయ కల్పతే అని రెండుసార్లు చెప్పబడింది.

అయితే, ఇక్కడ ఒక సందేహం తలెత్తే అవకాశం ఉంది. ఇప్పటి వరకూ చెప్పిన ఉపదేశమేమో ఆత్మజ్ఞానం గురించి కదా. జ్ఞానం అంటే, కర్మలకు విరుద్ధమైనదికదా. మరి, ఉపదేశానికి ఫలశ్రుతిగా చెప్పినటువంటి ఈ మంత్రంలో ఈ ఉపదేశాన్ని కనుక శ్రాద్ధకాలంలో పారాయణం చేస్తే, ఆ శ్రాద్ధానికి అనంతమైన ఫలితాన్ని ఇచ్చే సమర్థత కలుగుతుందని చెప్తున్నారేమిటి. అంటే, ఈ ఆత్మజ్ఞానోపదేశం చేసే ఈ మంత్రాలకు కర్మలలో వినియోగం చెప్తున్నారు. పితృయజ్ఞం అనే కర్మకు ఈ ఆత్మజ్ఞానోపదేశం ఉపాంగంగా వినియోగాన్ని చెప్తున్నారు. మరి ఇది శంకరుల అద్వైత సిద్ధాంతానికి వ్యతిరేకం అవుతోంది. శంకర భాష్యంలో కూడా దీని గురించిన ప్రస్తావన కనబడటం లేదు. అయితే, ఇక్కడ ఈ విషయాన్ని ఇలా అర్థంచేసుకోవచ్చు. 16వ మంత్రంలో ఈ ఉపదేశం యొక్క ఫలితంగా సాధకుడు బ్రాహ్మీస్థితి పొందుతాడని చెప్పారు. జ్ఞానమే స్వరూపంగాగల బ్రహ్మత్వమే తనంత తానుగా ఎరుకలోకి వస్తుంది. అది మౌళికమైన, ప్రాథమిక ఫలితం. మరి తిరిగి 17వ మంత్రంలో చెప్పిన ఫలశ్రుతి గౌణమైనది. సాధకులలో తారతమ్యత కారణంగా ఉపదేశం యొక్క నిగూఢ తత్వాన్ని అవగాహన చేసుకొనలేక పోయిన మందబుద్ధులు ప్రాథమిక ఫలాన్ని అందుకోలేరు. మరి వారు నిరుత్సాహపడకుండా, కనీసం ఈ ఉపదేశాన్ని పవిత్రమైన పితృయజ్ఞంలో భాగంగా బ్రాహ్మణభోజన సమయంలో అర్థవంతంగా పారాయణ చేసినట్లైతే ఆ పితృయజ్ఞం అనంతమైన ఫలాన్నివ్వడంలో సమర్థమౌతుందని గౌణఫలాన్ని ప్రస్తావించారు. ఈ రెండవదే అసలైన ఫలమైతే, 16వ మంత్రంలోని ఫలం యొక్క

ప్రస్తావనే ఉండేది కాదు.  అసలు ఉపనిషత్తు ప్రస్తావించే విషయం జ్ఞానమే స్వరూపంగా గల ఆత్మతత్త్వాన్ని గురించి. కాబట్టి, 17వ మంత్రం చెప్పబడినది గౌణఫలంగానే గ్రహించుకోవాలి.  ఇది రచయిత స్వంత అభిప్రాయం మాత్రమే అని పాఠకులు గ్రహించాలి.)

.. ఇతి తృతీయవల్లీభాష్యం ..

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ కాఠకోపనిషద్భాష్యే ప్రథమోఽధ్యాయః ..

# ద్వితీయోఽధ్యాయః

# చతుర్థీ వల్లీ

### శంకర భాష్యమ్

'ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా' (క.ఉ. 1.3.12) ఇత్యుక్తం . కః పునః ప్రతిబంధోఽగ్ర్యాయా బుద్ధేః, యేన తదభావాదాత్మా న దృశ్యత ఇతి తదదర్శనకారణప్రదర్శనార్థా వల్లీ ఆరభ్యతే ; విజ్ఞాతే హి శ్రేయఃప్రతిబంధకారణే తదపనయనాయ యత్న ఆరబ్ధుం శక్యతే, నాన్యథేతి —

### శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అతడు సర్వ భూతములయందు దాగి ప్రకటితం కాడు. అయితే సూక్ష్మబుద్ధితో అతడిని దర్శిస్తారు.' ['ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా' (క.ఉ. 1.3.12)] అని ఇంతకు ముందు (ఈ ఉపనిషత్తులో) చెప్పబడింది. సూక్ష్మబుద్ధికి అడ్డుపడేది ఏది? ఎందువల్ల ఆ సూక్ష్మబుద్ధి రహితమైన స్థితిలో ఆత్మ దర్శనం కాదు? అనే ప్రశ్నలకు సమాధానంగా ఆత్మయొక్క అదర్శనానికి కారణాన్ని చూపేందుకే ఈ వల్లీ ఆరంభించబడుతోంది. [శంకరుల వ్యాఖ్యానంలో 'తదదర్శన' అన్న పాఠం ఆధారంగా పై వివరణ చెప్పబడింది. 'తద్దర్శన' అన్న పాఠాంతరం తీసుకొంటే ఇందుకు వ్యతిరేకమైన భావం వస్తుంది – స్వామి గంభీరానంద]. ఎందుకంటే, శ్రేయానికి అడ్డుపడేది ఏదో తెలుసుకొంటేనే, దానిని తొలగించుకొనే ప్రయత్నం చేయగలం. వేరే విధంగా (తొలగించుకోవడం) కుదరదు.

**పరాఞ్చి ఖాని వ్యతృణత్ స్వయంభూ-**
**స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్ .**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష-**
**దావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్ .. 2-1-1 ..**

స్వయంభువుడైన పరమాత్మ శ్రోత్రాది ఇంద్రియాలను బాహ్యములైన వాటినిమాత్రమే గ్రహించేలా నియంత్రించినందున అవి బాహ్య విషయాలనే గ్రహిస్తాయి కాని అంతరాత్మను గ్రహించలేవు. అరుదుగా వివేకవంతుడొకడు మాత్రం, అమృతత్వాన్ని కోరి, ఇంద్రియాలను కప్పివేసి, అంతరాత్మను దర్శిస్తాడు.

## శంకర భాష్యమ్

పరాంచి పరాగంచంతి గచ్ఛంతీతి, ఖాని ఖోపలక్షితాని శ్రోత్రాదీనీంద్రియాణి ఖానీత్యుచ్యంతే . తాని పరాంచ్యేవ శబ్దాదివిషయప్రకాశనాయ ప్రవర్తంతే . యస్మాదేవంస్వభావకాని తాని వ్యతృణత్ హింసితవాన్ హననం కృతవానిత్యర్థః . కోఽసౌ ? స్వయంభూః పరమేశ్వరః స్వయమేవ స్వతంత్రో భవతి సర్వదా న పరతంత్ర ఇతి . తస్మాత్ పరాఙ్ పరాగ్రూపానానాత్మభూతాఞ్ఛబ్దాదీన్ పశ్యతి ఉపలభతే ఉపలబ్ధా నాంతరాత్మన్ నాంతరాత్మానమిత్యర్థః . ఏవంస్వభావేఽపి సతి లోకస్య కశ్చిత్ నద్యాః ప్రతిస్రోతఃప్రవర్తనమివ ధీరః ధీమాన్వివేకీ ప్రత్యగాత్మానం ప్రత్యక్ చాసావాత్మా చేతి ప్రత్యగాత్మా . ప్రతీచ్యేవాత్మశబ్దో రూఢో లోకే, నాన్యత్ర . వ్యుత్పత్తిపక్షేఽపి తత్రైవాత్మశబ్దో వర్తతే ; 'యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ . యచ్చాస్య సంతతో భావస్తస్మాదాత్మేతి కీర్త్యతే' ; ఇత్యాత్మశబ్దవ్యుత్పత్తిస్మరణాత్ . తం ప్రత్యగాత్మానం స్వస్వభావం ఐక్షత్ అపశ్యత్ పశ్యతీత్యర్థః, ఛందసి కాలానియమాత్ . కథం పశ్యతీతి, ఉచ్యతే — ఆవృత్తచక్షుః ఆవృత్తం వ్యావృత్తం చక్షుః శ్రోత్రాదికమింద్రియజాతమశేషవిషయాత్ యస్య స ఆవృత్తచక్షుః . స ఏవం సంస్కృతః ప్రత్యగాత్మానం పశ్యతి . న హి బాహ్యవిషయాలోచనపరత్వం ప్రత్యగాత్మేక్షణం చైకస్య సంభవతి . కిమిచ్ఛన్పునరిత్థం మహతా ప్రయాసేన స్వభావప్రవృత్తినిరోధం కృత్వా ధీరః ప్రత్యగాత్మానం పశ్యతీతి, ఉచ్యతే . అమృతత్వం అమరణధర్మత్వం నిత్యస్వభావతాం ఇచ్ఛన్ ఆత్మన ఇత్యర్థః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఖాని'– ఆకాశం వంటి లక్షణాలు కలవి అంటే శ్రోత్రాది ఇంద్రియాలు సూచింపబడుతున్నాయి; 'పరాఞ్చి'– బాహ్యానికి వెళ్ళేవి. అంటే ఇంద్రియాలు వాటి విషయాలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను ప్రకాశింపచేయడానికి (దేహానికి) బాహ్యంలోకి మాత్రమే ప్రవర్తిల్లుతాయి. వాటి స్వభావం అలాంటిదైనందున, వాటిని శిక్షించాడు, అంటే దెబ్బకొట్టాడు లేదా నియంత్రించాడు. ఎవరు? 'స్వయంభూః'– 'స్వయమ్' అనగా తనంత తాను 'భూః' అనగా ఉన్నట్టి పరమేశ్వరుడు, అంటే స్వతంత్రుడు, దేనిపైనా ఆధారపడనివాడు అనగా పరతంత్రుడు కానివాడు; 'తస్మాత్'– అందువలన; మానవుడు 'పరాక్'– బాహ్యాన్ని అంటే అనాత్మ విషయాలై బాహ్యంలో ఉనికి కలిగిన శబ్దాదులను; 'పశ్యతి'– చూస్తాడు, గ్రహిస్తాడు; కాని, 'న అన్తరాత్మన్' అంటే 'న అన్తరాత్మానమ్'– అంతరాత్మను కాదు. మానవుని స్వభావం ఇలాంటిదైనప్పటికీ, ప్రవాహానికి ఎదురీదే విధంగా, 'కః చిత్ ధీరః'– ఒక (అరుదైన) వివేకి లేదా ధీమంతుడు; 'ప్రత్యగాత్మానమ్'– అంతరాత్మ, ప్రత్యక్ అనగా అంతరమైనది, అదే సమయంలో ఆత్మయైనది అనగా ప్రత్యగాత్మ. లోకంలో సాధారణంగా ఆత్మ శబ్దాన్ని ప్రయోగిస్తే వ్యక్తిగతమైన ఆత్మయేననే తప్ప మరొకటి కాదు. శబ్దోత్పత్తి పరంగా చూస్తే కూడా ఆత్మ అంటే ఇదే భావం. ఎందుకంటే, ఈ శబ్దాన్ని నిర్వచించిన స్మృతి వాక్యం ఇలా ఉంది. 'ఏది లోకంలోని విషయాలన్నింటిని వ్యాపించి, లయంచేసుకొని, అనుభవిస్తుందో మరియు దేనినుండి లోకం తన అపరిచ్ఛిన్నమైన ఉనికిని కలిగి ఉంటున్నదో, దానిని ఆత్మ అంటారు' ['యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ. యచ్చాస్య సంతతో భావస్తస్మాదాత్మేతి కీర్త్యతే' (లిం.పు. 1.70.96)]. ఆ అంతరాత్మను అంటే తన స్వభావాన్ని, 'ఐక్షత్'– చూస్తాడు. కాల నియమాలను (శబ్దాల యొక్క భూత, భవిష్యత్, వర్తమాన కాలరూపాలను) వైదిక ఛందస్సు తరచుగా పాటించదు. ఎలా చూస్తాడో చెప్తున్నారు. 'ఆవృత్తచక్షుః' – కన్నులను కప్పివేసినవాడై అంటే చక్షువు మొదలైన ఇంద్రియ సమూహాన్ని ఇంద్రియవిషయాలనుండి విముఖపరచి. అలాటి వాడు, ఆ విధంగా సంస్కరించబడినవాడు, ప్రత్యగాత్మను దర్శిస్తాడు. బాహ్య విషయాలలో నిమగ్నమైయుండటం మరియు ఆత్మను దర్శించటం ఒకే వ్యక్తిలో

సంభవంకాదు. మరైతే, వివేకి తన సహజ స్వభావాన్ని గట్టి ప్రయత్నంతో నిరోధించి, ఆత్మను ఎందుకు తెలుసుకొంటాడు అన్న ప్రశ్నకు ఇదీ సమాధానం. 'అమృతత్వమ్'–తన నిజ శాశ్వత స్వభావమైన మరణరహిత స్థితిని, 'ఇచ్ఛన్'– తనకుతానే కోరుకున్నందు చేత.

(ఇంద్రియాలు బాహ్యంలోనున్న విషయాలను గ్రహించడంలోనే సమర్థత గలవి. అవి అంతరంలోనున్న విషయాలను గ్రహించలేవు. ఉదాహరణకు కన్నులు తమకు బయట ఉన్న వస్తువులనే చూడగలవు గాని, వాటికి లోపల ఉన్న రక్త మాంసాలను దర్శించలేవు కదా. ఆవిధంగా, వాటిని నియంత్రించింది నిర్బంధించింది నిరోధించింది ఆ పరమేశ్వరుడే. అతడు స్వయంభువుడు. తనంత తానుగా, స్వతంత్రగా ఉనికి కలవాడు. అతడి ఉనికికి ఇతరములేవీ కారణంకాదు, అంటే అతడు పరతంత్రుడు కాదు. ఇంద్రియాలు బాహ్యంలోకి మాత్రమే వెళ్ళి విషయాలను గ్రహించే స్వభావం కలవి కావడంచేత, మానవుడు బాహ్య విషయాలని మాత్రమే గ్రహించగలడు కాని, అంతరంగా ఉన్న అంతరాత్మను దర్శించలేడు. అయితే, ప్రవాహానికి ఎదురీదే వానిలాగా, అరుదుగా ఎవడో ఒకడు, వివేకవంతుడు మరణ రహిత స్థితిని పొందాలనే కోరికతో ఇంద్రియాలను కప్పివేసి అంతరాత్మను దర్శిస్తాడు. ఇక్కడ ఒక విషయం స్పష్టమౌతోంది. బాహ్య విషయాలమీద ఆసక్తి కలిగి వాటిగురించే ఆలోచన చేసేవాడు, అంతర్ముఖుడు కాలేడు. అంతరాత్మను దర్శించాలనే పట్టుదల కలవాడు, ప్రయత్న పూర్వకంగా బాహ్య విషయాలను నిరసిస్తాడు. అంటే, బాహ్యవిషయాలలో నిమగ్నమైనవాడు, అంతరాత్మను దర్శించగలగటం అసంభవమైన విషయం.)

**పరాచః కామాననుయన్తి బాలా**
**స్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్ .**
**అథ ధీరా అమృతత్వం విదిత్వా**
**ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే** **.. 2-1-2 ..**

మూఢులు బాహ్యమైన కోరికలను అనుసరిస్తారు. విస్తృతమైన మృత్యుపాశాలలో చిక్కుతారు. మరి ధీమంతులు, అనిత్యములైన వాటి నడుమ శాశ్వతమైన మరణరహిత స్థితిని ఎరిగినవారై, ఇహంలో దేనికొరకూ ప్రార్థించరు.

### శంకర భాష్యమ్

యత్తావత్స్వాభావికం పరాగేవానాత్మదర్శనం తదాత్మదర్శనస్య ప్రతిబంధకారణమవిద్యా తత్ప్రతికూలత్వాద్యా చ పరాగేవావిద్యోపప్రదర్శితేషు దృష్టాదృష్టేషు భోగేషు తృష్ణా తాభ్యామవిద్యాతృష్ణాభ్యాం ప్రతిబద్ధాత్మదర్శనాః పరాచః బహిర్గతానేవ కామాన్ కామ్యాన్విషయాన్ అనుయంతి అనుగచ్ఛంతి బాలాః అల్పప్రజ్ఞాః తే తేన కారణేన మృత్యోః అవిద్యాకామకర్మసముదాయస్య యంతి గచ్ఛంతి వితతస్య విస్తీర్ణస్య సర్వతో వ్యాప్తస్య పాశం పాశ్యతే బధ్యతే యేన తం పాశం దేహేంద్రియాదిసంయోగవియోగలక్షణం . అనవరతం జన్మమరణజరారోగాద్యనేకానర్థవ్రాతం ప్రతిపద్యంత ఇత్యర్థః . యత ఏవం అథ తస్మాత్ ధీరాః వివేకినః

ప్రత్యగాత్మస్వరూపావస్థానలక్షణం అమృతత్వం ధ్రువం విదిత్వా . దేవాద్యమృతత్వం హ్యధ్రువం , ఇదం తు ప్రత్యగాత్మస్వరూపావస్థానలక్షణం ధ్రువం , 'న కర్మణా వర్ధతే నో కనీయాన్' ఇతి శ్రుతేః . తదేవంభూతం కూటస్థమవిచాల్యమమృతత్వం విదిత్వా అధ్రువేషు సర్వపదార్థేషు అనిత్యేషు నిర్ధార్య, బ్రాహ్మణా ఇహ సంసారేఽనర్థప్రాయే న ప్రార్థయంతే కించిదపి ప్రత్యగాత్మదర్శనప్రతికూలత్వాత్ . పుత్రవిత్తలోకైషణాభ్యో వ్యుత్తిష్ఠంత్యేవేత్యభిప్రాయః ..

యద్విజ్ఞానాన్న కించిదన్యత్ప్రార్థయంతే బ్రాహ్మణాః, కథం తదధిగమ ఇతి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఇప్పుడిక, బాహ్యములైన అనాత్మవిషయాలను గ్రహించడమనే స్వభావమే, ఆత్మ దర్శనానికి ప్రతిబంధ కారణం. అదియే విద్యకు ప్రతికూలమైన అవిద్య. ఆ అవిద్యచే కల్పించబడిన దృశ్యాదృశ్య భోగాలను అనుభవించాలనుకోవడం తృష్ణ. ఈ అవిద్య మరియు తృష్ణలచే ఎవరైతే ఆత్మదర్శనాన్ని నిరోధించుకొంటారో, 'బాలాః' - అటువంటి అల్పబుద్ధులు; 'పరాచః కామాన్'– బాహ్య విషయాలపై కోరికలను; 'అనుయన్తి'– అనుసరిస్తారు. 'తే'– వారు, ఆ కారణం చేత, 'వితతస్య'– విస్తారమైన, సర్వత్రా వ్యాపితమైయున్న; 'మృత్యోః'– మృత్యువు యొక్క, అంటే అవిద్య, కోరిక మరియు కర్మల సముదాయం యొక్క; 'పాశమ్'– పాశాలలో, వేటిచే కట్టివేయడం జరుగుతుందో అట్టి బంధనాలలో, అంటే దేహేంద్రియాల సంయోగ వియోగాలతో నిండిన వాటిలో; 'యాన్తి'– చిక్కుకుంటారు. అంటే వారు జనన, మరణ, జర, వ్యాధుల వంటి అనేక అనర్థాలకు నిరంతరం గురి అవుతూనే ఉంటారు అని అర్థం. ఇదిలా ఉన్నందున, 'అథ'– కాబట్టి; 'ధీరాః'– ధీమంతులు, వివేకవంతులు; 'అమృతత్వమ్'– మరణరహితం, అంతరాత్మయొక్క నిజస్థితిలో ఉండటం; 'ధ్రువమ్'– నిశ్చయంగా; 'విదిత్వా'– తెలుసుకొన్నవారై, ఎందుకంటే, దేవతలు మరియు ఇతరుల అమృతత్వం అస్థిరం. కాని, ఈ అమృతత్వం అనగా అంతరాత్మ నిజస్థితిలో నిలచియుండటం స్థిరమైనది. దీనిని సమర్థిస్తూ, 'కర్మలచే వృద్ధి క్షీణతలు పొందదు' ['న కర్మణా వర్ధతే నో కనీయాన్' (బృ.ఉ. 4.4.23)] అన్న శ్రుతివాక్యం ఉన్నది. ఈ విధమైన స్థిరమైన, కదల్చను వీలుగాని అమృతత్వాన్ని తెలుసుకొన్నవాడై, 'అధ్రువేషు'– అశాశ్వతమైన వాటి నడుమ, బ్రహ్మను తెలుసుకొన్నవారు, 'ఇహ'– ఈ లోకంలో, అనర్థాలతో నిండిన ఈ లోకంలో; అంతరాత్మ దర్శనానికి ఇవన్నీ ప్రతిబంధకాలైనందున, 'న ప్రార్థయన్తే'– ప్రార్థింపరు, దేని గురించీ కోరరు. అంటే వారు పుత్రుల గురించి, ధనం గురించి, లోకాల గురించిన కోరికలను అధిగమిస్తారని అభిప్రాయం.

(ఆత్మదర్శనాన్ని ఏది నిరోధిస్తోందో చెప్తున్నారు. ఇంద్రియాల ద్వారా బాహ్యవిషయాలను గ్రహించే స్వభావం ఏదైతే ఉన్నదో, ఆ స్వభావమే ఆత్మను దర్శింప వీలులేకుండా చేస్తోంది. దానినే అవిద్య అంటారు. విద్య అంటే ఆత్మను దర్శించుకోగలగటం. దానికి విరోధమైనది, ప్రతిబంధకమైనది అవిద్య. కాబట్టి, అవిద్య అంటే ఇంద్రియాల ద్వారా బాహ్యవిషయాలను గ్రహించడమే. విషయాలలో కొన్ని దృశ్యంగా కనబడేవి మరికొన్ని అదృశ్యంగా కనబడనివి ఉంటాయి. ఇవన్నీ అవిద్యామూలకంగా కల్పించబడిన విషయాలే. ఈ దృశ్యమైన, అదృశ్యమైన విషయాలను అనుభవించాలనుకోవడాన్నే తృష్ణ అంటారు. కాబట్టి, అవిద్య మరియు తృష్ణల వల్ల నిత్యమూ సత్యమైన ఆత్మ కనబడటం లేదు. ఎవరైతే ఈ అవిద్య, తృష్ణలు కలిగి ఉంటారో వారు బాలురు లేదా అల్పబుద్ధులు. వారు స్వభావ రీత్యా, బాహ్యవిషయాల పట్ల కోరికలు కలిగివారై, ఆ కోరికలు తీర్చుకోవడానికి తగిన కర్మలు చేస్తూ పడరాని పాట్లు పడుతూ ఉంటారు. ఆవిధంగా వారు, అవిద్య, కోరికలు మరియు కర్మలనబడే మృత్యుపాశాలలో చిక్కుకొని

జన్మించడం, మరణించడం, వృద్ధాప్యం పొందడం, వ్యాధికి గురి కావడం వంటి అనేక అనర్థాలను నిరంతరంగా పొందుతున్నారు. అయితే, ఇందుకు వ్యతిరేకంగా, తెలివిగలవారు, ఈ జననమరణ ప్రవాహానికి ఎదురీది నిశ్చితమైన శాశ్వతమైన పరమపదాన్ని సాధించుకోవాలనే కోరికతో, ఇంద్రియవ్యాపారాలను ముగించేసి ప్రత్యగాత్మను తెలుసుకొంటారు. అంటే, అవిద్యా కారకమైన ఇంద్రియవ్యాపారాలను నిర్మూలిస్తే, వాటి గురించిన కోరికలు సమూలంగా నశిస్తాయి. కోరికలు సమూలంగా నశిస్తే ఇక వాటి గురించి చేయవలసిన కర్మలనేవే ఉండవు. ఆవిధంగా, ఆత్మదర్శనానికి ప్రతిబంధకాలైన అవిద్య, కోరిక, కర్మలనేవే ఉండవు. అంటే, ప్రతిబంధకాలు తొలగిపోతే ఆత్మ తనంతతానుగా, మబ్బులు వీడిన సూర్యునిలా, ప్రకాశిస్తుంది. ఈ సత్యాన్ని గ్రహించిన ధీమంతులు, ఇహలోకంలోని విషయాలను కోరనే కోరరు.)

దేనిని సాధించడం చేత జ్ఞానులు ఇతరాలనేమీ కోరరో, దానిని తెలుసుకోవడం ఎలా అనే విషయాన్ని ప్రస్తావిస్తున్నారు.

**యేన రూపం రసం గన్ధం**
**శబ్దాన్స్పర్శాగ్ంశ్చ మైథునాన్ .**
**ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే .**
**ఏతద్వై తత్ .. 2-1-3 ..**

ఏది రూప, రస, గంధ, శబ్ద, స్పర్శ మరియు మైథునాలనే వీటిని తెలుసుకుంటోందో అది కాక ఇక్కడ ఏం మిగిలి ఉంది? అది నిశ్చయంగా ఇదే (నీవడిగినదే).

### శంకర భాష్యమ్

యేన విజ్ఞానస్వభావేనాత్మనా రూపం రసం గంధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్ మైథుననిమిత్తాన్సుఖప్రత్యయాన్ విజానాతి విస్పష్టం జానాతి సర్వో లోకః . నను నైవం ప్రసిద్ధిర్లోకస్య ఆత్మనా దేహాదివిలక్షణేనాహం విజానామీతి . దేహాదిసంఘాతోఽహం విజానామీతి తు సర్వో లోకోఽవగచ్ఛతి . నను దేహాదిసంఘాతస్యాపి శబ్దాదిస్వరూపత్వావిశేషాద్విజ్ఞేయత్వావిశేషాచ్చ న యుక్తం విజ్ఞాతృత్వం . యది హి దేహాదిసంఘాతో రూపాద్యాత్మకః సన్ రూపాదీన్విజానీయాత్ , తర్హి బాహ్యా అపి రూపాదయోఽన్యోన్యం స్వం స్వం రూపం చ విజానీయుః . న చైతదస్తి . తస్మాద్దేహాదిలక్షణాంశ్చ రూపాదీన్ ఏతేనైవ దేహాదివ్యతిరిక్తేనైవ విజ్ఞానస్వభావేనాత్మనా విజానాతి లోకః . యథా యేన లోహో దహతి సోఽగ్నిరితి తద్వత్ ఆత్మనోఽవిజ్ఞేయం . కిం అత్ర అస్మింల్లోకే పరిశిష్యతే న కించిత్పరిశిష్యతే సర్వమేవ త్వాత్మనా విజ్ఞేయం , యస్యాత్మనోఽవిజ్ఞేయం న కించిత్పరిశిష్యతే, స ఆత్మా సర్వజ్ఞః . ఏతద్వై తత్ . కిం తత్ యన్నచికేతసా పృష్టం దేవాదిభిరపి విచికిత్సితం ధర్మాదిభ్యోఽన్యత్ విష్ణోః పరమం పదం యస్మాత్పరం నాస్తి తద్వై ఏతత్ అధిగతమిత్యర్థః ..

అతిసూక్ష్మత్వాద్దుర్విజ్ఞేయమితి మత్వైతమేవార్థం పునః పునరాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏన'– దేనివలన, ఎరుకయే స్వభావంగా గల దేనిచే (అంటే ఏ ఆత్మచే); జనులు 'రూపమ్'– రంగును; 'రసమ్'– రుచిని; 'గన్ధమ్'– వాసనను; 'శబ్దమ్'– శబ్దాన్ని; 'స్పర్శాన్'– స్పర్శను; 'చ'– మరియు; 'మైథునమ్'– సంభోగ సుఖాన్ని; విజానాతి – స్పష్టంగా గ్రహిస్తున్నారో.

**సందేహం :** లోకంలో 'దేహానికి విలక్షణమైన ఆత్మద్వారా నేను తెలుసుకొంటున్నాను' అని భావించడం ప్రసిద్ధం కాదు. కాని, 'నేను దేహేంద్రియసంఘాతం ద్వారా తెలుసుకొంటున్నాను' అన్నది లోకరీతి కదా.

**సమాధానం :** కాని, ఇది సరికాదు. దేహాది సంఘాతం కూడా శబ్దాదుల కంటే వేరైనదేమీ కానందువల్ల అది కూడా తెలియబడేదే కాని, తెలుసుకొనేది కాదు అనడం సముచితం. రూపాదులు కలిగిన దేహాదిసంఘాతం దానికి బాహ్యమైన రూపాది విషయాలను గ్రహించేటట్లైతే, ఆ బాహ్య రూపాది విషయాలు కూడా వాటిలో అవి వాటి వాటి రూపాది విషయాలను, గ్రహించ గలగాలి. కాని, వాస్తవంలో అలా లేదు.

కాబట్టి, అగ్నివల్లనే లోహం దహించ సమర్థమైనట్లు, జనులు రూపాది విషయాలను, దేహాది రూపంలో, 'ఏతేన ఏవ'– దీని వల్లనే, ఎరుకయే స్వభావంగా గలిగి, దేహానికి భిన్నమైన ఆత్మవల్లనే; గ్రహిస్తారు. 'అత్ర'– ఇక్కడ, ఈ లోకంలో; 'కిమ్'– ఏమి; 'పరిశిష్యతే'– మిగిలింది, ఆత్మకు తెలియలేనిది. ఏమీ మిగిలిలేదు, కాని ప్రతిదీ ఆత్మద్వారానే తెలియబడుతుంది. తెలియనట్టిది ఏమీ లేనటువంటి ఆత్మ సర్వవ్యాపి. 'ఏతత్ వై తత్'– అది (ఆత్మ) ఇదియే. అది ఏమిటి? అని దేని గురించైతే దేవతలకు కూడా అనుమానాలున్నవో, ఏది ధర్మానికి భిన్నమైనదో, ఏది విష్ణువుయొక్క పరమ పదమో, దేనికి అతీతమైనది మరొకటి ఏదీ లేనిదో, అదియే నచికేతునిచే అడగబడినట్టిది. దాని గురించే ఈ విధంగా వివరించడం జరిగింది. ఇదీ అభిప్రాయం.

(శబ్ద, స్పర్శ, రూప, రస, గంధం మరియు సంభోగం వల్ల కలిగే సుఖాన్ని కేవలం ఆత్మ కారణంగానే మానవుడు అనుభవించ గలుగుతున్నాడు. అయితే ఇక్కడ ఒక సందేహం కలుగుతోంది. తెలుసుకోవడం అనేది దేహేంద్రియ సంఘాతం వల్ల కలుగుతుందనేది లోకంలో అనుభవంలో ఉన్న విషయం. కాని, దేహానికి విలక్షణమైన ఆత్మ వల్ల తెలుసుకోవడం అనేది జరుగుతుంది అని చెప్పినమాట అనుభవానికి విరుద్ధంగా ఉంది. దీనిని సమాధానాన్ని శంకరులు ఇలా చెప్తున్నారు.

దేహ సంఘాతానికి, బాహ్యంలోని విషయాలకు తేడా ఏమీ లేదు కదా. బాహ్యంలో రంగు, రుచి, వాసన, స్పర్శ, శబ్దాలు గల వస్తువులున్నట్లే దేహానికి కూడా అవే గుణాలు ఉన్నాయి కదా. ఒక వేళ దేహమే బాహ్య విషయాలను తెలుసుకొంటోంది అనేటట్లైతే, ఆ బాహ్య విషయాలు కూడా దేహాన్ని అలాగే తెలుసుకోవాలి కదా. అంతేకాదు, బాహ్య విషయాలు తమలో తాము కూడా విషయాలను తెలుసుకొనే వీలుండాలి. అంటే ఉదాహరణకు ఆకు పచ్చ రంగు గల ఆకు, ఎరుపురంగు గల పూవును లేదా సువాసన గల పూవును తెలుసుకోవాలి కదా. కాని, వాస్తవంలో అలా జరగడం లేదే. కాబట్టి, దేహ సంఘాతం విషయాలను గ్రహించడం వాస్తవం కాదు. అయితే, అగ్ని సంపర్కం గల లోహపు ఫలకం ఇతర వస్తువులను కాల్చడం మనకు తెలుసు కదా. అంటే, ఇక్కడ కాల్చడం అనేది లోహపు ఫలకానికి సంబంధించిన విషయం కాదు. లోహపు ఫలకాన్ని ఆశ్రయించిన అగ్నికి సంబంధించిన విషయం. అదే విధంగా, దేహ సంఘాతాన్ని ఆశ్రయించియున్న ఆత్మ వల్లనే శబ్దాది విషయాలను తెలుసుకోవడం జరుగుతుంది.

ఈ విధంగా లోకంలోని సర్వ విషయాలనీ ఆత్మ తెలుసుకొంటోంది. ఆత్మకు తెలియకుండా మిగిలిన విషయం ఏదీ లేదు. సర్వమూ ఆత్మ వలననే తెలియబడుతోంది. ఆత్మకు తెలియని విషయం ఏదీ లేదనంటే, ఆత్మ సర్వవ్యాపి అనేది స్పష్టమౌతోంది. దీని గురించే నచికేతుడు పూర్వం ప్రశ్నించింది. నచికేతుడు అడిగిన విషయాన్ని ఇక్కడ గుర్తు చేస్తున్నారు. నచికేతుడు 3వ వరంగా యమదేవుడిని ఇలా అడిగాడు. దేవతలకు కూడా దేని గురించి స్పష్టంగా తెలియబడకున్నది ఏది? అలాగే, ధర్మానికి విలక్షణమైనదేది? విష్ణువు యొక్క పరమపదమైన స్థితి ఏది? దేనిని మించిన స్థితి మరొకటి ఏదీ లేనిది ఏది? ఈ ప్రశ్నలకు సమాధానంగా, నచికేతా నీవు అడిగినది ఇదే, దీని గురించే అని మృత్యువుచే సమాధానం ఇవ్వబడుతోంది.)

సూక్ష్మమైనదైనందున ఆత్మను తెలుసుకోవడం కష్టమైనదనే ఆలోచనతో, ఉపనిషత్తు అదే విషయాన్ని తిరిగి తిరిగి బోధిస్తోంది.

**స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి .**
**మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి .. 2-1-4 ..**

దేని వల్ల జాగ్రత్తులోనూ, స్వప్నావస్థలోనూ విషయాలు గ్రహించబడుతాయో, అట్టి గొప్పది సర్వవ్యాపియైన ఆత్మను తెలుసుకొన్న ధీమంతుడు శోకాన్ని పొందడు.

## శంకర భాష్యమ్

స్వప్నాంతం స్వప్నమధ్యం స్వప్నవిజ్ఞేయమిత్యేతత్ . తథా జాగరితాంతం జాగరితమధ్యం జాగరితవిజ్ఞేయం చ . ఉభౌ స్వప్నజాగరితాంతౌ యేన ఆత్మనా అనుపశ్యతి లోకః ఇతి సర్వం పూర్వవత్ . తం మహాంతం విభుమాత్మానం మత్వా అవగమ్యాత్మభావేన సాక్షాదహమస్మి పరమాత్మేతి ధీరః న శోచతి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏన'– ఏ దాని వలన, అంటే ఏ ఆత్మవలనైతే; మానవుడు 'స్వప్నాన్తమ్'– స్వప్నాన్ని అంటే స్వప్నంలోని విషయాలను; అలాగే, 'జాగరితాన్తమ్'– జాగ్రత్తును అంటే జాగ్రత్తులోని విషయాలను; 'ఉభౌ'– రెండింటిని, అనగా స్వప్న జాగ్రత్తులలోని విషయాలను; 'అనుపశ్యతి'– గ్రహిస్తాడో. ఇదంతా ఇంతకు ముందు మంత్రలో లాగా వివరించబడింది. 'మహాన్తమ్ విభుమ్ ఆత్మానమ్'– మహీయమైనది, సర్వవ్యాపకమైన ఆత్మను; 'మత్వా'– తెలుసుకొన్నవాడు, దానిని తానుగా అంటే 'నేను పరమాత్మను' అనే అపరోక్షానుభూతి పొందిన; 'ధీరః'– ధీమంతుడు, వివేకి; 'న శోచతి'– శోకాన్ని పొందడు.

(ముందు మంత్రంలో బాహ్యవిషయాలను తెలుసుకొనేది ఆత్మ అని నిర్ధారించుకొన్నాంకదా. ఆ బాహ్య విషయాలకు కొంత వివరణ ఇస్తున్నారు. జాగ్రత్తులో బాహ్య విషయాలే కాకుండా స్వప్నంలో కూడా విషయాలు ఉంటాయి కదా. స్వప్నంలోని విషయాలు కూడా ఆత్మ వల్లనే తెలియబడుతాయి. కాబట్టి, ఇక్కడ జాగ్రత్తుతో పాటుగా

స్వప్నంలోని విషయాలను కూడా తీసుకొంటున్నారు. ఏ ఆత్మ వల్లనైతే జాగ్రత్తు మరియు స్వప్నంలోని విషయాలు తెలియబడుతున్నాయో, అట్టి ఆత్మ మహత్తరమైనది అంటే అన్నింటి కన్నా గొప్పది మరి దానిని మించినది వేరేదీ లేదు. అలాగే అది సర్వాన్ని వ్యాపించి ఉన్నది. అటువంటి దాన్ని అదియే తానుగా తెలుసుకొన్నవాడు వివేకి. ఇక్కడ తెలుసుకోవడం అంటే లౌకిక విషయాలను తెలుసుకోవడం వంటిది కాదు. అదే తాననే అనుభూతిని అపరోక్షంగా పొందటం. ప్రత్యక్ష, పరోక్షాలకు భిన్నమైనది అపరోక్షం. అలాంటి అపరోక్షానుభూతిని పొందిన ధీమంతుడు శోకాన్ని పొందడు. దేనిని గురించేనా శోకించడానికి తనకు ఇతరమైనదేదీ లేదనే జ్ఞానం కలగడం చేత, శోక హేతువే ఉండదు. కాబట్టి శోకించడు అంటున్నారు.)

**య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమన్తికాత్ .**
**ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే .**
**ఏతద్వై తత్ .. 2-1-5 ..**

దీనిని (ఈ ఆత్మను) కర్మఫలాలను భోగించే, ప్రాణకలాపాలకు ఆధారమైన భూతభవిష్యత్తులను శాసించే ప్రభువని చాలా సమీపంగా తెలుసుకొన్నవాడు భయాన్ని పొందడు. అదియే ఇది (నీవడిగినది).

## శంకర భాష్యమ్

కించ, యః కశ్చిత్ ఇమం మధ్వదం కర్మఫలభుజం జీవం ప్రాణాదికలాపస్య ధారయితారమాత్మానం వేద విజానాతి అంతికాత్ అంతికే సమీపే ఈశానం ఈశితారం భూతభవ్యస్య కాలత్రయస్య, తతః తద్విజ్ఞానాదూర్ధ్వమాత్మానం న విజుగుప్సతే న గోపాయితుమిచ్ఛతి, అభయప్రాప్తత్వాత్ . యావద్ధి భయమధ్యస్థోఽనిత్యమాత్మానం మన్యతే తావద్గోపాయితుమిచ్ఛత్యాత్మానం . యదా తు నిత్యమద్వైతమాత్మానం విజానాతి, తదా కః కిం కుతో వా గోపాయితుమిచ్ఛేత్ . ఏతద్వై తదితి పూర్వవత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, 'జీవమ్'– సర్వ ప్రాణశక్తి వంటి వాటికి ఆధారభూతమైన; 'మధ్వదమ్'– కర్మఫలాలను భోగించే, 'ఇమమ్'– ఈ; 'ఆత్మానమ్'– ఆత్మను; 'భూతభవ్యస్య'– భూత భవిష్యత్తు కాలాలకు అంటే త్రికాలాలకు; 'ఈశానమ్'– ప్రభువుగా; 'యః'– ఎవరు; 'అంతికాత్'–అత్యంత సమీపంగా, దగ్గఱగా; 'వేద'– తెలుసుకొంటే; 'తతః'– ఆ మీదట, ఆ జ్ఞానం కలిగిన మీదట; 'న విజుగుప్సతే'– (ఆత్మకు) రక్షణ కోరరు, ఎందుకంటే అభయత్వాన్ని పొందటం చేత. ఒకనికి భయం ఉన్నంత కాలం, తనను అశాశ్వతునిగా పరిగణించుకొన్నంత కాలం, తనను రక్షించుకోవాలనే అనుకొంటాడు. కాని, నిత్యమైన అద్వయమైన ఆత్మను తెలుసుకొన్నవాడు, దేనినుండి ఎక్కడనుండి రక్షణ పొందుతాడు? 'ఏతత్ వై

తత్' అన్న వాక్యానికి వివరణ ఇంతకు పూర్వం చెప్పినట్లుగానే (3వ మంత్రానికి శంకరులు చెప్పిన భాష్యాన్ని) అవగాహన చేసుకోవాలి.

(ఆత్మ తత్త్వాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకొన్న స్థితి గత మంత్రంలో చెప్పబడింది. అటువంటి స్థితికి చాలా సమీప స్థితి పొందినప్పుడు ఎలాటి ఫలితం కలుగుతుందో చెప్తున్నారు. ఈ ఆత్మను సమస్త ప్రాణాది కార్యకలాపాలకు ఆధారభూతమైనదిగా, కర్మఫలాలను అనుభవించేదిగా భావించే వారు దానిని కాల స్వరూపమైన ఈశ్వరునిగా తెలుసుకొన్న మీదట భయం నుండి విముక్తి పొందుతారు. జీవ స్థితి నుండి ఈశ్వర స్థితికి ఎదిగిన వారి గురించి ఇక్కడ చెప్పబడుతోంది. ఆత్మ అనిత్యమైనదనే భావన ఉన్నంతకాలం భయం ఉండి తీరుతుంది. భయం ఉన్నంతకాలం తనను రక్షించుకోవాలనే భావన కలిగితీరుతుంది. అంతటా నిండియున్న ఈశ్వరత్వమే తాననే స్థితి అందిన మీదట, ఇక భయం అనేది ఉద్భవించేందుకు కారణమైన ఇతరత్వమే నశిస్తుంది. భయం నశిస్తే అభయాన్ని కోరటం ఉత్పన్నమే కాదు. అందుచేత, పరమాత్మ స్థితికి సమీపస్థితి అయినటువంటి ఈశ్వరస్థితికి చేరినవానికిక తనను రక్షించుకోవడమనే భావనే ఉండదని భావం.)

ఈశ్వరునిగా చెప్పబడుతున్న ప్రత్యగాత్మయే సర్వానికి ఆత్మ అని చెప్పబోతున్నారు.

**యః పూర్వం తపసో జాతమద్భ్యః పూర్వమజాయత .**

**గుహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభిర్వ్యపశ్యత . ఏతద్వై తత్ .. 2-1-6 ..**

చైతన్యం (జ్ఞానలక్షణ బ్రహ్మ) నుండి నీటి (పంచభూతముల) కన్నా ముందు ఉద్భవించి, దేహేంద్రియాలతో గూడి హృదయ గుహలో ప్రవేశించి ఉన్నట్టి ఏ ప్రథమ సృష్టిని (హిరణ్యగర్భుని) దేనినైతే సాధకుడు దర్శిస్తాడో అది నిశ్చయంగా ఇదియే (నీవడిగినదే).

## శంకర భాష్యమ్

యః కశ్చిన్ముముక్షుః పూర్వం ప్రథమం తపసః జ్ఞానాదిలక్షణాద్బ్రహ్మణ ఇత్యేతత్ ; జాతం ఉత్పన్నం హిరణ్యగర్భం . కిమపేక్ష్య పూర్వమితి, ఆహ — అద్భ్యః పూర్వం అప్సహితేభ్యః పంచభూతేభ్యః, న కేవలాభ్యోఽద్భ్య ఇత్యభిప్రాయః . అజాయత ఉత్పన్నః యస్తం ప్రథమజం దేవాదిశరీరాణ్యుత్పాద్య సర్వప్రాణిగుహాం హృదయాకాశం ప్రవిశ్య తిష్ఠంతం శబ్దాదీనుపలభమానం భూతేభిః భూతైః కార్యకరణలక్షణైః సహ తిష్ఠంతం యో వ్యపశ్యత యః పశ్యతీత్యేతత్ ; య ఏవం పశ్యతి, స ఏతదేవ పశ్యతి — యత్తత్ప్రకృతం బ్రహ్మ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః'– ఎవడైనా, ముక్తిని కోరుకునే వాడెవడైనా; 'తపసః'– జ్ఞానాదులే లక్షణంగాగల బ్రహ్మనుండి; 'పూర్వమ్ జాతమ్'– ప్రథమంగా ఉత్పన్నమై (హిరణ్యగర్భునిగా); దేనికి ముందు అనేది చెప్తున్నారు. 'అద్భ్యః పూర్వం'– నీటి తోటి

వాటికి, అంటే కేవలం నీటికి ముందు మాత్రమే కాదు పంచభూతాలకు ముందు అని అభిప్రాయం; 'యః'– ఎవరు; 'అజాయత'– ఉద్భవించారో. 'ప్రవిశ్య గుహామ్'– సర్వజీవుల హృదయ గుహలో ప్రవేశించి; 'తిష్ఠన్తమ్'– ఉనికి కలిగిలేదా నిలచియుండి; 'భూతేభిః'– భూతాలతో కూడి ఉన్న, అంటే దేహేంద్రియాదుల మధ్యనుండి శబ్దాదులను గ్రహించే, ఆ ప్రథమ సృష్టియైన హిరణ్యగర్భ తత్త్వాన్ని, 'యః వ్యపశ్యత' - ఎవడు (ఏ సాధకుడు) దర్శిస్తాడో; అతడే 'ఏతత్'– ఈ దీనిని, బ్రహ్మాన్ని, ప్రస్తుతం చర్చింపబడుతున్న ఆత్మను దర్శిస్తాడు.

[బంగారంతో తయారు కాబడిన ఆభరణం బంగారమే అయినట్లు, హిరణ్యగర్భుడనగా బ్రహ్మమే. – స్వామి గంభీరానంద]

(బ్రహ్మంనుండి అన్నింటికన్నా ప్రథమంగా ఉత్పన్నమైనది హిరణ్యగర్భ తత్వం. దీనినే సగుణ బ్రహ్మగా వర్ణిస్తారు. పంచభూతాలైన పృథివ్యాపస్తేజోవాయురాకాశాదులకన్నా కూడా ముందుగా పుట్టినది ఈ హిరణ్యగర్భతత్త్వం. అదియే జీవుల దేహేంద్రియాలు ఏర్పడిన తర్వాత వాటి హృదయాకాశంలో ప్రవేశించి నిలిచి ఉండి శబ్దాది విషయజ్ఞానాలను గ్రహిస్తుంది. అటువంటి ఈ హిరణ్యగర్భ తత్త్వాన్ని ఏ ముముక్షువు దర్శిస్తాడో లేదా తెలుసుకొంటాడో అతడే బ్రహ్మాన్ని దర్శిస్తాడు లేదా బ్రహ్మానుభూతి పొందుతాడు.)

**యా ప్రాణేన సంభవతి అదితిర్దేవతామయీ .**
**గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీం యా భూతేభిర్వ్యజాయత . ఏతద్వై తత్ .. 2-1-7 ..**

సర్వ దేవతలతో కూడినది, హిరణ్యగర్భుని వలె సంభవించినది, పంచభూతాలతో కలసి ఆవిర్భవించినది, హృదయ గుహలో ప్రవేశించి, నిలిచియున్నట్టి అదితి ఏది కలదో అది నిశ్చయంగా అదియే (నీవడిగినదే).

## శంకర భాష్యమ్

కించ, యా సర్వదేవతామయీ సర్వదేవతాత్మికా ప్రాణేన హిరణ్యగర్భరూపేణ పరస్మాద్బ్రహ్మణః సంభవతి శబ్దాదీనామదనాత్ అదితిః తాం పూర్వవద్గుహాం ప్రవిశ్య తిష్ఠంతీం అదితిం . తామేవ విశినష్టి — యా భూతేభిః భూతైః సమన్వితా వ్యజాయత ఉత్పన్నేత్యేతత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, 'దేవతామయీ'– సర్వదేవతామయమైనది; అయిన 'యా అదితిః'– ఆ అదితి, శబ్దాది విషయాలన్నింటినీ అనుభవించటం చేత అదితి (అదనాత్ అదితిః); 'ప్రాణేన'– పరబ్రహ్మం నుండి హిరణ్యగర్భుని వలె; 'సమ్భవతి'– పుట్టినది, 'గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీమ్' అన్న భాగానికి ముందు చెప్పినట్లుగానే అన్వయించుకోవాలి.

పంచభూతాలతో కూడి ఉత్పన్నమైనదని చెప్తూ అదితిని ప్రత్యేకంగా చూపిస్తున్నారు. (ఆ అదితి అని చెప్పబడేదే బ్రహ్మ).

(పరబ్రహ్మనుండి హిరణ్యగర్భుని లాగా పుట్టినది మరొకటి ఉన్నది. అదే అదితి అని పిలవబడుతోంది. ఎందుకు అలా పిలవబడుతోందంటే, అది శబ్దాది విషయాలను అనుభవిస్తోంది కాబట్టి. ముందు మంత్రంలో చెప్పబడిన హిరణ్యగర్భతత్వం జీవుల హృదయగుహలో ఉండి ఇంద్రియ విషయాలను గ్రహించగా, ఈ అదితి ఆ గ్రహించబడిన విషయాలను అనుభవిస్తుంది. పంచభుతాలతో కూడి ఉద్భవించినట్టి ఈ అదితి కూడా హిరణ్యగర్భుని లాగానే జీవుల హృదయ కుహరంలో ప్రవేశించి నిలుస్తోంది. ఈ అదితియే మన ప్రస్తుతం విచారణచేస్తున్న బ్రహ్మము. అంటే ఈ అదితి పరబ్రహ్మమే తప్ప మరేమీ కాదు.)

**అరణ్యోర్నిహితో జాతవేదా**
**గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః .**
**దివే దివ ఈడ్యో జాగృవద్భిః**
**హవిష్మద్భిర్మనుష్యేభిరగ్నిః .**
**ఏతద్వై తత్ ..2-1-8 ..**

గర్భిణులు చక్కగా రక్షించుకొనే గర్భం లాగా, అరణులలో దాచబడిన అగ్ని మరియు జాగరూకులైన మానవులు ప్రతిదినం హవిస్సుతో రక్షించుకొనే అగ్ని ఏది కలదో అదియే నిశ్చయంగా అది (నీవడిగినది).

## శంకర భాష్యమ్

కించ, యః అధియజ్ఞం ఉత్తరాధరారణ్యోర్నిహితః స్థితః జాతవేదా అగ్నిః పునః సర్వహవిషాం భోక్తా అధ్యాత్మం చ యోగిభిః, గర్భ ఇవ గర్భిణీభిః అంతర్వత్నీభిరగర్హితాన్నభోజనాదినా యథా గర్భః సుభృతః సుష్ఠు సమ్యగ్భృతో లోకే, ఇత్థమేవ ఋత్విగ్భిర్యోగిభిశ్చ సుభృత ఇత్యేతత్ . కించ, దివే దివే అహన్యహని ఈడ్యః స్తుత్యో వంద్యశ్చ కర్మిభిర్యోగిభిశ్చాధ్వరే హృదయే చ జాగృవద్భిః జాగరణశీలైః అప్రమత్తైరిత్యేతత్ . హవిష్మద్భిః ఆజ్యాదిమద్భిః ధ్యానభావనావద్భిశ్చ మనుష్యేభిః మనుష్యైః అగ్నిః ; ఏతద్వై తత్ తదేవ ప్రకృతం బ్రహ్మ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, యజ్ఞ సందర్భంలో 'అరణ్యోః'– అరణులలో (ఎండు కట్టెలను ఒకదానిపై ఒకటి ఉంచి మథించడం చేత అగ్నిని యజ్ఞ ప్రారంభంలో పుట్టిస్తారు. ఆ ఎండు కట్టెలనే అరణులు అంటారు); 'నిహితః'– ఉన్నట్టి; 'జాతవేదా'– అగ్ని, మరల మానవులలో (విరాట్ స్వరూపంగానుండి) సర్వ హవిస్సులను భుజించేది; మరియు, 'గర్భిణీభిః'– గర్భాన్ని

ధరించిన స్త్రీలు, నిషిద్ధం కాని ఆహార పానీయాలను సేవిస్తూ; 'గర్భ ఇవ'– పిండాన్ని రక్షించుకొన్నట్లుగా; 'సుభృతః'– యోగులచే చక్కగా రక్షింపబడేది. అభిప్రాయమేమంటే, లోకంలో గర్భస్థ పిండాన్ని గర్భిణీస్త్రీలు రక్షించికొన్నట్లుగా ఋత్విక్కులు మరియు యోగులు అగ్నిని రక్షించుకొంటారు. మరింకా, 'జాగృవద్భిః'– జాగరూకత కల్గిన, జాగరణ శీలురైన, అప్రమత్తత కల; 'హవిష్మద్భిః'– నేయి వంటి హవిస్సులుకల, ధ్యానభావనలు కల; 'మనుష్యేభిః'– అంటే 'మనుష్యైః' మానవులచే; 'దివే దివే'– ప్రతి దినం దినం; 'ఈడ్యః'–ఋత్విక్కులచే కర్మలలో మరియు యోగులచే హృదయాలలో ఆరాధనీయమైన; ఆ 'అగ్నిః'– అగ్ని, 'ఏతద్వై తత్'– అదియే ప్రస్తావించబడుతున్న బ్రహ్మ.

(హిరణ్యగర్భ తత్త్వం గురించి, దేవతా మయమైన అదితిని గురించి అవి బ్రహ్మమే అని చెప్పిన తర్వాత, ఇక అగ్నిని కూడా బ్రహ్మమని నిర్ధారణ చేయబోతున్నారు. యజ్ఞాల సందర్భంలో అరణులను మథించి అగ్నిని పుట్టిస్తారు. అంటే, అరణులలో అగ్ని దాగి ఉంటోంది. ఈ అగ్నితో ప్రజ్వలింపచేసిన హోమంలో హవిస్సులు ఆహుతిస్తారు. అంటే, ఈ అగ్నియే సర్వహవిస్తులను భుజిస్తోంది. ఎండుకట్టెలతో ప్రాణుల శరీరాలని పోల్చుకొంటే, ఆ శరీరాలలో నిక్షిప్తమై ఉన్న అగ్నియే ఆహారాన్ని భుజిస్తోంది. దీనిసే వైశ్వానరాగ్నిగా భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ప్రస్తావించారు. మరి యోగులు ఏవిధంగా అగ్నిని రక్షించుకొంటారో చెప్తున్నారు. గర్భిణీ స్త్రీలు, ఆహార పానీయాలలో నిషిద్ధమైన వాటిని తమకు ప్రీతికలిగించేవి అయినప్పటికినీ సేవించకుండా ఎంత జాగ్రత్తగా తమ గర్భస్థ పిండాన్ని కాపాడుకుంటారో, అంతే జాగ్రత్తగా ఋత్విక్కులు, యోగులు అగ్నిని రక్షించుకుంటారు. ఈ విధంగా, ఋత్విక్కులు కర్మకాండలోనూ మరియు యోగులు తమ హృదయాలలోనూ ఏ అగ్నిని ప్రతిదినం జాగరూకతతో రక్షించుకొంటూ ఆరాధన చేస్తారో, ఆ అగ్నియే మనం విచారణ చేస్తూన్నటువంటి బ్రహ్మ.)

**యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి .**
**తం దేవాః సర్వే అర్పితాస్తదు నాత్యేతి కశ్చన .**
**ఏతద్వై తత్** **.. 2-1-9 ..**

దేని నుండి సూర్యుడు ఉదయిస్తాడో, దేని యందు అస్తమిస్తాడో, దానిపై సర్వదేవతలు స్థిరంగా ఉంటారు. ఎవరూ దానిని అధిగమించరు. ఇదియే నిశ్చయంగా అది (నీవడిగినది).

### శంకర భాష్యమ్

కించ, యతశ్చ యస్మాత్ప్రాణాత్ ఉదేతి ఉత్తిష్ఠతి సూర్యః, అస్తం నిమ్లోచనం తిరోధానం యత్ర యస్మిన్నేవ చ ప్రాణే అహన్యహని గచ్ఛతి, తం ప్రాణమాత్మానం దేవాః సర్వే అగ్న్యాదయః అధిదైవం వాగాదయశ్చాధ్యాత్మం సర్వే విశ్వే అరా ఇవ రథనాభౌ అర్పితాః సంప్రవేశితాః స్థితికాలే . సోఽపి బ్రహ్మైవ . తత్ ఏతత్సర్వాత్మకం బ్రహ్మ, ఉ నాత్యేతి నాతీత్య తదాత్మకతాం తదన్యత్వం గచ్ఛతి, కశ్చన కశ్చిదపి ఏతద్వై తత్ ..

యద్బ్రహ్మాదిస్థావరాంతేషు వర్తమానం తత్తదుపాధిత్వాదబ్రహ్మవదవభాసమానం సంసార్యన్యత్పరస్మాద్బ్రహ్మణ ఇతి మా భూత్కస్యచిదాశంకేతీదమాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, 'యతశ్చ'– ఏ దానినుండి, అంటే ఏ ప్రాణంనుండి (హిరణ్యగర్భుని నుండి); 'సూర్యః'– సూర్యుడు; 'ఉదేతి'– ఉదయిస్తాడో; 'యత్ర'– ఎక్కడ, అంటే ఏ ప్రాణమందే; 'అస్తమ్ గచ్ఛతి'– అస్తమిస్తాడో ప్రతిదినం, 'తమ్'– దాని పైనే, ఆ ఆత్మయైన ప్రాణంపైనే; 'సర్వే దేవాః'– సమస్త దేవతలు, అధిదైవికంగా అగ్ని మొదలైనవి మరియు అధ్యాత్మికంగా వాక్కు మొదలైనవి; విశ్వం యొక్క స్థితికాలంలో, 'అర్పితాః'–రథచక్రాల యొక్క కమ్మీల లాగా స్థిరమై ఉంటాయో, అట్టి ప్రాణము కూడా బ్రహ్మయే. ఇదంతా సర్వవ్యాపితమైన బ్రహ్మయే. 'తత్ ఉ'– నిశ్చితంగా దానిని, 'కః చన'– ఎవరునూ, ఎవరైననూ; న అత్యేతి – దాట జాలరు, అతిక్రమించరు. దానితో ఏకత్వం పొందకుండా ఉండరు, అది కాకుండా పేరుకారు. ఇది నిశ్చయంగా అదియే.

(ఏ ప్రాణం నుండి సూర్యుడు క్రమం తప్పకుండా నియమిత కాలానికి ప్రతిదినం ఉదయిస్తాడో, అలాగే ప్రతి సాయంకాలం ఏ ప్రాణంలోకి అస్తమిస్తాడో, ఆ ప్రాణంలోనే సర్వదేవతలు స్థిరంగా ఉంటారు. అటువంటి ప్రాణం కూడా బ్రహ్మమే. అట్టి బ్రహ్మాన్ని ఎవరూ అతిక్రమించలేరు, అధిగమించ లేరు. ఎవ్వరునూ, ఈ చెప్పబడినట్టి హిరణ్యగర్భతత్త్వం కాని, దేవతా మయమైన అదితి కాని, అగ్నికాని, ప్రాణం కాని బ్రహ్మంతో ఏకత్వాన్ని పొందకుండా ఉండలేరు. అవి బ్రహ్మానికి అభిన్నం ఏనాడూ కాదు. కాబట్టి, ప్రస్తుత మంత్రంతో కలిపి ముందు మూడు మంత్రాలలో చెప్పబడిన అన్ని తత్త్వాలు కూడా నిశ్చయంగా బ్రహ్మమే అని చెప్తున్నారు.)

బ్రహ్మము నుండి కదలలేని ప్రాణుల పర్యంతము సర్వజీవుల యందు జీవాత్మగా ఏది యున్నదో అది ఆ జీవరాశుల విశేషములు పరిమితులు కారణంగా బ్రహ్మము కానిదిగా కనబడుతున్నందున, పరబ్రహ్మానికి భిన్నమైనదేమోననే సందేహాన్ని నివృత్తి చేసేందుకు ఈ క్రింది మంత్రాన్ని చెప్తున్నారు.

**యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ .**
**మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి .. 2-1-10 ..**

ఇక్కడ ఏది ఉన్నదో అదే అక్కడ ఉన్నది. అక్కడ ఏది ఉన్నదో, అదియే ఇక్కడ ఉన్నది. అలా కాకుండా భేదాన్ని దర్శించిన వాడు మృత్యువునుండి మృత్యువుకు పయనిస్తాడు.

## శంకర భాష్యమ్

యదేవేహ కార్యకారణోపాధిసమన్వితం సంసారధర్మవదవభాసమానమవివేకినాం , తదేవ స్వాత్మస్థం అముత్ర నిత్యవిజ్ఞానఘనస్వభావం సర్వసంసారధర్మవర్జితం బ్రహ్మ . యచ్చ అముత్ర అముష్మిన్నాత్మని స్థితం , తదను ఇహ తదేవ ఇహ కార్యకరణనామరూపోపాధిం అను విభావ్యమానం నాన్యత్ . తత్రైవం సతి ఉపాధిస్వభావభేదదృష్టిలక్షణయా అవిద్యయా మోహితః సన్ య ఇహ బ్రహ్మణ్యనానాభూతే పరస్మాదన్యోఽహం మత్తోఽన్యత్పరం బ్రహ్మేతి నానేవ భిన్నమివ పశ్యతి ఉపలభతే, స మృత్యోర్మరణాత్ మృత్యుం మరణం పునః పునః జననమరణభావమాప్నోతి ప్రతిపద్యతే . తస్మాత్తథా న పశ్యేత్ . విజ్ఞానైకరసం నైరంతర్యేణాకాశవత్పరిపూర్ణం బ్రహ్మైవాహమస్మీతి పశ్యేదితి వాక్యార్థః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యత్ ఏవ ఇహ'– ఏది నిశ్చయంగా ఇక్కడ ఉన్నదో, అంటే అజ్ఞానులకు కార్య-కారణ-ఉపాధులతో కూడి సంసారధర్మాలు కలిగినదిగా గోచరిస్తున్న జీవాత్మ (ఏదైతే ఇక్కడ ఉన్నదో); 'తత్'– అదియే, 'అముత్ర'– అక్కడ, తన సహజస్థితిలో నిలచిన; నిత్యత్వం చేతనత్వం ఘనత్వమే స్వభావంగా గలిగి సంసారధర్మాలు లేని (కారణ స్థితిలో ఉన్నట్టి) బ్రహ్మం; 'యత్ అముత్ర' - ఏది అక్కడ (కారణ స్థితిలో ఉన్నదో), తనలో తాను స్థిరమైఉన్నదో (పర బ్రహ్మమై యున్నదో); 'తత్'– ఆ అదియే; 'ఇహ అను'– ఇక్కడ నామరూపాలు మరియు దేహేంద్రియాది పరిమితులకు లోబడినదాని వలె వేర్వేరుగా కనబడుతోంది. ఇది అది కాక మరేమీ కాదు. ఇది ఇలా ఉండగా, 'యః'– ఎవడైనా, అవిద్యచే మోహితుడై, ఉపాధులకు స్వాభావికమైన బేధాలను చూసే వాడు, 'ఇహ'– ఇక్కడ; అనేకత్వం లేని బహ్మమును, 'నానా ఇవ'– పరిచ్ఛిన్నమైనదిగా, అంటే 'నేను బ్రహ్మమునకు భిన్నమైనవాడను, ఆ పరబ్రహ్మము నాకు భిన్నమైనది' అని బేధబుద్ధిని భావిస్తున్నట్లైతే, 'సః'– అతడు (ఆ మూఢుడు); 'మృత్యోః మృత్యుమ్' - మరణం తరువాత మరణాన్ని, అంటే జనన మరణాలను మరలా మరలా, 'ఆప్నోతి'– పొందుతాడు. కాబట్టి, అలా (తనకు పరబ్రహ్మానికి బేధాన్ని ) భావించకూడదు. మరి ఎలాగంటే, 'నేను నిశ్చయంగా ఏకరసమైన చేతనత్వమూ, ఆకాశం వలె సర్వస్వాన్ని వ్యాపించియున్న బ్రహ్మమును' అని భావనచేయాలి. ఆ వాక్యానికి ఇదీ అర్థం.

(ఈ మంత్రంలో 'ఇక్కడ' అని అంటే జీవుని సందర్భమని 'అక్కడ' అని అంటే పరమాత్మ సందర్భమని గ్రహించాలి. ఈ జీవాత్మను అజ్ఞానులు ఎలా అర్థంచేసుకుంటున్నారంటే, అది కార్య కారణ ఉపాధులతో కలిసి సంసారధర్మాలు కలిగినదానిలాగా భావిస్తున్నారు. వివేకం కలవారు అలా భావన చేయరు. ఎందుకంటే, ఈ దేహాన్ని ఉపాధిగా కలిగిన జీవాత్మ, సదా కారణ స్థితిలో ఉన్నటువంటి పరమాత్మే. అటువంటి సమస్థితి కలిగి సర్వాన్ని వ్యాపించి అపరిచ్ఛిన్నుడైనట్టి ఆ పరమాత్మయే అనేక నామరూపాలు, దేహాదులతో కూడిన అనేక జీవాత్మలుగా పరిచ్ఛిన్నంగా కనిపిస్తున్నాడు. ఈ బేధబుద్ధి కేవలం అజ్ఞానులకు మాత్రమే. జ్ఞానులు ఎటువంటి బేధాన్ని చూడరు. అందువలననే, బేధబుద్ధి కలిగిన అజ్ఞానులు జనన మరణ ప్రవాహంలో నిరంతరం పయనిస్తుంటారు. కాబట్టి, బేధబుద్ధిని విడనాడి, జీవాత్మ పరమాత్మయేననే అభిన్నత్వాన్ని నిరంతరం భావన చేస్తుండాలి అన్నది ఈ మంత్ర వాక్యానికి సరియైన అర్థం.)

**మనసైవేదమాప్తవ్యం నేహ నానాఽస్తి కిఞ్చన .**
**మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి .. 2-1-11 ..**

ఇది మనసుతో నిశ్చయంగా పొందతగినది. ఇక్కడ నానాత్వం ఏదీ లేదు. అనేకత్వాన్ని దర్శించినవాడు మరణం నుండి మరణానికి పయనిస్తాడు.

## శంకర భాష్యమ్

ప్రాగేకత్వవిజ్ఞానాదాచార్యాగమసంస్కృతేన మనసైవ ఇదం బ్రహ్మైకరసం ఆప్తవ్యం ఆత్మైవ నాన్యదస్తీతి . ఆప్తే చ నానాత్వప్రత్యుపస్థాపికాయా అవిద్యాయా నివృత్తత్వాత్ ఇహ బ్రహ్మణి నానా నాస్తి కించన అణుమాత్రమపి . యస్తు పునరవిద్యాతిమిరదృష్టిం న ముంచతి ఇహ బ్రహ్మణి నానేవ పశ్యతి, స మృత్యోర్మృత్యుం గచ్ఛత్యేవ స్వల్పమపి భేదమధ్యారోపయన్నిత్యర్థః ..

పునరపి తదేవ ప్రకృతం బ్రహ్మాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఏకత్వమైన జ్ఞానాన్ని సాధించుకొనేందుకు పూర్వం, 'మనసైవ'— గురువుచేత, శాస్త్రంచేత సంస్కరింపబడిన మనసు ద్వారా మాత్రమే; 'ఇదమ్'— ఈ ఏకరసమైన సజాతీయమైన బ్రహ్మము; దానికి భిన్నంగా మరేమీ లేనందున, ఆత్మకు అభిన్నమైన ఆ బ్రహ్మమే 'ఆప్తవ్యమ్'— పొందతగినది. ఈ జ్ఞానం పొందిన మీదట విభిన్నత్వాన్ని చూపే అజ్ఞానం నశించినందువల్ల, 'ఇహ'— ఇక్కడ, ఈ బ్రహ్మమునందు; 'నానా'— భిన్నత్వం; 'కించన'— ఏ మాత్రము; 'న అస్తి'— ఉండదు. అలా కాకుండా, 'యః'— ఎవడు, అంధకారంతో పోల్చదగిన అజ్ఞానదృష్టిని వీడకుండా, 'నానా ఇవ పశ్యతి'— భిన్నమున్నట్లుగానే చూస్తాడో; 'సః'— అతడు; 'మృత్యోః మృత్యుమ్ గచ్ఛతి'— మరణం నుండి మరణానికి పయనిస్తాడు. అంటే, స్వల్పమాత్రంగానైనా బేధాన్ని అధ్యారోపించినా కూడా అని అభిప్రాయం.

(ప్రత్యగాత్మయే బ్రహ్మమని నిరూపించేందుకు ఈ వివరణ కొనసాగుతోంది. ఇందుకోసం బ్రహ్మజ్ఞానం పొందటానికి పూర్వం ఉన్న స్థితిని వివరిస్తున్నారు. ఆ స్థితిలో మనసు కల్మషాలతో నిండి ఉంటుంది. ఆ కల్మషాలను గురువుల ఉపదేశం సహాయంతోనూ, శాస్త్రాలను అధ్యయనం చేయడంతోనూ పోగొట్టుకొని మనసును సంస్కరించుకోవాలి. అలా సంస్కరింపబడిన మనసుతో మాత్రమే ఆత్మకు అభిన్నమైన పరబ్రహ్మాన్ని పొందటం వీలవుతుంది. ఈ బ్రహ్మము సర్వదా సర్వత్రా ఏకరీతిగా ఉండేది. దానిలో ఏమాత్రం భిన్నత్వానికి అవకాశమే లేదు. భిన్నత్వమనేది కేవలం అజ్ఞానం వల్లనే కలుగుతుంది. బ్రహ్మజ్ఞానాన్ని పొందినమీదట అజ్ఞానం సమూలంగా నశిస్తుంది కాబట్టి పరబ్రహ్మంలో భిన్నత్వమేదీ మిగిలి ఉండదు. కాని, ఎవడైనా స్వల్పంగానైనా పరబ్రహ్మంలో భిన్నత్వాన్ని లేశమాత్రమైనా దర్శించినట్లైతే అతనిలో అజ్ఞాన మూలం ఇంకా మిగిలి ఉన్నట్లే. అజ్ఞానం మిగిలి ఉన్నదనంటే అతడు మృతత్వాన్ని వీడలేదనే అర్థం. ఎందుకంటే అజ్ఞానమంటేనే మృత్యువు లేదా మృత్యువంటేనే అజ్ఞానం. కాబట్టి, అజ్ఞానం కారణంగా అతడు నిశ్చయంగా మరణంనుండి మరణాన్ని పొందుతూ జనన మరణ చక్రంలో పరిభ్రమిస్తాడు. కాబట్టి, పరబ్రహ్మంలో ఎటువంటి పరిచ్ఛిన్నత్వాన్ని, భిన్నత్వాన్ని చూడటం సరికాదు.)

ఆ బ్రహ్మము గురించే మరింకా కూడా చెప్తున్నారు.

**అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి .**
**ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే .**
**ఏతద్వై తత్ .. 2-1-12 ..**

దేహంలో పురుషుడు అంగుష్ఠ ప్రమాణంలో స్థితుడైనాడు. భూత భవిష్యత్తులకు అతడు ప్రభువని తెలుసుకొన్న మీదట భయమనేది ఉండదు. ఇదియే అది (నీవడిగినది).

## శంకర భాష్యమ్

అంగుష్ఠమాత్రః అంగుష్ఠపరిమాణః . అంగుష్ఠపరిమాణం హృదయపుండరీకం తచ్ఛిద్రవర్త్యంతఃకరణోపాధిరంగుష్ఠమాత్రః అంగుష్ఠమాత్రవంశపర్వమధ్యవర్త్యంబరవత్ . పురుషః పూర్ణమనేన సర్వమితి . మధ్యే ఆత్మని శరీరే తిష్ఠతి యః తం ఆత్మానం ఈశానం భూతభవ్యస్య విదిత్వా, న తత ఇత్యాది పూర్వవత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అంగుష్ఠమాత్రః'– బొటనవ్రేలు పరిమాణం, హృదయపద్మం బొటనవ్రేలు పరిమాణం కలది, బొంగుకర్ర కణుపుల మధ్యనున్న ఖాళీ అంగుష్ఠ పరిమాణంలో ఉన్నట్లుగా హృదయ పద్మంలోని ఆకాశంలో అంతఃకరణ ఉపాధిలో నున్నట్టి ఆత్మ అంగుష్ఠ పరిమాణం కలది. 'పురుషః'– సర్వాన్ని పూరించి యున్నవాడు. 'మధ్యే ఆత్మని'– దేహం మధ్యలో, 'తిష్ఠతి'– ఉన్నట్టి అతనిని 'ఈశానమ్ భూతభవ్యస్య'– భూత-భవిష్యత్తుకాలాలకు అంటే త్రికాలాలకు ప్రభువుగా తెలిస్తే, 'న తతః విజుగుప్సతే, ఏతద్వై తత్' అన్న భాగానికి ఈ వల్లీలోని 5వ మంత్రభాగానికి చెప్పబడిన వ్యాఖ్యానాన్నే తీసుకోవాలి.

(దేహం మధ్యలో హృదయ పుండరీక స్థలంలో అంగుష్ఠమాత్ర పరిమాణంలో పరమాత్మ నిండి ఉన్నాడని చెప్తున్నారు. అంటే, పరమాత్మ పరిమితమైనవాడని కాదు. అతడు నిండియున్న ఉపాధి హృదయ కమలం మధ్యలోనున్న ప్రదేశం. ఆ ప్రదేశం పరిమాణం బొటనవ్రేలంతటిది. ఆ ఉపాధిలో నిండియున్నవాడు కాబట్టి, పరమాత్మ అంగుష్ఠపరిమాణంలో ఉన్నాడని గ్రహించాలి. పరిమాణ పరిమితి ఉపాధి పరిమితి వల్ల కలిగినదేకాని పరమాత్మ అపరిమితుడు. అలాంటి దేహంలోని హృదయ కమలంలో నిండియున్న పరమాత్మయే మూడు కాలాలను అంటే భూత-భవిష్యత్-వర్తమాన కాలాలను శాసించే ప్రభువు అని గ్రహించిన వానికి జుగుప్స అనేదే ఉండదు. హాని కలుగకుండా తనను తాను రక్షించుకోవాలనే భావనయే జుగుప్స. ఈ జుగుప్స అనే భావం తను అశాశ్వతునిగా, నశించేవానిగా అనుకొన్నప్పుడు మాత్రమే కలుగుతుంది. భూత-భవిష్యత్తులపై తనకు అధికారము లేదని తలచేవాడు అనిత్యుడు. హృదయ పుండరీకంలో స్థితుడైన ఆత్మయే భూత-భవిష్యత్తులను అంటే త్రికాలాలను శాసించే ప్రభువని తెలిసినమీదట జుగుప్స అనేది ఉండే అవకాశం లేదు. ఎందుకంటే, కాల పరిమితి వల్ల కలిగే జుగుప్స, కాలాలు తన అధీనంలో ఉన్నాయని తెలిసిన మీదట ఉండదని తాత్పర్యం.)

**అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః .**
**ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః .**
**ఏతద్వై తత్ .. 2-1-13 ..**

అంగుష్ఠ పరిమాణం గల పురుషుడు పొగలేని అగ్నివంటివాడు. త్రికాలాలకు అధిపతి. అతడే నేడు. అతడే రేపు. ఇదియే అది.

## శంకర భాష్యమ్

కించ, అంగుష్ఠమాత్రః పురుషః జ్యోతిరివ అధూమకః, అధూమకమితి యుక్తం జ్యోతిఃపరత్వాత్ . యస్త్వేవం లక్షితో యోగిభిర్హృదయే ఈశానః భూతభవ్యస్య స ఏవ నిత్యః కూటస్థః అద్య ఇదానీం ప్రాణిషు వర్తమానః స ఉశ్వోఽపి వర్తిష్యతే, నాన్యస్తత్సమోఽన్యశ్చ జనిష్యత ఇత్యర్థః . అనేన 'నాయమస్తీతి చైకే' (క. ఉ. 1 . 1 . 20) ఇత్యయం పక్షో న్యాయతోఽప్రాప్తోఽపి స్వవచనేన శ్రుత్యా ప్రత్యుక్తః, తథా క్షణభంగవాదశ్చ .

పునరపి భేదదర్శనాపవాదం బ్రహ్మణ ఆహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, 'అంగుష్ఠమాత్రః పురుషః'– బొటనవ్రేలు పరిమాణం కల పురుషుడు (అంటే సర్వవ్యాపక తత్వం); 'జ్యోతిః ఇవ అధూమకః'– పొగలేని అగ్నివంటి వాడు. 'అధూమకః' అనేది 'అధూమకమ్' అని గ్రహించడం సముచితం (ఎందుకంటే జ్యోతి శబ్దం నపుంసక లింగం కాబట్టి). యోగుల హృదయంలో అనుభవమయ్యే అతడు 'ఈశానః భూతభవ్యస్య'– భూత-భవిష్యత్తు కాలాలను శాసించే ప్రభువు; 'సః'– నిత్యుడు, కూటస్థుడైన అతడు; 'అద్య'– ఇప్పుడు ఉన్నాడు; 'ఉ'– మరియు; 'సః'– అతడు; 'శ్వః'– రేపుకూడా ఉంటాడు. అంటే, అతనితో సమానమైనవాడు ఇప్పుడు లేడు, రేపు జనించడని అభిప్రాయం. '(మరణానంతరం) ఆత్మ అనేది లేదని కొందరు చెప్తున్నారు' ['నాయమస్తీతి చైకే' (క.ఉ. 1.1.20)] అని ముందు చెప్పిన రెండవ అభిప్రాయం హేతుబద్ధమైనది కానప్పటికీ, ఉపనిషత్తు తన మాటలతోనే దాన్ని తోసిపుచ్చుతోంది. అలాగే క్షణభంగురవాదాన్ని కూడా నిరాకరిస్తోంది.

(హృదయాకాశాన్ని ఉపాధిగా చేసుకొని సర్వవ్యాపకుడైన పురుషుడు ఉపాధి పరిమితికి లోబడి అంగుష్ఠమాత్రుడుగా పరిగణింపబడుతున్నాడు. అటువంటి పురుషుడు తేజమే స్వరూపంగా గలవాడు. ఇక్కడ తేజస్సు అంటే పంచభూతాలలో ఒకటైనటువంటి అగ్ని అని పొరబడతారేమోనని, అది పొగలేని తేజమని విశేషించి చెప్తున్నారు. అంతే కాక, ఆ పురుషుడు భూత-భవిష్యత్తు కాలాలను తన నియంత్రణలో ఉంచు కొన్నవాడు. అంటే, నేడు ఉన్నాడు, రేపు ఉంటాడు అనగా నిత్యుడు, శాశ్వతుడని అర్థం. అతనికి సమమైన వాడు కాని తత్త్వం కాని వేరొకటి గతములోనూ లేదు, ప్రస్తుతంలోనూ లేదు, భవిష్యత్తులో ఉండబోదు. ఈ విధంగా చెప్పడం ద్వారా నచికేతుడు ప్రథమ వల్లీలోని 20వ మంత్రంలో లేవనెత్తిన సందేహంలో మరణం తర్వాత ఆత్మఅనేది ఏదీ లేదని కొందరంటున్నారన్న దాన్ని త్రోసిపుచ్చడమైంది. దీనితో పాటు ఆత్మ క్షణభంగురమైనది, అంటే మెరుపులాగా అలా పుట్టి వెంటనే నశించేదనే వాదాన్ని కూడా ఉపనిషత్తు తిరస్కరిస్తోంది.)

తిరిగి మరలా, బ్రహ్మంలో బేధాన్ని దర్శించడం సరికాదని తెలియజేస్తూ ఇలా చెప్తున్నారు.

**యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి .**

**ఏవం ధర్మాన్పృథక్పశ్యంస్తానేవానువిధావతి .. 2-1-14 ..**

ఉన్నత శిఖరాలపై వర్షించిన నీరు ఎలా కిందనున్న పర్వతాలపై విడివిడిగా ప్రవహిస్తుందో అలాగే ఆత్మలను భిన్నంగా దర్శించేవాడు వాటివెంట పరుగెడతాడు.

## శంకర భాష్యమ్

యథా ఉదకం దుర్గే దుర్గమే దేశే ఉచ్ఛ్రితే వృష్టం సిక్తం పర్వతేషు పర్వవత్సు నిమ్నప్రదేశేషు విధావతి వికీర్ణం సద్వినశ్యతి, ఏవం ధర్మాన్ ఆత్మనోఽభిన్నాన్ పృథక్ పశ్యన్ పృథగేవ ప్రతిశరీరం పశ్యన్ తానేవ శరీరభేదానువర్తినః అనువిధావతి . శరీరభేదమేవ పృథక్ పునః పునః ప్రతిపద్యత ఇత్యర్థః ..

అస్య పునర్విద్యావతో విధ్వస్తోపాధికృతభేదదర్శనస్య విశుద్ధవిజ్ఞానఘనైకరసమ్ అద్వయమాత్మానం పశ్యతో విజానతో మునేర్మననశీలస్యాత్మస్వరూపం కథం సంభవతీతి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యథా'– ఏవిధంగానైతే; 'దుర్గే'– దుర్గమమైన శిఖరాలపై; 'వృష్టమ్'– కురిసిన లేదా వర్షించిన; 'ఉదకం'– నీరు; 'పర్వతేషు'– కొండలపై, కిందనున్న కొండప్రాంతాలపై; 'విధావతి'– ప్రవహిస్తుందో, నలుప్రక్కలా విస్తరించి ప్రసరిస్తుందో; 'ఏవం'– అదే విధంగా; 'ధర్మాన్'– ఆత్మలను, 'పృథక్'– వేరు వేరుగా లేదా భిన్నంగా, ప్రతి శరీరానికి భిన్న భిన్నమైనదిగా; 'పశ్యన్'– చూస్తూ; 'తాన్ ఏవ'– వాటినే ఆ భిన్నత్వాల వెంటనే, వివిధ శరీరాలకు సంబంధించిన వివిధ ఆత్మల వెంటనే; 'అనుధావతి'– పరుగెడతాడు. అంటే, వివిధ శరీరాలనే మరల మరల పొందుతాడని అభిప్రాయం.

(వివిధ దేహాలలో ఉన్న ఆత్మ వేరు వేరని, ఒక్కటి కాదని భావించే వాడు అజ్ఞాని. అంటే, వాడు సర్వత్రా జీవజాలంలో ఉన్న ఆత్మ ఒక్కటే అనే సత్యాన్ని దర్శించే స్థితిలో లేడన్నమాట. అటువంటి వాడు, భిన్న భిన్న దేహాలనే పొందుతాడు. అంటే, భిన్నత్వంవైపే పరుగులు తీస్తాడు కాని, ఏకత్వం వైపు అతడు దృష్టి పెట్టడు అని అర్థం చేసుకోవాలి.)

ఉపాధుల యొక్క పరిమితుల వల్ల కలిగే భిన్నత్వాన్ని ధ్వంసం చేసి, సజాతీయమైన పూర్ణ చేతనా ఘనమై అద్వయమైన (అంటే రెండవది ఏదీ లేనట్టి) ఆత్మను దర్శించి, మననశీలుడై జ్ఞానాన్ని పొందిన వాడు, తిరిగి నూతనంగా ఆత్మ స్వభావాన్ని పొందడమేమిటి అనే సందేహానికి సమాధానం చెప్పబోతున్నారు.

**యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి .**

**ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ .. 2-1-15 ..**

ఓ గౌతమా, శుద్ధమైన నీటిపై శుద్ధమైన నీరు పోస్తే శుద్ధమైన నీరుగా అయినట్లే, మననశీలుడైన వాని ఆత్మకూడా అలా అవుతుంది.

## శంకర భాష్యమ్

యథా ఉదకం శుద్ధే ప్రసన్నే శుద్ధం ప్రసన్నం ఆసిక్తం ప్రక్షిప్తం ఏకరసమేవ నాన్యథా, తాదృగేవ భవతి ఆత్మాప్యేవమేవ భవతి ఏకత్వం విజానతో మునేః మననశీలస్య హే గౌతమ . తస్మాత్కుతార్కికభేదదృష్టిం నాస్తికకుదృష్టిం చోజ్ఝిత్వా మాతృపితృసహస్రేభ్యోఽపి హితైషిణా వేదేనోపదిష్టమాత్మైకత్వదర్శనం శాంతదర్పైరాదరణీయమిత్యర్థః

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఓ గౌతమా (అంటే గౌతముని వంశానికి చెందిన నచికేతా అని అర్థం) యథా – ఏ విధంగానైతే, 'ఉదకమ్ శుద్ధమ్'– శుద్ధమైన నీటిని; 'శుద్ధే'– శుద్ధమైన నీటిపై; 'ఆసిక్తం'– పోస్తే; 'తాదృగేవ భవతి'– అలాంటిదే అవుతుంది కాని వేరు కాదో, అంటే శుద్ధమైన నీరే అవుతుందో; 'ఆత్మా'– ఆత్మ, 'ఏవం'– ఆవిధంగానే; 'మునేః'– మననశీలత కలవానికి; 'విజానతః'– ఏకత్వాన్ని తెలుసుకొన్నమీదట; 'భవతి'– అవుతుంది. కుతర్కం చేసేవారు దర్శించే ద్వైతాన్ని మరియు నాస్తికుల తప్పుడు దృష్టికోణాన్ని విడిచిపెట్టి, వేయిమంది తల్లిదండ్రులకన్నా మిన్నయైన శ్రేయస్సును కలిగించే వేదములచే ఉపదేశింపబడిన ఆత్మ ఏకత్వదర్శనమే, శాంతమే దర్పంగాగలిగిన సాధకులకు, ఆదరణీయం అని అభిప్రాయం.

(గత మంత్రాన్ని వ్యాఖ్యానిస్తూ, శంకరులు చివరలో సాధకులకు కలిగే సందేహాన్ని లేవనెత్తి దానికి సమాధానంగా ప్రస్తుత మంత్రం చెప్పబడిందని చెప్తున్నారు. సందేహమేమంటే, సాధకుడు తనకు తెలిసినా తెలియక పోయినా ఆత్మ స్వరూపమే కదా. అలా అయినప్పుడు, సాధన పరిపక్వమై జ్ఞానాన్ని పొందిన మీదట తిరిగి ఆత్మ స్వరూపాన్ని పొందడం అనేది అంత సమంజసంగా లేదు కదా అని. దీనికి సమాధానంగా ఈ మంత్రంలో ఉపనిషత్తు ఒక ఉదాహరణ ఆధారంగా ఆ సందేహాన్ని త్రోసిపుచ్చుతోంది. శుద్ధమైన జలంలో వేరొక శుద్ధమైన జలాన్ని మిళితం చేస్తే ఏమవుతుంది. శుద్ధజలమే మిగులుతుంది కదా. అదే విధంగా, సహజంగా ఆత్మ స్వరూపుడే అయిన సాధకుడు, తన సాధన ద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందితే ఆ పొందబడినట్లుగా చెప్పబడే ఆత్మస్వరూపం తానే అయి ఉన్నాడని అర్థం చేసుకోవాలి.)

.. ఇతి చతుర్థవల్లీభాష్యం ..

# పంచమీ వల్లీ

## శంకర భాష్యమ్

పునరపి ప్రకారాంతరేణ బ్రహ్మతత్త్వ నిర్ధారణార్థోఽయమారంభః, దుర్విజ్ఞేయత్వాద్బ్రహ్మణః —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

బ్రహ్మాన్ని గ్రహించడం చాలా దుష్కరమైనందుచేత, వేరొక విధంగా బ్రహ్మతత్త్వాన్ని నిర్ధారించేందుకు నూతన ప్రకరణం ప్రారంభిస్తున్నారు.

**పురమేకాదశద్వారమజస్యావక్రచేతసః .**
**అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే .**
**ఏతద్వై తత్ .. 2-2-1 ..**

స్థిరమైన చైతన్యంతో పుట్టుకనేదే లేని దాని యొక్క నగరం పదకొండు ద్వారాలు కలది. ధ్యానించిన వానికి శోకముండదు, బంధనాల నుండి విడివడి మోక్షం పొందుతాడు. నిశ్చయంగా ఇదియే అది.

## శంకర భాష్యమ్

పురం పురమివ పురం . ద్వారద్వారపాలాధిష్ఠాత్రాద్యనేకపురోపకరణసంపత్తిదర్శనాత్ శరీరం పురం . పురం చ సోపకరణం స్వాత్మనా అసంహతస్వతంత్రస్వామ్యర్థం దృష్టం . తథేదం పురసామాన్యాదనేకోపకరణసంహతం శరీరం స్వాత్మనా అసంహతరాజస్థానీయస్వామ్యర్థం భవితుమర్హతి . తచ్చేదం శరీరాఖ్యం పురం ఏకాదశద్వారం ; ఏకాదశ ద్వారాణ్యస్య — సప్త శీర్షణ్యాని, నాభ్యా సహార్వాంచి త్రీణి, శిరస్యేకం , తైరేకాదశద్వారం పురం . కస్య ? అజస్య జన్మాదివిక్రియారహితస్యాత్మనో రాజస్థానీయస్య పురధర్మవిలక్షణస్య . అవక్రచేతసః అవక్రం అకుటిలమాదిత్యప్రకాశవన్నిత్యమేవావస్థితమేకరూపం చేతో విజ్ఞానమస్యేతి అవక్రచేతాః తస్యావక్రచేతసః రాజస్థానీయస్య బ్రహ్మణః యస్యేదం పురం తం పరమేశ్వరం పురస్వామినం అనుష్ఠాయ ధ్యాత్వా . ధ్యానం హి తస్యానుష్ఠానం సమ్యగ్విజ్ఞానపూర్వకం . తం సర్వైషణావినిర్ముక్తః సన్సమం సర్వభూతస్థం ధ్యాత్వా న శోచతి . తద్విజ్ఞానాదభయప్రాప్తేః శోకావసరాభావాత్కుతో భయేక్షా . ఇహైవావిద్యాకృతకామకర్మబంధైర్విముక్తో భవతి . విముక్తశ్చ సన్విముచ్యతే ; పునః శరీరం న గృహ్ణాతీత్యర్థః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'పురమ్'– పురం అనగా పురం వంటిది. ద్వారములు, ద్వారపాలకులు, అధికార గణం, ఇలా పురానికి ఉండే అన్ని హంగులూ ఉండటం చేత శరీరమే పురం. ఎలాగైతే అన్ని హంగులతో కూడినట్టి నగరం, ఆ నగరంలో భాగం

కానట్టి ఒక స్వతంత్రుడైన ప్రభువు కొరకని గ్రహిస్తామో, అదేవిధంగా ఇంద్రియాది వివిధ అవయవాల సంఘాతమైనట్టి ఈ శరీరానికి ప్రభువు లాగా ఉండి, ఆ సంఘాతంలో భాగం కానటువంటి ఒక స్వంతదారు, తప్పక ఉండి తీరవలసిందే. అట్టి శరీరమనబడే ఈ పురం, 'ఏకాదశద్వారమ్' - పదకొండు ద్వారాలు గలది. పదకొండు ద్వారాలు ఏవంటే, శిరస్సులో ఏడు, నాభితో కలిసి అధోభాగంలో మూడు, నడినెత్తిన ఒకటి. కాబట్టి, అది ఏకాదశ ద్వారాలు గల నగరం. ఎవరినగరం ఇది? అజస్య – జనించడమే లేని వానిది, ప్రభుస్థానంలో ఉన్నట్టి మరియు పురానికి సంబంధించిన విషయాలకు భిన్నమైనట్టి, జననాది పరిణామాలు లేనట్టి ఆత్మకు చెందినది; 'అవక్రచేతసః'– అస్థిరం కాని జ్ఞానం కలవానిది, అంటే ఎవని 'చేతః'– చైతన్యం, 'అవక్ర'– సరళమైనదో, సూర్యకాంతిలా సర్వదా నిశ్చయమైన ఉనికి కలిగి ఉంటుందో, అంటే ప్రభువుతో పోల్చబడే పరబ్రహ్మనిది. 'అనుష్ఠాయ'–ఈ నగరానికి స్వంతదారైనటువంటి ఆ పరబ్రహ్మమును కామనలనుండి పూర్తిగా స్వేచ్ఛను పొందిన పిమ్మట, ధ్యానించగా. అనగా ఈ అనుష్ఠానం (ఆచరణ) సంపూర్ణ జ్ఞానాన్ని గురించిన విచారణ కాబట్టి, [అవాంతరాలు లేని అపరోక్ష దృష్టి. సమ్యగ్విజ్ఞానపూర్వకమ్ పదాన్ని పరిపూర్ణ జ్ఞానానుభవమే లక్ష్యంగా కలిగిన ధ్యానంగా బాలగోపాలేన్ద్రులు వ్యాఖ్యానించారు.] అలా పరబ్రహ్మన్ని సర్వ జీవరాశులలోను సమంగా వసించిన వానిగా ధ్యానించిన వాడు, 'న శోచతి'– శోకాన్ని పొందడు. పరిపూర్ణజ్ఞానాన్ని పొందటం ద్వారా భయరహితమైన స్థితిని చేరుకొన్న తరువాత శోకము కలిగే అవసరమే లేనందున, భయ దృష్టి ఎలా ఉంటుంది? ఇక్కడనే (అంటే జీవించి ఉండగనే), అతడు 'విముక్తః'– అవిద్య వల్ల కలిగే కోరికలు, కర్తవ్యాలనే బంధనాలనుండి స్వేచ్ఛ పొందుతాడు. 'విముక్తః చ'– (జీవించి ఉండగనే) స్వేచ్ఛ కలిగిన మీదట; 'విముచ్యతే'– ముక్తిని పొందుతాడు అంటే తిరిగి శరీరాన్ని పొందడు.

(ఆత్మజ్ఞానోపదేశాన్ని మరొక నూతన కోణంలో ఆవిష్కరించే ప్రయత్నం ఈ వల్లీలో చేయబడుతోంది. దీనికోసం మానవ దేహాన్ని నగరంతో పోల్చి చూపిస్తున్నారు. నగరంలో ఏ విధంగానైతై అనేక ద్వారాలు ఉంటాయో, అలాగే ఈ మానవ దేహంలో కూడా 11 ద్వారాలున్నాయి. రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు నాసికా రంధ్రాలు, ఒక నోరు వెరసి 7 ద్వారాలు శరీరంలో తల భాగంలో ఉన్నాయి. నాభి, రెండు విసర్జనేంద్రియాలు అధోభాగంలో ఉన్నాయి. ప్రతి నగరానికి ఒక ప్రభువున్నట్లే, ఈ శరీరమనే పురానికి ఆత్మయే ప్రభువు లేదా యజమాని. నగరానికి ఉన్న ప్రభువు ఎలాగైతే నగరంలో ఒక భాగం కాడో అలాగే ఆత్మయనే యజమాని శరీరానికి భిన్నమైనవాడే. ఆత్మ విశిష్ఠత ఏమంటే అది పుట్టుకనేదే లేనిది. పుట్టుకలేనిదంటే అది లేని కాలమే లేదని అర్థం. ఎప్పుడూ నిత్యమై ఉండేదానికి పుట్టుకేముంది. ఆ చైతన్యం అస్థిరమైనది కాదు. అస్థిరమైనది కాదంటే కొంతమేరకు లేదా కొంతసేపు దట్టంగా మరికొంతమేరకు లేదా మరికొంతసేపు పలుచగా ఉండేది కాదు. ఎక్కడైనా, ఏ కాలంలోనైనా దాని స్థితి సమంగా ఎటువంటి హెచ్చుతగ్గులు లేకుండా ఉంటుంది. సూర్యకాంతిలా సరళంగా ఎటువంటి వంకరతనం లేకుండా ఉంటుంది. అటువంటి ఆత్మ చైతన్యాన్ని నిరంతరాయంగా ధ్యానం చేసినవానికి ఇక శోకము ఉండదు. నిరంతరాయంగా ధ్యానించడమంటే, ఎటువంటి అవరోధాలు లేకుండా. అవరోధాలకు కారణం కోరికలు. కోరికలు నశిస్తే అవరోధాలు అంతరిస్తాయి. అవరోధాలు అంతరిస్తే ధ్యానం ధ్యానవిషయంపై నిరంతరాయంగా కుదురుతుంది. కాబట్టి, అటువంటి నిరంతరాయమైన ధ్యానం ఆత్మవిషయంపై నిలబడాలంటే ముందు కోరికలను దూరం చేసుకోవాలి. ఆత్మవిషయంపై అలా నిరంతరంగా ధ్యానం చేసినవానికి శోకించడానికి తగిన కారణమే ఉండదు. ఇది ఎలాగంటే, ఆత్మవిషయమై ధ్యానిస్తే ఆత్మకు భిన్నమైన ఇతరమేదీ లేదని, అది తానేనని అనుభవమౌతుంది. భయహేతువైన ఇతరమైనదేదీ

లేనందున అది భయరహిత స్థితి. ఆ అభయస్థితిని పొందినవానికిక శోకం ఎలా ఉంటుంది. ఉండదని అర్థం. మరింకా ఆ పరమస్థితిని అందుకొన్న వాడు కోరికలు, చేయవలసిన కర్తవ్యాలనుండి స్వేచ్ఛ పొందుతాడు. అలా స్వేచ్ఛను పొందినవాడు సర్వబంధాలనుండి విముక్తి పొందుతాడు. ఈ విముక్తస్థితిని సాధకుడు జీవించి ఉండగానే పొందుతాడు. అంటే జీవిక కొనసాగుతూనే ఈ స్థితిని అందుకోవడం సాధ్యమేనని ఉపనిషత్తు ఘంటాపథంగా చెప్తోంది.)

**హగ్ంసః శుచిషద్వసురన్తరిక్షస-**

**ద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ .**

**నృషద్వరసదృతసద్వ్యోమస-**

**దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ .. 2-2-2 ..**

సంచరిస్తూ స్వర్గంలో (సూర్యునిగా), వాయువై అంతరిక్షంలో, అగ్నిగా భూమిపై, సోమరసమై పాత్రలో, ఇంకా నరులలో, దేవతలలో, సత్యంలో, ఆకాశంలో మరింకా జలంనుండి, భూమినుండి, యజ్ఞాలనుండి, పర్వతాలనుండి జనించే సర్వములోనూ పరిణామ రహితుడై, మూలాధారమై ఉన్నాడు.

## శంకర భాష్యమ్

స తు నైకపురవర్త్యేవాత్మా కిం తర్హి సర్వపురవర్తీ . కథం ? హంసః హంతి గచ్ఛతీతి . శుచిషత్ శుచౌ దివి ఆదిత్యాత్మనా సీదతీతి . వసుః వాసయతి సర్వానితి . వాయ్వాత్మనా అంతరిక్షే సీదతీతి అంతరిక్షసత్ . హోతా అగ్నిః, 'అగ్నిర్వై హోతా' ఇతి శ్రుతేః . వేద్యాం పృథివ్యాం సీదతీతి వేదిషత్ , 'ఇయం వేదిః పరోఽన్తః పృథివ్యాః' (ఋ.మం. 1.22.164.35) ఇతి మంత్రవర్ణాత్ . అతిథిః సోమః సన్ దురోణే కలశే సీదతీతి దురోణసత్ . బ్రాహ్మణోఽతిథిరూపేణ వా దురోణేషు గృహేషు సీదతీతి దురోణసత్ . నృషత్ నృషు మనుష్యేషు సీదతీతి నృషత్ . వరసత్ వరేషు దేవేషు సీదతీతి వరసత్ . ఋతసత్ ఋతం సత్యం యజ్ఞో వా, తస్మిన్ సీదతీతి ఋతసత్ . వ్యోమసత్ వ్యోమ్ని ఆకాశే సీదతీతి వ్యోమసత్ . అబ్జాః అప్సు శంఖశుక్తిమకరాదిరుపేణ జాయత ఇతి అబ్జాః . గోజాః గవి పృథివ్యాం వ్రీహియవాదిరూపేణ జాయత ఇతి గోజాః . ఋతజాః యజ్ఞాంగరూపేణ జాయత ఇతి ఋతజాః . అద్రిజాః పర్వతేభ్యో నద్యాదిరూపేణ జాయత ఇతి అద్రిజాః . సర్వాత్మాపి సన్ ఋతం అవితథస్వభావ ఏవ . బృహత్ మహాన్ , సర్వకారణత్వాత్ . యదాప్యాదిత్య ఏవ మంత్రేణోచ్యతే తదాప్యాత్మస్వరూపత్వమాదిత్యస్యాంగీకృతమితి బ్రహ్మణి వ్యాఖ్యానేఽప్యవిరోధః . సర్వథాప్యేక ఏవాత్మా జగతః, నాత్మభేద ఇతి మంత్రార్థః ..

ఆత్మనః స్వరూపాధిగమే లింగముచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

కాని (పరమాత్మ) అతడు ఒక శరీర నగరంలో మాత్రమే నివసించేవాడు కాడు. అయితే ఏమిటి? అన్ని నగరాలలో ఉన్నవాడతడు. ఎలా ఉన్నాడు?

'హంసః' – చరించే, 'హమ్' వెళ్ళుట, తిరుగాడుట, లేదా చరించుట అని అర్థాన్నిచ్చే అనే ధాతువు నుండి ఏర్పడిన రూపం, 'శుచిసత్' – 'శుచి' అనగా శుద్ధం మరియు సద్ అనగా ఉండే లేదా వసించే, అంటే శుద్ధమైన స్వర్గంలో నివసించే ఆదిత్యునిలా. 'వసుః' – అంటే సర్వానికి నివాసమైనది ['వాసయతి సర్వానితి'] అనే అర్థాన్నిచ్చే 'వస్' ధాతువు యొక్క రూపం. వాయువుగా 'అన్తరిక్షసత్' – అంతరిక్షంలో వసించే. 'హోతా' – (అంటే) అగ్నిగా, 'అగ్నియే నిశ్చయంగా హోతా' ['అగ్నిర్వై హోతా' (చిత్ ఉ. 3.1, 6.1)] అన్న శ్రుతి వాక్యం ప్రకారం హోతా అనగా అగ్ని అని, 'వేదిసత్' – 'ఈ (యజ్ఞ) వేది భూమి యొక్క ఉన్నత స్థితి' ['ఇయం వేదిః పరోఽన్తః పృథివ్యాః' (ఋ.మం.1.22.164.35)] అన్న శ్రుతి వాక్యం నుండి వేది అనగా భూమి, భూమియందు వసించే (అగ్నిగా భూమియందు ఉండేది), 'అతిథిః'– సోమరసంగా; 'దురోణసత్'– పాత్రలో వసించే, లేదా బ్రాహ్మణ అతిథిగా గృహాలలో వసించేది. అతడు 'నృషత్'– నరులలో వసించే; 'వరసత్'– పూజనీయులలో వసించే; 'ఋతసత్'– ఋతంలో వసించే, అంటే సత్యం లేదా క్రతువులో అని; 'వ్యోమసత్'– ఆకాశంలో వసించే; 'అబ్జ'– నీటినుండి జనించే శంఖం, ముత్యం, మకరం మొదలైన వాటిలో; 'గోజాః'– భూమినుండి పుట్టే ధాన్యం, యవలు మొదలైన వాటిలో; 'ఋతజాః'– యజ్ఞాంగాలుగా యజ్ఞం నుండి ఉద్భవించేవాటిలో; 'అద్రిజాః'– పర్వతాలనుండి జనించే నదులు మొదలైనవాటిలో. అతడు సర్వమునకు ఆత్మయే అయినప్పటికినీ, అతడు నిశ్చయంగా 'ఋతమ్' మార్పులేని స్వభావం కలవాడు మరియు 'బృహత్'– అన్నిటికన్నా అధికుడు, సర్వానికి కారణమైనవాడు కాబట్టి. ఈ మంత్రంలో ఆత్మను గురించి కాక ఆదిత్యుని ఉద్దేశించి చెప్పినట్లుగా తీసుకొన్నప్పటికీ, నిజానికి ఆదిత్యుడే ఆత్మయని గ్రహిస్తాము కాబట్టి, ఆదిత్యుని పరంగా బ్రాహ్మణములో చెప్పబడిన ఈ మంత్రానికి ఇపుడు ఆత్మపరంగా చెప్పిన వ్యాఖ్యానంతో విరుద్ధత ఏమీ లేదు. {వేద బ్రాహ్మణ భాగంలో ఈ మంత్రం "అసౌ వా ఆదిత్యో హంసః శుచిషత్" (ఆ ఆదిత్యుడే హంసః శుచిషత్) అని వివరించబడింది. అయితే "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" (కదిలే మరియు కదలని సర్వానికీ సూర్యుడే ఆత్మ) [ఋగ్వేదం 1.115.1] అనే మంత్రం ద్వారా ఆదిత్యుడు సర్వగతమైన చైతన్యానికి చిహ్నమని తెలుస్తోంది. – ఆనందగిరి}. ఈ మంత్రానికి అర్థమేమంటే జగత్తునకంతా సర్వవ్యాపకమైన ఆత్మ ఒక్కటియే కాని, అనేకములైన ఆత్మలనేవి లేవు అని.

(క్రిందటి మంత్రంలో శరీరానికి యజమానిగా ఆత్మను ధ్యానం చేసినవానికి సర్వమూ ఆత్మమయమైనదిగానే అనుభవానికి వస్తుందని చెప్పారు. అయితే ఈ సర్వమూ ఆత్మమయమేనని ఎలా గుర్తించడం? అంటే శరీరాలలో యజమానిగా ఆత్మ ఉనికి ఇంతకు ముందు నిరూపించబడగా, శరీరాలు కాని స్థానాలలో పరమాత్మ ఉనికిని ఇపుడు నిర్ధారించబోతున్నారు.

దివిలో తిరుగాడే సూర్యునిగా ఆ పరమాత్మే ఉన్నాడు. సూర్యుడే పరమాత్మ అనే ఈ విషయాన్ని శ్రుతికూడా సూచించింది. మరింకా, అంతరిక్షంలో చరించే వాయువుగాను, భూమిపై యున్న అగ్నిగాను, పాత్రలోని సోమరసంగాగాను ఉన్నది ఆ పరమాత్మే. అదేకాక, నరులలో, దేవతలలో, క్రతువులలోనూ ఆ పరమాత్మే ఉన్నాడు. అంతే కాక, జలంనుండి ఉద్భవించే జీవరాశులలో, భూమినుండి జనించే ధాన్యాదులలో, పర్వతాలనుండి జనించే నదీజల రాశులలో ఉన్నది ఆ పరమాత్మే. ఈ విధంగా అనేక విధాలుగా పరమాత్మ ఉనికి కలిగి ఉన్నాడు కాబట్టి ఒక్కొక్క దానిలో ఒక్కొక్క విధంగా ఉన్నాడేమో అనే అనుమానం కలగటం సహజం. ఆ అనుమానాన్ని తొలగిస్తూ ఇన్నిచోట్ల ఇన్నివిధాలుగా ఉన్నప్పటికీ పరమాత్మ అన్నిటా మార్పులేనివాడై ఉన్నాడు అని ఋతమ్ పదంతో

సూచిస్తున్నారు. అంతేకాదు, అన్నింటికీ మూలమైనవాడు కాబట్టి అతడు బృహత్ అనికూడా చెప్తున్నారు. ఈ మంత్రాన్నే సంధ్యావందనంలో ప్రతి వటువూ అనుష్ఠిస్తున్నాడు.)

ఆత్మ స్వరూపాన్ని అవగాహన చేసుకొనేందుకు మరొక హేతుబద్ధమైన సూచన చేస్తున్నారు.

**ఊర్ధ్వం ప్రాణమున్నయతి అపానం ప్రత్యగస్యతి .**
**మధ్యే వామనమాసీనం విశ్వే దేవా ఉపాసతే .. 2-2-3 ..**

ప్రాణాన్ని పైకి అపానాన్ని క్రిందికి పంపుతూ మధ్యలో నిలచినట్టి ఆ పూజనీయమైన దాన్ని సర్వ దేవతలు ఆరాధిస్తారు.

## శంకర భాష్యమ్

ఊర్ధ్వం హృదయాత్ ప్రాణం ప్రాణవృత్తిం వాయుం ఉన్నయతి ఊర్ధ్వం గమయతి . తథా అపానం ప్రత్యక్ అధః అస్యతి క్షిపతి యః ఇతి వాక్యశేషః . తం మధ్యే హృదయపుండరీకాకాశే ఆసీనం బుద్ధావభివ్యక్తం విజ్ఞానప్రకాశనం వామనం వననీయం సంభజనీయం విశ్వే సర్వే దేవాః చక్షురాదయః ప్రాణాః రూపాదివిజ్ఞానం బలిముపాహరంతో విశ ఇవ రాజానం ఉపాసతే తాదర్థ్యేనానుపరతవ్యాపారా భవంతీత్యర్థః . యదర్థా యత్ప్రయుక్తాశ్చ సర్వే వాయుకరణవ్యాపారాః, సోఽన్యః సిద్ధ ఇతి వాక్యార్థః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఏదైతే' అనే అర్థాన్నిచ్చే 'యః' పదాన్ని మంత్రంలో చేర్చుకోవాలి. ఏదైతే 'ప్రాణమ్'– ప్రాణ వ్యపారాన్ని, వాయు నిశ్వాసాన్ని; 'ఊర్ధ్వమ్'– హృదయానికన్నా పైకి; 'ఉన్నయతి'–తోస్తుందో, వెళ్లేలా చేస్తుందో; అదేవిధంగా, 'అపానమ్'– వాయు ఉచ్ఛ్వాసను; 'ప్రత్యక్ అస్యతి'– క్రిందికి నెడుతుందో; ఆ 'వామనమ్'– పూజనీయమైనట్టి, 'మధ్యే ఆసీనమ్'– మధ్యలో ఆసీనమై, అంటే హృదయపద్మంలోని ఆకాశంలో ఆసీనమై; బుద్ధిలో వెలిగే విజ్ఞాన ప్రకాశాన్ని, 'విశ్వే'– సర్వ; 'దేవాః'– దేవతలు, అంటే కన్ను మొదలైన సర్వ ఇంద్రియాలు; 'ఉపాసతే'– ఆరాధిస్తున్నాయి, ప్రభువుకు సేవకులు అందించినట్లుగా, రూపాది విషయాలనే కానుకలు సమర్పించడంద్వారా ఆ పరబ్రహ్మాన్ని పూజిస్తున్నాయి. ఆ ఆరాధనలో వాటికి విరామముండదని అభిప్రాయం. ఈ వాక్యానికి ముఖ్య ఉద్దేశ్యమేమంటే, ఎవని కొరకైతే, ఎవని ఆదేశానుసారం, ప్రాణం మరియు సర్వేంద్రియాలు కార్యకలాపాలు నిర్వహించడానికై ఉన్నాయో, అవన్నీ ఆ పరమాత్మకు భిన్నములే.

(హృదయాకాశంలో ఉండి వెలిగే విజ్ఞాన ప్రకాశమే పరమాత్మ. అదే పూజనీయమైనది. అది అలా ఉన్నందుచేతనే ప్రాణ, అపాన వాయువులు వాటి వృత్తులైన ఊర్ధ్వ, అధో చలనాలు నిరంతరంగా చేస్తూనే ఉంటాయి. దానినే (ఆ పరమాత్మనే) దేవతలు ఆరాధిస్తుంటారు. దేవతలు అంటే ఇక్కడ శరీరంలోని సర్వ ఇంద్రియాలు అని గ్రహించుకోవాలి. అన్ని ఇంద్రియాలు వాటి వాటి విషయాలను సేకరించి ఎప్పటికప్పుడు పరమాత్మకు

నివేదిస్తుంటాయి. అదే వాటి ఆరాధన. ఆ ఆరాధనలో విసుగు విరామం అనేవి ఉండవు. ఎటువంటి అలసత్వం లేకుండా పరమాత్మ కోసమే ప్రాణములు కాని, ఇంద్రియాలు కాని అవి వాటివాటి కార్యకలాపాలు నిర్వహిస్తాయి. కాబట్టి, ఇవన్నీ పరమాత్మకు భిన్నమైనవే అని అర్థం చేసుకోవాలి.)

**అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః .**

**దేహాద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే .**

**ఏతద్వై తత్ .. 2-2-4 ..**

శరీరంలో విడిగా ఉన్న ఈ దేహి (ఆత్మ) దేహాన్నుండి విడుదలైతే ఇక్కడ (ఈ దేహంలో) ఏమి మిగిలుతుంది. నిశ్చయంగా ఇది అదియే.

## శంకర భాష్యమ్

కించ, అస్య శరీరస్థస్య ఆత్మనః విస్రంసమానస్య భ్రంశమానస్య దేహినో దేహవతః .విస్రంసనశబ్దార్థమాహ — దేహాద్విముచ్యమానస్యేతి . కిమత్ర పరిశిష్యతే ప్రాణాదికలాపే న కించన పరిశిష్యతే ; అత్ర దేహే పురస్వామివిద్రవణ ఇవ పురవాసినాం యస్యాత్మనోఽపగమే క్షణమాత్రాత్కార్యకరణకలాపరూపం సర్వమిదం హతబలం విధ్వస్తం భవతి వినష్టం భవతి, సోఽన్యః సిద్ధ ఆత్మా ..

స్యాన్మతం ప్రాణాపానాద్యపగమాదేవేదం విధ్వస్తం భవతి న తు వ్యతిరిక్తాత్మాపగమాత్ , ప్రాణాదిభిరేవేహ మర్త్యో జీవతీతి ; నైతదస్తి —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, 'అస్య శరీరస్థస్య'– ఈ శరీరంలో ఉన్నటువంటిది; 'దేహినః'– దేహాన్ని స్వంతం చేసుకొన్నటు వంటిది అంటే ఆత్మ; 'విస్రంసమానస్య'– తన స్థానంనుండి తొలగినట్లైతే, 'విస్రంసన' శబ్దానికి 'దేహాద్విముచ్యమానస్య' అనగా దేహం మొదలైన వాటినుండి స్వేచ్ఛ పొందినది అనే అర్థాన్ని చెప్పారు. 'కిమ్ అత్ర పరిశిష్యతే'– ఇక్కడ ఇక ఏమి మిగిలి ఉంటుంది? అంటే ప్రాణశక్తి మొదలైనవాటి సమూహమైన ఈ దేహంలో మిగిలి ఉండేది ఏదీ లేదు అని అభిప్రాయం. నగరాన్ని రాజు విడిచిపెట్టి వెళ్ళినపుడు ఆ నగర ప్రజలు ఎలా నశిస్తారో, ఆ విధంగా, ప్రాణేంద్రియాలకి భిన్నమైనదని నిరూపించబడిన ఆ ఆత్మ దేహేంద్రియ సంఘాతాన్ని విడిచిపెట్టగా, ప్రాణేంద్రియాలు వెనువెంటనే శక్తిహీనమై, వ్యవహారాలన్నీ స్తంభించి, నశిస్తాయి.

(ఆత్మ దేహంలోనే ఉంటున్నప్పటికీ, దేహేంద్రియ సంఘాతానికి భిన్నమైనదిగా ఉంటోంది. అటువంటి ఆత్మ ప్రాణేంద్రియాలతో ఎటువంటి సంబంధాన్ని పెట్టుకోదు. స్వతంత్రంగానే నిలిచి ఉంటుంది. ఒకవేళ ఆత్మ దేహాన్ని వదలి వెళితే, ఈ దేహేంద్రియ సంఘాతంలో ఏ ఒక్కటి మిగిలి ఉండదు. ఇదెలాగంటే, నగరాన్ని రాజు వదలి వెళ్ళిపోతే, ఆ

నగర ప్రజల జీవనం ఎలా స్తంభించిపోతుందో, నశించిపోతుందో అలాగే, ఆత్మ దేహాన్ని విడిచివెళ్ళిన మరుక్షణమే ప్రాణేంద్రియాలు శక్తిహీనమైపోతాయి. వాటి కార్యకలాపాలన్నీ ఒక్కసారిగా స్తంభించిపోతాయి. ఆ విధంగా అవి నాశనాన్ని పొందుతాయి. ఏది ఈ దేహం నుండి విడుదలైతే ఇక ఇక్కడ ఏమీ మిగలకుండా పోతుందో, ఆ అది అనగా ఆ ఆత్మయే నీవు నన్ను ప్రశ్నించిన విషయంగా గ్రహించమని నచికేతునికి ఉపదేశిస్తున్నాడు యమదేవుడు.)

అయితే, ప్రాణాపానాదులు నిర్గమించిన తరువాతనే ఈ దేహం నశిస్తుందిగాని వాటికి భిన్నమైన ఆత్మ నిర్గమించినందువల్ల కాదు. ఎందుకంటే మానవుడు ప్రాణాదులచే మాత్రమే జీవిస్తాడు అని ఒక అభిప్రాయముంది. కాని, ఈ అభిప్రాయం సరికాదు.

**న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన .**
**ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ .. 2-2-5 ..**

**ప్రాణ, అపానాల వల్ల ఏ నరుడూ జీవించడు. ఈ రెండింటికీ ఆశ్రయమైన ఇతరం వల్ల మాత్రమే జీవిస్తారు.**

## శంకర భాష్యమ్

న ప్రాణేన నాపానేన చక్షురాదినా వా మర్త్యః మనుష్యో దేహవాన్ కశ్చన జీవతి న కోఽపి జీవతి . న హ్యేషాం పరార్థానాం సంహత్యకారిత్వాజ్జీవనహేతుత్వముపపద్యతే . స్వార్థేనాసంహతేన పరేణ సంహతానామవస్థానం న దృష్టం కేనచిదప్రయుక్తం యథా గృహాదీనాం లోకే ; తథా ప్రాణాదీనామపి సంహతత్వాద్భవితుమర్హతి . అత ఇతరేణ తు ఇతరేణైవ సంహతప్రాణాదివిలక్షణేన తు సర్వే సంహతాః సంతః జీవంతి ప్రాణాంధారయంతి . యస్మిన్ సంహతవిలక్షణే ఆత్మని సతి పరస్మిన్ ఏతౌ ప్రాణాపానౌ చక్షురాదిభిః సంహతౌ ఉపాశ్రితౌ యస్యాసంహతస్యార్థే ప్రాణాపానాదిః సర్వం వ్యాపారం కుర్వన్వర్తతే సంహతః సన్ స తతోఽన్యః సిద్ధ ఇత్యభిప్రాయః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'న ప్రాణేన న అపానేన'– వాయు నిశ్వాసం వలన కాదు, వాయు ఉచ్ఛ్వాసం వలన కాదు, కన్నులు మొదలైన వాటి వలననూ కాదు; 'మర్త్యః'– మానవుడు, దేహం కలిగినవాడు; 'కః చన'– ఎవడైనా; 'జీవతి'– జీవించేది. (అంటే ఏ మానవుడైనా జీవించేది వాయు ఉచ్ఛ్వాస నిశ్వాసాల వలన కాదు). ఇవి (ఈ ప్రాణ, అపానాలు, చక్షురాది ఇంద్రియాలు) ఇతరము (వాటికి భిన్నమైన దాని) కొరకై ఉద్దేశించబడినవి, సంఘాతంగా (అవి కలిసికట్టుగా) కార్యాలను నిర్వహించేవి అయినందున, జీవత్వానికి కారణాలు కాలేవు. గృహాదులలాగా సంఘటితమైన వస్తువులకు, వాటిలో భాగం కాని భిన్నమైన వేరొకరు వాటిని తమ ప్రయోజనానికై నిర్మిస్తే తప్ప, ప్రపంచంలో వాటికి ఉనికి ఉండదు. ప్రాణాదుల విషయంలో కూడా ఇదే వర్తిస్తుంది. ఎందుకంటే, ప్రాణాదులు కూడా కలయికతో ఏర్పడినవే. అంటే ఆ ప్రాణాదులు వాటికి భిన్నమైన వేరొకదానిచే కూర్పు చేయబడినవి అని అర్థం. 'యస్మిన్'– ఏ దానిలోనే, సంఘాతానికి

భిన్నమైన ఏ పరమాత్మ యొక్క ఉనికిలోనే, 'ఏతౌ'– ఈ రెండూ, చక్షురాది ఇంద్రియాలతో కూడిన ప్రాణ, అపానాలు; 'ఉపాశ్రితౌ'– ఆశ్రయాన్ని పొందాయో, [లేదా, యస్మిన్ – అనగా సంఘాతానికి భిన్నమైనదీ అతీతమైనదీ అయిన ఆత్మ యొక్క ఉనికిని, ఏతౌ ఉపాశ్రితౌ – ఈ రెండూ ఆశ్రయించాయో] దాని వల్లనే (ఆ పరమాత్మ ఉనికి వలననే) ప్రాణాదుల సమూహాలైన ఇవన్నీ (ఈ జీవరాశులన్నీ) 'జీవంతి'– జీవిస్తున్నాయి. వేటితోనూ సంఘటితంకాని ఏ ఆత్మయొక్క ప్రయోజనానికై, ప్రాణాపానాదులు సంఘాతాలుగా రూపొంది వాటి వాటి వృత్తులను నిర్వహిస్తున్నాయో, ఆ ఆత్మ వాటికి భిన్నమైనదని నిర్ధారించబడింది. ఇదీ ఉద్దేశ్యం.

(ప్రాణ-అపానాల వల్లనే జీవం కలుగుతోంది అనే దురభిప్రాయాన్ని త్రోసిపుచ్చుతున్నారు ఇక్కడ. దేహం యొక్క జీవనం ప్రాణం వల్లకాని, అపానం వల్లకాని కలగడం లేదని ఈ మంత్రంలో నిర్ద్వందంగా ప్రకటిస్తున్నారు. మంత్రంలో ప్రాణ, అపానాలను చెప్పినప్పటికీ శంకరులు తమ భాష్యంలో చక్షురాది ఇంద్రియాలను కూడా వీటికి జోడించారు. ఈ ప్రాణ-అపానాలకు జీవత్వాన్ని కలిగించే సామర్థ్యం లేదని నిర్ధారణ చేస్తున్నారు. ప్రాణ, అపానాలు వేరొక దానికి ప్రయోజనం కలిగించేందుకు ఏర్పాటైనవి. సేవకుడు సేవలనందిస్తాడే కాని స్వంతదారు కాడు. అంతేకాక, అవి ఒకదానికొకటి సహకరించుకొంటూ వాటి కార్యకలాపాలు నిర్వహిస్తాయి. అంటే, కార్యకలాపాల నిర్వహణలో అవి స్వతంత్రాలు కావు. అటువంటి అధిష్ఠానతత్త్వం, సతంత్రత్వం లేని ప్రాణ-అపానాలు మరియు చక్షురాది ఇంద్రియాలు జీవుల జీవత్వానికి కారణమెలా అవుతాయి? కాలేవు. గృహాలవంటి వస్తుసముదాయాలు వాటిని నిర్మించేవాడు లేకపోతే అవి ఉండే అవకాశమే లేదు కదా. ఆ నిర్మించేవాడు, ఆ గృహాలు వాటి సముదాయాలకు భిన్నమైన వాడే కదా. అలాగే, ప్రాణాదులు కూడా వాటిని ఏర్పరచినవాడు లేకపోతే అవి ఏర్పాటయ్యే వీలులేదు. అంతేకాకుండా, వాటిని ఏర్పాటుచేసే ఏ ఇతరమైతే ఉన్నదో దానికి ఆ ప్రాణాదులకు భిన్నత్వం ఉండి తీరాలి. కాబట్టి, ఇదమిత్థంగా తేలిందేమంటే, ప్రాణాదుల వల్ల జీవం కలగడం లేదు. మరి దేనివల్ల జీవం కలుగుతోంది. ఆ ప్రాణాదులను ఏర్పాటు చేసిన తత్త్వం ఏదైతే ఉన్నదో, ప్రాణాదులకు భిన్నమైనటువంటి ఆ తత్త్వంపై ఆధారపడి మాత్రమే ప్రాణాదులు ఉండటం వల్ల, జీవరాశులు జీవించడానికి ఆ తత్త్వమే మూలకారణం. అదియే ఆత్మ లేదా పరమాత్మ.)

**హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్ .**
**యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ .. 2-2-6 ..**

ఓ గౌతమా! నీకు శాశ్వత బ్రహ్మను గురించిన రహస్యాన్ని మరియు మరణం ప్రాప్తించిన తర్వాత ఆత్మ ఏవిధంగా ఉంటుందో కూడా చెప్తాను.

**శంకర భాష్యమ్**

హంతేదానీం పునరపి తే తుభ్యం ఇదం గుహ్యం గోప్యం బ్రహ్మ సనాతనం చిరంతనం ప్రవక్ష్యామి . యద్విజ్ఞానాత్సర్వసంసారోపరమో భవతి, అవిజ్ఞానాచ్చ యస్య మరణం ప్రాప్య యథా చ ఆత్మా భవతి యథా ఆత్మా సంసరతి తథా శృణు హే గౌతమ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఓ గౌతమా, 'హన్త'– బాగు; మరింకా 'తే'– నీకు; 'ఇదమ్'– ఈ; 'సనాతనమ్ బ్రహ్మ'– నిత్యమైన బ్రహ్మను గురించిన; 'గుహ్యమ్'– రహస్యాన్ని; 'ప్రవక్ష్యామి'– బోధిస్తాను. ఏ విజ్ఞానం ద్వారా సంసార సర్వస్వం ఉనికిని కోల్పోతుందో దాని గురించి మరియు ఏ దానిని తెలియకపోవడం వల్ల, 'యథా'– ఏ విధంగా; 'మరణం ప్రాప్య'– మరణం సంభవించిన తర్వాత; 'ఆత్మ'– ఆత్మ; 'భవతి'– ఉంటుందో, సంచరిస్తుందో; అది విను.

(యమదేవుడు, గౌతమ వంశంలో జన్మించిన నచికేతునితో ఇలా అంటున్నాడు. ఓ గౌతమా, నీకు ఇప్పుడు నిత్యమైన బ్రహ్మన్ని గురించిన రహస్యాన్ని బోధిస్తాను. ఈ జ్ఞానం యొక్క విశిష్టత ఏమిటంటే, ఇది తెలుసుకొన్నమీదట సంసారమనే దానికి ఉనికి ఏ మాత్రం ఉండదు. అంటే సంసారస్థితి ఉపసంహరించ బడుతుంది. అంటే అది నిన్ను ఏమాత్రం బాధించదు. అటువంటి దాన్ని గురించి నేను నీకు చెప్పదలచుకున్నాను. అంతేకాదు, ఈ తెలుసుకొనదగిన జ్ఞానాన్ని పొందకపోయినట్లైతే, తద్వారా కలిగే అజ్ఞానం వలన మరణానంతరం ఆత్మ ఏవిధంగా ప్రవర్తిస్తుందనేది కూడా చెప్తాను అంటున్నాడు. అంటే, ఆత్మజ్ఞానం ప్రాప్తించిన మరుక్షణమే అప్పటివరకు నిన్ను బాధించిన సంసారం నీకు గోచరించడం మానుతుంది. అంటే జనన మరణాదులు నీ ఎదుట సంభవిస్తున్నా వాటి ప్రభావమేమీ జ్ఞానికి ఉండదు అంటున్నారు. మరి, ఆ తెలియవలసిన ఆత్మజ్ఞానాన్ని పొందనంతవరకు సాధకుడు అజ్ఞానియే. కాబట్టి, అజ్ఞానికి జనన మరణాలు సంభవమౌతాయి. అలాగే మరణించిన తర్వాత ఆత్మ ఏమవుతుంది దాని పరిస్థితి ఏమిటి అనే సంశయం అజ్ఞానికి సమంజసమే. కాబట్టి, అటువంటి అజ్ఞానం వల్ల మరణానంతరం ఆత్మ ఏమవుతుందో దాని స్థితి ఎలా ఉంటుందో కూడా యమదేవుడు వివరిస్తానంటున్నాడు.)

**యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః .**
**స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్ .. 2-2-7 ..**

వారు చేసుకొన్న కర్మలు మరియు పొందిన జ్ఞానాలకు అనుగుణంగా కొందరు దేహాత్ములు తిరిగి శరీరం పొందేందుకు గర్భాలలో ప్రవేశిస్తారు, ఇంకొందరు మరణానంతరం కదలలేని వృక్షాదులను అనుసరిస్తారు.

## శంకర భాష్యమ్

యోనిం యోనిద్వారం శుక్రబీజసమన్వితాః సంతః అన్యే కేచిదవిద్యావంతో మూఢాః ప్రపద్యంతే శరీరత్వాయ శరీరగ్రహణార్థం దేహినః దేహవంతః యోనిం ప్రవిశంతీత్యర్థః . స్థాణుం వృక్షాదిస్థావరభావం అన్యే అత్యంతాధమా మరణం ప్రాప్య అనుసంయంతి అనుగచ్ఛంతి . యథాకర్మ యద్యస్య కర్మ తద్యథాకర్మ యైర్యాదృశం కర్మ ఇహ జన్మని కృతం తద్వశేనేత్యేతత్ . తథా యథాశ్రుతం యాదృశం చ విజ్ఞానముపార్జితం తదనురూపమేవ శరీరం ప్రతిపద్యంత ఇత్యర్థః ; 'యథాప్రజ్ఞం హి సంభవాః' (ఐ. ఆ. 2 . 3 . 2) ఇతి శ్రుత్యంతరాత్ ..

యత్ప్రతిజ్ఞాతం గుహ్యం బ్రహ్మ ప్రవక్ష్యామీతి తదాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అన్యే దేహినః'– కొందరు అవిద్యాపరులైన మూఢులు, దేహాత్మభావం కలవారు; 'యోనిం'– యోని ద్వారాన్ని శుక్రబీజములతో కూడి; 'శరీరత్వాయ'– శరీరాన్ని పొందేందుకు; 'ప్రపద్యంతే'– ప్రవేశిస్తారు; 'అన్యే'– ఇతరులు, అత్యంత అధములైన వారు; మరణాన్ని పొందిన తర్వాత, 'స్థాణుమ్'– కదలని స్థితికల వృక్షాదుల వంటి వాటిని; 'అనుసంయంతి'– అనుసరిస్తారు. 'యథా కర్మ'– వారి వారి కర్మలకు సరిపడిన, అంటే ఈ జన్మలో వారు నిర్వర్తించిన కర్మ ఫలాల వశంగా; అలాగే 'యథా శ్రుతమ్'– సంపాదించిన విజ్ఞాన స్వభావానికి అనుగుణంగా కూడా వారు శరీరాలను పొందుతారని అభిప్రాయం. 'ప్రాణులు వాటి జ్ఞానానుసారంగా జన్మాన్ని పొందుతాయి' ['యథాప్రజ్ఞం హి సంభవాః' (ఐ.ఆ. 2.3.2)].

(మరణానంతరం ఆత్మ ప్రస్థానమెలా ఉంటుంది అనే దానికి సమాధానం ఇస్తున్నారు. ఆత్మ ప్రస్థానం ఆ జీవులు వారి ప్రస్తుత జన్మలో చేసుకొన్న కర్మలను బట్టి మరియు పొందినట్టి జ్ఞాన స్వభావాలనుబట్టి ఉంటుంది అంటున్నారు. వివరంగా చెప్పాలంటే, అజ్ఞానంతో మూఢులైన వారు దేహమే ఆత్మయనే భావనే ఉన్నవాళ్లు కొందరు తిరిగి శుక్రబీజాలతో పాటు మాతృ గర్భంలో ప్రవేశించి నూతన శరీరాన్ని పొందుతారు. ఇక్కడ మాతృ గర్భమంటే నర జన్మ మాత్రమే కాదు. అనేక పశు పక్ష్యాది జన్మలు కూడా అని అర్థం చేసుకోవాలి. మరి వీటిలో ఏ జన్మను పొందుతారనేది వారి వారి కర్మఫలానుసారమే ఉంటుంది. అంతేకాక, వారు ప్రస్తుత జన్మలో సముపార్జించుకొన్న జ్ఞాన స్వభావంపై కూడా ఆధారపడి ఉంటుంది. మరి ఇంకొంతమంది అధమస్థాయికి చెందిన వారు కనీసం పశుపక్ష్యాది జన్మలు పొందటానికి కూడా అర్హతలేనివారు, వృక్షాదుల వంటి కదలని జీవులుగా జన్మ పొందుతారు.)

బ్రహ్మము గురించిన రహస్యాన్ని బోధిస్తామని ఉపనిషత్ ఇచ్చిన హామీని ఇపుడు ప్రవచిస్తున్నారు.

**య ఏష సుప్తేషు జాగర్తి కామం**

**కామం పురుషో నిర్మిమాణః .**

**తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే .**

**తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన . ఏతద్వై తత్ .. 2-2-8 ..**

ఏ పురుషుడైతే, సుషుప్తిలో జాగరూకుడై అవసరమైన కార్యాలను నిర్వహిస్తున్నాడో, అతడే శుద్ధుడు, అతడే బ్రహ్మ, అతడినే అమృతమంటారు. అతనిలోనే లోకాలు ఆశ్రయం పొందుతున్నాయి. ఏదీ అతనిని అతిక్రమించ లేదు. ఇది నిశ్చయంగా అదే.

## శంకర భాష్యమ్

యి ఏష సుప్తేషు ప్రాణాదిషు జాగర్తి న స్వపితి ; కథం ? కామం కామం తం తమభిప్రేతం స్త్ర్యాద్యర్థమవిద్యయా నిర్మిమాణః నిష్పాదయన్ , జాగర్తి పురుషః యః, తదేవ శుక్రం శుభ్రం శుద్ధం తద్బ్రహ్మ నాన్యద్గుహ్యం బ్రహ్మాస్తి . తదేవ అమృతం అవినాశి ఉచ్యతే సర్వశాస్త్రేషు . కించ, పృథివ్యాదయో లోకాస్తస్మిన్నేవ సర్వే బ్రహ్మణి శ్రితాః ఆశ్రితాః, సర్వలోకకారణత్వాత్తస్య . తదు నాత్యేతి కశ్చనేత్యాది పూర్వవదేవ ..

అతః కుతార్కికపాషండబుద్ధివిచాలిత అంతఃకరణానాం ప్రమాణోపపన్నమప్యాత్మైకత్వవిజ్ఞానమ్ అసకృదుచ్యమానమప్యనృజుబుద్ధీనాం బ్రాహ్మణానాం చేతసి నాధీయత ఇతి తత్ప్రతిపాదనే ఆదరవతీ పునః పునరాహ శ్రుతిః —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యః ఏషః'– ఎవరైతే; 'సుప్తేషు'–ప్రాణాదులు నిద్రాణమైన స్థితిలో; 'జాగర్తి'– మేల్కొన్నవాడై, నిద్రించకుండా అని. ఎలా? 'కామమ్ కామమ్'– ప్రీతికరమైన ప్రతియొక్క దానిని, అంటే వనితాదుల వంటి ప్రీతికలిగించే వాటిని; 'నిర్మిమాణః'– సృష్టి చేస్తూ, అవిద్యతో; 'పురుషః'– ఆ పురుషుడు (సర్వవ్యాపకుడైన బ్రహ్మ), ఎవరైతే వీటిని పూర్తి చేస్తూ జాగరూకుడై ఉన్నాడో ఆతడు; 'తత్ ఏవ'– ఆ పురుషుడే; నిజానికి 'శుక్రమ్'– తెల్లనిది, స్వచ్ఛమైనది; 'తత్ బ్రహ్మ'– అదియే బ్రహ్మ, వేరొక గుప్తమైన బ్రహ్మ లేదు. 'తత్ ఏవ'– అది మాత్రమే నిజానికి; 'అమృతమ్ ఉచ్యతే'– నాశరహితమైనదని అంటారు, సర్వ శాస్త్రములు అలాగే అంటున్నాయి. మరింకా, 'సర్వే లోకాః'– అన్ని లోకాలు, భూలోకాదులు; 'తస్మిన్'– దానిపైనే, బ్రహ్మము పైనే, 'శ్రితాః'– ఆధారపడినాయి, ఎందుకంటే అదియే అన్నిలోకాలకు మూలాధారం కాబట్టి. 'తత్ ఉ నాత్యేతి కశ్చన' అన్న పాఠానికి క.ఉ. 2.1.9 లో చెప్పబడిన భాష్యాన్ని తీసుకోవాలి. ['తత్ ఉ'– నిశ్చితంగా దానిని, 'కః చ న'– ఎవరునూ, ఎవరైననూ; న అత్యేతి – దాట జాలరు, అతిక్రమించరు. దానితో ఏకత్వం పొందకుండా ఉండరు, అదికాకుండా వేరుకారు.]

(సర్వ ఇంద్రియాలు వాటి కార్యకలాపాలను విరమించి నిద్రిస్తే దానిని సుషుప్తిఅంటారు. అటువంటి సుషుప్తిలో కూడా నిద్రించకుండా జాగరూకుడై ఉండేవాడు ఒకడున్నాడు. అలా మేకువగా ఉండి అతడేం చేస్తాడు అంటే, జీవునికి ప్రీతికరమైన వాటిని తయారు చేస్తూ ఉంటాడు. అంటే ఆ తయారు చేసేవాడు కర్తే కదా అంటే కాదంటున్నారు. మరెలా చేస్తాడు అంటే అవిద్యచేత అజ్ఞానం చేత చేయిస్తాడు. అతడినే పురుషుడు అని అంటున్నాం. అది ఆతని పేరుకాదు. అసలతనికి పేరేంలేదు. కాని, మనం గుర్తించడం కోసం మనంతట మనం అతనికి పెట్టిన పేరది. మరి ఆ పురుషుడు ఎటువంటి వాడు అంటే, స్వచ్ఛమైన వాడు. ఎటువంటి ఇతరాలు ఆతనిలో లేవు. అంతా అతడే. అతడు కాని వేరొకటేదీ అతనిలో లేదు. ఏదైనా వస్తువు స్వచ్ఛంగా ఉందంటే, ఆ వస్తువంతటా ఆ వస్తువే ఉన్నదని దానిలో వేరొక వస్తువనేదేదీ కలిసి లేదని అర్థం. వేరొక వస్తువు కలిసిందంటే, ఆ వస్తువు స్వచ్ఛత లోపించినట్లేకదా. అలాంటి స్వచ్ఛత కలిగిన పురుషుడన్నమాట. అదే బ్రహ్మ. దానినే అంటే ఆ పురుషుడినే బ్రహ్మ అనీ అంటున్నాం. వేదాలు, స్మృతులు తరచుగా బ్రహ్మ అనే పదంతో సూచించేది ఆ పురుషుడినే అని అర్థం. అది తప్ప, రహస్యంగా దాగి ఉన్న బ్రహ్మమనే వస్తువు లేదా తత్త్వం వేరొకటి లేదు. ఏదయితే శరీరంలో నిండిఉండి, ప్రాణాది సంఘాతానికి భిన్నమైనదై, ఆ ప్రాణాదులకు మూలాధారమై ప్రకాశిస్తుందో, దేనివలన జీవులు జీవత్వాన్ని అనుభవిస్తున్నారో ఆ పురుషుడే శ్రుతులు, స్మృతులు తరచుగా పేర్కొనే పరబ్రహ్మం. ఇదే బ్రహ్మ గురించిన రహస్యం. యమదేవుడు నచికేతునకు

ప్రతిజ్ఞ చేసిన బ్రహ్మము యొక్క రహస్యం ఇదే. ఈ పురుషుడినే లేదా బ్రహ్మనే అమృతమని అంటే నాశరహితమని శాస్త్రాలు ప్రవచిస్తున్నాయి. అన్ని లోకాలకు మూలాధారమైనది ఈ పురుషుడే. దీనిని ఏ ఇతరమూ అధిగమించి లేదు. ఈ పరమాత్మకు అతీతమైనది వేరొకటి ఏదీ లేదు. ఇలా ఘంటాపధంగా నిర్ధారించి చెప్పారు.)

ఆత్మ ఏకమైనదనే జ్ఞానాన్ని ప్రమాణాల ద్వారా నిర్ధారణ చేసినప్పటికీ, అనేక మార్లు నొక్కిచెప్పినప్పటికీ, విపరీత బుద్ధితో కుతర్కం చేసేవారివల్ల పెడత్రోవ పట్టిన బ్రాహ్మణుల మనసులలో ఆ జ్ఞానం స్థిరంగా నాటుకొనకపోవడం చేత, దానిని వృద్ధిపరచడం కోసం ఉపనిషత్తు ఆ విషయాన్నే మరల మరల చెప్తోంది.

**అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో**
**రూపం రూపం ప్రతిరూపో బభూవ .**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా**
**రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ .. 2-2-9 ..**

ఏ విధంగానైతే అగ్ని ఒక్కటే అయినప్పటికీ, లోకంలో ప్రవేశించి వివిధ రూపాలు దాల్చినట్లు, సర్వ భూతాలలోని ఆత్మ ఒక్కటే అయినప్పటికీ వివిధ రూపాలు పొందినా, వాటికి బాహ్యంగా ఉంటుంది.

## శంకర భాష్యమ్

అగ్నిః యథా ఏక ఏవ ప్రకాశాత్మా సన్ భువనం , భవంత్యస్మిన్భూతానీతి భువనం , అయం లోకః, తమిమం ప్రవిష్టః అనుప్రవిష్టః, రూపం రూపం ప్రతి, దార్వాదిదాహ్యభేదం ప్రతీత్యర్థః, ప్రతిరూపః తత్ర తత్ర ప్రతిరూపవాన్ దాహ్యభేదేన బహువిధో బభూవ ; ఏక ఏవ తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం సర్వేషాం భూతానామభ్యంతర ఆత్మా అతిసూక్ష్మత్వాద్దార్వాదిష్వివ సర్వదేహం ప్రతి ప్రవిష్టత్వాత్ ప్రతిరూపో బభూవ బహిశ్చ స్వేనావికృతేన రూపేణ ఆకాశవత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యథా'– ఏ విధంగా; 'అగ్నిః'– అగ్ని, ప్రకాశమే స్వభావంగాగలది; 'ఏకః'– ఒక్కటి మాత్రమే అయినా; 'భువనమ్'– దేనినుండి ప్రాణులు ఉద్భవిస్తాయో అనే అర్థంలో 'భూ' అనే ధాతువు యొక్క రూపమే (భూ సత్తాయామ్ – ధాతు పాఠం) భువనమ్, అనగా ఈ ప్రపంచాన్ని; 'ప్రవిష్టః'– ప్రవేశించగా; 'రూపమ్ రూపమ్ ప్రతి'– ప్రతి ఒక్క రూపానికి అనుగుణమైన, అంటే కట్టె మొదలైనటువంటి దహించబడే వివిధ వస్తువులను బట్టి; 'ప్రతిరూపః'– అనేక రూపాలుగా, ఆ యా ఇంధనద్రవ్యాలకు సంబంధించిన వేర్వేరు రూపాలుగా; 'బభూవ'– అవుతుందో; 'తథా'– అదే విధంగా; 'ఏక'– ఒక్కటే అయి; 'సర్వభూతాంతరాత్మా'– సర్వ జీవరాశులలోనున్నట్టి ఆత్మ, కట్టెలోని అగ్ని మొదలైనవాటి వలె అత్యంత సూక్ష్మతా ధర్మం చేత; 'ప్రతిరూపమ్'– శరీరాలలో ప్రవేశించడం ద్వారా, ప్రతి ఒక్క శరీరానికి

సంబంధించిన ప్రతి ఒక్క రూపానికి అనుగుణంగా ఆత్మ వివిధమైన రూపాలను పొందుతుంది; 'బహిః చ'– మరియు అది బాహ్యం, అంటే ఆకాశంలాగా తన స్వంతమైన అవ్యాకృత రూపంగాకూడా ఉంటుంది.

(ఆత్మ వివిధ శరీరాలలో ఆయా శరీర రూపాలకు తగ్గట్టుగా ఎలా ఉంటుంది అనే సందేహానికి సమాధానం చెప్తున్నారు. ఉదాహరణను అగ్నితో ప్రారంభించారు. అగ్నికి మండించే స్వభావం. మండించే వస్తువు రూపాన్ని అగ్ని సంతరించుకుంటుంది. ఎండిన చెట్టును దహిస్తే, చెట్టు రూపాన్ని పొందుతుంది. ఇనుప గుండును మండిస్తే, ఇనుప గుండు రూపాన్ని పొందుతుంది. అలాగే, కొన్ని ద్రవ్యాలను మండిస్తే నీలి రంగు కాంతి వస్తుంది. ఇలా వివిధ వస్తువులను మండించేటప్పుడు ఆయా వస్తువులు లేదా ద్రవ్యాలను బట్టి అగ్ని వివిధ రూపాలను పొందుతుండటం మనం చూస్తూనే ఉన్నాం. కాని చెట్టును దహించినా, ఇనుప గుండును దహించినా ఆ దహించేది అగ్ని మాత్రమే కదా. చెట్టును దహించే అగ్ని వేరు, ఇనుప గుండు దహించే అగ్ని వేరు కాదు కదా. అంటే అగ్ని మాత్రం ఒక్కటే. కాని, తన కార్యమైన దహనంలో మాత్రం అది వేరు వేరు రూపాలను సంతరించుకొంటోంది. అదే విధంగా, ఆత్మ అనేది ఒక్కటే. కాని, వివిధ శరీరాలలో ప్రవేశించి వాటి వాటి రూపాలను సంతరించుకొని వేరు వేరు నామాలతో గుర్తించబడుతోంది. వివిధ శరీరాలలో వివిధ రూపాలలో ఉన్నది గదా అని, ఒక్కొక్క శరీరానికి ఒక్కొక్క ఆత్మ అని భావన చేయకూడదు. పై ఉదాహరణలోని అగ్నిలాగా సర్వ జీవులలో అంతరతమమైయున్న ఆత్మ ఒక్కటే. సర్వ జీవులలో అంతరంగా ఉన్నది ఒకే ఆత్మ అన్నారు. బాగానే ఉంది. మరి జీవులకు బాహ్యంలో అంటే బయట పరిస్థితి ఏమిటి. ఆ బాహ్యంలో వేరే ఏదయినా ఇతర పదార్థంగాని, ద్రవ్యంకాని ఉన్నదా అనే సందేహం తలెత్తవచ్చు. అందుకే, జీవుల అంతరంగంలోనే కాదు, జీవులకు బాహ్యంలోకూడా ఉన్నది ఆ పరమాత్మే. అంటే ఒకే పరమాత్మ ప్రతి జీవియొక్క శరీరమనే పురంలో నిండి ఉండటమే కాదూ, వాటి బాహ్యంలో కూడా అదే పరమాత్మ ఏ మాత్రం వెలితి లేకుండా పూర్తిగా నిండి ఉన్నాడని ఉపనిషత్తు బోధిస్తోంది.)

**వాయుర్యథైకో భువనం ప్రవిష్టో**

**రూపం రూపం ప్రతిరూపో బభూవ .**

**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా**

**రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ .. 2-2-10 ..**

ఏ విధంగానైతే వాయువు ఒక్కటే అయినప్పటికీ, లోకంలో ప్రవేశించి వివిధ రూపాలు దాల్చినట్లు, సర్వ భూతాలలోని ఆత్మ ఒక్కటే అయినప్పటికీ వివిధ రూపాలు పొందినా, వాటికి బాహ్యంగా ఉంటుంది.

## శంకర భాష్యమ్

తథాన్యో దృష్టాంతః — వాయుర్యథైక ఇత్యాది .ప్రాణాత్మనా దేహేష్వనుప్రవిష్టః . రూపం రూపం ప్రతిరూపో బభూవేత్యాది సమానం ..

ఏకస్య సర్వాత్మత్వే సంసారదుఃఖిత్వం పరస్యైవ స్యాదితి ప్రాప్తే, ఇదముచ్యతే —

**శంకర భాష్యానికి తెలుగు అనువాదం**

'యథా'– ఏ విధంగా; 'వాయుః'–వాయువు, ప్రాణ శక్తి రూపంగా శరీరాలలో ప్రవేశించినదై, 'రూపమ్ రూపమ్ ప్రతిరూపః బభూవ ....' అన్న పాఠానికి ఇంతకు ముందు చెప్పినట్లుగా అర్థాన్ని గ్రహించాలి.

(క్రింది మంత్రంలో అగ్నిని ఉదాహరణగా చెప్పి దానిని ఆత్మకు అన్వయం చేసి చూపించారు. అలాగే, ఇప్పుడూ ఈ మంత్రంలో వాయువును ఉదాహరణగా చూపిస్తూ ఆత్మ యొక్క ఏకత్వాన్ని నిర్ధారణ చేస్తున్నారు. ఇక్కడ వాయువు అంటే ప్రాణశక్తిగా గ్రహించాలి. ఈ ప్రాణశక్తి అంతా ఒక్కటే. కాని వివిధ శరీరాలలో ప్రవేశించడవల్ల వివిధ రూపాలు పొందుతోంది. మానవ దేహంలో ప్రవేశించి అది మానవుని ప్రాణశక్తిగా కన్పడుతోంది. అదే పశువులో ప్రవేశించి పశుప్రాణశక్తిగా అనిపిస్తోంది. కాని వాస్తవానికి మానవ శరీరంలో ఉన్న ప్రాణశక్తి పశువులో ఉన్న ప్రాణశక్తి ఒక్కటియే. వేరు వేరు కాదు. ఈ వాయు (ప్రాణశక్తి) ఉపమానాన్ని ఆత్మకు అన్వయం చేస్తే, ప్రాణశక్తి వలెనే ఆత్మకూడా ఒక్కటే అయినప్పటికీ వేరువేరు ఉపాధులను పొందుతోందని ముందు చెప్పిన మంత్రంలో ఏవిధంగా అవగాహన చేసుకొన్నామో, అదే విధమైన అవగాహనను ఈ మంత్రంలో కూడా కొనసాగించాలి.)

సర్వ జీవుల ఆత్మ ఏకమేనని అంటే, సర్వజీవులనుభవించే సంసారదుఃఖం యావత్తూ ఆ పరమాత్మది అయే అవకాశం ఉంటుంది కదా అంటే, ఇలా చెప్తున్నారు.

**సూర్యో యథా సర్వలోకస్య చక్షు-**
**ర్న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః .**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా**
**న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః** **.. 2-2-11 ..**

సమస్తలోకానికి చక్షువైన సూర్యుడిని కన్నుల బాహ్యదోషాలు ఎలా అంటవో, అలాగే సర్వభూతాలకు ఏకమైన అంతరాత్మను బాహ్య ప్రాపంచిక దుఃఖాలు అంటవు.

**శంకర భాష్యమ్**

సూర్యః యథా చక్షుష ఆలోకేనోపకారం కుర్వన్మూత్రపురీషాద్యశుచిప్రకాశనేన తద్దర్శినః సర్వలోకస్య చక్షుః అపి సన్ న లిప్యతే చాక్షుషైః అశుచ్యాదిదర్శననిమిత్తైరాధ్యాత్మికైః పాపదోషైః బాహ్యైశ్చ అశుచ్యాదిసంసర్గదోషైః ఏకః సన్ , తథా సర్వభూతాంతరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః . లోకో హ్యవిద్యయా స్వాత్మన్యధ్యస్తయా కామకర్మోద్భవం దుఃఖమనుభవతి . న తు సా పరమార్థతః స్వాత్మని . యథా రజ్జుశుక్తికోషరగగనేషు సర్పరజతోదకమలాని న రజ్జ్వాదీనాం స్వతో దోషరూపాణి సంతి, సంసర్గిణి విపరీతబుద్ధ్యధ్యాసనిమిత్తాత్తు తద్దోషవద్విభావ్యంతే ; న తద్దోషైస్తేషాం లేపః, విపరీతబుద్ధ్యధ్యాసబాహ్యా హి తే ; తథా

ఆత్మని సర్వో లోకః క్రియాకారకఫలాత్మకం విజ్ఞానం సర్పాదిస్థానీయం విపరీతమధ్యస్య తన్నిమిత్తం జన్మమరణాదిదుఃఖమనుభవతి ; న త్వాత్మా సర్వలోకాత్మాపి సన్ విపరీతాధ్యారోపనిమిత్తేన లిప్యతే లోకదుఃఖేన . కుతః ? బాహ్యః రజ్జ్వాదివదేవ విపరీతబుద్ధ్యధ్యాసబాహ్యో హి స ఇతి ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యథా'– ఏ విధంగా; 'సూర్యః'– సూర్యునికి; తన కాంతి ద్వారా కన్నులకు దర్శించగలిగే సామర్థ్యాన్ని కలిగిస్తూ మరియు మూత్ర పురీషాదుల వంటి అశుద్ధ పదార్థాలను కూడా ప్రకాశింపచేయడం వల్ల వాటిని చూడగలిగేలా చేయడం వల్ల; 'సర్వలోకస్య చక్షుషః'– అలా వస్తువులను దర్శించే సమస్త జనుల కన్ను తాను అయినప్పటికీ; 'చాక్షుషైః బాహ్యదోషైః'– కంటిలోని దోషాలు మరియు కంటికి బాహ్యమైన దోషాలు, అంటే అశౌచాదుల వంటి వాటిని చూడటంద్వారా కలిగే అధ్యాత్మికపరమైన పాపదోషాలు మరియు అశౌచాదులతో సంసర్గం వల్ల కలిగే దోషాలు; 'న లిప్యతే'– అంటవో; 'తథా'– అదేవిధంగా; 'సర్వభూతాంతరాత్మా'– సర్వభూతజాలానికి అంతరతమైన ఆత్మగా, 'ఏకః'– ఒక్కడే అయినప్పటికీ; 'న లిప్యతే లోకదుఃఖేన'– సంసారదుఃఖములచే అంటబడడు, సంసారదుఃఖములు అంటవు. లోకులు సంసారంలో కామ్యకర్మలవల్ల సంభవించినట్టువంటి అవిద్యను ఆత్మపై అధ్యారోపితం చేయడం వల్ల దుఃఖాన్ని అనుభవిస్తున్నారు. తాడు-ముత్యపుచిప్ప-ఎడారి-ఆకాశాలపై అధ్యారోపణం చేయబడిన పాము-వెండి-నీరు-దుమ్ములలాగా అవిద్య ఆత్మపై ఆరోపించబడినదే కాని వాస్తవానికి అది ఆత్మకాదు. తాడు మొదలైనవాటిలో స్వాభావికంగా ఎటువంటి దోషమూ లేదు. విపరీత బుద్ధిచేత ఆరోపించబడిన కారణంగా [లేదా, వాటితో సంబంధాన్ని కలిగిన వ్యక్తులలో తప్పుడు భావనలు ఆరోపితం కావడం వల్ల] అవి దోషపూరితమైనవిగా గోచరిస్తున్నాయి. ఆ దోషాలు వాటిపై అధ్యారోపణం చేయబడినవైనందున రజ్జువు మొదలైనవాటిని ఆ దోషాలేవీ తాకడం లేదు. అదేవిధంగా, కర్మలు, కర్తృత్వాలు, ఫలాలు అనేవాటిని సర్పాదుల లాగా ఆత్మపై అధ్యారోపణం చేసిన తరువాత, ఆ అధ్యాస కారణంగా జననమరణాది దుఃఖాలను జనులు అనుభవిస్తున్నారు. కాని, ఆ ఆత్మను, సర్వభూతాలలో ఉన్న ఆత్మ అయినప్పటికీ, అధ్యారోపణం వల్ల కలిగి సంసారదుఃఖం అంటుకోదు. ఎందుకని? 'బాహ్యః'– తాడు మొదలైనవాటి లాగా బాహ్యమైనది కాబట్టి. విపరీత బుద్ధిచేత అధ్యారోపణం చేయబడిన విషయానికి అది బాహ్యమైనది కాబట్టి.

(ప్రపంచంలోని సర్వభూతాలకు అంతరాత్మ అయిన పరమాత్మకు, ఆ సర్వభూతాల దుఃఖంతో సంబంధముంటుందేమో అనే సందేహానికి సమాధానం చెప్తున్నారు. దీనికి సూర్యుడినే ఉదాహరణగా చూపిస్తున్నారు. సూర్యుడు తన కాంతితో కన్నులకు చూడగలిగే సామర్థ్యాన్ని ఇస్తున్నాడు. కంటికి చూడగలిగే సామర్థ్యంతో పాటు వస్తువులను కనబడేలా చేస్తున్నాడు. చూడగలిగిన కళ్ళుంటే సరిపోతుందా. ఎదుటి వస్తువులుకూడా కాంతిలో ప్రకటనమవ్వాలి కూడా. చీకటిలో కళ్ళు ఉన్నప్పటికీ వస్తువులు కనిపించవు కదా. అందుచేత వస్తువులు ప్రకటన మయ్యేలా చేసేది కూడా సూర్యుడే. అందుచేత సూర్యుడిని సమస్తలోకానికి చక్షువు అంటారు. అటువంటి చక్షువు అన్ని పదార్థాలు వస్తువులతో పాటు అశౌచమైన మూత్ర పురీషాదుల వంటి వాటిని కూడా ప్రకాశింప చేస్తుంది. ప్రకాశింపచేసిన మాత్రంచేత ఆ మలినత్వం అంతరంగంగా గాని, బాహ్యంగా గాని సూర్యుడికి అంటుతోందా. లేదు. అదే విధంగా, సర్వభూతజాలానికి అంతరంగమైన ఆత్మకు ఆ భూతజాలాలకు సంబంధించిన దుఃఖంకూడా అంటదు. అంటే సంసారదుఃఖం పరమాత్మకు అంటదు. అసలీ భూతజాలం దుఃఖాన్ని ఎందుకు అనుభవిస్తున్నాయి. సంసారంలో ఉండి

కోరికలను తీర్చుకోవడానికై జీవులు కర్మలు చేస్తున్నాయి. ఆ కర్మల వల్ల కలిగే ఫలమే అవిద్య. ఈ అవిద్యను ఆత్మమీద ఆరోపితం చేసుకోవడం వల్ల దుఃఖం అనుభవంలోకి వస్తోంది. ఇది ఎలాగంటే, తాడు మీద పామును అధ్యారోపం చేసుకొని భయాన్ని పొందినట్లుగా. అలాగే, ముత్యపు చిప్పలో వెండిని చూసినట్లు, ఎండమావిని నీటిగా భ్రమించినట్లు, ఆకాశాన్ని ధూళిగా దర్శించినట్లు, ఉదాహరణలు చెప్తున్నారు శంకరులు. నిజానికి తాడులో ఏదైన దోషమున్నదా అది పాములా తోచడానికి. దోషం తాడులో సుతరామూ లేదు. అవిద్యచేత ప్రేరేపించబడిన అవివేక బుద్ధి తాడును చూసి పాము అని పొరబడింది. అంటే దోషం తాడులో లేదని స్పష్టమౌతుంది. అంటే అవిద్యయే ఈ దోషానికి కారణం. అంటే అవిద్యా కారణమైన ఈ పాముగా కనబడటం అనే దోషం, తాడును అంటడం లేదు అంటే తాడుకు ఈ దోషానికి ఏమాత్రం సంబంధం లేదు. అదేవిధంగా ఆత్మపై అధ్యారోపణం చేయబడిన అవిద్య కారణంగానే సంసార దుఃఖాలైన జననం, మరణం, వ్యాధి మొదలైన దుఃఖాలు కలిగినట్లు కనిపిస్తున్నాయి. అధ్యారోపం తొలగిపోగానే, దానివల్ల కలిగే పరిణామాలైన సంసారదుఃఖాలు, వివేకం కలిగిన తర్వాత పాము తొలగిపోయినట్లు, తొలగిపోతాయి. అంటే ఆత్మకు అజ్ఞాన జనితమైన సంసారదుఃఖాలు అంటవని తెలిపోయింది. ఎందుకు అంటుకోవు అంటే, అధ్యారోపాల వల్ల కలిగిన సంసారదుఃఖాలకు ఆత్మ బాహ్యం, అంటే బయటిది, వాటితో ఏమాత్రం సంబంధం లేనిది.)

**ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా**

**ఏకం రూపం బహుధా యః కరోతి .**

**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా-**

**స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ .. 2-2-12 ..**

ఆ పరమాత్మను ఒకే ఒక్కనిగా, సర్వాధిష్టునిగా, సర్వభూతజాలానికి అంతరాత్మగా హృదయంలో దర్శించి, ఆ ఒక్కడే ఈ ఆనేకం అని గ్రహించే వివేకులే శాశ్వతమైన సుఖాన్ని పొందుతారు. ఇతరులు పొందరు.

### శంకర భాష్యమ్

కించ, స హి పరమేశ్వరః సర్వగతః స్వతంత్రః ఏకః, న తత్సమోఽభ్యధికో వాన్యోఽస్తి . వశీ, సర్వం హ్యస్య జగద్వశే వర్తతే . కుతః ? సర్వభూతాంతరాత్మా . యత ఏకమేవ సదైకరసమాత్మానం విశుద్ధవిజ్ఞానఘనరూపం నామరూపాద్యశుద్ధోపాధిభేదవశేన బహుధా అనేకప్రకారేణ యః కరోతి స్వాత్మసత్తామాత్రేణ అచింత్యశక్తిత్వాత్ , తత్ ఆత్మస్థం స్వశరీరహృదయాకాశే బుద్ధౌ చైతన్యాకారేణాభివ్యక్తమిత్యేతత్ — న హి శరీరస్యాధారత్వమాత్మనః, ఆకాశవదమూర్తత్వాత్ ; ఆదర్శస్థం ముఖమితి యద్వత్ — తమేతమీశ్వరమాత్మానం యే నివృత్తబాహ్యవృత్తయః అనుపశ్యంతి ఆచార్యాగమోపదేశమను సాక్షాదనుభవంతి ధీరాః వివేకినః, తేషాం పరమేశ్వరభూతానాం శాశ్వతం నిత్యం సుఖం ఆత్మానందలక్షణం భవతి, నేతరేషాం బాహ్యాసక్తబుద్ధీనామవివేకినాం స్వాత్మభూతమపి, అవిద్యావ్యవధానాత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, నిశ్చయంగా అతడు పరమేశ్వరుడు, సర్వవ్యాపి, స్వతంత్రుడు మరియు 'ఏకః'– ఒకే ఒక్కడు, అతనికి సమమైన వాడు అతనికన్నా గొప్పవాడు లేడు; అతడు 'వశీ'– అధిష్ఠానం, జగత్తు యావత్తు అతని ఆధీనం. ఎందుచేత? అతడు 'సర్వభూతాన్తరాత్మా'– సర్వభూతజాలానికి అతడే ఆత్మ అయిన కారణంగా. 'ఏకమ్ రూపమ్'– ఒకే రూపమై, అంతటా అన్నివేళలా సజాతీయమైన-సమమైన-స్వచ్ఛమైన చైతన్య ఘనమే రూపముగా గలిగినదానిని, నామ రూపాదులతో కూడిన అశుద్ధమైన ఉపాధుల వలన, 'బహుధా'– అనేక ప్రకారాలుగా, వారి ఆత్మ ఉనికిమాత్రంచేత ఊహచేయశక్యంకాని శక్తితో, 'యః'– ఎవరు; 'కరోతి'– చేస్తారో, 'తమ్ ఆత్మస్థమ్'– అతనిని తమ శరీరంలోని హృదయాకాశంలో నివసించే వానిని, అంటే బుద్ధిలో జ్ఞానరూపంగానున్న వానిని, అద్దంలో ముఖం ఎలా కనబడుతుందో ఆ విధంగా ఆకాశంలాగా రూపంలేని ఆత్మను గ్రహించడం శరీరానికి అసాధ్యమైనందున, 'శాశ్వతమ్ సుఖమ్'– నిత్యమైన సుఖం, ఆత్మానందమే లక్షణంగా గల సుఖంగా; 'యే ధీరాః'– వివేకం కలిగిన వారు, ఎవరైతే బాహ్యమైన కార్యకలాపాలనుండి విరమిస్తారో వారు; 'అనుపశ్యన్తి'– ఆచార్యుని ఉపదేశానుసారంగా సాక్షాత్తుగా అనుభవిస్తారో 'తేషామ్'– వారికే, పరమాత్మతో తాదత్మ్యత్వం మరియు ఆత్మానుభూతి కలుగుతుంది;, ఆత్మయైన భగవంతుని అనుభూతి పొందుతారు. 'న ఇతరేషామ్'– ఇతరులకు కాదు, బాహ్యవిషయాలలో చిక్కుకున్న బుద్ధి కల అవివేకులకు కాదు. ఎందువల్లనంటే, ఆనందమే వారి ఆత్మ అయినప్పటికీ అవిద్య అడ్డుపడటం కారణంగా వారు దాన్ని పొందలేరు.

(ఇపుడు పరమాత్మ లక్షణాలను మరియు వాటిని ఎలాంటివారు ఆ పరమాత్మను ఎలా అనుభూతి చెందుతారో చెప్తున్నారు. పరమాత్మ ప్రధాన లక్షణాలలో సర్వవ్యాపకత్వం ప్రధానమైంది. ఇందుగలడందులేడని పోతనామాత్యులు ఈ లక్షణాన్ని చక్కటి తెలుగులో వ్యక్తపరిచారు. ఇక్కడ ఉన్నాడు, అక్కడలేడు అని చెప్పే వీలు పరమాత్మ విషయంలో లేదు. అంతటా అన్ని వేళలా పరమాత్మ సృష్టి యావత్తూ వ్యాపించే ఉన్నాడు. మరి ఇలా వ్యాపించాడంటే, ఎవరైనా ఆదేశిస్తే ఇలా వ్యాపించి ఉన్నాడా? లేదు. పరమాత్మను ఆదేశించే మరొక వ్యక్తి గాని శక్తిగాని లేదు. మరెలా వ్యాపించాడు. వ్యాపించాలనుకొన్నాడు కనుక వ్యాపించాడు. అంతే. అంటే అతడు సర్వ స్వతంత్రుడన్నమాట. అతడిని ఆదేశించే వారు, నిరోధించే వారెవ్వరూ లేరు. స్వతంత్రత అనేది పరమాత్మ యొక్క రెండవ లక్షణం. ఏకత్వమనేది పరమాత్మ యొక్క మూడవ లక్షణం. అంటే పరమాత్మకు సమమైనది గాని, మించినది గాని వేరొక శక్తిగాని తత్త్వంగాని లేదు. ఈ లక్షణాల కారణంగా జగత్తు యావత్తూ పరమాత్మ వశంలోనే అధీనంలోనే అతని ఇష్టామాత్రంగానే వ్యవహరిస్తుంది. సర్వ జీవరాశుల అంతరాత్మ అయినందుచేతనే ఇది సాధ్యపడుతోంది. పరమాత్మ అంతటా ఒకే రీతిగా సమంగా స్వచ్ఛంగా ఉంటుందని చెప్తున్నారు. స్వచ్ఛమంటే, ఒక పదార్థంలో వేరొక పదార్థం మిళితమైతే ఆ పదార్థం తన స్వచ్ఛతను కొల్పోతుంది. అంటే పరమాత్మలో మరొకటి మిళితమయ్యే స్థితియే ఉండదు. అదెప్పుడూ స్వచ్ఛమే. మరైతే, ఒక్కొక్క జీవిలో ఒక్కోలా పరమాత్మ ఉన్నాడు కదా! మరది ఎలాగా? జీవుల ఉపాధి బేధం వల్లనే పరమాత్మ వేర్వేరుగా కన్పడుతున్నాడు కాని. వాస్తవానికి పరమాత్మ స్వరూపంలో బేధమేమీ లేదు. నరులలో ఒక రకమైన పరమాత్మ, పశువులో మరో రకమైన పరమాత్మ ఉండడు. ఎవరైతే ఈ సత్యాన్ని గ్రహిస్తారో వారు ధీమంతులు అంటే బుద్ధిమంతులు లేదా వివేకవంతులు. ఈ విధంగా సత్యాన్ని గ్రహించడమంటే తెలియని దాన్ని తెలుసుకొన్నట్లు కాదు. పోయినదాన్ని తిరిగి సంపాదించడం వంటిది కాదు. అద్దంలో తన ముఖాన్ని

చూసుకొన్నట్లుగా పరమాత్మను దర్శించడం సంభవం కాదు. ఎందుకు సంభవం కాదంటే, ఆకాశంలాగా ఆత్మకు రూపమేమీ లేదు కాబట్టి. ఆకాశానికి రూపం లేదు కాని అది ఉన్నట్లు అనుభవమైతే కలుగుతోంది కదా! అలా అనుభవంతో పరమాత్మను గుర్తించాలే కాని వేరేవిధంగా కుదరదు. అంటే, ఆ పరమాత్మ తానే నన్న పరమసత్యాన్ని అనుభూతి చెందడం ఒక్కటే మార్గం. పరమాత్మకు తనకు ఏకత్వమేనని భిన్నత్వం లేదని ఎరుకకలిగి ఉండటం. అలా అనుభూతి చెందిన వాళ్లకే శాశ్వతమైన సుఖం లభిస్తుంది. శాశ్వతమంటే నిక్కచ్చిగా శాశ్వతమే. కొంతకాలం పాటు ఉండి తర్వాత మరుగుపడేది కాదు. సుఖమంటే ఆత్మానందమే. పరమాత్మ అంటేనే అంతులేని ఆనందరాశి. మరి ఈ అనుభవం ఎవరికి కలుగుతుంది? ఇందాక చెప్పిన ధీమంతులకు, వివేకవంతులకు. వారికే ఎలా కలుగుతుంది? వారేంచేస్తారంటే, ఆచార్యులు వేదశాస్త్రానుసారంగా చెప్పిన ఉపదేశాలను శ్రద్ధతోపాటించి బాహ్యవిషయాల పట్ల విరక్తిని పొంది వివేకాన్ని సంపాదించుకొంటారు. తద్వారా వారికి ఆత్మానుభవం కలుగుతుంది. అంటే, అలాంటి వివేకవంతులకే కలుగుతుందా, వేరే ఇతరులకు కలగదా అంటే, కలగదు అని నిర్ద్వందంగా చెప్తున్నారు. మరి మీరు ఆత్మ అంటే ఆనందపు ఘనమని చెప్పారు. అది ప్రతి వ్యక్తిలోనూ ఉన్నదనే చెప్పారు. తమలోనే ఉన్నదాన్ని కొంతమంది వివేకవంతులే తెలుసుకొంటారు, మిగిలిన వారు తెలుసుకోరని ఎలా చెప్తారు అనే ప్రశ్నకు కూడా సమాధానం ఇలా చెప్తున్నారు. వివేకంలేని ఇతరుల బుద్ధి అజ్ఞానం వల్ల బాహ్యవిషయాలలో చిక్కుకొని బయటపడలేదు. ఆ అజ్ఞానం వల్లనే ఇతరులు ఆత్మజ్ఞానాన్ని అది తమలోనే ఉన్నప్పటికీ పొందలేకపోతున్నారు. మెడలోనే గొలుసు ఉన్నప్పటికీ దాన్ని బయట ప్రపంచంలో వెదుకుతున్నారు.)

**నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా-**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్ .**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా-**
**స్తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషామ్ .. 2-2-13 ..**

**అశాశ్వతాలలోని శాశ్వత్వమై, చైతన్యాలలోని చేతనై, ఒక్కడై అనేకుల కోర్కెలను తీరుస్తూ, ఆత్మస్థితుడైన వానిని గ్రహించే వివేకులే శాశ్వతమైన శాంతిని పొందుతారు. ఇతరులు పొందరు.**

## శంకర భాష్యమ్

కించ, నిత్యః అవినాశీ నిత్యానాం అవినాశినాం . చేతనః చేతనానాం చేతయితృణాం బ్రహ్మాదీనాం ప్రాణినాం . అగ్నినిమిత్తమివ దాహకత్వమనగ్నీనాముదకాదీనామాత్మచైతన్యనిమిత్తమేవ చేతయితృత్వమన్యేషాం . కించ, స సర్వజ్ఞః సర్వేశ్వరః కామినాం సంసారిణాం కర్మానురూపం కామాన్ కర్మఫలాని స్వానుగ్రహనిమిత్తాంశ్చ కామాన్ యః ఏకో బహూనాం

అనేకేషాం అనాయాసేన విదధాతి ప్రయచ్ఛతీత్యేతత్ . తం ఆత్మస్థం యే అనుపశ్యంతి ధీరాః, తేషాం శాంతిః ఉపరతిః శాశ్వతీ నిత్యా స్వాత్మభూతైవ స్యాత్ . న ఇతరేషాం అనేవంవిధానాం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

మరింకా, అతడు ఆ పరమాత్మ, 'నిత్యానామ్'–వినాశనమే లేనివాటిలో; 'నిత్యః'– వినాశములేని వాడు; 'చేతనానామ్'– చైతన్యమైన వాటిలో;[రామకృష్ణ మఠం వారు ప్రచురించిన గంభీరానందుల వారి అనువాదంలో 'నిత్యోఽనిత్యానామ్' అని పాఠబేధమున్నది. కాని శంకరుల భాష్యంలో కూడా నిత్యో నిత్యానామ్ అన్నట్లుగానే వ్యాఖ్యానం చేయబడినందున నిత్యో నిత్యానామ్ అనే ఇక్కడ గ్రహించడమైనది]; 'చేతనః'– చైతన్యం, బ్రహ్మాదులతో మొదలైన ప్రాణుల వంటి చైతన్య రూపాలలోని చైతన్యం. అగ్నికానటువంటి ఉదకాదులలో అగ్నికారణంగా మండే స్వభావమున్నట్లుగా, ఆత్మచైతన్యం కారణంగా మాత్రమే ఇతరములలో చూడబడుతున్న చైతన్య శక్తి రూపాన్ని సంతరించుకొంటోంది. ఇంకా, సర్వజ్ఞత్వంతో సర్వానికి ప్రభువైన పరమాత్మ, 'యః'– ఎవడైతే; 'ఏకః'– ఒక్కడే అయివుండీ; 'బహూనామ్'– అనేకులకు, కోరికలు కోరుకొనే సంసారికులకు; 'కామాన్'– కోరికలు కోరుకొనే సంసారులకు వారి కర్మలకు సరిపడిన కర్మఫలాలను, తను స్వయంగా అనుగ్రహపూర్వకంగా కూడా ఇచ్చే ఫలాలను; 'విదధాతి'– విభజించి నిర్దేశించేది, అనాయాసంగా. 'తం ఆత్మస్థం యే అనుపశ్యంతి ధీరాః'– అటువంటి పరమాత్మను తమ హృదయాలలో అనుభూతి చెందిన వివేకవంతులకు, 'శాశ్వతీ'– నిత్యమైన; 'శాన్తిః'– శాంతి లేదా ఉపరతి లభిస్తుంది. అట్టి వివేకంకలవారు మాత్రమే వారి ఆత్మయే అయినటువంటి శాంతిని పొందుతారు. 'న ఇతరేషామ్'– వారికి భిన్నమైన ఇతరులు పొందరు.

(ఆ పరమాత్మ గురించిన మరిన్ని విశేషాలు చెప్తున్నారు. పరమాత్మ శాశ్వతమైన వాటన్నింటిలోని శాశ్వతత్త్వం. చైతన్యాలన్నింటిలోని చైతన్యం అంటున్నారు. ఇదెలాగంటే, నీటిని తీసుకొందాం. నీటికి దహన శక్తి అంటే కాల్చే శక్తి ఉండదు. కాని మరిగేనీటికి కాల్చే శక్తి ఎక్కడనుండి వచ్చింది? ఆ మరిగేనీటిలోని అగ్నినుండే కదా. అలాగే, చైతన్యరూపాలన్నింటిలోనూ ఆ చేతనత్వం పరమాత్మయే. అలాగే శాశ్వతమైన విషయాలన్నింటిలోని శాశ్వతత్త్వం ఆ పరమాత్మే. అటువంటి పరమాత్మ తాను ఒక్కడే అయినప్పటికీ, ఎంతోమంది సంసారికులకు వారి అభీష్టంమేరకు వారి వారి కర్మానుసారంగా కర్మఫలాలను అందిస్తున్నాడు. కోరుకున్నమేరకు మాత్రమే కాదు ఒక్కోసారి పరమాత్మ తన ఇచ్ఛానుసారంగా అనుగ్రహపూర్వకంగా కూడా జీవులకు ఫలాలను అనుగ్రహిస్తాడు. అంటే, తానొక్కడే అయినప్పటికీ ఈ కర్మఫలాలను జీవులందరికీ విభజించి ఇచ్చే కార్యాన్ని ఏమాత్రం కష్టపడకుండా సునాయాసంగా నిర్వహిస్తున్నాడు. ఇదీ పరమాత్మ యొక్క సర్వజ్ఞత్వ లక్షణం. ఇటువంటి పరమాత్మను వివేకవంతులు తమ అంతరంగంలో ఉన్నవానిగా ఎరుకగలిగి అనుభూతి పొందుతారు. వారు శాంతియే స్వరూపంగా గల ఆ పరమాత్మానుభవంలో రమిస్తూ అంటే ఆనందానుభూతి చెందుతూ ఉంటారు. కాని వీరికి విరుద్ధమైన స్వభావంకల ఇతరులు ఈ అనుభూతిని పొందలేరు.)

**తదేతదితి మన్యన్తేఽనిర్దేశ్యం పరమం సుఖమ్ .**

**కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా .. 2-2-14 ..**

వారు తెలుసుకొన్న నిర్దేశింపశక్యంకాని పరమ సుఖం ఇదేనని ఎలా గ్రహించడం? అది ప్రకాశిస్తుందా లేక గోచరిస్తుందా?

## శంకర భాష్యమ్

యత్తదాత్మవిజ్ఞానసుఖం అనిర్దేశ్యం నిర్దేష్టుమశక్యం పరమం ప్రకృష్టం ప్రాకృతపురుషవాఙ్మనసయోరగోచరమపి సన్నివృత్తైషణా యే బ్రాహ్మణాస్తే తదేతత్ప్రత్యక్షమేవేతి మన్యంతే, కథం ను కేన ప్రకారేణ తత్సుఖమహం విజానీయాం ఇదమిత్యాత్మబుద్ధివిషయమాపాదయేయం యథా నివృత్తవిషయైషణా యతయః . కిము తత్ భాతి దీప్యతే ప్రకాశాత్మకంతత్ యతోఽస్మద్బుద్ధిగోచరత్వేన విభాతి విస్పష్టం దృశ్యతే కిం వా నేతి ..

అత్రోత్తరమిదం — భాతి చ విభాతి చేతి . కథం ?

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'తత్' (యత్) – అది, ఆ ఆత్మగురించిన జ్ఞానం; 'సుఖమ్'– ఆనందం; 'అనిర్దేశ్యమ్'– నిర్దేశింపశక్యం కానిది; 'పరమమ్'– మహోన్నతమైనది; సాధారణ జనుల వాక్కుకు మరియు మనసుకు గోచరంకానిదైనప్పటికినీ, కోరికలు నశించిన బ్రాహ్మణులు దానిని, 'ఏతత్ ఇతి'– "ఇది" అని ప్రత్యక్షంగా తెలిసినదానిగా; 'మన్యన్తే'– భావిస్తారు. 'కథం ను'– ఎలా నిశ్చయంగా; 'తత్'– దానిని; 'విజానీయామ్'– నేను తెలుసుకొంటాను. సన్యాసులు అంటే కోరికలను నివృత్తి చేసుకొన్నవారు పొందిన ఆ పరమానందం,"అది ఇదే" (సన్యాసులు పొందిన ఆ పరమానందం ఇదే) అని నా బుద్ధికి ఏ ప్రకారంగా తోస్తుంది?'కిమ్ ఉ తత్ భాతి'– అది ప్రకాశిస్తుందా?; ప్రకాశమే స్వభావమైనట్టి అది, 'విభాతి'– గోచరమౌతుందా, బుద్ధికి విషయంగా స్పష్టంగా చూడబడుతుందా; 'వా'– లేక, అలా కాదా (లేదా అది ప్రకాశం కావడం చేత బుద్ధికి విషయంగా స్పష్టంగా అనుభవమౌతుందా? లేక కాదా?)

(ఇక్కడ ఒక ముఖ్యమైన సందేహాన్ని ఉపనిషత్తు లేవనెత్తుతోంది. ఇది దాదాపుగా అందరికీ కలిగే సందేహమే. ఇప్పటివరకు రెండు విషయాలు నిర్ధారణకు వచ్చాయి. అవేమంటే, పరమాత్మను గురించిన జ్ఞానం నిస్సందేహంగా అది ఇలాంటిది అని చెప్పే వీలులేనటువంటిది. అంటే, అంతా అస్పష్టంగా అనంతమనీ, అనాది అనీ అలా పైపైన చెప్పుకొస్తున్నామే కాని, ఖచ్చితంగా 'ఇదిగో ఇది పరమాత్మ' అన్నట్లుగా 'ఇది' అనే పదంతో పరమాత్మను సూచించ వీలుకాదు. అయితే, కోరికలను నశింపచేసుకొన్న యతులు లేదా మహర్షులు ఆ పరమాత్మను తెలిసినదానిగా భావిస్తారు, ప్రవర్తిస్తారు. తెలిసినది ఏదైనా ఇది అంటూ సూచింపబడాలి కాదా. ఇక్కడదే విశేషం. పరమాత్మజ్ఞానం తెలిసినదైనా దానిని ఇది అంటూ ఆ జ్ఞానం పొందిన మహర్షులు కూడా చెప్పలేరు. మరైతే, మనలాంటి ముముక్షువులకు సాధకులకు గురూపదేశంవల్ల కాని, శాస్త్రం వల్లకాని పరమాత్మ జ్ఞానం కలిగినదే అనుకొందాం. ఆ కలిగిన జ్ఞానం నిజమైన పరమాత్మ జ్ఞానమా కాదా అనేది ఎలా తెలుస్తుంది? ఇదీ అసలు సమస్య. ప్రశ్న కూడా దాని

గురించే. పరమాత్మ ప్రకాశ స్వరూపం కదా. అది ఎలా గోచరిస్తుంది? అన్ని భౌతిక ప్రకాశాలలాగా ఆ ప్రకాశం కూడా బుద్ధికి ఒకవిషయంగా గోచరించి చూడబడుతుందా లేక అలా కాదా అన్నది ప్రశ్న. దీనికి రాబోయే మంత్రంలో సమాధానమిస్తోంది ఉపనిషత్తు.)

దీనికి సమాధానం ఇది. అది స్వయం ప్రకాశకం మరియు వివిధ ప్రకాశాలు కూడా అదే. ఎలా?

**న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం**

**నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః.**

**తమేవ భాన్తమనుభాతి సర్వం**

**తస్య భాసా సర్వమిదం విభాతి .. 2-2-15 ..**

అక్కడ సూర్యుడు ప్రకాశించడు, చంద్రుడు తారలు కూడా ప్రకాశించవు, మెరుపులు మెరవవు. ఇంకెక్కడి అగ్ని? అది(ఆ పరబ్రహ్మం) ప్రకాశించడం చేతనే సర్వం ప్రకాశిస్తున్నాయి. దాని తేజంతోనే ఈ సర్వస్వం ప్రకాశవంతమౌతోంది.

## శంకర భాష్యమ్

న తత్ర తస్మిన్స్వాత్మభూతే బ్రహ్మణి సర్వావభాసకోఽపి సూర్యః భాతి తద్బ్రహ్మ న ప్రకాశయతీత్యర్థః . తథా న చంద్రతారకం , నేమా విద్యుతో భాంతి, కుతః అయం అస్మద్దృష్టిగోచరః అగ్నిః . కిం బహునా ? యదిదమాదిత్యాదికం భాతి తత్ తమేవ పరమేశ్వరం భాంతం దీప్యమానం అనుభాతి అనుదీప్యతే . యథా జలోల్ముకాది అగ్నిసంయోగాదగ్నిం దహంతమనుదహతి న స్వతః, తద్వత్ . తస్యైవ భాసా దీప్త్యా సర్వమిదం సూర్యాది విభాతి . యత్ ఏవం తదేవ బ్రహ్మ భాతి చ విభాతి చ . కార్యగతేన వివిధేన భాసా తస్య బ్రహ్మణో భారూపత్వం స్వతోఽవగమ్యతే . న హి స్వతోఽవిద్యమానం భాసనమన్యస్య కర్తుం శక్యం , ఘటాదీనామన్యావభాసకత్వాదర్శనాత్ భారూపాణాం చ ఆదిత్యాదీనాం తద్దర్శనాత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'తత్ర'— అచట, స్వయంగా తన ఆత్మయైన బ్రహ్మమునందు, సర్వాన్ని ప్రకాశించేదయినప్పటికీ 'సూర్యః'— సూర్యుడు; 'న భాతి'— ప్రకాశించడు, అంటే బ్రహ్మను ప్రకాశింపచేయలేడని అభిప్రాయం. అదేవిధంగా, 'న చన్ద్రతారకమ్ న ఇమాః విద్యుతః భాన్తి'— చంద్రుడు నక్షత్రాలు మరియు విద్యుల్లతల మెరుపులు కూడా (ఆ బ్రహ్మమును ప్రకాశింపచేయలేవు). 'కుతః అయమ్ అగ్నిః'— ఈ మనచే చూడబడే అగ్ని ఎలా? (ఏమి ప్రకాశించగలదు?) ఇంతెందుకు? వీటన్నిటితో సహా, ప్రకాశించేవన్నీ కూడా 'తమ్ ఏవ భాన్తమ్'— అతడు, ఆ పరమాత్మ ప్రకాశిస్తేనే, 'అనుభాతి'— దానికి అనుగుణంగా ప్రకాశిస్తున్నాయి. ఇది ఎలాగంటే, (వేడి) నీరు, బాణాసంచాలు మొదలైనవి స్వతంత్రంగా కాకుండా అగ్నియొక్క సంపర్కం చేత మాత్రమే దహించ గలుగుతున్నాయో, ఆ విధంగా. అందుచేత

నిజానికి 'తస్య భాసా'– అతని (పరమాత్మ) తేజస్సుచేతనే, 'సర్వమ్ ఇదమ్'– ఇదంతా, అంటే సూర్యుడు మొదలైనవన్నీ, 'విభాతి'– వేర్వేరుగా ప్రకాశిస్తున్నాయి. ఇది ఇలా ఉన్నందున, ఆ పరబ్రహ్మమే ప్రకాశ తత్త్వమూనూ మరియూ వేర్వేరు ప్రకాశాలూనూ. వివిధ ప్రకాశనాల ఫలితాల ద్వారా, ఆయా ప్రకాశాల ప్రకాశన శీలత్వమే ఆ బ్రహ్మము. నిజానికి, స్వయంగా ప్రకాశన శీలత్వం లేనివి ఇతరాలకు ప్రకాశాన్ని ఇవ్వలేవు. ఉదాహరణకు కుండ మొదలైనవి ఇతర వస్తువులును ప్రకాశింప చేయలేవు కాని, స్వయం ప్రకాశకములైన సూర్యుడు మొదలైనవి అలా చేయడం చూస్తున్నాం.

(ముందు మంత్రంలో సాధకునికి కలిగే సందేహాన్ని ఈ మంత్రంలో నివృత్తి చేస్తున్నారు. పరమాత్మ ప్రకాశం ఇతర విషయాలలాగా బుద్ధికి గోచరించేది కాదని నిర్ద్వందంగా తిరస్కరిస్తున్నారు. ఆ పరమాత్మ ప్రకాశం ఎంత ఉత్కృష్టమైనదంటే, ఆ ప్రకాశం ముందు సూర్యుడు ఏమాత్రం తన ప్రకాశ ప్రభావాన్ని చూపలేడు. సూర్యుడే కాదు, చంద్రుడు, తారలు మరింకా మెరుపులు ఆ ప్రకాశంముందు దిగదుడుపే. ఆ ప్రకాశం ముందు అవన్నీ వెలవెల పోతాయి. ఇంతటి ప్రతిభలు కల ప్రకాశాల పరిస్థితే ఇలా ఉంటే ఇక మన కళ్ళముందు కనబడే అగ్ని తేజస్సు గురించి చెప్పేదేముంది. అది అసలు లెక్కలోకి కూడా రాదు. కాబట్టి, మన ఊహకు అందే భౌతిక ప్రకాశాలేవీ ఆ పరమాత్మ ప్రకాశం ముందు పనికిరానివి. భౌతిక పరిధిలో పరమాత్మను గుర్తించడం సాధ్యమయ్యే విషయం కాదని సుస్పష్టంగా ప్రకటిస్తున్నారు. మరింకా, ఇంకోమాట అదనంగా కూడా చెప్తున్నారు. అదేమంటే, అసలు ఈ భౌతిక ప్రకాశాలైన సూర్యుడు, చంద్రుడు, తారలు, మెరుపులు, అగ్ని ఇవన్నీకూడా ఆ పరమాత్మ ప్రకాశం వల్ల మాత్రమే, ప్రకాశిస్తున్నాయి. వాటికి స్వతంత్రత ఏమీ లేదు. ఆ పరమాత్మ ప్రకాశం లేకపోతే, ఇవన్నీ ప్రకాశహీనమౌతాయి. వట్టి నీరు దహించగలదా. లేదు. నీటికి అగ్నితోడైతేనే, ఆ వేడినీటికి దహించే సామర్థ్యం కలుగుతుంది. అలాగే, బాణా సంచా తమంత తాముగా ఏ విస్ఫోటనాన్ని కలగచేయలేవు. కాని, అగ్నితోడైతై అవి చేసే విధ్వంసం చూస్తూనే ఉన్నాం. అలాగే, స్వయం ప్రకాశ రూపమైన పరమాత్మ యొక్క ఉనికి లేకుండా ఈ వివిధ భౌతిక ప్రకాశాలు ప్రకాశించేవి కానేకావు. వీటి ప్రకాశానికి మూలం ఆ పరబ్రహ్మ ప్రకాశమే. కాబట్టి పరమాత్మకు ఇంకొక లక్షణాన్ని చెప్తున్నారు. పరమాత్మ స్వయం ప్రకాశకమే కాదు, వివిధ ప్రకాశాలలోని ప్రకాశన శీలత కూడా ఆ పరమాత్మే. మరోవిధంగా చెప్పాలంటే, వివిధ భౌతిక ప్రకాశాలలో అంతర్గతంగా ఉన్నట్టి ప్రకాశ శీలతయే ఆ పరబ్రహ్మం. అలా అంతర్గతంగా ప్రకాశన శీలత్వంగా పరబ్రహ్మ ఉండటం వల్లనే, సూర్యుడు మొదలైనవి ఇతర పదార్థాలను ప్రకాశింపచేస్తున్నాయి. అంతే కాని, ప్రకాశనశీలత లేని కుండ దాని సమీపంలోని ఇతరాలను ప్రకాశింప చేయగలగడం లేదు కదా. అంటే, భౌతిక ప్రకాశాలలాగా సాధకుని బుద్ధిచేత గుర్తింపబడే ప్రకాశం వంటిది కాదు పరమాత్మ ప్రకాశం. ఆ ప్రకాశాలకే ప్రకాశమైనట్టి పరమాత్మను అలా గుర్తించడం సాధ్యంకాదని నిశ్చయంగా తెలియచేసింది ఉపనిషత్తు.)

..ఇతి పంచమవల్లీభాష్యం ..

# షష్ఠీ వల్లీ

## శంకర భాష్యమ్

తూలావధారణేనైవ మూలావధారణం వృక్షస్య యథా క్రియతే లోకే, ఏవం సంసారకార్యవృక్షావధారణేన తన్మూలస్య బ్రహ్మణః స్వరూపావదిధారయిషయా ఇయం షష్ఠీ వల్లీ ఆరభ్యతే .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

లోకంలో పత్తిపింజని చూసి దానికి మూలమైన పత్తిచెట్టును తెలుసుకొంటుంటారు. అదేవిధంగా సంసారవృక్షమనే కార్యాన్ని పరిశీలించి దానికి మూల కారణమైన పరబ్రహ్మాన్ని నిర్ణయించడంద్వారా బ్రహ్మము యొక్క నిజతత్త్వాన్ని తెలుసుకునేందుకు ఈ ఆరవ వల్లీ ప్రారంభిస్తున్నారు.

[పత్తిదూదిని చూసి అది పత్తిచెట్టునుండి వచ్చిందని, ఎక్కడో ఉన్నటువంటి ఆ చెట్టును చూడకపోయినా చెప్తున్నాం. అదేవిధంగా, కార్యమైనటువంటి ప్రపంచం కనబడుతోంది కనుక దానికి కారణమైన బ్రహ్మము, కనబడనప్పటికీ, ఉండి తీరాలి - స్వామి గంభీరానంద]

**ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః .**
**తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే .**
**తస్మిఁల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన . ఏతద్వై తత్ .. 2-3-1 ..**

ఇది వ్రేళ్లు పైకి కొమ్మలు కిందికి ఉన్న ఆదిలేని అశ్వత్థ వృక్షం. అదే పవిత్రం, అదే బ్రహ్మ. దానినే అమృతమంటారు. లోకాలన్నీ దానిలో స్థిరమైనాయి. దానిని అధిగమించ లేరెవ్వరు. ఇదంతా నిశ్చయంగా అదే.

## శంకర భాష్యమ్

ఊర్ధ్వమూలః ఊర్ధ్వం మూలం యత్ తద్విష్ణోః పరమం పదమస్యేతి సోఽయమవ్యక్తాదిస్థావరాంతః సంసారవృక్షః ఊర్ధ్వమూలః . వృక్షశ్చ వ్రశ్చనాత్ వినశ్వరత్వాత్ . అవిచ్ఛిన్నజన్మజరామరణశోకాద్యనేకానర్థాత్మకః ప్రతిక్షణమన్యథాస్వభావః మాయామరీచ్యుదకగంధర్వనగరాదివద్దృష్టనష్టస్వరూపత్వాదవసానే చ వృక్షవదభావాత్మకః కదలీస్తంభవన్నిఃసారః అనేకశతపాషండ బుద్ధివికల్పాస్పదః తత్త్వవిజిజ్ఞాసుభిరనిర్ధారితేదంతత్త్వః వేదాంతనిర్ధారిత పరబ్రహ్మమూలసారః అవిద్యాకామకర్మావ్యక్తబీజప్రభవః అపరబ్రహ్మ విజ్ఞానక్రియాశక్తిద్వయాత్మకహిరణ్యగర్భాంకురః సర్వప్రాణిలింగభేదస్కంధః తత్తత్తృష్ణాజలాసేకోద్భూతదర్పః బుద్ధీంద్రియవిషయప్రవాలాంకురః శ్రుతిస్మృతిన్యాయవిద్యోపదేశపలాశః యజ్ఞదానతపఆద్యనేకక్రియాసుపుష్పః సుఖదుఃఖవేదనానేకరసః ప్రాణ్యుపజీవ్యానంతఫలః తత్తృష్ణా సలిలావసేకప్రరూఢ జటిలీకృతదృఢబద్ధమూలః సత్యనామాది

సప్తలోకబ్రహ్మాదిభూతపక్షికృతనీడః ప్రాణిసుఖదుఃఖోద్భూతహర్షశోక జాతనృత్యగీతవాదిత్రక్ష్వేలితాస్ఫోటిత హసితాక్రుష్టరుదితహాహా ముంచముంచేత్యాద్యనేకశబ్దకృతతుములీభూతమహారవః వేదాంతవిహితబ్రహ్మాత్మ దర్శనాసంగశస్త్రకృతోచ్ఛేదః ఏష సంసారవృక్ష అశ్వత్థః అశ్వత్థవత్కామకర్మవాతేరితనిత్యప్రచలితస్వభావః . స్వర్గనరకతిర్యక్ప్రేతాదిభిః శాఖాభిః అవాక్శాఖః, అవాంచః శాఖా యస్య సః, సనాతనః అనాదిత్వాచ్చిరప్రవృత్తః . యదస్య సంసారవృక్షస్య మూలం తదేవ శుక్రం శుభ్రం శుద్ధం జ్యోతిష్మత్ చైతన్యాత్మజ్యోతిఃస్వభావం తదేవ బ్రహ్మ సర్వమహత్త్వాత్ . తదేవ అమృతం అవినాశస్వభావం ఉచ్యతే కథ్యతే సత్యత్వాత్ . వాచారంభణం వికారో నామధేయమనృతమన్యదతో మర్త్యం . తస్మిన్ పరమార్థసత్యే బ్రహ్మణి లోకాః గంధర్వనగరమరీచ్యుదకమాయాసమాః పరమార్థదర్శనాభావావగమనాః శ్రితాః ఆశ్రితాః సర్వే సమస్తాః ఉత్పత్తిస్థితిలయేషు . తదు తద్బ్రహ్మ నాత్యేతి నాతివర్తతే మృదాదికమివ ఘటాదికార్యం కశ్చన కశ్చిదపి వికారః . ఏతద్వై తత్ ..

యద్విజ్ఞానాదమృతా భవంతీత్యుచ్యతే, జగతో మూలం తదేవ నాస్తి బ్రహ్మ ; అసత ఏవేదం నిఃసృతమితి, తన్న —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఊర్ధ్వమూలః'– మూలము పైకి ఉన్నట్టిది, విష్ణువు యొక్క పరమపదమనే మూలము. అవ్యక్తంనుండి కదలని జీవరాశులవరకు కూడిన ఈ సంసారమనే వృక్షానికి మూలము పైకి ఉంటుంది. ('వ్రశ్చనాత్ వృక్షస్య') నరికివేయబడేది లేదా నశించేది వృక్షం అనబడుతుంది. విచ్ఛిన్నంగాని జననం, వృద్ధాప్యం, మరణం, శోకం వంటి అనేక అనర్థాలతో కూడినది. భ్రాంతిలా, మరీచికలోని నీటిలా, గంధర్వనగరాల వంటివాటిలా ప్రతి క్షణానికి మార్పు చెందుతూ చివరకు చూస్తూ ఉండగానే నశించే వృక్షంలాంటిది. అరటి స్తంభంలాగా సారహీనమైనది. బుద్ధిలో వందలాది అనుమానాలు నిండిన మొండివాదులకు ఆలవాలమైనది. తత్త్వ జిజ్ఞాసువులచే నిశ్చయంగా దాని నిజరూపమిట్టిదని తేల్చిచెప్పబడేది (మరొక పాఠాంతరం ఏమంటే, సాధకులచే దాని స్వభావం ఇది ఇది అని నిశ్చితంగా నిర్ణయించలేనిది). వేదాంతంచేత దాని మూలమే పరబ్రహ్మ సారమని నిర్ధారించబడినది. అవిద్యా బీజం చేత (అధ్యాస చేత), కోరికలచేత, కర్మలచేత, అవ్యక్తంచేత వృద్ధి చెందేది. విజ్ఞానశక్తి-క్రియాశక్తి ద్వయ రూపాలైన అపరబ్రహ్మ మరియు హిరణ్యగర్భుడనే మొలకలు కలిగినది. వివిధ ప్రాణుల సూక్ష్మశరీరాలనే మ్రాను కలిగినది. కోరికల జలాలచే చిలకరించబడి బలంపుంజుకొనేది. బుద్ధి మరియు ఇంద్రియాల యొక్క విషయాలనే లేత చిగుళ్ళుగలది. వేదములు, స్మృతులు, న్యాయము, అధ్యయనము, ఉపదేశాలనే రెమ్మలుకలది. యజ్ఞ-దాన-తపాదుల వంటి అనేక క్రియలనే మంచి పుష్పాలుకలది. సుఖ, దుఃఖ వేదనలనే అనేక రుచులుకలది. ప్రాణుల జీవనమనే అనంత ఫలాలు కలది. కోరికల నీటిచే తడుపబడి ధృఢంగా పెరిగి పెనవేసుకొని స్థిరమైన వ్రేళ్ళుకలిగినది (దీని అంతరార్థమేమంటే, ఫలాల గురించిన కోరికలు కామ్యకర్మలుగా వృద్ధిచెంది, కలగాపులగంగా సాత్విక, రాజసిక, తామసిక గుణాలతో చుట్టువడి పోతాయి). సత్యాది సప్తలోకములనే పక్షిగూడులతో బ్రహ్మాది జీవజాలానికి నీడనిచ్చేది. ప్రాణులు వాటివాటి సుఖదుఃఖాలచే పొందిన సంతోష శోకాలచే జనించిన నర్తనం, గానం, వాయిద్యం, చప్పట్లు, నవ్వులు, తోపిడులు, ఆక్రందనలు, హాహా నన్నొదులు, నన్నొదులనే కేకలతో నిండిన శబ్దాల సంకరత్వం వల్ల కలిగిన మహారవాలు చేసేది. వేదాంతం విధించిన బ్రహ్మాత్మ దర్శనముచే కలిగిన వైరాగ్యమనే నిశిత ఖడ్గంచేత నరికివేయబడేది. ఇటువంటి సంసారమనే ఈ వృక్షం 'అశ్వత్థః'– అశ్వత్థ వృక్షంలాగా, కామకర్మలనే గాలులచే ప్రచలితమై స్వభావరీత్యా అస్థిరమైనది (శ్వస్ – మరునాటికి, అ స్థాతా – ఉండనట్టిది అనగా అనిత్యమైనది అని వాచ్యార్థం). 'అవాక్శాఖః'– కొమ్మలు క్రిందికి గలదీ, స్వర్గం-నరకం

మరియు పశువులు-ప్రేతాలనే శాఖలు క్రిందగా ఉన్నటువంటిది. 'సనాతనః'– కాలాతీతమై సదా ఉనికి గలిగినది, మొదలు అనేది లేనిది. అటువంటి సంసార వృక్షం యొక్క మూలం 'తత్ ఏవ'– అది మాత్రమే, 'శుక్రమ్'– శుద్ధమైనది, శుభ్రమైనది, నిజానికి ఆత్మజ్యోతి స్వభావమైన చైతన్యం, 'తత్ బ్రహ్మ'– అన్నింటికన్నా గొప్పది, 'తత్ ఏవ'– నిజానికి అదియే, సత్యమైనది కనుక 'అమృతమ్'– అవినాశత్వమే స్వభావమైనదని, 'ఉచ్యతే'– చెప్పబడుతోంది. మిగిలినవన్నీ అసత్యమే 'పరిణామము చెందేవి, పేరుకు మాత్రమే ఉన్నట్టివి' ['వాచారంభణం వికారో నామధేయమ్' (ఛాం.ఉ. 6.1.4)] కాబట్టి నశించేవి. 'తస్మిన్'– దానిపైనే, పరమసత్యమైన బ్రహ్మముపైననే, 'సర్వే'– సమస్తమైన, 'లోకాః'– లోకములు, ఆకాశహర్మ్యాలు-ఎండమావులు-భ్రమల మాదిరిగా పరమసత్యాన్ని పొందిన క్షణాన అదృశ్యమయ్యేవి, 'శ్రితాః'– స్థిరమైనాయి (ఆధారపడినవి), సృష్టి-స్థితి-లయలలో. 'తత్ ఉ'– దానిని, ఆ బ్రహ్మమును; 'కః చ న అత్యేతి'– ఏది కూడా, ఏ పరిణామము కూడా అతిక్రమించదు, కుండవంటి పరిణామము చెందేవి దాని మూలమైన మట్టిని దాటి పోలేనట్లుగా. ఇది నిజానికి అదియే.

జగత్తుకు మూలమైన ఏ బ్రహ్మమును తెలుసుకొంటే మృత్యువును అధిగమిస్తారని చెప్పబడిందో అది (ఆ బ్రహ్మమనేది) అసలు లేదనీ, ఇదంతా (ఈ జగత్తంతా) దేనినుండీ అసలు ఉద్భవించనే లేదని అంటే, అది సరికాదు.

(సంసారాన్ని వృక్షంతో పోల్చి చూసే ప్రయత్నం చేస్తున్నారీమంత్రంలో. అయితే ఇక్కడ ఒక తేడా వుంది. అదేమిటో చూద్దాం. అన్ని వృక్షాలకి మూలమైన వ్రేళ్ళు క్రిందికి నేలలో స్థిరంగా ఉంటాయి. కాని, ఈ సంసార వృక్షానికి మూలం పైన ఉంటుంది. ఆ మూలం ఏమిటో శంకరులు తమ భాష్యంలో వివరించారు. సర్వవ్యాపకత్వమైన విష్ణువు యొక్క స్థానమే ఈ సంసారవృక్షానికి మూలం. దాని ఆధారంగానే సంసారమనే ఈ వృక్షం ఏర్పడుతోంది. వృక్షమనే పదానికి విరుచబడేది అని సంస్కృతంలో అర్థం. ఎలాగైతే వృక్షం నశిస్తుందో అలాగే ఈ సంసారం కూడా నశించేదే గాని, దానికి శాశ్వతత్వం అనేది లేదని అర్థం చేసుకోవాలి. సరే. కాని దాని వల్ల వచ్చే ఇబ్బంది ఏమిటి అంటారా. జననం, వృద్ధాప్యం, మరణం, శోకం వంటి అనర్థాలు నిరంతరంగా చక్రభ్రమణంలో సంభవిస్తూనే ఉంటాయి ఈ సంసారంలో. అదీ ఇబ్బంది. ఈ సంసారం ఒక్క క్షణం కూడా స్థిరంగా ఉండదు. క్షణ క్షణానికి మార్పుచెందుతూ ఉండటమే ఈ సంసారానికున్న ప్రధాన స్వభావం. పోనీ దీని వల్ల ఏమైనా ప్రయోజనముందా అంటే. లేదనే సమాధానం వస్తోంది. అంటే సంసారంలో సారం ఏమీ లేదు. అది నిస్సారం, ప్రయోజన రహితమైనది. ప్రయోజనమిచ్చేది కాకపోగా, ఈ సంసారం గురించి అనేక వివాదాలు. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వారి వారి బుద్ధి పరిమితులకు లోబడి ఈ సంసారం గురించి వివిధమైన సిద్ధాంతాలు చేస్తూ, తమ సిద్ధాంతమే సరైనదిగా భావించి ఇతరులతో దాని గురించి వాదనలు చేస్తూ ఉంటారు. అనేక విరుద్ధ వివాదాలకు సంఘర్షణలకు ఈ సంసారమే కారణమౌతోంది. అయితే, తాత్వికులు మాత్రం దీని అసలు స్వభావాన్ని తెలుసుకొని మిన్నకుండిపోతారు. ఈ సంసారానికి పరబ్రహ్మమే మూలమని మాత్రం వేదాంత శాస్త్రం నిర్ధారణ చేసింది. వృక్షానికున్న మరొక లక్షణం వృద్ధి చెందటం. విత్తనం మొలకెత్తి మెల్లమెల్లగా ఎదిగి వృక్షంగా వృద్ధి చెంది చివరకు విరిచివేయబడుతుంది. అలాగే, ఈ సంసార వృక్షానికి అపరబ్రహ్మ లేదా నిర్గుణబ్రహ్మ మరియు హిరణ్యగర్భుడు లేదా సగుణ బ్రహ్మ అనేవి అంకురాల వంటివి. ఈ మొలకల నుండి వృద్ధి చెంది వృక్షం శాఖోపశాఖలుగా విస్తరిస్తోంది. ప్రాణుల సూక్ష్మశరీరాలే ఈ వృక్షానికి మ్రాను అంటే వృక్షం బలంగా నిలబడి ఉండటానికి కారణం. కోరికలనే జలాలతో ఆ మ్రానుకు బలం నిరంతరం చేకూరుతోంది. అలా బలాన్ని పొందిన మ్రాను బుద్ధి, ఇంద్రియాలనే లేతచిగుళ్ళు సంతరించుకొంటోంది. ఆ చిగుళ్ళనుంచి కొమ్మలు, శాఖలు అనేకంగా విస్తరిస్తూ పోగా ఆ

సంసార వృక్షం పెరిగి పెద్దది కావడం వల్ల కలిగే సుఖాలు దుఃఖాలు అనర్థాలు ఇన్నీ అన్నీ కావు. ఇంత ధృఢంగా తయారైన ఈ సంసార వృక్షం పోనీ స్థిరంగా నాలుగు కాలాలపాటు ఉంటుందా అంటే ఉండదు. అది అశ్వత్థం. అంటే రేపు అనేది ఉండనిది. అనిత్యమైనది. మరి నిత్యమైనదానిని పొందాలనే అన్వేషణకు ఇది అడ్డంకే కదా. ఈ సంసార వృక్షమనే అడ్డంకిని తొలగించేదెలా? ప్రయత్నం చేసి తొలగించడ మెందుకండీ అది అశాశ్వతమే కదా. అదే పోతుంది అంటారేమో. ఒక వృక్షం శిథిలమైతే మరో వృక్షం మొలకెత్తుతుంది కదా. అందుకే, ఈ సంసారవృక్షాన్ని మొదటికంటా తిరిగి మొలకలెత్తకుండా నరికిపేయాలి. దేనితో నరకాలి. వైరాగ్యమనే ధఢమైన శస్త్రంతో. అప్పుడు ఏం మిగులుతుంది? కేవలం ఆ సంసారవృక్షానికి మూలమై ఊర్ధ్వంగా ఉన్నట్టి విష్ణుపదం అంటే పరబ్రహ్మమే మిగులుతుంది. ఆ పరబ్రహ్మ ఎలాంటిదయ్యా అంటే చెప్తున్నారు. అదియే శుద్ధం అనగా అది కానిది వేరొకటి తనలో లేనిది. అదియే బ్రహ్మం. వినాశత్వమనేది లేనట్టిది.అది తప్ప మిగిలినదంతా అసత్యమే. ఆకాశ హర్మ్యాలవంటి సమస్తలోకాలు దాని యందే ఉనికిని కలిగి కనుమరుగౌతున్నాయి. దానిని మించిన విషయం కాని వస్తువు కాని తత్త్వంకాని వేరొకటి లేదని ఘంటాపథంగా తేల్చి చెప్తున్నారు. నచికేతుడు కోరిన విషయం అదేనని యమదేవుడు నిశ్చయం చేసి ఉపదేశిస్తున్నాడు.)

**యదిదం కిం చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్ .**
**మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి .. 2-3-2 ..**

మహాభీతిరూపమై, ఎత్తబడిన వజ్రాయుధం వంటి పరబ్రహ్మ ఉనికి మాత్రంచేత ఈ జగత్తు యావత్తూ నియమబద్ధంగా ఉద్భవించి కదలుతోంది. ఎవరైతే ఇదంతా తెలుసుకొంటారో, వారు మృతిలేని వారౌతారు.

## శంకర భాష్యమ్

యదిదం కించ యత్కించేదం జగత్సర్వం ప్రాణే పరస్మిన్బ్రహ్మణి సతి ఏజతి కంపతే, తత ఏవ నిఃసృతం నిర్గతం సత్ ప్రచలతి నియమేన చేష్టతే . యదేవం జగదుత్పత్త్యాదికారణం బ్రహ్మ తత్ మహద్భయం , మహచ్చ తత్ భయం చ బిభేత్యస్మాదితి మహద్భయం , వజ్రముద్యతం ఉద్యతమివ వజ్రం ; యథా వజ్రోద్యతకరం స్వామినం అభిముఖీభూతం దృష్ట్వా భృత్యా నియమేన తచ్ఛాసనే వర్తంతే, తథేదం చంద్రాదిత్యగ్రహనక్షత్రతారకాదిలక్షణం జగత్సేశ్వరం నియమేన క్షణమప్యవిశ్రాంతం వర్తత ఇత్యుక్తం భవతి . యే ఏతత్ విదుః స్వాత్మప్రవృత్తిసాక్షిభూతమేకం బ్రహ్మ అమృతాః అమరణధర్మాణః తే భవంతి ..

కథం తద్భయాజ్జగద్వర్తత ఇతి, ఆహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ప్రాణే (సతి)'– ఆ పరబ్రహ్మ (ఉండగా); [ప్రాణక్రియకు కూడా బ్రహ్మమే మూలమైనందున, బ్రహ్మమును ప్రాణ శబ్దంతో సూచించడమైనది - ఆనందగిరి], 'యత్ ఇదమ్ కిమ్ చ జగత్ సర్వమ్'– ఈ ఉన్నటువంటి జగత్తు యావత్తూ; 'నిఃసృతమ్ (సత్)'– ఉద్భవిస్తోంది; 'ఏజతి'– కదులుతోంది, నియమానుసారంగా ప్రవర్తిల్లుతోంది. జగత్తు సృష్టి- స్థితి-

లయాలకు కారణమైన బ్రహ్మ ఏది కలదో అది, 'మహత్ భయమ్'– మహా భీతిని కలిగించేది, గొప్పది మరియు భయంపుట్టించేది కాబట్టి అది మహద్భయం; 'వజ్రమ్ ఉద్యతమ్'– పైకెత్తబడిన వజ్రాయుధం. వజ్రాయుధాన్ని పెకెత్తిపట్టుకొని ఎదురుగా ఉన్నట్టి ప్రభువును చూసి సేవకులు ఏవిధంగానైతే నియమానుసారంగా శాసనాలను పాటిస్తారో, అదేవిధంగా ఈశ్వరకారణంగా సూర్య-చంద్ర-గ్రహ-రాశి-నక్షత్రాలతో కూడిన జగత్తు క్షణమైనా విరామం లేకుండా నియమానుసారం ప్రవర్తిల్లుతోంది. 'యే'– ఎవరైతే; 'విదుః ఏతత్'– దీనిని తెలుసుకొన్నారో, వారి మానసిక వృత్తులకు పరమాత్మ సాక్షియని; 'తే'– వారు; 'అమృతాః'– మృతిలేనివారు; 'భవన్తి'– అవుతారు.

(జగత్తుకు మూల కారణంగా బ్రహ్మం ఉండాల్సిన పనేముంది? అసలా బ్రహ్మమే లేకుండానే జగత్తు ఉండియుండవచ్చుకదా అనే అనుమానానికి ఈ మంత్రంలో సమాధానం చెప్తున్నారు. సూర్య-చంద్ర-నక్షత్రాలు ఒక నియమానుసారం కదలటం భ్రమించడం చూస్తూనే ఉన్నాం కదా. జగత్తు కూడా సృష్టింపబడి, కదలుతూ ఉన్నది కదా. మరి వాటి గమనాన్ని నియంత్రించే శక్తి ఒకటి ఉండి తీరాలి కదా. కాబట్టి, బ్రహ్మయే ఈ జగత్తంతటికీ మూల కారణమై ఉన్నాడు. ఆ పరమాత్మ ఎలా నియంత్రిస్తున్నాడంటే, కత్తి ఎత్తి పట్టుకొని ఉన్న ప్రభువు ఎదుట సేవకులు ఎలా నియమానుసారం ప్రవర్తిస్తారో, అలా పరమాత్మ ఉనికి మాత్రం చేత జగత్తంతా ప్రవర్తిస్తోంది. ప్రభువు ఏమీ చేయనక్కరలేదు. అలా ఉంటే చాలు. పనులన్నీ వాటికవే చక్కగా జరిగిపోతాయి. ప్రభువు లేకపోతే పనులెలా జరుగుతాయో చెప్పనక్కరలేదు కదా. అలాగే, ఈ జగత్తు ఇలా సవ్యంగా సాగిపోతోందంటే, దానికి కారణమైన పరమాత్మ ఉనికి ఉండి తీరాల్సిందే. జగత్తు ఎలాగైతే పరమాత్మ ఉనికి మాత్రంచేత తన కార్యకలాపాలు సాగిస్తోందో, అదేవిధంగా మన మనోవృత్తులన్నింటినీ సాక్షిగా గమనిస్తోన్న పరమాత్మ ఉనికిని గుర్తించ మంటున్నారు శంకరులు తమ వ్యాఖ్యలో. అలా గుర్తించిన వారికిక మృతి అనేదే ఉండదని చెప్తున్నారు.)

ఏ విధంగా పరమాత్మ భయంచేత జగత్తు ప్రవర్తిస్తోంది అనేది చెప్తున్నారు.

**భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః .**
**భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః .. 2-3-3 ..**

**ఆతని (పరమాత్మ) భయంచేత అగ్ని దహిస్తోంది, అతని (పరమాత్మ) భయంచేత సూర్యుడు వెలుగిస్తున్నాడు, అతని (పరమాత్మ) భయంచేత ఇంద్రుడు, వాయువు మరియు ఐదవ వాడైన మృత్యువు పరుగిడుతున్నారు.**

## శంకర భాష్యమ్

భయాత్ భీత్యా అస్య పరమేశ్వరస్య అగ్నిః తపతి ; భయాత్తపతి సూర్యః, భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః . న హి, ఈశ్వరాణాం లోకపాలానాం సమర్థానాం సతాం నియంతా చేద్వజ్రోద్యతకరవన్న స్యాత్ , స్వామిభయభీతానామివ భృత్యానాం నియతా ప్రవృత్తిరుపపద్యతే ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అస్య'– పరమేశ్వరుని; 'భయాత్'– భీతిచేత; 'అగ్నిః తపతి'– అగ్ని దహిస్తోంది; 'భయాత్'– భయం చేత; 'సూర్యః'– సూర్యుడు; 'తపతి'– వెలుగుతున్నాడు; 'భయాత్ ఇన్ద్రః'– భయంచేత ఇంద్రుడు; 'చ'– మరియు; 'వాయుః'– వాయువు; 'చ' – మరియు; 'పంచమః'– ఐదవవాడైన; 'మృత్యుః'– మరియు మృత్యువు; ధావతి – పరుగిడుతున్నారు. సమర్థులు, లోకపాలకులైనట్టి ఈ దేవతలను నియంత్రించేందుకు, వజ్రాయుధాన్ని ఎత్తిపట్టుకొనియున్న వానిలా, ప్రభువు లేనట్లైతే, రాజుకు భయపడిన సేవకుల లాగా నియమానుసారం ప్రవర్తించడం సాధ్యపడదు.

(పరమాత్మ అలా ఉన్నాడనే భయం ఉండటం వల్లే, అగ్ని తన కార్యమైన దహనాన్ని నిర్వహిస్తోంది. ఆ పరమాత్మ వల్లనే సూర్యుడు లోకాలకు వెలుగిస్తున్నాడు. ఆ పరమాత్మ వల్లనే, ఇంద్రుడు, వాయువు, మృత్యువు వారి వారి కార్యాలు నిర్వహించేందుకు త్వరపడుతున్నారు. ఫరమాత్మయే లేకపోతే స్వయంగా నియంతలైన సమర్థులైన ఈ దేవతలు ఇలా సక్రమంగా వారి వారి విధులు నిర్వహించగలిగే వారు కానే కాదు. వారు అలా నియమాలు తప్పకుండా తమ తమ కార్యాలు నిర్వహించడానికి పరమాత్మ ఉన్నాడనే భయమే కారణం.)

**ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః .**
**తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే .. 2-3-4 ..**

**జీవించియుండగనే (బ్రహ్మను) తెలుసుకొనే సమర్థత కలవాడు, శరీరాన్ని విడువక ముందే ముక్తుడౌతాడు. అలా కాకుంటే, జీవులకై సృజించబడిన లోకాలలో శరీరాన్ని పొందతగి ఉంటాడు.**

## శంకర భాష్యమ్

తచ్చ ఇహ జీవన్నేవ చేత్ యద్యశకత్ శక్తః సన్ జానాతీత్యేతత్ , భయకారణం బ్రహ్మ బోద్ధుం అవగంతుం , ప్రాక్ పూర్వం శరీరస్య విస్రసః అవస్రంసనాత్పతనాత్ సంసారబంధనాద్విముచ్యతే . న చేదశకద్బోద్ధుం , తతః అనవబోధాత్ సర్గేషు, సృజ్యంతే యేషు స్రష్టవ్యాః ప్రాణిన ఇతి సర్గాః పృథివ్యాదయో లోకాః తేషు సర్గేషు, లోకేషు శరీరత్వాయ శరీరభావాయ కల్పతే సమర్థో భవతి ; శరీరం గృహ్ణాతీత్యర్థః . తస్మాచ్ఛరీరవిస్రంసనాత్ప్రాగాత్మావబోధాయ యత్న ఆస్థేయః యస్మాదిహైవాత్మనో దర్శనమాదర్శస్థస్యేవ ముఖస్య స్పష్టముపపద్యతే, న లోకాంతరేషు బ్రహ్మలోకాదన్యత్ర . స చ దుష్ప్రాపః ..

కథమితి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

(పైన చెప్పబడిన) భయానికి కారణమైనట్టి ఆ బ్రహ్మను, 'ఇహ'– ఇక్కడనే, జీవించి ఉండగనే; 'బోద్ధుమ్'– తెలుసుకొనుటలో; 'అశకత్' అంటే 'శక్నోతి'– సఫలతచెందిన వాడు; 'శరీరస్య విస్రసః'– శరీర పతనానికి; 'ప్రాక్'– పూర్వమే, సంసార బంధనాలనుండి విముక్తి పొందుతాడు. 'తతః'– అప్పుడు, బ్రహ్మను తెలుసుకోవడంలో సఫలం కానప్పుడు; 'సర్గేషు లోకేషు'– సృజించతగిన ప్రాణులు ఎక్కడ సృజింపబడతాయో అవి సర్గాః మరియు పృథివి మొదలైన లోకములే లోకాః, అనగా అటువంటి సృజింపబడే లోకములలో; 'శరీరత్వాయ'– శరీరభావంతో; 'కల్పతే'– సృజింపతగి ఉంటాడు. శరీరాన్ని స్వీకరిస్తాడని అభిప్రాయం. కాబట్టి, శరీరాన్ని విడిచిపెట్టకముందే ఆత్మజ్ఞానాన్ని పొందే ప్రయత్నం చేయాలి. ఎందుకంటే, ఇక్కడ మాత్రమే, దర్పణంలో ముఖాన్ని చూసినంత స్పష్టంగా ఆత్మను దర్శించే వీలుంటుంది. ఎందుకంటే, బ్రహ్మలోకమునందు తప్ప, మిగిలిన ఇతర లోకాలలో అది (ఆ విధంగా స్పష్టంగా దర్శించడం) సాధ్యపడదు కాబట్టి.

(జీవన్ముక్తి అంటే జీవించియుండగనే ముక్తి సాధ్యమేనని ఈ శ్రుతి వాక్యం చెప్తోంది. అయితే, దీనిని సాధించాలంటే, జీవించియుండగానే ఆత్మజ్ఞానాన్ని అవగతం చేసుకోవాలి. ఆత్మజ్ఞానాన్ని అనుభవంలోకి తెచ్చుకొన్న జ్ఞానికి సంసారబంధాలనుండి ముక్తి లభించి తీరుతుంది. అంటే అతడు జీవన్ముక్తుడౌతాడన్నమాట. మరి అలా ఆత్మజ్ఞానాన్ని జీవితకాలంలో అవగాహన చేసుకోలేని సాధకుని పరిస్థితి ఏమిటి? దీనికీ శ్రుతి సమాధానమిస్తోంది. అలా ఆత్మజ్ఞానం పొంద శక్తి లేని వాడు, సృష్టిలోని లోకాలలో మరొక శరీరాన్ని పొందటానికి తగినవాడై ఉంటాడు. అంటే, అతడు మరొక శరీరాన్ని స్వీకరిస్తాడని అర్థం. కాబట్టి, శ్రుతి ఉద్దేశ్యమేమంటే, శరీరాన్ని విడిచిపెట్టకముందే ఆత్మజ్ఞానాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకొనే ప్రయత్నంలో సాధకుడు నిమగ్నమై ఉండాలని. ఇక్కడొక సందేహం కలగవచ్చు. అదేమంటే, శరీరాన్ని విడిచిపెట్టిన వారు, వారి వారి యోగ్యతలకు తగ్గట్టుగా ఇతర లోకాలైన బ్రహ్మలోకం, గంధర్వలోకం, పితృలోకం వంటి వాటిలో శరీరాలు పొందుతారు కదా. ఆయా లోకాలలో ఆత్మజ్ఞానాన్ని పొందే అవకాశం ఉంటుంది కదా. అందుచేత, శరీరం విడిచిపెట్టేలోపే ఆత్మజ్ఞానం పొందే ఆవశ్యకతేముంది? అంటే, ఇక్కడనే ఈ లోకంలో మాత్రమే ఆత్మను అద్దంలో ముఖాన్ని దర్శించినంత స్పష్టంగా దర్శించే వీలుంటుంది. మిగిలిన లోకాలలో ఆత్మ దర్శనం ఇంత స్పష్టంగా ఉండదని చెప్తున్నారు. అయితే, ఒక్క బ్రహ్మలోకం దీనికి మినహాయింపు. ఇది ఎలాగో తరువాతి మంత్రం విశదీకరిస్తోంది.)

ఏ విధంగానో చెప్తున్నారు.

**యథాఽఽదర్శే తథాఽఽత్మని**

**యథా స్వప్నే తథా పితృలోకే .**

**యథాఽప్సు పరీవ దదృశే**

**తథా గంధర్వలోకే**

**ఛ్ఛాయాతపయోరివ బ్రహ్మలోకే .. 2-3-5 ..**

అద్దంలో లాగా తన బుద్ధియందు. స్వప్నంలోని దృశ్యంలాగా పిత్రులోకంలో. నీటిలోని ప్రతిబింబంలాగా గంధర్వలోకంలో. వెలుగు-నీడలాగా బ్రహ్మలోకంలో.

## శంకర భాష్యమ్

యథా ఆదర్శే ప్రతిబింబభూతమాత్మానం పశ్యతి లోకః అత్యంతవివిక్తం , తథా ఇహ ఆత్మని స్వబుద్ధావాదర్శవన్నిర్మలీభూతాయాం వివిక్తమాత్మనో దర్శనం భవతీత్యర్థః . యథా స్వప్నే అవివిక్తం జాగ్రద్వాసనోద్భూతం , తథా పితృలోకే అవివిక్తమేవ దర్శనమాత్మనః కర్మఫలోపభోగాసక్తత్వాత్ . యథా చ అప్సు అవివిక్తావయవమాత్మస్వరూపం పరీవ దదృశే పరిదృశ్యత ఇవ, తథా గంధర్వలోకే అవివిక్తమేవ దర్శనమాత్మనః ఏవం చ లోకాంతరేష్వపి శాస్త్రప్రామాణ్యాదవగమ్యతే . ఛాయాతపయోరివ అత్యంతవివిక్తం బ్రహ్మలోక ఏవైకస్మిన్ . స చ దుష్ప్రాపః, అత్యంతవిశిష్టకర్మజ్ఞానసాధ్యత్వాత్ . తస్మాదాత్మదర్శనాయ ఇహైవ యత్నః కర్తవ్య ఇత్యభిప్రాయః ..

కథమసౌ బోద్ధవ్యః, కిం వా తదవబోధే ప్రయోజనమితి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యథా ఆదర్శే'– ఎలాగైతే అద్దంలో తమ ప్రతిబింబాన్ని తాము చాలా స్పష్టంగా లోకులు చూస్తారో; 'తథా'– ఆవిధంగా ఇక్కడ; 'ఆత్మని'– తమ బుద్ధిలో. అంటే, బుద్ధి దర్పణమంత స్వచ్ఛంగా ఉన్నప్పుడు (ఆ బుద్ధిలో ప్రతిఫలించిన ఆత్మను) స్పష్టంగా దర్శించ వీలవుతుంది. 'యథా స్వప్నే'– స్వప్నంలో ఏ విధంగానైతే, అంటే జాగ్రత్తులోని వాసనల వల్ల కలిగే స్వప్నదర్శనంలో దృశ్యం ఎలా అస్పష్టంగా గోచరిస్తుందో; 'తథా'– ఆ విధంగా; 'పితృలోకే'– పితృలోకంలో, కర్మఫలాలను అనుభవించాలనే ఆసక్తులతో ముడిపడియున్నందువల్ల ఆత్మ దృశ్యం అస్పష్టంగానే గోచరిస్తుంది. 'యథా అప్సు'– నీటిలో ఎలాగైతే, 'పరి ఇవ దృశ్యతే' ('పరిదృశ్యతే ఇవ') - రూపంలోని అవయవ విభాగం స్పష్టంగా గోచరించదో; 'తథా'– అదే విధంగా; 'గంధర్వలోకే'– గాంధర్వుల లోకంలో ఆత్మ స్ఫుటంగా నిర్దిష్టంగా గోచరంకాదు. ఇతర లోకాలలో కూడా ఇదే పరిస్థితి అని శాస్త్ర ప్రమాణాల ద్వారా తెలుస్తోంది. ఒక్క 'బ్రహ్మలోకే'– బ్రహ్మలోకంలో మాత్రమే ఆత్మ దర్శనం సుస్పష్టం; 'చాయా-ఆతపయోః ఇవ'– వెలుగు నీడల లాగా. కాని, ఆ లోకాన్ని పొందటం, సులభసాధ్యం కాదు. ఎంతో ప్రత్యేకమైన కర్మలు, కఠినమైన ఉపాసనల ఫలితంగా మాత్రమే బ్రహ్మలోకాన్ని పొందను వీలవుతుంది కనుక. కాబట్టి, ఆత్మజ్ఞానాన్ని పొందేందుకు ప్రయత్నాన్ని ఇక్కడనే చేయవలసివుంది. అదీ అభిప్రాయం.

(ఆత్మ దర్శనం ఈ మానవ జీవితంలో ఎంత సులభ సాధ్యమో వివరిస్తున్నారు ఈ మంత్రంలో. ఇక్కడ ఈ లోకంలో ఆత్మ ఎంత సుస్పష్టంగా అనుభవమౌతుందంటే మీ ముఖాన్ని అద్దంలో దర్శించినంత స్పష్టంగా. అయితే అద్దంలో ముఖం స్పష్టంగా కనిపించాలంటే, ఆ అద్దం మురికిలేకుండా స్వచ్ఛంగా ఉండాలి కదా. అలాగే, బుద్ధిలో ప్రతిఫలించే ఆత్మను అనుభూతి చెందాలంటే ఆ బుద్ధి కూడా మాలిన్యాలేవీ లేకుండా అద్దంగా మెరిసిపోవాలి. అప్పుడే ఆత్మానుభూతి కలుగుతుంది. బుద్ధిలో ఆత్మ ప్రతిఫలనం ఎప్పుడూ ఉండేదే. కాని, బుద్ధిని ఆవరించిన మాలిన్యం వల్లనే ఆత్మ అనుభవంలోకి రావడం లేదు. ఇక ఇతర లోకాలలో ఆత్మ ఎలా అనుభవంలోకి వస్తుందనే విషయం చూద్దాం. స్వప్నంలో దృశ్యాలను చూసే అనుభవం మనకుంది. ఆ దృశ్యాలు ఎంత అస్పష్టంగా, క్షణకాలం గోచరించి

మాయమౌతాయో అంత అస్పష్టంగా క్షణికంగా మాత్రమే పితృలోకంలో ఆత్మానుభూతి కలుగుతుంది. నీటిలో కదలుతూ అస్పష్ట అవయవ విభాగంతో కూడిన ప్రతిబింబంలగా, గంధర్వలోకంలో ఆత్మానుభూతి కలుగుతుంది. ఇతరలోకాలలో కూడా ఇలాంటి స్థితే ఆత్మ విషయంలో ఉంటుందని శాస్త్రాలు చెప్తున్నాయి. అయితే ఒక్క బ్రహ్మలోకంలో మాత్రం ఆత్మానుభూతి అత్యంత స్పష్టంగా వెలుగు-నీడల లాగా అనుభవమౌతుంది. కాని బ్రహ్మలోకం పొందటం ఎంతో కష్టసాధ్యమైన విషయం. అందుకై, ప్రత్యేకమైన యజ్ఞాది క్రతువులు నిర్వహించవలసి ఉంది. అంతేకాక, కఠోర నియమాలతో కూడిన ఉపాసనలను చేయవలసి వస్తుంది. కాబట్టి అటువంటి కఠినమైన కర్మలు, ఉపాసనలు చేయవలసిన అవసరం లేకుండానే, ఈ మానవ జన్మలోనే ఆత్మానుభవాన్ని స్పష్టంగా పొందగలిగే వీలున్నందున, మానవుడు ఆత్మజ్ఞానాన్ని పొందేందుకు ఇక్కడనే ఈ జన్మలోనే ప్రయత్నం చేయాలని ఉపదేశిస్తున్నారు.)

ఆ పరమాత్మను తెలుసుకోవడం ఎలా? తెలుసుకొన్నందువల్ల కలిగే ప్రయోజనమేమిటి? అనే ప్రశ్నలకు సమాధానం ఇవ్వబడుతోంది.

**ఇంద్రియాణాం పృథగ్భావముదయాస్తమయౌ చ యత్ .**
**పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి .. 2-3-6 ..**

ఇంద్రియాల పుట్టుక వేర్వేరని, ఉదయించి అస్తమించేవని తెలుసుకొన్న వివేకి శోకించడు.

## శంకర భాష్యమ్

ఇంద్రియాణాం శ్రోత్రాదీనాం స్వస్వవిషయగ్రహణప్రయోజనేన స్వకారణేభ్య ఆకాశాదిభ్యః పృథగుత్పద్యమానానాం అత్యంతవిశుద్ధాత్కేవలాచ్చిన్మాత్రాత్మస్వరూపాత్ పృథగ్భావం స్వభావవిలక్షణాత్మకతాం , తథా తేషామేవేంద్రియాణాం ఉదయాస్తమయౌ చ ఉత్పత్తిప్రలయౌ జాగ్రత్స్వాప్నావస్థాప్రతిపత్త్యా నాత్మన ఇతి మత్వా జ్ఞాత్వా వివేకతో ధీరః ధీమాన్ న శోచతి, ఆత్మనో నిత్యైకస్వభావత్వావ్యభిచారాచ్ఛోకకారణత్వానుపపత్తేః . తథా చ శ్రుత్యంతరం 'తరతి శోకమాత్మవిత్' (ఛా. ఉ. 7 . 1 . 3) ఇతి ..

యస్మాదాత్మనః ఇంద్రియాణాం పృథగ్భావ ఉక్తో నాసౌ బహిరధిగంతవ్యః యస్మాత్ప్రత్యగాత్మా స సర్వస్య ; తత్కథమితి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'ఇంద్రియాణామ్'– ఇంద్రియాల యొక్క, అంటే చెవి మొదలైన వాటి యొక్క; 'పృథగుత్పద్యమానానామ్'– ఉత్పత్తి లేదా పుట్టుక వేరు వేరుగా ఉండటం చేత, వాటి వాటి విషయాలను గ్రహించే ప్రయోజనం కొరకు వాటి మూలాలైన ఆకాశం మొదలైన వాటినుండి ఉద్భవించడం చేత; 'పృథగ్భావమ్'– అత్యంత పరిశుద్ధమై కేవలం చిన్మాత్ర స్వరూపమైన ఆత్మ స్వభావానికి విలక్షమైన స్వభావం కలిగినవి కావడం చేత; అంతేకాక, ఆ ఇంద్రియాలు

'ఉదయాస్తమయౌ చ'– ఉదయించేవి, అస్తమించేవి కూడా అయినందున; అంటే జాగ్రత్తులో ఉదయించి స్వప్నావస్థలో అస్తమించేటటువంటి స్వభావం కలిగినవైనందున అవి ఆత్మకాదు అని 'మత్వా'– వివేకంతో తెలుసుకొన్న; 'ధీరః'– ధీమంతుడు, బుద్ధిమంతుడు; 'న శోచతి'– నిత్యమూ, ఏకమనే స్వభావం, మార్పులేకుండుట అనే లక్షణాలు కల ఆత్మ శోకానికి కారణం కాదని తెలుసుకొని శోకాన్ని పొందడు. ఈ విషయాన్నే 'ఆత్మను తెలుసుకొన్నవాడు శోకాన్ని అధిగమిస్తాడు' ['తరతి శోకమాత్మవిత్' (ఛాం.ఉ. 7.1.3)] అని మరొక శృతికూడా చెప్తోంది.

ఆత్మ ఇంద్రియాలకు భిన్నమైనదని చెప్పబడినప్పుడు, అది బాహ్యంలో ఉన్నదని భావించ కూడదు. ఎందుకంటే, సర్వానికి అంతరంగా ఉండే ప్రత్యగాత్మ కావడం చేత. అది ఎలాగో చెప్తున్నారు.

(ఆత్మను తెలుసుకోవడం ఎలా అన్న ప్రశ్నకు సమాధానం ప్రారంభిస్తున్నారు ఈ మంత్రంతో. ఆత్మను తెలుసుకొవాలంటే ఆత్మ స్వభావానికి భిన్నమైనవాటిని గుర్తించి నిరాకరించడం ద్వారా ఆత్మను చేరే ప్రయాణం ప్రారంభమౌతుంది. ఈ సందర్భంగా, ఇంద్రియాల పుట్టుక, వాటి స్వభావాన్ని పరిశీలించడం చేద్దాం. ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క ప్రయోజనం కోసం సృష్టించబడింది. కాబట్టి, ఇంద్రియాలు కార్యాలు. వాటికి మూలమైన కారణాలు వేర్వేరు. ఉదాహరణకు శ్రోత్రేంద్రియం దానికి కారణమైన ఆకాశం నుండి ఉద్భవించింది. ఇంద్రియాలకు నిత్యత్వం లేదు. మెలకువ స్థితిలో మాత్రమే వీటికి ఉనికి. నిదురించేప్పుడు ఇంద్రియాల ప్రసక్తి ఉండదు. అంటే ఇంద్రియాలు జాగ్రత్తులో ఉదయించి, స్వప్నావస్థలో అస్తమిస్తాయి. ఆత్మ సర్వ కారణాలకు కారణం. దానికి వేరొకటి కారణం కాదు. కాబట్టి ఇంద్రియాల స్వభావం ఆత్మ స్వభావానికి విలక్షణమైనది. నిత్యత్వం ఏకత్వం శుద్ధత్వమే ఆత్మ స్వభావమైనందున శోకానికి తావేలేనిదైనందున, ఆత్మ శోకానికి కారణమయ్యే ప్రశ్నే తలెత్తదు. కాబట్టి, శోకానికి కారణమైన ఇంద్రియాలు ఆత్మ కాదని తెలుసుకొన్న వివేకవంతుడు శోకం పొందే పరిస్థితే తలెత్తదు. ఇంద్రియాలను, ఆత్మకు భిన్నమైనవిగా గ్రహించి, ప్రాథమికంగా వాటిని నిరాకరించాలని అభిప్రాయం. ఆత్మను తెలుసుకొనేందుకు ప్రారంభించే యాత్రను ఇంద్రియాలను నిరాకరించడంతో మొదలు పెట్టాలన్నమాట.)

**ఇంద్రియేభ్యః పరం మనో మనసః సత్త్వముత్తమమ్ .**
**సత్త్వాదధి మహానాత్మా మహతోఽవ్యక్తముత్తమమ్ .. 2-3-7 ..**

ఇంద్రియాల కన్నా మనసు పరమం. మనసు కన్నా బుద్ధి ఉత్తమం. బుద్ధి కన్నా మహత్తు గొప్పది. మహత్తు కన్నా అవ్యక్తం ఉత్తమం.

### శంకర భాష్యమ్

ఇంద్రియేభ్యః పరం మన ఇత్యాది . అర్థానామిహేంద్రియసమానజాతీయత్వాదింద్రియగ్రహణేనైవ గ్రహణం . పూర్వవదన్యత్ . సత్త్వశబ్దాద్బుద్ధిరిహోచ్యతే ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఇంద్రియ విషయాలు కూడా ఇంద్రియాల తరగతికి చెందినవే కాబట్టి, ఇంద్రియాల గురించి ప్రస్తావిస్తే ఇంద్రియవిషయాల గురించి కూడా ప్రస్తావించినట్లుగానే అర్థంచేసుకోవాలి. మిగిలినదంతా ముందటి 1.3.10 వ మంత్రంలో చెప్పినట్లుగానే గ్రహించాలి. 'సత్వ' శబ్దం ఇక్కడ బుద్ధిని సూచిస్తున్నది.

(ఈ ఉపనిషత్తులోని ప్రథమాధ్యాయంలోని మూడవ వల్లీలోని 10వ మంత్రంలో చెప్పబడిన విషయాన్నే ఇక్కడ తిరిగి ప్రస్తావిస్తున్నారు. అయితే ఆ మంత్రంలో ఇంద్రియాల కన్నా ఇంద్రియవిషయాలు సూక్ష్మమైనవని ప్రత్యేకంగా చెప్పారు. ప్రస్తుత మంత్రంలో కేవలం ఇంద్రియాలను మాత్రమే ప్రస్తావిస్తూ ఆ ఇంద్రియాల కన్నా మనసు ఉత్తమమైనదని చెప్తున్నారు. ఇక్కడ ఇంద్రియాలు అని అంటే ఇంద్రియాలు మరియు వాటి విషయాలు కూడా అని గ్రహిస్తే రెండు మంత్రాలకు సమన్వయం కుదురుతుంది. పూర్వపు మంత్రంలో స్థూలత్వం నుండి సూక్ష్మత్వం దిశలో పరమాత్మ అత్యంత సూక్ష్మమైనదని తేల్చి చెప్పారు. ఈ మంత్రంలో అధిక్యపు కొలమానంలో కూడా ఆ పరమాత్మమే అన్నిటికన్నా అధికుడని తేల్చే ప్రయత్నం చేస్తున్నారు. మరింకా, ఈ మంత్రంలో సత్వ శబ్దంచేత బుద్ధి సూచితమవుతోంది అని కూడా గ్రహించాలి.)

**అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోఽలిఙ్గ ఏవ చ .**
**యం జ్ఞాత్వా ముచ్యతే జన్తురమృతత్వం చ గచ్ఛతి .. 2-3-8 ..**

అవ్యక్తం కంటే, సర్వవ్యాపకుడైన, గుర్తించుటకు వీలగు విశేషణాలేవీ లేని, పురుషుడు గొప్పవాడని తెలుసుకొన్న మానవుడు విముక్తిపొంది, అమృతత్వాన్ని సాధిస్తాడు.

## శంకర భాష్యమ్

అవ్యక్తాత్తు పరః పురుషః వ్యాపకః, వ్యాపకస్యాప్యాకాశాదేః సర్వస్య కారణత్వాత్ . అలింగః లింగ్యతే గమ్యతే యేన తల్లింగం బుద్ధ్యాది, తదవిద్యమానం యస్య సోఽయమలింగః ఏవ చ ; సర్వసంసారధర్మవర్జిత ఇత్యేతత్ . యం జ్ఞాత్వా ఆచార్యతః శాస్త్రతశ్చ ముచ్యతే జంతుః అవిద్యాదిహృదయగ్రంథిభిర్జీవన్నేవ ; పతితేఽపి శరీరే అమృతత్వం చ గచ్ఛతి . సోఽలింగః పరోఽవ్యక్తాత్పురుష ఇతి పూర్వేణైవ సంబంధః ..

కథం తర్హి తస్య అలింగస్య దర్శనముపపద్యత ఇతి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అవ్యక్తాత్ తు పరః'– అవ్యక్తం కంటే ఉన్నతమైన వాడు; 'పురుషః'– పురుషుడు; అతడు 'వ్యాపకః'– వ్యాపకుడు; ఎందుకంటే ఆకాశాదుల వంటి వ్యాపకత్వం కలిగిన విషయాలకు మూలమైన వాడు అయినందున, 'అలిఙ్గః'– లిఙ్గమనగా ఏదేని విషయాన్ని సూచించే చిహ్నం అంటే బుద్ధి మొదలైనవి; అతనికి అటువంటి చిహ్నం లేదా బుద్ధి

వంటివి లేనందున 'అలిఙ్గః'. అంటే ఆ పురుషుడు సర్వలౌకిక విశేషాలేవీ లేనివాడు, 'ఏవ'–నిశ్చయంగా; 'యం జ్ఞాత్వా'– అట్టి వానిని తెలుసుకొని, ఆచార్యుని ద్వారా లేదా శాస్త్రం ద్వారా; 'జంతుః'– మానవుడు; 'ముచ్యతే'– స్వేచ్ఛను పొందుతాడు, జీవించి ఉండగానే, హృదయంలో గూడుకట్టుకొని ఉన్న బంధనాలనుండి అంటే అవిద్య మొదలైన వాటినుండి. శరీరం పతనమైన తర్వాత అతడు 'గచ్ఛతి అమృతత్వమ్ చ'– మృతి లేని స్థితిని కూడా సాధిస్తాడు. మంత్రంలోని ఈ భాగాన్ని పూర్వం చెప్పినదానితో ఇలా అనుసంధానించుకోవాలి. గుర్తింపదగిన విశేషణాలు ఏవియూ లేని ఏ పరమపురుషుని తెలుసుకొంటే మానవుడు సర్వబంధాలనుండి స్వేచ్ఛను పొందుతాడో, ఆతడు ( ఆ పరమపురుషుడు) అవ్యక్తం కన్నా అధికుడు.

(అవ్యక్తం కన్నా ఎవరు అధికుడు అనే ప్రశ్న వస్తే, దానికి పురుషుడు అధికుడని సమాధానమిస్తున్నారు. మరి ఆ పురుషుడు ఎలాటి వాడు, విశేషణాలేమిటి? ఆ పురుషుడు సర్వాన్ని వ్యాపించి ఉన్నవాడని చెప్తున్నారు. అంటే అంతటా నిండియున్న వాడట. అదేమిటండీ సర్వాన్నీ వ్యాపించి ఉన్నాడంటే గుర్తించడం ఎలా సాధ్యం అంటారా. మరి అంతే. అంతకన్నా ఆ పరమపురుషుడిని గుర్తించడానికి ఏ గుర్తులూ చిహ్నాలూ లేవు. ఆ పరమ పురుషుడిని అనుభవాత్మకంగా తెలుసుకొన్నవాడిని సంసారబంధనాలేవీ బాధించవు. అంటే బంధనాలన్నింటినుండీ అతడు ముక్తుడౌతాడు. ఈ విషయాన్నే ఇలా కూడా చెప్పవచ్చు. సర్వవ్యాపకుడు, విశేషణ రహితుడైన ఏ పరమపురుషుడిని తెలుసుకొంటే మానవుడు సర్వబంధనాలనుండి స్వేచ్ఛ పొందుతాడో, ఆ పరమపురుషుడే అవ్యక్తం కన్నా అధికుడు. అతడికన్నా అధికుడైన లేదా అధికమైన వేరొక వస్తువు లేదా తత్త్వం లేదు.)

గుర్తింపశక్యంకాని దాన్ని దర్శించడం ఎలా సంభవమౌతుంది అనేది చెప్తున్నారు.

**న సందృశే తిష్ఠతి రూపమస్య**
**న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ .**
**హృదా మనీషా మనసాఽభిక్లృప్తో**
**య ఏతద్విదురమృతాస్తే భవన్తి .. 2-3-9 ..**

ఆతని రూపం దృశ్య పరిధిలోనిది కాదు. కన్నులతో కాంచలేరెవ్వరూ ఆతనిని. విచారించగా ఎరుకకాబడిన ఆత్మ, హృదయంలో ఉండే మనసును నియంత్రించే బుద్ధిచే గ్రహింపబడగా, దానిని తెలుసుకొన్నవారు మృతిలేని వారౌతారు.

## శంకర భాష్యమ్

న సందృశే సందర్శనవిషయే న తిష్ఠతి ప్రత్యగాత్మనః అస్య రూపం . అతః న చక్షుషా సర్వేంద్రియేణ, చక్షుర్గ్రహణస్యోపలక్షణార్థత్వాత్ , పశ్యతి నోపలభతే కశ్చన కశ్చిదపి ఏనం ప్రకృతమాత్మానం . కథం తర్హి తం పశ్యేదితి, ఉచ్యతే — హృదా హృత్స్థయా బుద్ధ్యా, మనీషా మనసః సంకల్పాదిరూపస్య ఈష్టే నియంతృత్వేనేతి మనీట్ తయా మనీషా వికల్పవర్జితయా

బుద్ధ్యా . మనసా మననరూపేణ సమ్యగ్దర్శనేన అభిక్లృప్తః అభిసమర్థితః అభిప్రకాశిత ఇత్యేతత్ . ఆత్మా జ్ఞాతుం శక్య ఇతి వాక్యశేషః . తమాత్మానం బ్రహ్మ ఏతత్ యే విదుః అమృతాః తే భవంతి ..

సా హృన్మనీట్ కథం ప్రాప్యత ఇతి తదర్థో యోగ ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అస్య రూపమ్'— అతని రూపం అంటే అంతరతమమైన ఆత్మయొక్క రూపం; 'సందృశే'— దర్శింపబడే విషయంగా; 'న తిష్ఠతి'— ఉండదు. కాబట్టి, 'కః చన'— ఎవరైననూ; 'ఏనమ్'— ఈ ఆత్మను, ప్రస్తుతం విచారించబడుతున్నటువంటి; 'చక్షుషా'— కన్నులచే అంటే ఇంద్రియాలలో దేని చేతనైననూ అని, ఎందుకంటే చక్షుః అన్న శబ్దం ఇంద్రియాలకు ఉదాహరణగా చెప్పబడింది కాబట్టి; 'న పశ్యతి'— దర్శించజాలరు, చూడజాలరు. మరైతే అతనిని దర్శించడం ఎలా అనేది చెప్పబడుతోంది. 'హృదా'— హృదయంలో స్థితమై ఉన్నట్టి; 'మనీషా'— బుద్ధిచేత, సంకల్పాదులే స్వరూపమైన మనసును శాసించేది కాబట్టి మనీట్, మనీషా అనగా అట్టి మనీట్ చేత అంటే వికల్పములు లేనటువంటి బుద్ధిచేత; 'అభిక్లృప్తః'—సమర్థించబడినప్పుడు, ఎరుక కాబడినప్పుడు; 'మనసా'— విచారణలో కలిగిన సరియైన దృష్టి ద్వారా; అంటే హృదయంలో ఉండి, విషయాలతో సంసర్గం లేని, మనసును శాసించే బుద్ధిచే, ఆత్మ అనుభవం వీలవుతుంది అని వాక్యాన్ని పూర్తి చేసుకోవాలి. 'యే'— ఎవరైతే; 'ఏతత్'— దీనిని, ఆత్మయే బ్రహ్మమనే ఈ విషయాన్ని; 'విదుః'— తెలుసుకొంటారో; 'తే'— వారు; 'అమృతాః భవన్తి'— మరణత్వం లేని వారౌతారు. [మనసును విషయాలనుండి విముఖం చేసే శాసకుడే బుద్ధి. ఆత్మ మరియు ఉపనిషత్తులలో ఉపదేశించబడిన బ్రహ్మము యొక్క సామ్యత 'మనసా' అనగా విచారణచే నిర్ధారితమౌతుంది. అప్పుడు విషయ సంపర్కంలేని, శుద్ధమైన బుద్ధిలో తత్త్వమసి అన్న ఉపనిషద్ పాఠాన్నుండి నేను బ్రహ్మను అనే నిశ్చయం పుడుతుంది. ఆ విధంగా నిశ్చయం కల్గిన బుద్ధికి బ్రహ్మము పూర్తిగా విశదమౌతుంది లేదా అనుభవమౌతుంది – స్వామి గంభీరానంద]

(ఈ ఆత్మకు రూపమంటే కన్నులకు కనబడే రూపం వంటిది కాదని స్పష్టం చేస్తున్నారు. ఎదురుగా ఉన్న వస్తువులు కంటికి కనిపించినట్లుగా ఆత్మ కంటికి కనిపించేది కాదు. పోనీ, కంటికి కనిపించక పోయినా, మిగిలిన ఇంద్రియాలు వాటి వాటి శక్తితో గ్రహించగలుగుతాయా అంటే, అదీ కాదంటున్నారు. చెవికి శబ్దంగా, ముక్కుకు వాసగా, నాలుకకు రుచిగా, చర్మానికి స్పర్శగా ఆత్మను గ్రహించలేం. ఇంద్రియాల శక్తి ఆత్మను గ్రహించడంలో వృథానే. మరైతే ఈ ఆత్మను గ్రహించడం వీలుకాదా, దాన్ని గ్రహించేందుకు మన దగ్గర సాధనమేమీ లేదా అంటే, ఒక్క సాధనం మాత్రం ఉందంటున్నారు. ఆ సాధనమే బుద్ధి. అదొక్కటే ఆత్మ యొక్క ఉనికిని ఎరుగగలదు. అయితే, ప్రాపంచిక విషయాలతో నిండి ఉన్న సాధారణ బుద్ధికి ఆత్మ ఉనికిని ఎరుగగలిగే సామర్థ్యం ఉండదు. సంకల్పాదులే మనసు. ఆ ఆలోచనా స్వరూపమైన మనసును నియంత్రించగలిగేది బుద్ధి మాత్రమే. మనసుని అదుపులో ఉంచుకొన్న బుద్ధి. మరి ఈ బుద్ధి ఎక్కడుంటుంది. హృదయంలోనే అంటే మనసులోనే దాని స్థావరం. బుద్ధి మనసులోనే ఉండి మనసును అదుపు చేయగలదన్నమాట. సాధారణమైన బుద్ధి మనసు చేసే ఆలోచనలతో మమేకమై ఆ సంకల్పాలు లేదా ఆలోచనల మంచి చెడులను విచారణ చేయకుండా వ్యవహరిస్తుంది. ఈ ఉపనిషత్ లోని 3వ వల్లీలోనే 5వ మంత్రం అలాంటి సాధారణ బుద్ధిచే ప్రస్తావించింది. దీనికి భిన్నంగా 3వ వల్లీలోని 6వమంత్రం ముందు చెప్పిన వ్యవసాయాత్మిక బుద్ధిని ప్రస్తావించింది. మనకు ఇక్కడ కావలసింది 1.3.6 లో చెప్పిన సమర్థమైన బుద్ధి అన్నమాట. అటువంటి దక్షత కలిగిన

బుద్ధి మాత్రమే ఆత్మను గురించిన సమగ్రమైన లోతైన విచారణచేసే క్రమంలో ఆత్మ ఉనికిని ఎరుగగలుగుతుంది. ఆత్మను అనుభవంలోకి లేదా ఎరుకలోకి తెచ్చుకోవాలంటే రెండు అంశాలున్నాయి. సమర్థమైన వ్యవసాయాత్మిక బుద్ధి, సమగ్రమైన ఆత్మ విచారణ. ఈ రెండింటినీ సాధించుకొంటే సిద్ధమై ఉన్న ఆత్మ అనుభవంగా పరిణమిస్తుంది. ఆ ఆత్మానుభూతి చెందిన వాడు మృత్యువు అధిగమిస్తాడు అంటే ఆతనికి మృతత్వం అనేది ఉండదు. మరి సమర్థంగా మనసును శాసించగలిగే బుద్ధిని సాధించుకోవడానికి యోగాన్ని అంటే సాధనా క్రమాన్ని తరువాతి మంత్రం చెప్పబోతోంది.)

ఆ హృదయంలోని మనోశాసకుడిని పొందటం ఎలా? ఆ ప్రయోజనం కొరకే యోగాన్ని ఉపదేశిస్తున్నారు.

**యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ .**
**బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్ .. 2-3-10 ..**

**ఎపుడు పంచజ్ఞానేంద్రియాలు మనసుతో సహా విరమిస్తాయో మరియు బుద్ధి చేష్టారహితమౌతుందో, ఆ స్థితినే ఉత్తమగతి అని అంటారు.**

## శంకర భాష్యమ్

యదా యస్మిన్కాలే స్వవిషయేభ్యో నివర్తితాని ఆత్మన్యేవ పంచ జ్ఞానాని — జ్ఞానార్థత్వాత్ శ్రోత్రాదీనీంద్రియాణి జ్ఞానాన్యుచ్యంతే — అవతిష్ఠంతే సహ మనసా యదనుగతాని, యేన సంకల్పాదివ్యావృత్తేనాంతఃకరణేన . బుద్ధిశ్చ అధ్యవసాయలక్షణా న విచేష్టతి స్వవ్యాపారేషు న విచేష్టతే న వ్యాప్రియతే, తామాహుః పరమాం గతిం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యదా'– ఎప్పుడైతే; 'పఞ్చ జ్ఞానాని'– అయిదు జ్ఞానేంద్రియములు, ఆయా జ్ఞానాలను కలిగిస్తాయి కాబట్టి శ్రోత్రాది ఇంద్రియాలు జ్ఞానములు అని అనబడుతాయి; 'సహ మనసా'– దేన్నైతే ఇంద్రియాలు అనుసరిస్తాయో అటువంటి మనసుతో సహా, అంటే అంతఃకరణమైన మనసుతో కలిసి వాటి వృత్తులనుండి అంటే ఆలోచనాదులనుండి నిష్క్రమించి; 'అవతిష్ఠంతే'– విరామం చెందుతాయో, అంటే వాటి వాటి విషయాలనుండి వెనుకకు మరలి ఆత్మయందుండిపోగా; 'చ బుద్ధిః'– మరియు బుద్ధి, నిశ్చయాత్మకతే లక్షణంగా గలిగినట్టిది; 'న విచేష్టతే' ('విచేష్టతి' అని పాఠాంతరం) – తన కార్యకలాపాలలో నిమగ్నం కాదు; 'తాం'– ఆ (స్థితి); 'పరమామ్ గతిమ్'– ఉన్నతమైన స్థితి; అని 'ఆహుః'– వారు అంటారు.

(సాధనా క్రమాన్ని వివరిస్తున్నారిక్కడ. పంచ జ్ఞానేంద్రియాలను వాటి వాటి విషయాలనుండి వెనక్కి మరల్చాలి. అంటే కన్నుకు దృశ్యాలను చూడడం వృత్తి. దృశ్యాలే కంటికి విషయాలు. కన్నులచే దృశ్యాలను చూడటం అనే కర్మ చేయకుండా ఉండాలి. అలాగే చెవులతో శబ్దాలను వినడం మానివేయాలి. ముక్కుతో వాసనను

గ్రహించడం మానాలి. నాలుకతో రుచిని ఆస్వాదించడం మానాలి. చర్మంతో స్పర్శను అనుభవించడం మానుకోవాలి. ఇదేమిటండీ ఇదెలా సాధ్యమౌతుంది అంటారేమో. కన్నులు ఎన్నో దృశ్యాలు చూస్తున్నాయి. కానీ అన్నీ మనకు కనిపిస్తున్నాయా. కేవలం ఏ దృశ్యంపైన మనసు నిలుస్తుందో ఆ దృశ్యమే మనకు కన్పిస్తోంది. మీ కుమార్తె తన బృందంతో కలసి నృత్యం చేస్తుంటే మీరు మీ కుమార్తె నృత్యాన్నే ఆసక్తిగా గమనిస్తారు కాని, పక్కన ఇతరులు చేస్తున్న నృత్యాన్ని అది మీ దృక్పథంలో ఉన్నప్పటికీ తిలకించరు. అంటే ఇక్కడ దృశ్యం మొత్తాన్నీ నిష్పాక్షికంగా కన్నులు మీకు చేరవేస్తున్నప్పటికీ మీ మనసు మీ కుమార్తె నృత్యంపైననే లగ్నం కావడం చేత అది ఒక్కటే మీ అంతఃకరణంలో చేరుతోంది. కాబట్టి, ఏమి అర్థమౌతోందంటే ఇంద్రియాలు వాటి వాటి విషయాల జ్ఞానాన్ని చేరవేస్తున్నా మనసు ఆయా విషయాలపై ఆసక్తి చూపకపోతే ఆ జ్ఞానం మీకు చేరదు. ఇక్కడ మనసు పాత్ర చాలా కీలకం. అందుచేతనే, పై మంత్రంలో మనసుతో సహా పంచ జ్ఞానేంద్రియాలు అని అంటున్నారు. సరే పంచ జ్ఞానేంద్రియాలు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాల జ్ఞానాన్ని మోసుకు రావడం లేదనుకొందాం. అపుడు మనసు చేష్టలుడిగి కూర్చుంటుందా. ఉండదు. జ్ఞాపకాల భాండాగారాన్ని తెరచి విషయాలను ఆలోచించడం చేస్తుంది. కాబట్టి, అలాగా కూడా ఇక్కడ మనసు కీలకమే. అందుకే, మనసుతో సహా ఇంద్రియాలు వాటి వాటి వృత్తులు చేయడం మానివేయాలి. వృత్తులు మానడం అంటే వాటి ఉనికి కనుమరుగై పోవడం అని అర్థం. మనసుతో సహా ఇంద్రియాలు మరుగుపడిపోవడం మనకు నిత్యమూ గాఢ నిద్రలో అనుభవమే. అయితే నిద్రలోని స్థితికి, మనం ఇప్పుడు చర్చించుకొనే స్థితికి చాలా తేడా ఉంది. నిద్రా స్థితి మనస్సు, ఇంద్రియాలు అలసినందున వాటి కార్యకలాపాలు నిర్వహించలేని స్థితికి చేరినందున ఏర్పడుతోంది. కాని, ఇక్కడ మనసు, ఇంద్రియాలు వాటి వృత్తులు సమర్థంగా నిర్వహించగలిగి ఉన్నప్పుడే ప్రయత్నపూర్వకంగా వాటిని ఆయా వృత్తులనుండి నిష్క్రమింపచేయడం గమనించదగ్గది. అటువంటి సమయంలో, బుద్ధి చేష్టలు ఏమీ లేకుండా అంటే కర్తృత్వ భోక్తృత్వాదులను భావన చేయకుండా నిలిచి ఉంటుంది. ఇంకా, బుద్ధిలో తను నిశ్చయించ వలసిన విషయాలు ఏమీ మిగిలి ఉండవు. అనగా, బుద్ధి ఎటువంటి ఆలోచనలు, వికల్పాలు, విషయాలు లేకుండా పరిశుద్ధంగా ఉంటుంది. క్రిందటి మంత్రంలో చెప్పబడిన సామర్థ్యత కలిగిన సంస్కరింపబడిన బుద్ధి స్థితి ఏర్పడుతుంది. సమగ్రంగా, వృత్తి రహితమైన అయిదు ఇంద్రియాలు మరియు మనసు వల్ల కలిగిన విషయరహితమై సంస్కరించబడిన బుద్ధి, వీటి కలయిక లేదా యోగం వల్ల కలిగిన స్థితియే పరమగతి లేదా పరమలక్ష్యం అని చెప్తారు. గతి అంటే జ్ఞానమని అర్థం. పరమగతి అంటే హద్దులు లేని విస్తారమైన జ్ఞానం. దీనికే ఎరుక అని, బ్రహ్మమనీ, ప్రేమ అనీ, శాంతావస్థ అనీ అంటారు.)

**తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణామ్ .**
**అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ .. 2-3-11 ..**

ఇంద్రియాలను స్థిరంగా ఉంచడాన్ని వారు యోగమని భావిస్తారు. యోగమనేది వృద్ధి క్షీణతలకు లోనౌతుంది కనుక ఆ కాలంలో అప్రమత్తుడై ఉండాలి.

## శంకర భాష్యమ్

తాం ఈదృశీం తదవస్థాం యోగమితి మన్యంతే వియోగమేవ సంతం . సర్వానర్థసంయోగవియోగలక్షణా హీయమవస్థా యోగినః . ఏతస్యాం హ్యవస్థాయాం అవిద్యాధ్యారోపణవర్జితస్వరూపప్రతిష్ఠ ఆత్మా స్థిరామింద్రియధారణాం స్థిరామచలామింద్రియధారణాం బాహ్యాంతఃకరణానాం ధారణమిత్యర్థః . అప్రమత్తః ప్రమాదవర్జితః సమాధానం ప్రతి నిత్యం యత్నవాన్ తదా తస్మిన్కాలే, యదైవ ప్రవృత్తయోగో భవతీతి సామర్థ్యాదవగమ్యతే . న హి బుద్ధ్యాదిచేష్టాభావే ప్రమాదసంభవోఽస్తి . తస్మాత్ప్రాగేవ బుద్ధ్యాదిచేష్టోపరమాత్ అప్రమాదో విధీయతే . అథవా, యదైవ ఇంద్రియాణాం స్థిరా ధారణా, తదానీమేవ నిరంకుశమప్రమత్తత్వమిత్యతోఽభిధీయతే అప్రమత్తస్తదా భవతీతి . కుతః ? యోగో హి యస్మాత్ ప్రభవాప్యయౌ ఉపజనాపాయధర్మక ఇత్యర్థః . అతః అపాయపరిహారాయాప్రమాదః కర్తవ్య ఇత్యభిప్రాయః ..

బుద్ధ్యాదిచేష్టావిషయం చేద్బ్రహ్మ ఇదం తదితి విశేషతో గృహ్యేత, బుద్ధ్యాద్యుపరమే చ గ్రహణకారణాభావాదనుపలభ్యమానం నాస్త్యేవ బ్రహ్మ . యద్ధి కరణగోచరం తదస్తీతి ప్రసిద్ధం లోకే విపరీతం చాసదితి . అతశ్చానర్థకో యోగోఽనుపలభ్యమానత్వాద్వా నాస్తీత్యుపలబ్ధవ్యం బ్రహ్మేత్యేవం ప్రాప్తే, ఇదముచ్యతే .

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'స్థిరామ్ ఇన్ద్రియధారణామ్'– ఇంద్రియాలను స్థిరంగా అదుపులో ఉంచుట అంటే, అంతరేంద్రియాలను బాహ్యేంద్రియాలను స్థిరంగా చలించకుండా అదుపులో ఉంచడం అని అర్థం. ఇంటువంటిదైన, 'తామ్'– ఆ స్థితిని; 'యోగమ్ ఇతి'– యోగము అంటే కలయిక అని; 'మన్యన్తే'– భావిస్తారు. నిజానికి అది విడతీతయే. ఎందుకంటే యోగుల స్థితి సమస్తమైన అనర్థాలతోకూడిన కలయికనుండి విడదీయబడినది. ఇటువంటి అవస్థలో అజ్ఞానంవల్ల ఆరోపితములైన వాటినుండి స్వేచ్ఛపొంది ఆత్మ తన స్వరూపంలో ప్రతిష్ఠితమౌతుంది. అపుడు, 'అప్రమత్తః'– జాగకరూకత కలిగినవాడు, ప్రమత్తత కోల్పోనివాడు; 'భవతి'– అవుతాడు; 'తదా'– ఆ సమయంలో అంటే యోగము ప్రారంభమైన ఆ సమయంలో అని సందర్భోచితంగా అర్థంచేసుకోవాలి. ఎందుకంటే, బుద్ధి తన వృత్తులను నిలిపివేసినపుడు, జాగరూకత లేకపోవడమనేది సంభవం కాదు కాబట్టి బుద్ధి ముందుగానే అంటే తన కార్యకలాపాలను నిర్వర్తిస్తున్నప్పుడే జాగరూకతతో కూడినదై ఉండాలి. లేదా, ఇంద్రియాలు స్థిరంగా అదుపులో ఉన్నప్పుడు మాత్రమే అవరోధాలు లేని జాగరూకత సంభవం కాబట్టి 'అప్రమత్త స్తదా భవతి' అని అన్నారు. ఎందుచేత? 'యోగః హి ప్రభవాప్యయౌ'– యోగంవృద్ధి, క్షయాలు పొందేది కావడం చేత అని అభిప్రాయం. కాబట్టి, అపాయాన్ని నివారించడానికి అప్రమత్తతగా ఉండటం అవసరం. ['కాబట్టి అపాయాన్ని నివారించడానికి అప్రమత్తతగా ఉండటం అవసరం' అన్న వాక్యం మొదటి విచారణకు అనుబంధంగా గ్రహించాలి. 'అప్రమత్తః భవతి' అన్న ఉపనిషత్తు ఉపదేశంలో 'భవతి' శబ్దానికి 'అవుతాడు' అనే అర్థానికి బదులు 'కావాలి' అని తీసుకోవాలి. రెండవ విచారణవిషయంలో 'లేదా ఇంద్రియాలు స్థిరంగా అదుపులో ఉన్నపుడు మాత్రమే అవరోధాలు లేని జాగరూకత సంభవం కాబట్టి అప్రమత్త స్తదా భవతి' అన్న వాక్యం ఉన్న విషయాన్ని ప్రకటిస్తోంది. – స్వామి గంభీరానంద]. ఇదీ అభిప్రాయం.

(ఇంద్రియాలను మరియు మనసును వాటి విషయాలనుండి వెనుకకు మరల్చి అవి వాటి వృత్తులను నిర్వహించకుండా నిరోధించడాన్ని గురించి గత మంత్రంలో ప్రస్తావించారు. అలా మనసును ఇంద్రియాలను వాటి వాటి ప్రవృత్తులవైపు వెళ్లకుండా ఆపి ఉంచటం అనేది అవసరం. అలా ఆ స్థితిని స్థిరంగా ఉంచడాన్ని ఇక్కడ ఈ మంత్రంలో

ప్రస్తావిస్తున్నారు. ఎంతకాలమైతే ఇలా స్థిరంగా మనసును ఇంద్రియాలను వాటి వాటి విషయాలవైపు వెళ్ళకుండా ఆపగలుగుతున్నారో అంతకాలంపాటు బుద్ధి చేష్టారహితమౌతుంది. ఆ స్థితినే యోగమంటారని ఉపనిషత్తు చెపుతోంది. అంటే అటువంటి స్థితి కలిగేలా సాధకుడు అభ్యాసం చేయాలని అభిప్రాయం. అయితే, ఇక్కడ ఒక సూక్ష్మమైన విషయాన్ని శంకరులు వివరిస్తున్నారు. అదేమంటే, ప్రారంభదశలో అంటే స్థిరమయ్యేదాకా యోగానికి వృద్ధిచెందటం మరియు జారిపోవడం అనే లక్షణముంటుంది. అలా యోగం నుండి జారిపోకుండా సాధకుడు నిరంతరం అప్రమత్తుడై ఉండాలని ఆదేశిస్తున్నారు. యోగం కలిగిన ప్రారంభ స్థితిలో ఏర్పడే ఈ ప్రమాదాన్నుండి సాధకుడు తనను తాను కాపాడుకోవాలి. మనసు ఇంద్రియాలను వాటి విషయాలవైపు పోకుండా నిరోధించగలగడంలో స్థిరత్వాన్ని సాధించుకొన్నవానికి యోగస్థిరత్వం ఏర్పడుతుంది. అలా యోగంలో స్థిరత్వం ఏర్పడిన స్థితిలో అంటే బుద్ధి చేష్టారహితమైన స్థితిలో సాధకునికి యోగం నుండి పతనం చెందటం సంభవం కాదు. కాని, యోగం స్థిరంకాని పూర్వస్థితిలో మాత్రం సాధకుడు నిరంతరం జాగరూకతతో ఉండాలని చెప్తున్నారు.)

బ్రహ్మము బుద్ధి మొదలైన వాటిచే గ్రహింపదగిన విషయమైతే, ఇది ఇటువంటిది అని ప్రత్యేకించి చెప్పబడగలగాలి. బుద్ధి చేష్టారహితమైనపుడు అది (ఆ బ్రహ్మము) గ్రహింపబడనిదైనందున, దానిని గ్రహించే సాధనమేదీ లేనందున, బ్రహ్మము తప్పనిసరిగా ఉనికి లేనిదే. ఒక వస్తువు దానిని గుర్తించగలిగే సాధనం పరిధిలో ఉన్నంతకాలమే ఆ వస్తువు ఉన్నది అనేది లోకంలో బాగా తెలిసిన విషయమే. దానికి విపర్యయమైతే అది లేనట్లే. కాబట్టి, యోగం అనేది నిష్ప్రయోజనం లేదా గుర్తించబడే విషయం కానందున బ్రహ్మమనేది ఉనికి లేనిదిగా గ్రహించాలి. ఈ సందిగ్ధతనే తదుపరి మంత్రంలో వివరించబోతున్నారు.

(ఇక్కడ మరొక ముఖ్య సందేహం కలుగుతోంది. బ్రహ్మాన్ని గుర్తించే సాధనాలేవీ కన్పించడం లేదు. ఇంద్రియాలు, మనసు, బుద్ధి ఇవేవీ బ్రహ్మను గుర్తించడంలో ఏ మాత్రం ఉపయోగపడేవి కావు. ఒకవేళ అవి కనుక గుర్తించ గలిగితే, బ్రహ్మాన్ని ఇదిగో బ్రహ్మమంటే ఇది, ఇలా ఉంటుంది అని స్పష్టంగా అవగాహన కలిగించగలిగేవి. కాని, యథార్థంగా అవి బ్రహ్మను అలా చూపించలేవు. లోకంలో ఏదైనా వస్తువు ఉన్నది అని అంటే అది ఏదో ఒక సాధనం చేత గుర్తించగలిగితేనే అది ఉన్నట్లుగా గ్రహిస్తాము. అలా గ్రహించ లేకపోతే ఆ వస్తువు యొక్క ఉనికి లేదని స్పష్టమౌతోంది. మరి అలా విచారణ చేస్తే, బ్రహ్మం కూడా ఏదో ఒక సాధనం చేత గుర్తించబడేది కానందున దానికి అసలు ఉనికియే లేదని లేదా అస్తిత్వం లేదని, అసలు బ్రహ్మమనేది ఒకటి ఏదీ లేదని నిర్ధారణ చేయవచ్చుకదా. అదీ సందిగ్ధత. ఈ సందిగ్ధతను తొలగించడానికి తరువాతి మంత్రం ఉపదేశించబడుతోంది.)

**నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా .**
**అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే .. 2-3-12 ..**

వాక్కుచే కాని మనసుచే కాని కంటిచే కాని పొందశక్యం కాదు. అది (ఆ పరమాత్మ) ఉన్నది అని (శాస్త్రాన్ని విశ్వసించినవారికి). అన్యులకు అది ఎలా తెలియబడుతుంది?

## శంకర భాష్యమ్

సత్యం .నైవ వాచా న మనసా న చక్షుషా నాన్యైరపీంద్రియైః ప్రాప్తుం శక్యతే ఇత్యర్థః . తథాపి సర్వవిశేషరహితోఽపి జగతో మూలమిత్యవగతత్వాదస్త్యేవ, కార్యప్రవిలాపనస్యాస్తిత్వనిష్ఠత్వాత్ . తథా హీదం కార్యం సౌక్ష్మ్యతారతమ్యపారంపర్యేణానుగమ్యమానం సద్బుద్ధినిష్ఠామేవావగమయతి . యదాపి విషయప్రవిలాపనేన ప్రవిలాప్యమానా బుద్ధిః, తదాపి సా సత్ప్రత్యయగర్భైవ విలీయతే . బుద్ధిర్హి నః ప్రమాణం సదసతోర్యాథాత్మ్యావగమే . మూలం చేజ్జగతో న స్యాదసదన్వితమేవేదం కార్యమసదసదిత్యేవ గృహ్యేత, న త్వేతదస్తి ; సత్సదిత్యేవ తు గృహ్యతే ; యథా మృదాదికార్యం ఘటాది మృదాద్యన్వితం . తస్మాజ్జగతో మూలమాత్మా అస్తీత్యేవోపలబ్ధవ్యః . కస్మాత్ ? అస్తీతి బ్రువతః అస్తిత్వవాదిన ఆగమార్థానుసారిణః శ్రద్ధధానాదన్యత్ర నాస్తికవాదిని నాస్తి జగతో మూలమాత్మా నిరన్వయమేవేదం కార్యమభావాంతం ప్రవిలీయత ఇతి మన్యమానే విపరీతదర్శిని, కథం తద్బ్రహ్మ తత్త్వత ఉపలభ్యతే ; న కథంచనోపలభ్యత ఇత్యర్థః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఇది సత్యం. 'ఏవ వాచా'– వాక్కు ద్వారా కాని; 'మనసా'– మనసు ద్వారా కాని; 'చక్షుషా'– కంటి ద్వారా కాని, అంటే ఇతర ఇంద్రియాల ద్వారా కాని; 'న ప్రాప్తుమ్ శక్యః'– అది (ఆ పరమాత్మ) పొందశక్యము కాదు. ఇదీ అభిప్రాయం. అయినప్పటికినీ, ఏ ఇతర విశేషములూ లేనప్పటికినీ, జగత్తుకు మూలకారణంగా తెలియబడుతున్నందున, అది ఉన్నదే. కార్యాన్ని నిరాకరించడమంటే, దానికి మూలంగా కారణముండి తొలగించడమే. అలాగే, (జగత్తుగా కనపడుతోన్న) ఈ కార్యమును సూక్ష్మత్వపు తారతమ్య పరంపరలకు అనుగుణంగా దాని మూలాలకు వెళితే అంతిమంగా 'సత్' అనగా ఉన్నది అనే భావనకి చేరుతాము. మరి, బుద్ధికూడా విషయాలను అత్యంత సూక్ష్మంగా విచారించడం ద్వారా'సత్' భావనతో నిండియున్న ఉనికిలోనే విలీనమౌతుంది. నిజానికి, 'సత్' మరియు 'అసత్' యొక్క యథార్థస్వరూపాన్ని నిర్ధారించడంలో, బుద్ధియే మాకు ప్రమాణం. జగత్తునకు మూలమే లేకపోతే, ఈ జగత్తు యావత్తూ 'అసత్'తో నిండియుండాలి, అంటే లేనిది గానే అనుభవంలోకి రావాలి. కాని, నిజానికి అలా లేదు. మట్టిచే ఏర్పడిన కుండ మొదలైన వాటిలో మట్టియే వ్యాప్తమైయున్నట్లుగా ఎలా అనుభవంలోకి వస్తోందో, అదేవిధంగా జగత్తు ఉన్నట్లుగానే అనుభవంలోకి వస్తోంది. కాబట్టి జగత్తుకు మూలమైన ఆత్మను 'సత్' గానే అనుభూతి చెందాలి. ఎందుకు? 'అస్తిఇతిబృవతః' – (ఆత్మ) ఉన్నదని బోధించే శృతులను అనుసరిస్తూ విశ్వాసంకలిగిన వానికి తప్ప; 'అన్యత్ర'– వేరెక్కడైనా అంటే అది లేనిదనే సిద్ధాంతాన్ని పట్టుకున్నవాని వద్దగానీ, ఈ (చెప్పబోయే) విధంగా విపరీతధోరణిలో ఆలోచించే వాని వద్దగానీ; 'తత్'– అది (బ్రహ్మము); 'కథమ్'– ఎలా; ఉపలభ్యతే – తెలియబడుతుంది? ఈ జగత్తుకు మూలమైన ఆత్మ అనేది లేదు. ఈ జగత్తనే కార్యానికి కారణమనేదే లేదు. అది అంతిమంగా లేనిదానిలోనే (శూన్యంలోనే) లయమైపోతుంది. అభిప్రాయమేమంటే, అది (ఆత్మ) అనుభవంలోకి వచ్చేదే కాదు. ఇదీ విపరీత ధోరణి.

(అసలు ఆత్మ అనేదే లేదేమోననే సందిగ్ధతను పోగొట్టుతూ ఆత్మ సత్యమని నిర్ద్వందగా ప్రకటిస్తున్నారు. అయితే, అది వాక్కుకు గాని, మనసుకు గాని, ఇంద్రియాలకు గాని గోచరించేది కాదనేని మటుకు వాస్తవమే. అంతమాత్రం చేత, ఆత్మ లేనిదెలా అవుతుంది? ఎందుకంటే, కంటి ఎదురుగా జగత్తు కనబడుతోంది కదా! మరి కుండ అనే కార్యానికి మట్టి అనేది కారణమైనట్లుగా, ఈ కనబడే జగత్తుకు మూలమైన కారణం ఒకటి ఉండి ఉండాలి కదా! ఆ

మూల కారణమే బ్రహ్మం. కాబట్టి, జగత్తు కనపడుతోందంటే దానికి కారణమైన బ్రహ్మ ఉండి తీరాలి. జగత్తులోని విషయాలను బుద్ధిచేత సూక్ష్మంగా విచారణ చేస్తూపోతే చివరకు బుద్ధి విచారణకు అందని 'సత్' అనగా ఉన్నది అనే భావన నిండియున్నట్టి తత్త్వంలో ఈ బుద్ధి విలీనమైపోతుంది. అంటే సత్ అని పిలువబడే ఆ ఆత్మ లేదా బ్రహ్మం ఉన్నదని స్పష్టమౌతోంది. ఒక వేళ, బ్రహ్మమనేదే లేకపోతే, కారణమైన మట్టి లేకపోయినట్లైతే కుండ అనేదానికి ఎలా ఉనికి ఉండదో, అలాగే ఈ జగత్తుకు ఉనికే ఉండదు. జగత్తు కనపడకుండా పోవడం లేదు కాబట్టి, దాని మూలకారణమైన బ్రహ్మ ఉన్నదనేది ప్రామాణికంగా నిరూపణౌతోంది. ఆత్మ ఉన్నదని బోధించే శ్రుతులపై శాస్త్రాలపై విశ్వాసం ఉన్నవానికి అది ఉన్నదా లేదా అనే సందిగ్ధత ఉండనే ఉండదు. కాని, మిగిలిన వారికి, అంటే బ్రహ్మమనేదే లేదు అని సిద్ధాంతం చేసి కూర్చున్నవానికి అది ఎలా అనుభవంలోకి వస్తుంది. రాదు. అలాగే, కొందరు విపరీతమైన వ్యాఖ్యానాలు చేస్తూంటారు. వారేమంటారంటే, ఈ జగత్తుకు మూల కారణమనేది ఏదీ లేదు. అది అలా శూన్యంలోంచి పుడుతోంది. తిరిగి శూన్యంలోకి లయమైపోతుంది. ఇక ఆత్మ లేదా బ్రహ్మ అనేది ఏదీ లేదు అంటారు. ఇలా వితండంగా వాదన చేసేవారికి ఆత్మ ఎలా తెలుస్తుంది. ఆ విపరీత ధోరణినుండి బయటపడి, శాస్త్రవిహితంగా విచారణ చేస్తే తప్ప వారికి ఆత్మ అనుభవమయ్యే అవకాశమే లేదు.)

**అస్తీత్యేవోపలబ్ధవ్యస్తత్త్వభావేన చోభయోః .**
**అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి .. 2-3-13 ..**

ఆత్మ (మొదట) ఉన్నదిగా అనుభవం కావాలి తరువాత అది ఏమిటనే విచారణ. ఈ రెండింటిలో ఆత్మ కేవలం ఉన్నదనే అనుభవం పొందగా, ఆత్మ యొక్క స్వభావం (తనంతతానుగా) ప్రకటనమౌతుంది.

## శంకర భాష్యమ్

తస్మాదపోహ్యాసద్వాదిపక్షమాసురం అస్తీత్యేవ ఆత్మా ఉపలబ్ధవ్యః సత్కార్యబుద్ధ్యాద్యుపాధిభిః . యదా తు తద్రహితోఽవిక్రియ ఆత్మా కార్యం చ కారణవ్యతిరేకేణ నాస్తి 'వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' (ఛా. ఉ. 6 . 1 . 4) ఇతి శ్రుతేః, తదా తస్య నిరుపాధికస్యాలింగస్య సదసదాదిప్రత్యయవిషయత్వవర్జితస్యాత్మనస్తత్త్వభావో భవతి . తేన చ రూపేణాత్మోపలబ్ధవ్య ఇత్యనువర్తతే . తత్రాప్యుభయోః సోపాధికనిరుపాధికయోరస్తిత్వతత్త్వభావయోః — నిర్ధారణార్థా షష్ఠీ — పూర్వమస్తీత్యేవోపలబ్ధస్యాత్మనః సత్కార్యోపాధికృతాస్తిత్వ ప్రత్యయేనోపలబ్ధస్యేత్యర్థః . పశ్చాత్ప్రత్యస్తమితసర్వోపాధిరూప ఆత్మనః తత్త్వభావః విదితావిదితాభ్యామన్యోఽద్వయస్వభావః 'నేతి నేతి' (బృ.ఉ. 2.3.6, 3.9.26) ఇతి, 'అస్థూలమనణ్వహ్రస్వమ్' (బృ.ఉ. 3.8.8), 'అదృశ్యేఽనాత్మ్యే నిరుక్తేఽనిలయన' (తై.ఉ. 2.7.1) ఇత్యాదిశ్రుతినిర్దిష్టః ప్రసీదతి అభిముఖీభవతి . ఆత్మప్రకాశనాయ పూర్వమస్తీత్యుపలబ్ధవత ఇత్యేతత్ ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

కాబట్టి, ఆత్మ లేదనే రాక్షసవాదన తృణీకరించి, 'అస్తి ఇతి ఏవ ఉపలబ్ధవ్యః'– ఆత్మ (అన్నిటా అంతర్లీనంగా) ఉన్నదిగా అనుభవం కావాలి, అంటే బుద్ధి మొదలైన పరిమిత ఉపాధులు కలిగి, ఉండుట అనే స్వభావం కలిగిన కార్యములుగా రూపొందిన సత్ అనుభవం కావాలి. కాని, ఇవన్నీ లేకుండా ఉన్నట్టిది, ఎటువంటి పరిణామాలకు లోను కానిది, 'పరిణామాలన్నీ వాక్కుచే కలిగిన నామములు మాత్రమే కాని మట్టి ఒక్కటే నిజం' [వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' (ఛాం.ఉ. 6.1.4)] అన్న శ్రుతి వాక్యం ప్రకారంగా కారణానికి భిన్నంగా కార్యములు లేనిది, ఎటువంటి పరిమితులు గుణాలు లేనిది, సత్ మరియు అసత్ అనే విభాగాలు కల విషయం కానటువంటి ఆత్మ యొక్క, 'తత్త్వభావః'– నిజమైన స్వభావం అనుభవమౌతుంది. అటువంటి (తత్త్వభావేన) భావనారూపంగా కూడా, 'ఆత్మ అనుభవం కావాలి' అని పూరించుకోవాలి. 'ఉభయోః' అని షష్ఠీ విభక్తి ప్రత్యయం నిర్ధారణను చూపిస్తోంది. 'ఉభయోః' అంటే రెండింటిలో, అంటే ఉపాధి పరిమితులకు లోబడి ఉన్నదనే అంతర్లీన అనుభవమూ మరియు ఉపాధి రహితమై అవధులులేని సర్వవ్యాపకమైన తత్త్వానుభవమూ అనే ఈ రెండింటిలో 'తత్త్వభావః'– యథార్థ స్వభావం; 'అస్తి ఇతి ఏవ ఉపలబ్ధస్య'– తొలుత (అంతర్లీనంగా) ఉన్నదనే అనుభవం కలిగినట్టి ఆ ఆత్మ యొక్క [ఉన్నవి అనే అనుభవానికి అందుబాటులో ఉన్న సమస్త కార్యాలకు ఆత్మయే మూలకారణమనే సత్యాన్ని గ్రహించడం వల్ల ఆత్మ ఉన్నదని ధృవపరచుకొంటాం] అంటే, ఆ ఉన్నట్టి దానియొక్క కార్యరూపాలే అయిన ఉపాధి పరిమితులకు లోబడినదై ఉన్నది అనే భావన ద్వారా ఏదైతే తెలియబడుతుందో అట్టి ఆ ఆత్మ యొక్క (నిజతత్త్వం), 'ప్రసీదతి'– తర్వాత అనుగ్రహపూర్వకంగా తనంత తాను అనుభవానికి వస్తుంది, అంటే ఆత్మను 'సత్' గా ఉన్నదానిగా అనుభవంలోకి తెచ్చుకొన్న సాధకునికి ఆత్మ యొక్క యథార్థ స్వభావం అంటే పరిమిత ఉపాధులు తొలగిపోయినట్టిది, తెలిసిన దానికి తెలియనిదానికి భిన్నమైట్టిది, రెండవది లేని స్థితి కలిగినట్టిది మరియు 'నేతి నేతి'(బృ.ఉ. 2.3.6, 3.9.26), 'అస్థూలమనణ్వహ్రస్వమ్' (బృ.ఉ. 3.8.8), 'అదృశ్యేఽనాత్మ్యే నిరుక్తేఽనిలయన' (తై.ఉ. 2.7.1)మొదలైన శ్రుతి వాక్యాలచే నిర్ధారింపబడినట్టిదైన ఆత్మ ముఖాముఖి అనుభవంలోకి వస్తుంది. ఆత్మ యదార్థస్థితి అనుభవంగా ప్రకాశించడానికి పూర్వమే దాని ఉనికి అనుభవానికి వస్తుందని అభిప్రాయం.

(ఆత్మ అనేది లేదు అనే విపరీత ధోరణి పక్కన పెట్టాలి. ఆత్మ ఉన్నది అనే సత్యాన్ని ఎరుకలోకి తెచ్చుకోవాలి. సిద్ధాంతపరంగా, హేతు బద్ధంగా ఆత్మ అనేది ఉన్నదని అంటే సరిపోదు. ఆ భావన అనుభవంగా మారాలి. పంచదార తియ్యగా ఉంటుందని అర్థమైతే సరిపోదు. దాన్ని నోటిలో వేసుకొని ఆ తియ్యదనాన్ని ఎలాగైతే అనుభవిస్తామో, అలా ఆత్మ యొక్క ఉనికిని అనుభవించాలి. ఎదురుగా ఏదైనా వస్తువు కనిపిస్తోందంటే, దానికి మూల కారణమైనది ఒకటుందనేది అనుభవానికి రావాలి. కుండను చూసినప్పుడు దాని మూలకారణమైన మట్టి అనుభవానికి రావాలి. ఆభరణాలలో వాటి మూల కారణమైన బంగారాన్ని చూడాలి. సర్వ జగత్తులో దానికి మూలకారణమైన ఆత్మ అనుభవానికి రావాలి. ఇది ఆత్మ గురించిన తొలి అనుభవం. ఉండుట అనేది జగత్తులోని ప్రతి అంశానికి అంతర్లీనంగా ఉన్న ధర్మం. ఆ ఉండుట అనేదే ఉనికి. దానిని ఎరుకలోకి తెచ్చుకోవాలి. అలా ఆత్మ యొక్క ఉనికి మొదట అనుభవంగా మారాలి. ఈ ప్రాథమికమైన అనుభవమే ఆత్మ తత్త్వానుభవంగా అనుగ్రహించబడుతుంది. అంటే, ఆత్మ యొక్క యథార్థ స్థితి లేదా స్వరూపమైన సర్వవ్యాపకత్వం అవగతమౌతుంది అనుభవానికి వస్తుంది. ఆ స్థితి ఎలాంటి దంటే, ఆత్మ ఉన్నది అని తెలుసుకోవడానికి పరిమిత ఉపాధుల గురించి చెప్పుకొన్నాం. యథార్థ స్థితిలో ఆత్మకు

ఎటువంటి ఉపాధుల అవసరం ఉండదు. ఉపాధులచే పరిమితం కానట్టి స్థితి అది. సర్వ కార్యాలకు కారణమైనట్టిది ఆత్మ యొక్క యధార్థ స్థితి. అన్ని కార్యాలు దానినుండి ఉద్భవించినవే. అది తెలిసినది కాదు తెలియనిది కూడా కాదు. వాటికి అతీతమైనట్టి స్థితి. రెండవది లేనట్టిది. అంటే తన లాంటిదే వేరొకటి లేదు అలాగే తన కంటే భిన్నమైనది కూడా వేరొకటి లేదు. ఎన్నో శ్రుతులు ఆత్మ యొక్క ఇటువంటి యధార్థ తత్త్వాన్ని ప్రకటించాయి. ముందు ఆత్మ యొక్క ఉనికి ఎరుకలోకి తెచ్చుకొన్న సాధకునికి అ తరువాత ఆత్మ యధార్థ తత్త్వం తనంత తానుగా అనుభవరూపంగా ప్రసాదిస్తుంది లేదా అనుగ్రహిస్తుంది.)

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః .**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే .. 2-3-14 ..**

ఎప్పుడైతే మనసుని ఆశ్రయించియున్న కోరికలు జారిపోతాయో, అపుడే మర్త్యుడు అమృతుడవుతాడు. ఇక్కడే బ్రహ్మాన్ని పొందుతాడు.

## శంకర భాష్యమ్

ఏవం పరమార్థాత్మదర్శినో యదా యస్మిన్కాలే సర్వే కామాః కామయితవ్యస్యాన్యస్యాభావాత్ ప్రముచ్యంతే విశీర్యంతే ; యే అస్య ప్రాక్ప్రతిబోధాద్విదుషో హృది బుద్ధౌ శ్రితాః ఆశ్రితాః ; బుద్ధిర్హి కామానామాశ్రయః నాత్మా, 'కామః సంకల్పః' (బృ. ఉ. 1 . 5 . 3) ఇత్యాదిశ్రుత్యంతరాచ్చ ; అథ తదా మర్త్యః ప్రాక్ప్రబోధాదాసీత్ స ప్రబోధోత్తరకాలమవిద్యాకామకర్మలక్షణస్య మృత్యోర్వినాశాత్ అమృతో భవతి గమనప్రయోజకస్య మృత్యోర్వినాశాద్గమనానుపపత్తేః . అత్ర ఇహైవ ప్రదీపనిర్వాణవత్సర్వబంధనోపశమాత్ బ్రహ్మ సమశ్నుతే బ్రహ్మైవ భవతీత్యర్థః ..

కదా పునః కామానాం మూలతో వినాశ ఇతి, ఉచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

ఆ విధంగా పరమాత్మానుభవం కలిగిన వాని గురించి, 'యదా'— ఏ కాలంలోనైతే; 'సర్వేకామాః'— కోరికలన్నీ; 'యే'— ఏవైతే; 'హృది శ్రితాః'— హృదయాన్ని ఆశ్రయించి ఉన్నాయో; 'ప్రముచ్యన్తే'— పడిపోతాయి, ముక్కలైపోతాయి, కోరవలసినది ఏదీ లేనందువల్ల; 'అస్య'— అట్టి జ్ఞానికి; జ్ఞానం కలగడానికి ముందు, కోరికలు బుద్ధిని ఆశ్రయించి ఉంటాయి కాని ఆత్మను కాదు. 'కోరిక, సంకల్పం' (సంశయం మొదలైనవన్నీ మనసు మాత్రమే) ['కామః సంకల్పః' (బృ.ఉ. 1.5.3)] అని శ్రుతి కూడా చెప్తోంది. 'అథ'— అప్పుడు, జ్ఞానం కలగడానికి ముందు; అతడు 'మర్త్యః'— మృతత్వాన్ని కలిగినవాడు; 'అమృతః భవతి'— మృతిలేనివాడు అవుతాడు, జ్ఞానం కలిగిన తర్వాత, అవిద్య-కోరిక-కర్మల వల్ల కలిగిన మృతత్వం నశించినందువల్ల. గమనాన్ని కలిగించే మృత్యువు నాశనం కాగా, ఇక గమనమనేది సంభవం కాదు. కాబట్టి, 'అత్ర'— ఇక్కడనే; దీపం ఆరిపోయినట్లుగా అన్ని బంధనాలు తెగిపోగా, 'సమశ్నుతే బ్రహ్మ'— బ్రహ్మను పొందుతాడు, అంటే బ్రహ్మమే అవుతాడు.

(గత మంత్రంలో పరమాత్మానుభవం కలగటం గురించి ప్రస్తావించారు. ఇక, అటువంటి పరమాత్మానుభవం కలిగిన జ్ఞాని స్థితి ఎలా ఉంటుందో వివరిస్తున్నారు. జ్ఞానం కలగడానికి పూర్వం సాధకునిలో బుద్ధిని ఆశ్రయించి ఉన్న కోరికలన్నీ జ్ఞానం కలిగిన వెంటనే మటుమాయమైపోతాయి. ఎందుకంటే అంతా పరమాత్మయే అని, పరమాత్మ తప్ప ఇతరమేదీ లేదనే అనుభవంలో మగ్నుడైన జ్ఞానికి కోరేందుకు ఏదీ లేని కారణంగా కోరికలు ఉండే అవకాశమే లేదు. కోరికలు అజ్ఞానం వల్ల పుట్టేవి. కోరికలు పుట్టేందుకు కారణమైన అజ్ఞానం నశించిన జ్ఞానికి కోరిక ఉండే అవకాశమే లేదు. అందుచేతనే, అప్పటిదాకా అతని బుద్ధిని ఆశ్రయించియున్న అజ్ఞానజనితమైన కోరికలన్నీ జ్ఞానం కలిగిన మరుక్షణమే మరుగున పడిపోతాయి. మరింకా ఏం జరుగుతుంది? అప్పటివరకు మృతత్వం స్వభావంగా కలిగినవాడు మృతిలేని వాడౌతాడు. అజ్ఞానం వల్ల కోరిక, ఆ కోరిక తీరేందుకు కర్మ, ఈ పరంపరయే మృతత్వం. అజ్ఞానం నశించగానే, కోరికలు నశిస్తాయి. కోరికలే లేనందున చేయతగిన కర్మలే ఉండవు. అంటే మృతత్వం కూడా నశిస్తుంది. మృతత్వం నశించిన జ్ఞాని మృతి లేనివాడే అవుతాడు. మరింకా మృతి అంటే గమనం అంటే ప్రయాణం అంటే ఒక చోటి నుండి మరొక చోటుకు మార్పు. మరి మృతి నశించడమంటే గమనం లేకపోవడం కూడా. అదే అమృతం అంటే గమనం లేకపోవడం. అందుకనే, జ్ఞాని ఇక్కడనే బ్రహ్మాన్ని పొందుతాడు. బ్రహ్మను పొందటమంటే బ్రహ్మమే కావడం. బ్రహ్మానికి జ్ఞానికి అభిన్నం.)

తిరిగి ఎప్పుడు, కోరికలు మూలంతో సహా పెకళించబడతాయి అనేది తరువాతి మంత్రంలో చెప్తున్నారు.

**యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః .**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనమ్ .. 2-3-15 ..**

ఎప్పుడైతే హృదయం యొక్క సర్వ గ్రంథులు ఛిన్నాభిన్నమౌతాయో అపుడే మర్త్యుడు అమృతుడౌతాడు. (అన్ని ఉపనిషత్తుల) ఉపదేశం ఇంతవరకే.

## శంకర భాష్యమ్

యదా సర్వే ప్రభిద్యంతే భేదముపయాంతి వినశ్యంతి హృదయస్య బుద్ధేరిహ జీవత ఏవ గ్రంథయో గ్రంథివద్దృఢబంధనరూపా అవిద్యాప్రత్యయా ఇత్యర్థః . అహమిదం శరీరం మమేదం ధనం సుఖీ దుఃఖీ చాహమిత్యేవమాదిలక్షణాః తద్విపరీతాత్ బ్రహ్మాత్మప్రత్యయోపజనాత్ బ్రహ్మైవాహమస్మ్యసంసారీతి వినష్టేష్వవిద్యాగ్రంథిషు తన్నిమిత్తాః కామా మూలతో వినశ్యంతి . అథ మర్త్యోఽమృతో భవతి ఏతావద్ధి ఏతావదేవైతావన్మాత్రం నాధికమస్తీత్యాశంకా కర్తవ్యా . అనుశాసనం అనుశిష్టః ఉపదేశః సర్వవేదాంతానామితి వాక్యశేషః ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'యదా'– ఎప్పుడు; 'హృదయస్య'– బుద్ధియొక్క; 'సర్వే గ్రన్థయః'– అన్ని ముడులు, అంటే ముడులుగా కట్టిపడవేసే అజ్ఞానజనితమైన అన్ని అపోహలు; 'ప్రభిద్యన్తే'– విడిపోతాయో, ఛిన్నాభిన్నమై పోతాయో, నశిస్తాయో; 'ఇహ'– ఇక్కడ, మానవుడు జీవించి యుండగనే. అవిద్య వల్ల కలిగే అపోహలు ఏవంటే, 'నేను ఈ దేహాన్ని', 'ఈ సంపద నాది', 'నేను సుఖంగా లేదా దుఃఖంగా ఉన్నాను' అనే భావనలు. ఎప్పుడు ఈ అవిద్య వల్ల కలిగిన బంధనాలు వాటికి వ్యతిరేకంగా 'నేను నిజానికి బ్రహ్మమునే', 'నేను పునర్జన్మను పొందే జీవిని కాను' అనే ఆత్మ మరియు బ్రహ్మముతో ఐక్యత వల్ల విడిపోతాయో, అపుడు గ్రంథులనుండి జనించే కోరికలు పూర్తిగా నశిస్తాయి. 'అథ మర్త్యః అమృతః భవతి'– అప్పుడు మృతి కలిగిన వాడు మరణంలేని వాడవుతాడు. 'అనుశాసనమ్'– ఉపదేశము, 'అన్ని ఉపనిషత్తుల యొక్క' అని వాక్యాన్ని పూరించేందుకు అదనంగా చేర్చుకోవాలి; 'ఏతావత్ హి'– ఇంతవరకు మాత్రమే. అంటే, ఇంకా ఏమైనా మిగిలి ఉండవచ్చనే అపేక్ష ఉండరాదు.

(పరమాత్మానుభవాన్ని పొందిన సాధకునికి ఇంకా ఏమి జరుగుతుంది అన్న ప్రశ్నకు ఈ మంత్రంలో సమాధానం చెప్తున్నారు. జ్ఞానాన్ని పొందటానికి పూర్వం అంటే అజ్ఞానం ఉన్న సందర్భంలో ఆ అజ్ఞానం వల్ల కొన్ని అపోహలు బుద్ధిలో గూడు కట్టుకొని ఉంటాయి. నేను ఈ దేహాన్ని, నేను కర్తను, నేను భోక్తను వంటివి చాలా ధృడంగా పేరుకొనిపోయి ఉంటాయి. వాటినే గ్రంథులు లేదా బంధనాలు లేదా చిక్కుముడులు అంటారు. మరి వీటి సంగతేంటి అనే అనుమానం రావచ్చు. అవి కూడా జ్ఞానం కలిగిన వెంటనే ఆ గ్రంథులు ఏర్పడడానికి కారణమైన అజ్ఞాన నాశనం వల్ల ఛిన్నాభిన్నమౌతాయి. అంటే అవిద్య వల్ల అప్పటి వరకు అధ్యారోపితాలైన భావనలు, భ్రమలు, కోరికలు సమూలంగా వాటి అస్తిత్వాన్ని కోల్పోతాయి అంటే నశిస్తాయి. జ్ఞానం కలిగిన మరుక్షణమే బుద్ధిని అప్పటివరకు ఆశ్రయించియున్న అవిద్యాజనితమైన అన్ని విషయాలు సమూలంగా అంటే ఏమాత్రం అంకురంకూడా లేకుండా నశిస్తాయి అని చెప్తున్నారు. జ్ఞానం కలగడానికి అజ్ఞానం మరియు దాని అనుబంధమైన అపోహలన్నీ తొలగిపోవడానికి సమయాంతరం ఏమీ ఉండదు. ఆ తొలగిపోవడం కూడా నిశ్శేషంగానే. ఈ ఒక్క కఠోపనిషత్తు మాత్రమే కాదు అన్ని ఉపనిషత్తుల అంతిమ ఉపదేశం ఇంతవరకే. ఆత్మజ్ఞానానుభూతిని దాటి ఏ ఉపదేశమూ ఉండదు. ఉండాల్సిన అవసరమూ లేదు.)

## శంకర భాష్యమ్

నిరస్తాశేషవిశేషవ్యాపిబ్రహ్మాత్మప్రతిపత్త్యా ప్రభిన్నసమస్తా విద్యాదిగ్రంథేః జీవత ఏవ బ్రహ్మభూతస్య విదుషో న గతిర్విద్యతే, 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' (క. ఉ. 2 . 3 . 14) ఇత్యుక్తత్వాత్ 'న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి' (బృ. ఉ. 4 . 4 . 6) ఇతి శ్రుత్యంతరాచ్చ . యే పునర్మందబ్రహ్మవిదో విద్యాంతరశీలినశ్చ బ్రహ్మలోకభాజః యే చ తద్విపరీతాః సంసారభాజః, తేషామేష గతివిశేష ఉచ్యతే ప్రకృతోత్కృష్టబ్రహ్మవిద్యాఫలస్తుతయే . కించాన్యత్ , అగ్నివిద్యా పృష్టా ప్రత్యుక్తా చ . తస్యాశ్చ ఫలప్రాప్తిప్రకారో వక్తవ్య ఇతి మంత్రారంభః . తత్ర —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అత్ర బ్రహ్మ సమశ్నుతే' (క.ఉ. 2.3.14) అని సమర్థించడంద్వారా, అత్మకు సర్వవ్యాపకమైన గుణాతీతమైన బ్రహ్మతోడి ఐక్యతను సాధించగా అవిద్యా బంధనాలన్నీ నశించి, 'న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి' (బృ.ఉ. 4.4.6) అన్న శ్రుతి వాక్యం ప్రకారంగా జీవించియుండగనే బ్రహ్మమే అయిన బ్రహ్మజ్ఞానికి గమనమనేది ఉండదని ప్రకటించబడింది.అయితే, బ్రహ్మను గురించిన జ్ఞానంలో అంతగా అభివృద్ధి చెందని వారికి, ఇతరములైన విద్యలలో (అంటే ఆరాధన మరియు ఉపాసనలలో) నిమగ్నులైనవారికి మరియు బ్రహ్మలోకస్థులగుటకు సమర్థత కలవారికి, అంతేకాక వీరికి వ్యతిరేకమైన వారికి మరియు సంసారులకు, ప్రత్యేకమైన మార్గం సూచించబడబోతోంది. మరింకా, బ్రహ్మను గురించిన జ్ఞానము యొక్క ఫలితము ఉత్తమమైనదని కీర్తించేందుకు కూడా (ఈ ప్రత్యేకమార్గం చెప్పబడుతోంది). అంతేకాక, అగ్నిని గురించిన జ్ఞానం కూడా అర్థించబడగా, బోధించబడియున్నందున కూడా ఆ విద్యా ఫలాన్ని పొందే విధానం కూడా చెప్పబడాలి. అందుకే ఈ క్రింది మంత్రం ప్రారంభమైంది. దాని గురించి,

(గత మంత్రంలో బ్రహ్మ జ్ఞానం పొందిన తర్వాత మరింక చెప్పేది ఏమీ లేదు, ఉపదేశం ఇంతవరకే అని అన్నారు కదా. మరింకా దేన్ని గురించి తరువాతి మంత్రంలో చెప్తున్నారు? అంటే, అందరూ బ్రహ్మజ్ఞానాన్ని పొందే స్థితికి చేరుకోలేక పోవచ్చు. అంతేకాక, కొందరు ఇతర లౌకిక ఆరాధనలు, ఉపాసనలతో జీవితాన్ని గడుపుతూ ఉండవచ్చు. మరికొంతమంది వేద విహితమైన కర్మలను విధిపూర్వకంగా ఆచరించి బ్రహ్మలోక ప్రాప్తిని పొందే సమర్థత సంపాదించుకొని ఉండవచ్చు. మరింకా, కొందరు కేవలం సంసారులుగానే ఉండి ఉండవచ్చు. మరి ఇలాంటి వారంతా, బ్రహ్మజ్ఞానానికి కావలసిన చిత్తశుద్ధి, ఇంద్రియ విషయాలపట్ల వైరాగ్యత మొదలైనవి లేనందున, తరించే మార్గమే లేదా. అంటే ఉన్నదనే విషయాన్ని వివరించేందుకై తదుపరి మంత్రం చెప్పబడబోతోంది. అంతేకాదు, సమస్త జ్ఞానాలకన్నా బ్రహ్మజ్ఞానమే అత్యున్నత స్థాయికి చెందినదని శ్లాఘించడం కూడా ఉద్దేశ్యమై ఉండవచ్చు. అంటే, ఈ చెప్పబోయే విషయం బ్రహ్మజ్ఞానానికన్నా తక్కువ స్థాయికి చెందినదని అభిప్రాయం. ఇంకా ఏమంటే, ఈ ఉపనిషత్తు సందర్భంగా ఆలోచిస్తే, నచికేతుడు యమదేవుడిని అగ్ని ఉపాసన గురించి ప్రశ్నించగా, దానిని యమదేవుడు బోధిస్తాడు. ఆ ఆగ్ని ఉపాసనా ఫలాన్ని ఏ విధంగా పొందాలి అనేది చెప్పవలసి ఉన్నందున కూడా తరువాతి మంత్రం ప్రారంభించబడుతోంది.)

**శతం చైకా చ హృదయస్య నాడ్య-**
**స్తాసాం మూర్ధానమభినిఃసృతైకా .**
**తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి**
**విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి .. 2-3-16 ..**

హృదయంలో నాడుల సంఖ్య 101. వాటిలో ఒకటి శిరస్సుగుండా ప్రసరిస్తుంది. దాని ద్వారా పయనించినవాడు అమృతత్వాన్ని సాధిస్తాడు. వివిధ దిశలలో పయనించేవి మృతికి కారణాలవుతాయి.

## శంకర భాష్యమ్

శతం చ శతసంఖ్యాకాః ఏకా చ సుషుమ్నా నామ పురుషస్య హృదయాద్వినిఃసృతాః నాడ్యః సిరాః ; తాసాం మధ్యే మూర్ధానం భిత్త్వా అభినిఃసృతా నిర్గతా ఏకా సుషుమ్నా నామ . తయా అంతకాలే హృదయే ఆత్మానం వశీకృత్య యోజయేత్ . తయా నాడ్యా ఊర్ధ్వం ఉపరి ఆయన్ గచ్ఛన్ ఆదిత్యద్వారేణ అమృతత్వం అమరణధర్మత్వమాపేక్షికం — 'ఆభూతసంప్లవం స్థానమమృతత్వం హి భాష్యతే' (వి. పు. 2 . 8 . 97) ఇతి స్మృతేః — బ్రహ్మణా వా సహ కాలాంతరేణ ముఖ్యమమృతత్వమేతి భుక్త్వా భోగాననుపమాన్బ్రహ్మలోకగతాన్ . విష్వజ్ నానాగతయః అన్యా నాడ్యః ఉత్క్రమణే ఉత్క్రమణనిమిత్తం భవంతి సంసారప్రతిపత్త్యర్థా ఏవ భవంతీత్యర్థః ..

ఇదానీం సర్వవల్ల్యర్థోపసంహారార్థమాహ —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'హృదయస్య నాడ్యః'— హృదయం నుండి వెడలే నాడులు; 'శతమ్ చ ఏకా'— నూట ఒక్కటి; 'తాసామ్'— వాటిలో; 'ఏకా'— ఒకటి; సుషుమ్న అని పిలువబడేది; 'మూర్ధానమ్'— శీర్షాన్ని; 'అభినిఃసృతా'— ఛేదిస్తూ బయటకు వెడుతుంది. మరణ కాలంలో మనసును ఆ సుషుమ్నా నాడి ద్వారా అదుపుచేసి హృదయంలో కేంద్రీకృతం చేయాలి. 'తయా'— ఆ నాడి ద్వారా; 'ఊర్ధ్వమ్ ఆయన్'— పైకి వెళ్ళి, అంటే సూర్యపథం వెంబడి (ఉత్తర మార్గం వెంట); 'అమృతత్వమ్'— మరణరహిత స్థితిని; 'ఏతి'— పొందును. అంటే ఇది సాపేక్షికమైన మరణరహిత స్థితి, 'ఎందుకంటే పంచభూతాలన్నీ లయమయ్యేంతవరకు నిలిచే ఆ స్థానాన్ని అమృతత్వం అంటారు' అని ['ఆభూతసంప్లవం స్థానమమృతత్వం హి భాష్యతే' (వి.పు. 2.8.97)] స్మృతి చెప్తోంది కనుక. లేదా, బ్రహ్మలోకంలో ఉండే పోల్చి చూపలేని భోగాలను అనుభవించిన తర్వాత సరియగు కాలంలో హిరణ్యగర్భునితో పాటుగా అమృతత్వాన్ని, అంటే ఆ పదానికున్న ప్రాథమిక అర్థం సూచించే మరణరహిత స్థితిని, పొందును. 'విష్వక్ అన్యాః'— వివిధ దిశలలో వ్యాపించియున్న ఇతర నాడులు; 'ఉత్క్రమణే భవంతి'— మృత్యువుకు కారణం అవుతాయి అంటే సంసారగతి పొందటానికి మాత్రమే కారణమౌతాయి.

(పూర్ణమైన బ్రహ్మజ్ఞానం లభించని సాధకుడు చేయవలసిన సాధనను సూచిస్తున్నారిక్కడ. హృదయానికి మొత్తం 101 నాడులు అనుసంధానమై ఉన్నాయి. అవి శరీరంలో నలువైపులా వ్యాపించి ఉన్నాయి. అందులో సుషుమ్న అని పిలువబడే నాడి మాత్రం నడినెత్తిని చీల్చుకుంటూ బాహ్యానికి వ్యాపించి ఉంది. మరణకాలంలో సాధకుడు మనసును సుషుమ్నా నాడి ద్వారా అదుపులోనికి తీసుకొనివచ్చి హృదయస్థానంలో నిలిపి ఉంచుతాడు. ఆ నాడి ద్వారా ఆదిత్య మార్గంలో అంటే ఉత్తరాయణ మార్గంలో ఊర్ధ్వంగా ప్రయాణం చేసి అమృతత్వాన్ని సాధిస్తాడు. ఇది యోగ విధానం. మరి అమృతత్వాన్ని ఈ విధానంలో కూడా సాధించవచ్చుగా అని అంటే కాదంటున్నారు శంకరులు. ఈ విధానం ద్వారా సాధించే అమృతత్వం బ్రహ్మజ్ఞానం పొందటం ద్వారా సాధించే అమృతత్వం కన్నా

తక్కువ స్థాయిది. బ్రహ్మజ్ఞానికి కలిగే ఫలం ఇక్కడనే జీవించియుండగనే కలిగేటటువంటిది. మరింకా పరమాత్మకు బ్రహ్మజ్ఞానికి అభేదమే. కాని ఇలా యోగాన్ని అభ్యాసం చేసి సాధించుకొన్న అమృతత్వం అంత స్థాయిది కాదు. బ్రహ్మలోకంలో అన్ని భోగాలను అనుభవించిన తర్వాత సరియైన కాలం సమీపించిన తదుపరి హిరణ్యగర్భుడు ఉన్నంతకాలం మేరకు మాత్రమే అమృతత్వాన్ని పొందుతాడు. అంటే బ్రహ్మజ్ఞానియొక్క అమృతత్వం కన్నా సాపేక్షికంగా ఇది తక్కువ స్థాయిది. మిగతా నాడుల ద్వారా కలిగితే తిరిగి సంసారంలో ప్రవేశిస్తాడని అభిప్రాయం.)

ఇక, అన్ని వల్లీలలో చెప్పబడిన విషయాన్ని ముగింపుచేసేందుకై ఉపనిషత్ ఇలా అంటోంది.

**అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా**
**సదా జనానాం హృదయే సంనివిష్టః .**
**తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ .**
**తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి .. 2-3-17 ..**

అంగుష్ఠమాత్రుడు, అంతరాత్మయైన పురుషుడు ఎల్లప్పుడూ జనుల హృదయాలలో ఆసీనుడైనాడు. ముంజగడ్డినుండి వెన్నును విడదీసినట్లుగా వివేకంతో వానిని తమ దేహం నుండి విడదీయాలి. అతనినే స్వచ్ఛమనీ అమృతమనీ తెలియాలి. అతనినే స్వచ్ఛమనీ అమృతమనీ తెలియాలి.

## శంకర భాష్యమ్

అంగుష్ఠమాత్రః పురుషః అంతరాత్మా సదా జనానాం సంబంధిని హృదయే సంనివిష్టః యథావ్యాఖ్యాతః ; తం స్వాత్ ఆత్మీయాత్ శరీరాత్ ప్రవృహేత్ ఉద్యచ్ఛేత్ నిష్కర్షేత్ పృథక్కుర్యాదిత్యర్థః . కిమివేతి, ఉచ్యతే — ముంజాదివేషీకాం అంతఃస్థాం ధైర్యేణ అప్రమాదేన . తం శరీరాన్నిష్కృష్టం చిన్మాత్రం విద్యాత్ విజానీయాత్ శుక్రం శుద్ధం అమృతం యథోక్తం బ్రహ్మేతి . ద్విర్వచనముపనిషత్పరిసమాప్త్యర్థం , ఇతిశబ్దశ్చ ..

విద్యాస్తుత్యర్థోఽయమాఖ్యాయికార్థోపసంహారః అధునోచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'అంగుష్ఠమాత్రః పురుషః అంతరాత్మా సదా జనానామ్ హృదయే'– జనుల హృదయంలో; 'సంనివిష్టః'. చతుర్థవల్లీలోని 12, 13 మంత్రాలలో దీనిగురించి విపులంగా వ్యాఖానించబడింది. 'తామ్'– అతనిని (ఆ పురుషుడిని); 'స్వాత్ శరీరాత్'– తన దేహం నుండి; 'ప్రవృహేత్'– బయటకు తీయాలి, వెలికి తీయాలి అంటే విడదీయాలి. ఏ విధంగానో చెప్తున్నారు. 'ఇషికామ్ ఇవ ముంజాత్'– ముంజగడ్డి నుండి దానిలోనున్న వెన్నును తీసినట్లు; 'ధైర్యేణ'– తెలివిగా, జాగ్రత్తగా; 'తామ్'– దానిని, దేహంనుండి విడదీయబడిన పరమ చైతన్యాన్ని; 'శుక్రమ్ అమృతమ్'– శుద్ధము,

అమరణశీలత కలిగినదాన్ని; ఇంతకు ముందు చెప్పబడిన బ్రహ్మముగా 'విద్యాత్'– తెలుసుకోవాలి. 'తం విద్యాచ్ఛుక్రమమృతమ్' అని రెండవసారి తిరిగి చెప్పడం మరియు ఇతి అన్న పదం ఉపనిషత్తు ముగిసినదని సూచిస్తోంది.

(ఈ ఉపనిషత్తులోని 4వ వల్లీలోని 12, 13 మంత్రాలలో చెప్పబడిన విషయాన్ని ఇక్కడ ముగింపు సందర్భంలో మరొకసారి గుర్తు చేస్తున్నారు. జగత్తుకు మూలకారణమైన పురుషుడు అంగుష్ఠమాత్ర పరిమాణంలో జీవుల హృదయాలలో వసించియున్నాడని అక్కడ చెప్పిన విషయాన్ని గుర్తుచేస్తున్నారు. హృదయంలోని ఆ పురుషుడిని దేహం నుండి వేరు చేయాలి. విడదీయడం ఎలా. ముంజగడ్డిలో అంతర్గతంగా ఉన్న వెన్నును ఎంత తెలివిగా జాగ్రత్తగా విడదీస్తారో అలా విడదీయాలి. దేహం నుండి పురుషుడిని విడదీయడానికి అత్యంత జాగరూకత ప్రమత్తత అవసరం. ఆ పురుషుడి లక్షణాలు శుద్ధంగా ఉండటం, మృతి లేకుండా ఉండటం. శుద్ధంగా ఉండటమంటే, అది తప్ప మరొకదాని ఉనికి అందులో ఉండకపోవడం. అలాగే అది సదా నిత్యమే. దానికి మరణమనే స్థితి అంటే అది లేని స్థితి, అంటే అదివినాశనం లేదా క్షయం కావడమనేదే లేదు. ఈ లక్షణంకాని లక్షణాలన్నీ బ్రహ్మమును గురించి చెప్పినవే. అంటే, అంగుష్ఠమాత్రంగా హృదయంలో వసించియున్న పురుషుడే బ్రహ్మము. వేరు కాదు అని స్పష్టం. ఈ పూర్ణమైన సందేశంతో ఉపనిషత్తు ముగిస్తున్నారు.)

ఇక ఈ కథనానికి ముగింపు పలుకుతూ, బ్రహ్మజ్ఞానం యొక్క ఘనతను శ్లాఘిస్తున్నారు.

**మృత్యుప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా**
**విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్.**
**బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృత్యు-**
**రన్యోఽప్యేవం యో విదధ్యాత్మమేవ .. 2-3-18 ..**

**నచికేతుడు మృత్యుదేవతచే బోధింపబడిన ఈ జ్ఞానాన్ని మరియు యోగ విధానాన్ని పరిపూర్ణంగా సాధించగా, మొదట పాపపుణ్యాలనుండి అలాగే కోరిక, అజ్ఞానాలనుండి కూడా విడుదల పొంది, బ్రహ్మమును పొందాడు. ఎవరైనా కూడా, అంతరాత్మ గురించి ఈ విధంగా (నచికేతుని లాగా) తెలుసుకొన్నట్లైతే అతడు (బ్రహ్మమును పొందును).**

## శంకర భాష్యమ్

మృత్యుప్రోక్తాం ఏతాం యథోక్తాం బ్రహ్మవిద్యాం యోగవిధిం చ కృత్స్నం సమస్తం సోపకరణం సఫలమిత్యేతత్ . నచికేతాః అథ వరప్రదానాన్మృత్యోః లబ్ధ్వా ప్రాప్యేత్యర్థః . కిం ? బ్రహ్మ ప్రాప్తోఽభూత్ ముక్తోఽభవదిత్యర్థః . కథం ? విద్యాప్రాప్త్యా విరజః విగతరజాః విగతధర్మాధర్మః విమృత్యుః విగతకామావిద్యశ్చ సన్ పూర్వమిత్యర్థః . న కేవలం నచికేతా ఏవ, అన్యోఽపి య ఏవం నచికేతోవదాత్మవిత్ అధ్యాత్మమేవ నిరుపచరితం ప్రత్యక్స్వరూపం ప్రాప్యతత్త్వమేవేత్యభిప్రాయః .నాన్యద్రూపమప్రత్యగ్రూపం .

తదేవమధ్యాత్మం ఏవం ఉక్తేన ప్రకారేణ వేద విజానాతీతి ఏవంవిత్ , సోఽపి విరజాః సన్ బ్రహ్మ ప్రాప్య విమృత్యుర్భవతీతి వాక్యశేషః ..

అథ శిష్యాచార్యయోః ప్రమాదకృతాన్యాయేన విద్యాగ్రహణప్రతిపాదననిమిత్తదోషప్రశమనార్థేయం శాంతిరుచ్యతే —

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

నచికేతుడు 'మృత్యుప్రోక్తామ్ ఏతామ్ విద్యామ్'– పైవిధంగా మృత్యువుచే బోధించబడిన ఈ జ్ఞానాన్ని; 'యోగవిధిమ్ చ కృత్స్న మ్'– పూర్ణమైన యోగ విధానంతో కూడా, అంటే అన్ని ఉపసాధనాలు మరియు ఫలితాలతో కలిపి పరిపూర్ణంగా; మృత్యువునుండి వరముల అనుగ్రహం ద్వారా'లబ్ధ్వా'– పొందగా; ఆ తరువాత ఏమయింది?'బ్రహ్మప్రాప్తః అభూత్'– బ్రహ్మం ప్రాప్తించింది, అంటే ముక్తిని పొందాడు. ఎలా? అప్పటికే 'విరజః'– పాపపుణ్యాలనుండి విడివడి; 'విమృత్యుః'– జ్ఞాన సముపార్జనద్వారా, కామన, అజ్ఞానాలనుండి విడుదలపొంది [ఈ సందర్భంలో కొందరు 'విమృత్యుః' అంటే అమృతత్వం అని అనువదించారు – స్వామి గంభీరానంద]. 'అన్యః అపి'– ఇతరులు ఎవరైనా కూడా, తన దేహాన్ని ఉపాధిగా కలిగి యున్నదాన్ని, ప్రత్యగాత్మగా తప్ప అన్యమైనది కాకుండా తన అంతర్గతంగానున్న పరమ సత్యమైన ఆత్మను పొందిన నచికేతుని వలె, అతడు కూడా 'అధ్యాత్మమ్ ఏవ – దేహాంతర్గతమైన ఆత్మను, ముందు వివరించిన ప్రకారంగా, ఏవమ్ విత్ – ఈ విధమైన దానిని తెలిసినవాడు, బ్రహ్మమును తెలుసుకొని విరజః, విమృత్యుఃఅవుతాడు' అని వాక్యాన్ని పూరించుకోవాలని అభిప్రాయం.

(ఇంతవరకు చెప్పిన జ్ఞానోపదేశాన్ని సంపూర్ణంగా మృత్యుదేవత నుండి నచికేతుడు గ్రహించాడు. సంపూర్ణంగా అంటే ప్రధాన ఉపదేశంతోపాటుగా దానికి అనుబంధమైన ఇతర సాధనాలు, ఉపాంగాలతో సహా అని అర్థం. ప్రధాన ఉపదేశాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవాలంటే, దానికి అనుషంగికమైన అన్ని విషయాలను కూలంకషంగా గ్రహించి అవగాహన చేసుకోవాలి. అప్పుడు ప్రధాన ఉపదేశం సంపూర్తిగా అవగాహనకు వస్తుంది. అలా పూర్ణ అవగాహనతో ఆకళింపుచేసుకొన్న ఉపదేశాన్ని అనుభవంలోనికి తెచ్చుకొన్న నచికేతునికి బ్రహ్మము ప్రాప్తించింది. బ్రహ్మం ఎలా ప్రాప్తించింది. పాపపుణ్యాలు తొలగిపోగా, అజ్ఞానం మరియు దానినుండి పుట్టే కోరిక సమూలంగా నశించింది. అంటే, అవి తొలగిపోగా మిగిలింది బ్రహ్మమే కాబట్టి అలా ఆవిధంగా నచికేతుడు బ్రహ్మన్ని పొందాడు అని అర్థం. నచికేతుడు కాబట్టి మృత్యుదేవత వద్దకు వెళ్ళి వరాలు అనుగ్రహంగా పొంది, ఆత్మజ్ఞానోపదేశాన్ని పొంది బ్రహ్మమైనాడు. మరి, ఇతరులకు అది సాధ్యమా అనే అనుమానాన్ని శంకరులు నివృత్తి చేస్తున్నారు. నచికేతునికి మృత్యుదేవత బోధించిన జ్ఞానమంతా మీముందుకు ఈ ఉపనిషత్తు రూపంగా తేబడింది. అంతేకాదు, దానిని వివరిస్తూ శంకరుల భాష్యంకూడా జ్ఞానబోధను మరింత సరళతరం చేస్తోంది. ఇక, ఆ ఆత్మజ్ఞానోపదేశాన్ని అవగాహన చేసుకొని అనుభవంలోకి తెచ్చుకోవడమనేదే మిగిలింది. తమ శరీరాన్ని ఉపాధిగా చేసుకొన్నటువంటి ఆత్మయే పరమ సత్యం. పరమ సత్యమే ప్రత్యగాత్మ. ప్రత్యగాత్మ తప్ప ఇతరమైనదేమీ లేదు. అదియే పరమాత్మ, పరబ్రహ్మం. ఇలా ఎవరైనా ఆత్మను తెలుసుకొంటే వారికి బ్రహ్మకు బేధమే లేదు. అంటే, అట్టివాడు పాపపుణ్యాలనుండి స్వేచ్ఛనుపొందుతాడు. మరణరహితుడౌతాడని అనడంలో సందేహమే లేదు.)

ఇక, ఆచార్యునికి మరియు శిష్యునికీ, ఉపదేశం చేయడంలోనూ మరియు పొందడంలోనూ అనుకోకుండా జరిగే తప్పిదాలవల్ల కలిగే దోషాలను పరిహరించడానికై, ముగింపు ప్రార్థన ఉచ్చరించబడుతోంది.

**ఓం సహ నావవతు . సహ నౌ భునక్తు . సహ వీర్యం కరవావహై . తేజస్వి నావధీతమస్తు మా విద్విషావహై .. 2-3-19 ..**

మమ్మిద్దరినీకాపాడు గాక (జ్ఞానోపదేశంతో). మమ్మిద్దరినీ రక్షించు గాక (జ్ఞాన ఫలంతో). మాకు శక్తి సమకూర్చు గాక. మా అధ్యయనం తేజోవంతమగుగాక. మాలో మేము ద్వేషింపకుందుము గాక.

## శంకర భాష్యమ్

సహ నౌ ఆవాం అవతు పాలయతు విద్యాస్వరూపప్రకాశనేన . కః ? స ఏవ పరమేశ్వరః ఉపనిషత్ప్రకాశితః . కించ, సహ నౌ భునక్తు తత్ఫలప్రకాశనేన నౌ పాలయతు . సహైవ ఆవాం విద్యాకృతం వీర్యం సామర్థ్యం కరవావహై నిష్పాదయావహై . కించ, తేజస్వినౌ తేజస్వినోరావయోః యత్ అధీతం తత్స్వధీతమస్తు . అథవా, తేజస్వి నౌ ఆవాభ్యాం యత్ అధీతం తదతీవ తేజస్వి వీర్యవదస్త్విత్యర్థః . మా విద్విషావహై శిష్యాచార్యావన్యోన్యం ప్రమాదకృతాన్యాయాధ్యయనాధ్యాపనదోషనిమిత్తం ద్వేషం మా కరవావహై ఇత్యర్థః . శాంతిః శాంతిః శాంతిరితి త్రిర్వచనం సర్వదోషోపశమనార్థం ..

## శంకర భాష్యానికి తెలుగు అనువాదం

'సహ నౌ'– మా ఇద్దరినీ కలిపి; జ్ఞానం యొక్క నిజస్వరూప ప్రకాశనం ద్వారా; 'అవతు'– కాపాడుగాక. ఎవరు? ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన ఆ పరమాత్మయే స్వయంగా. మరింకా, 'సహ నౌ'– మా ఇద్దరినీ కలిపి; ఆ జ్ఞానం వల్ల కలిగే ఫలాన్ని ప్రకాశింపచేయడం ద్వారా 'భునక్తు'– రక్షించు గాక; జ్ఞానం నుండి జనించే 'వీర్యమ్'– శక్తిని; 'సహ'– కలిసి; 'కరవావహై'– నిర్వహించుకొందుము గాక. ఇంకనూ, 'తేజస్వినౌ' ('తేజస్వినోః') – బుద్ధి కుశలత కలిగిన మా ఇద్దరి; 'అధీతమ్'– అధ్యయనం (పరిపూర్ణం); అంటే మాచే అధ్యయనం చేయబడినది బాగా అధ్యయనం చేయబడినదగు గాక. లేదా 'నౌ అధీతమ్'– మా ఇద్దరిచే అధ్యయనం చేయబడినది; 'తేజస్వి'– అత్యంత తేజోవంతమైనది, ప్రభావంతమైనది; 'అస్తు'– అగుగాక. 'మా విద్విషావహై'– మా ఇద్దరమూ ఒకరిపై ఒకరు ద్వేషమును పొందకుందుము గాక. అంటే, శిష్యునికి గురువుకు మధ్య అధ్యయనం మరియు ఉపదేశాలలో అనుకోకుండా జరిగే తప్పుల కారణంగా జనించే దోషాలవల్ల ఒకరిపై ఒకరము వ్యతిరేక భావాన్ని పొందకుందుము గాక. 'శాంతిః, శాంతిః, శాంతిః'– శాంతి, శాంతి, శాంతి అని ముమ్మారు చెప్పడం సర్వ దోషాలను [భౌతిక, ఆత్మిక, దైవికములనే మూడు స్థితులకు సంబంధించినవి – స్వామి గంభీరానంద] నివారించడం కోసం.

..ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ కాఠకోపనిషద్భాష్యం సంపూర్ణం ..

.. ఓం తత్ సత్..